# తొలినుడి

శ్రీ శారదాదేవి దివ్యజీవిత చరిత్రమును మేమిదివఱకే ఆంధ్రమున వెలువరించి యుంటిమి. వర్తమాన గ్రంథము ఆ సాధ్వియొనర్చిన ప్రసంగముల సంగ్రహము. దీనిని వంగభాషలో 'మాయేర్ కథా' అను రెండు సంపుటములుగ శ్రీమద్ అరూపానందస్వామివారు వెలువరించి యున్నారు. దానినే న్యూయార్కు (అమెరికా) నగర శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులగు శ్రీమత్ నిఖిలానందస్వామివారు ఆంగ్లమునకు పరివర్తన మొనర్చియుండిరి. శ్రీ రామకృష్ణ లీలామృతము అను శ్రీ రామకృష్ణుని జీవిత చరిత్రమును రచించిన శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు (గవర్నమెంటు ఆంధ్రానువాదకులు) గారే ఈ ఆంధ్రానువాదమును కూర్చిరి. వారికి మా ధన్యవాదములు.

సాధువులును మహాపురుషులునగు వారి సంభాషణలు ఆధ్యాత్మిక సాధనా రహస్యములను గ్రహింప దోడ్పడుచుండును. అట్టి సాధన సంకేతము లనేకము లీ గ్రంథమున నున్నవి; ముముక్షువుల కివి ఆహ్లాదకరము లగునని మేము విశ్వసించుచున్నాము.

శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు, మద్రాసు

ప్రకాశకులు

# దేవీ స్తోత్రమ్

ప్రకృతిం పరమా మభయాం వరదాం
నరరూపధరాం జనతాపహరాం,
శరణాగత సేవకతోషకరీం
ప్రణమామి పరాం జననీం జగతామ్. 1

గుణహీనసుతా నపరాధయుతాన్
కృపయాద్య సముద్ధర మోహగతాన్,
తరణీం భవసాగర పారకరీం
ప్రణమామి పరాం జననీం జగతామ్. 2

విషయం కుసుమం పరిహృత్య సదా
చరణాంబురుహామృతశాంతి సుధాం,
పిబ భృంగమనో భవరోగహరాం
ప్రణమామి పరాం జననీం జగతామ్. 3

కృపాం కురు మహాదేవి సుతేషు ప్రణతేషుచ,
చరణాశ్రయ దానేన కృపామయి నమోఽస్తుతే. 4

లజ్జా పటావృతే నిత్యం శారదే జ్ఞానదాయికే,
పాపేభ్యో నః సదా రక్ష కృపామయి నమోఽస్తుతే. 5

రామకృష్ణ గతప్రాణాం తన్నామశ్రవణప్రియాం,
తద్భావ రంజితాకారాం ప్రణమామి ముహుర్ముహుః.

పవిత్రం చరితం యస్యాః పవిత్రం జీవనం తథా,
పవిత్రతాస్వరూపిణ్యై తస్యై కుర్మో నమో నమః. 7

దేవీం ప్రసన్నాం ప్రణతార్తి హంత్రీం
యోగీంద్రపూజ్యాం యుగధర్మపాత్రీం,
తాం శారదాం భక్తివిజ్ఞానదాత్రీం
దయాస్వరూపాం ప్రణమామి నిత్యమ్. 8

స్నేహేన బధ్నాసి మనోఽస్మదీయం
దోషానశేషాన్ సగుణీకరోషి,
అహేతునా నో దయసే సదోషాన్
స్వాంకే గృహీత్వా యదిదం విచిత్రమ్. 9

ప్రసీద మాత ర్వినయేన యాచే
నిత్యం భవ స్నేహవతీ సుతేషు,
ప్రేమైకబిందుం చిరదగ్ధచిత్తే
విషించ చిత్తం కురు నః సుశాంతమ్. 10

జననీం శారదాం దేవీం రామకృష్ణం జగద్గురుమ్,
పాదపద్మే తయోః శ్రిత్వా ప్రణమామి ముహుర్ముహుః.





మనోనిగ్రహము నైర్మల్యము అమూల్యమైన సంపదలు

—శ్రీ శారదాదేవి

ఓమ్

నమో భగవతే రామకృష్ణాయ

# శ్రీ శారదా ప్రసంగములు

## (ప్రథమ భాగము)*

ఉద్బోధనాపత్రికా కార్యాలయము, కలకత్తా 1911-వ సం॥ జనవరి.

కలకత్తాలో పోటల్‌డంగా యందలి మా యింటికి ఒక శుక్రవారమునాటి యుదయమున శ్రీమాన్......గారు వచ్చి, "శ్రీమాతృ దేవిని సందర్శించుటకు రేపు మేము బాగ్‌బజారుకు వెళ్లెదము. ఆసమయమున మీరు సిద్ధముగా నుండుడు," అని చెప్పినారు. ఆహా, ఇంతకాలమునకు శ్రీమాతృ దేవి పాదపద్మములకు ప్రణమిల్లు మహాభాగ్యము నాకు పట్టనున్నదిగదా! నాకప్పుడు కలిగిన సంతోషాతిశయముచే నాటిరాత్రి నాకు నిద్రయే రాలేదు. కడచిన పదునాలుగు, పదునైదేండ్లు నేను కలకత్తాలో నివసించుచుండినను, నేటికి తన పావనదర్శనభాగ్య మిచ్చుటకు అమ్మకు నాయందు దయ గలిగినది.

మరునాటి మధ్యాహ్నమున మేమొక బండినికుదుర్చుకొని, బ్రాహ్మమత బాలికాపాఠశాలకుబోయి, సుమతిని

* ఈ ప్రసంగము లొక శిష్యురాలు లిఖించినవి.

వెంటబెట్టుకొని బాగ్ బజారులోని శ్రీ మాతృదేవియింటికి బయలు వెడలితిమి. ఈ యాత్రాసమయమున నాకుకలిగిన ఆతురతయు, నుత్సాహమును వర్ణనాతీతములు. బాగ్ బజారులో శ్రీ మాతృదేవిగారి యింటిలోనికి వెళ్లినప్పుడు, ఆమె పూజామందిరద్వారముకడ నిలుచుండి, యెవరిరాకకో ఆప్యాయముతో నెదురు చూచుచుండినట్లగుపడినారు. తలపై ముసుగులేదు. నేను సాష్టాంగ ప్రణామము చేసినతర్వాత అమ్మగారు నన్నుగూర్చి, సుమతినడిగిరి. తన అక్క యని నన్ను సుమతి యామెకు పరిచయపఱచినది. కొంత కాలము నుండి సుమతి, శ్రీ మాతృదేవిని సందర్శించి వచ్చుచుండినది. పిమ్మట అమ్మగారు నావంకజూచి "అమ్మాయీ! నాస్థితి చూచితివా? నేను వీరివలన నెంత బాధపడుచున్నానో చూచితివా? నా వదినెగారును, ఆమె కొమార్తె రాధుయునుకూడ జ్వరముతో పండుకొనియున్నారు. వారికేమి కావలయునో కనుగొని, వారికి పథ్యపానాదుల నెవరు సమకూర్చుదురో కదా! ఒక్కనిమిషము వేచియుందువా, తల్లీ? నేనిప్పుడే పోయి, నా బట్ట నుదికికొని మరలవచ్చెదను." మేమట్లే వేచియుంటిమి. కొలదినిమిషములైన తరువాత అమ్మగారు మరలవచ్చి యేవో కొన్ని తియ్యని వస్తువులను మా యిరువురకును తినుట కిచ్చినారు. సుమతి పాఠశాలకు వెళ్లవలసియుండుటచే, మే మెక్కువకాల మచ్చటనుండ వీలులేకపోయెను. పిమ్మట మేము లేచి నమస్కరించి వెళ్లునప్పుడు, "నీవు మరల రావలయును సుమా!" యని అమ్మ సెలవిచ్చినారు. ఈ అయిదు నిమిషముల సందర్శనముతో, నా కెంత మాత్రమును

తృప్తికలుగలేదు. మిక్కుటమైన పునర్దర్శనాభిలాషతో నే నింటికి తిరిగి వచ్చితిని.

1911-వ సం॥ ఫిబ్రవరి 12-వ తేది.

ఈ దినము నేను ఉద్బోధనాపత్రికా కార్యస్థానము నకు వెళ్లినప్పుడు, శ్రీ మాతృదేవి బలరాంబోసుగారి యింటికి వెళ్లినారని చెప్పినారు. నేను వెళ్లిన కొంచెము సేపటికే ఆమె తిరిగి వచ్చినారు. నేను నమస్కరించిన తరు వాత, అమ్మగారు మందహాసము చేయుచు "నీతోకూడ నే డెవరు వచ్చినారు?" అని అడిగినారు. "మా మేనల్లుడు" అని బదులు చెప్పితిని.

అమ్మ : నేడు నీ కెట్లున్నది? మీ చెల్లెలు క్షేమముగా నున్నది కదా! నీ విచ్చటకువచ్చి యెంత కాలమో అయినది. నీవిషయమై యాందోళనపడి, నీ వెట్లుంటివో యని యనుకొంటిని.

నే నామెనొకసారియే, అయిను నిమిషములవరకే, చూచియుండినందున, ఆమె మాయెడల నింతప్రేమ కనుబఱు చుటనుజూచి, ఆశ్చర్యపడితిని. కన్నులానందాశ్రువులతో నిండినవి.

"అమ్మాయీ! నీ విచ్చటకు వచ్చినతోడనే, నేను తిరిగి వచ్చువరకును బలరాము నింటిలో నా కేమియు తోచ లేదు. మనస్సు మిక్కిలి తల్లడిల్లినది," అని అమ్మగారెంతో వాత్సల్యముతో చెప్పినారు. నేను పూర్తిగా ఆశ్చర్యపర వశురాలనైతిని. శ్రీమాతృదేవి మేనల్లుడగు, ఖుదే యను

శిశువునకు నా చెల్లెలు, సుమతి రెండు ఉన్ని టోపీలను నా చేతికిచ్చి పంపినది. వానిని అమ్మ కిచ్చితిని. ఈ స్వల్పవస్తువులకే ఆమె యెంతో సంతోషమును వెలిప్రుచ్చిరి. ఆమె మంచముపైని కూర్చుండినారు. నన్నుకూడ ప్రక్కకువచ్చి కూర్చుండుమని యామె చెప్పినందున, నేనట్లే చేసితిని. నన్ను చూచి "అమ్మాయీ! నిన్నింతకు ముందెన్నిసార్లో చూచినట్లు, ఎంతకాలము నుండియో నీతో నాకు పరిచయ ముండినట్లు అనిపించుచున్నది," అని మిక్కిలి ప్రేమతో చెప్పినారు. "అమ్మా! నాకేమియు తెలియదు. నే నొక్క నాడు మాత్రమే వచ్చి, అయిదు నిమిషములవరకే యిచ్చట నుంటిని," అని బదులు చెప్పితిని.

అమ్మగారు నవ్వి, మా యిద్దరి భక్తిశ్రద్ధలను చాల కొనియాడ నారంభించిరి. ఆ మెప్పుదల మాటలకు నే నెంత వరకు అర్హురాలనో నాకు తెలియదు. పిమ్మట, నొకరి తరువాత నొకరు చాలమంది భక్తురాండ్రు వచ్చిరి. వారందరును కరుణ రసభరితమై, సుందరమందహాసవిలసితమై యొప్పు శ్రీమాతృదేవి ముఖపద్మమును రెప్పవాల్పక బహుప్రేమతో తిలకించుచు ఆనందించుచుండిరి. ఇట్టి దివ్యదృశ్యమును నేనెప్పుడు చూడలేదు. ఈ పరమానందసాగరములో నా మనస్సు మునిగి తన్మయమైయుండగా నెవ్వరో వచ్చి, నాకొఱకు బండి గుమ్మము దగ్గర సిద్ధముగా నుండెనని చెప్పిరి. అమ్మగారు వెంటనే లేచివెళ్లి ప్రసాదమును దెచ్చి, నా యెదుట బెట్టి తినుమనిరి. అంతమందిలో నే నా ప్రసాదమును తినుటకు సిగ్గుపడుచుంటిని. "ఎందుకు సందేహించెదవు? ఈ ప్రసాద

మును తినుము", అని అమ్మగారు చెప్పగా ఆ ప్రసాదమును చేతితో తీసికొని భుజించి, ఆమెకు ప్రణమిల్లి సెలవుగైకొని వచ్చితిని. నేను వచ్చుచుండగా "మరల రావలెనుసుమా! నీ వొక్కతెవు మెట్లు దిగి వెళ్లగలుగుదువా? నేనుకూడ నీతో రానా?" యని చెప్పుచు అమ్మగారు మేడమెట్లవరకు వచ్చిరి. "నే నొక్కతెనే వెళ్లగలను, మీరు శ్రమపడవలదు" అని చెప్పితిని. "మరియొకనాడు ప్రొద్దుట రమ్మ" అని తుదిమాటగా జెప్పి అమ్మగారు లోనికి వెళ్లిరి. నేను సంతుష్టాంతరంగముతో శ్రీమాతృదేవి యద్భుతప్రేమను దలచుకొనుచు నింటికి తిరిగి వచ్చితిని.

1911-వ సం॥ మే 14-వ తేది.

ఈనాడు శ్రీమాతృదేవికి నేను ప్రణమిల్లిన తోడనే "నీవు వచ్చుట యెంతో మేలైనది. ఇంతకాలమును నిన్ను గూర్చియే తలంచుచుంటిని. ఇన్నాళ్లు నీ వెందుకు రాలేదు?" అని యామె ప్రేమపూర్వకముగా సెలవిచ్చిరి.

భక్తురాలు: నేను కలకత్తాలో లేను. పుట్టినింటికి పోయి యుంటిని.

అమ్మగారు: సుమతి ఆరోగ్యముగా నున్నది కదా? ఆ పిల్ల యిక్కడకు వచ్చి యెంతకాలమో అయినది. ఊపిరి తిరుగకుండ చదువుచున్నది కాబోలు!

భక్తురాలు: ఆమె పెనిమిటి ఇక్కడ లేడు.

అమ్మగారు: ఇంకను బడికి వెళ్లుచున్నదే! వారిరువురు సంసారము చేయుచున్నారా?

భక్తురాలు : అమ్మా, సంసారమన నేమో, గృహ కృత్యములన నేమో మాకు తెలియదు. అది యెల్ల మీకే తెలియును.

అమ్మగారు : (చిఱునవ్వు నవ్వి :) "నే డెంత ఉక్క పోయుచున్నది!" అని చెప్పి నాకొక విసనకఱ్ఱ నిచ్చి, "అమ్మాయీ! హడావుడిగా భోజనముచేసి, యిచ్చటకు పరుగెత్తికొని వచ్చితివి. ఇటువచ్చి, నా ప్రక్కను బరుండుము, తల్లీ!" అని సెలవిచ్చిరి. నే నామెప్రక్కను బరుండుటకు సందేహించుచుండుటను జూచి, "ఎందుకు సందేహించుచున్నావు? నా మాట విని పరుండుము," అని మరల చెప్పిరి. నే నిక తప్పించుకొనలేక పోతిని. అమ్మగారు నిద్రమమతగా నుండిరి. నేను నిశ్శబ్దముగా బరుండియుంటిని. ఇంతలో కొంతమంది భక్తురాండ్రును, ఇద్దరు సన్న్యాసినులును వచ్చిరి. వారిలో నొక యామెకు నలువది, నలువదియైదేండ్ల వయస్సు; ఇంకొక యామె యువతి. కన్నులు తెరువకుండగనె అమ్మగారు, "ఎవరచ్చట? గౌరీదాసియా?" యని అడిగిరి. "అమ్మా! మీ రెట్లు తెలిసికొంటిరి?" అని యా బాలసన్న్యాసిని శ్రీమాతృదేవిని మరల ప్రశ్నించెను. "నా కట్లు పొడకట్టినది" అని శ్రీమాతృదేవి చెప్పెను. కొలది నిమిషములైన తరువాత అమ్మగారు లేచి కూర్చుండిరి. "మేము బేలూరుమఠమునకు వెళ్ళినాము. అచ్చట ప్రేమానందస్వాములవారు మాకు తృప్తిగా భోజనముపెట్టిరి. ఆయన మఠములో నున్నచో, సంతుష్టిగా భోజనము చేయకుండ తిరిగి వచ్చుట కెవరికిని శక్యముకాదు," అని బాల

సన్న్యాసిని చెప్పెను. మొగమున కుంకుమబొట్టు పెట్టుకొనన
నందుకు అచ్చటనున్నవారిలో నొకరిని, శ్రీమాతృదేవి
మృదువుగా మందలించిరి. పెండ్లియైన ప్రతి సువాసినియు
మోమున కుంకుమబొట్టు పెట్టుకొనవలయును. ఇది హైందవ
స్త్రీల యాచారము.

నన్ను గూర్చి గౌరీమాయి శ్రీమాతృదేవినడిగి తెలిసి
కొని, నన్ను తన బాలికాపాఠశాలకు రమ్మని ఆహ్వానించెను.
ఆ పాఠశాలలో నించుమించుగా అరువదిమంది బాలికలు
చదువుచుండిరి. "నీకు కుట్టుపని వచ్చునా?" యని గౌరీ
మాయి నన్నడిగెను. "కొంచెము వచ్చును" అని నేను
చెప్పితిని. పిమ్మట నామె తన యాశ్రమములోని విద్యార్థిను
లకు, నాకు తెలిసినంత కుట్టుపనిని నేర్పుమని నన్ను కోరెను.

శ్రీమాతృదేవి సమ్మతితో నేను గౌరీమాయి పాఠశాల
కొకనాడు వెళ్లిచూచితిని. ఆమె నన్ను బహుప్రేమతో
నాదరించి, ప్రతిదిన మచ్చటకువచ్చి బాలికలకు గంటయో
రెండు గంటలో పాఠములు నేర్పుమని కోరెను. "నాకున్న
స్వల్పజ్ఞానముతో నేను ఉపాధ్యాయినిగానుండుట అసంభ
వము. మీ కంతగా కావలసినచో వారికి నేను వర్ణక్రమము
నేర్పగలను" అని నా అసమర్థతను వెల్లడించితిని. కాని,
గౌరీమాయి నా మాట నెంతమాత్రము పాటింపకుండుటచే,
నేనే లొంగిపోవలసివచ్చెను.

ఒకనాడు గౌరీమాయి పాఠశాలనుండి, నేను
శ్రీమాతృదేవిని సందర్శింపవచ్చితిని. అది వేసవికాలము.

నేను మిక్కిలి అలసియుంటిని. అమ్మగారు చాలమంది భక్తురాండ్రతో కూడ తమ గదిలో కూర్చొనియుండిరి. నే నామెకు ప్రణామముచేసినతోడనే, అమ్మగారు నావైపు చూచి వెంటనే మంచము పందిరిమీదనున్న విసనకఱ్ఱను దీసి నాకు విసర నారంభించిరి. ఎంత అపూర్వప్రేమ! ఇంత మంది భక్తురాండ్ర యెదుట అమ్మగారు నన్నిట్లు బుజ్జగించు చుండుట జూచి సిగ్గుపడితిని. అందరును రెప్పవాల్పక నన్నే చూచుచుండిరి. విసనకఱ్ఱను నా చేతికిమ్మని నే నడిగిన కొలదిని ఆమె మిక్కిలి గారాబముతో "అలాగేనమ్మా! కొంచెము తేరుకొనుము!" అని చెప్పుచు విసరుచునేయుండిరి. కొంతసేపైన తరువాత త్రాగుటకు మంచినీళ్లను, తియ్యని ప్రసాదమును తెచ్చియిచ్చిరి. నేను ప్రసాదమును తిని మంచి నీళ్లు త్రాగునపుడు, అమ్మగారెంతయు సంతోషించిరి. పాఠశాలనుండి బండి వచ్చి నా కొరకు వేచియుండుటచే నేను వెంటనే సెలవు తీసికొని వెళ్లవలసివచ్చెను.

1911-వ సం॥ ఆగష్టు 3-వ తేది.

నేను ప్రొద్దుట త్వరితముగనే బాగ్‌బజారుకు వెళ్లితిని. నేడు శ్రీ మాతృదేవివలన మంత్రోపదేశము నొందగోరితిని. అందుకు వలయు కొన్ని వస్తువులనుగూడ తీసికొని వెళ్లితిని. ఈ వస్తువులను గౌరీమాయి నాకు వ్రాసియిచ్చెను. ఆమె కూడ నాతో వచ్చినది. మేము వెళ్లునప్పటికి అమ్మగారు పూజచేయుచుండిరి. నన్నుజూచి కూర్చుండుమని సంజ్ఞ చేసిరి. పూజయైన తరువాత గౌరీమాయి నా మంత్రోప

దేశము విషయమై అమ్మగారితో ప్రస్తావించెను. నేనుకూడ ఆమెతో ఆ విషయమై యొకనాడు ముచ్చటించియుంటిని. నేను కొన్ని మంచి అరటిపండ్లను తెచ్చితిని. ఆ పండ్లను జూచి "ఎన్ని పండ్లను దెచ్చితివమ్మా!" అని సంతోషించి, "ఆ తివాచి వేసికొని నా ప్రక్కను కూర్చుండుము" అని అమ్మగారు సెలవిచ్చిరి. "నే నింకను గంగలో స్నానము చేయలేదు," అని బదులు చెప్పితిని. "స్నానము చేయ నక్కరలేదు. రాత్రి కట్టుకొనిన బట్టలను తీసివేసి వేఱు బట్టలను కట్టుకొంటివి కదా?" అని యామె యడిగెను. పిదప నేనామె ప్రక్క గూర్చుంటిని. నా గుండె దడదడ లాడుచుండెను. గదిలోనుండిన యితరుల నందరిని బయటకు వెళ్లుడని చెప్పి "ఏ మంత్రము నీకు కలలో తెలుపబడెనో నా కిప్పుడు చెప్పుము" అని నన్నడిగిరి. "నే నా మాట నుచ్చరింతునా లేక వ్రాయనా?" అని యడిగితిని. "ఆ మాటలను నీవు చెప్పవచ్చును," అని అమ్మగారు చెప్పిరి.

మంత్రోపదేశ సమయమున ఆ మంత్రార్థమును అమ్మగారు నాకు బోధించి దాని నుచ్చరింపుమనిరి. ధ్యాన యుక్తముగా నిటు తరువాత నేను స్మరింపవలసిన క్రొత్త మంత్రమును పిమ్మట నా కామె తెలిపిరి. ఈ మంత్రార్థమును బోధించుటకు ముందు అమ్మగారు కొలది నిమిషములు ధ్యాన నిమగ్నులై యుండుటను జూచితిని. మంత్రోపదేశసమయ మున నా శరీమంతయు వణకనారంభించెను. కారణమేమియో తెలియలేదు కాని, ఏడువ మొదలుపెట్టితిని. అమ్మగారు నా నుదుటను రక్తచందనముతో పెద్ద బొట్టు పెట్టిరి. పూజా

మందిరములో దక్షిణగా కొన్ని రూపాయల నామెకిచ్చితిని. వాని నామె గోలప్ మాయి చేతికిచ్చిరి.

మంత్రోపదేశము చేయునప్పుడు శ్రీ మాతృదేవి ముఖవైఖరి బహు గంభీరముగా నుండుటను గనిపెట్టితిని. పిమ్మట నామె పూజాపీఠమునుండి లేచివచ్చి, నన్ను మంత్రమును కొంతకాల ముచ్చరించుచు ధ్యానప్రార్థనలను జేయుమనిరి. నేనట్లే చేసి యామె పాదములకు ప్రణమిల్లినప్పుడు "నీకు భగవద్భక్తి కలుగును గాక!" అని యాశీర్వదించిరి. ఆ మాటలను నే నిప్పటికిని జ్ఞప్తియందుంచుకొని, "అమ్మా, మీ ఆశీర్వచనమును మఱువకుడు! దాని ఫలము నాకు లభించును గాక!" అని నే నమ్మగారిని ప్రార్థించుచుందును.

శ్రీ మాతృదేవి స్నానమునకు గంగానదికి వెళ్లుచుండిరి. గోలప్ మాయికూడ వచ్చెను. అమ్మగారి తువాలును, చీరను చేతబట్టుకొని నేను బయలుదేరితిని. అప్పుడు వాన చినుకులు పడుచుండెను. స్నానమైన తరువాత, ఘట్టము దగ్గరనున్న బ్రాహ్మణునకు అమ్మగారు కొంత పైకమును, నొక మామిడిపండు నిచ్చుచు "ఈ ఫలమును నేను మీ కిచ్చుచున్నను నిజముగా ఈ దానఫలమే మీకు చెందును సుడీ!" అని చెప్పిరి. ఆహా ఈ దాన మెవరిచ్చిరో ఆ బ్రాహ్మణున కెట్లు తెలియును! ఆ మాటల అర్థముకూడ నాతనికి తెలియనే లేదు. లెక్కలేనన్ని స్వల్పవిషయాపేక్షలతో స్వార్థపరాయణులమై కొట్టుకొనుచుండిన అల్పజీవులమగు మేమైనను ఆ దివ్యవాక్యముల అర్థమును గ్రహింపగలిగితిమా!

స్నానమైన తరువాత అమ్మగారు పొడిబట్టను కట్టుకొని, తడిబట్టను తీసికొనివచ్చుటకు నా చేతికిచ్చిరి. అందరికిని ముందు గోలప్ మాయియు, వెనుకను నేను నడచుచు వచ్చినాము. మా యిరువురకును నడుమ అమ్మగారుండిరి. గంగా జలముతో నిండిన యొక చిన్న చెంబును ఆమె చేతబట్టుకొని వచ్చుచు దారిలో కనుపడిన ప్రతి పవిత్రవటవృక్షమునొద్దను ఆ నీటిని కొంచెము పోయుచుండిరి. మే మింటికి వచ్చిన తోడనే క్రింది యంతస్థులో, కొళాయిదగ్గరగల కుండికి సమీపమున నీళ్లబిందె యొకటి యుండెను. ఆ బిందెలోని నీటితో అమ్మగారు కాళ్లు కడుగుకొని "నీ కాళ్లకుకూడ బురద అంటుకొని యున్నది, నీవును కాళ్లు కడుగుకొనుము" అని నా కానతిచ్చిరి. నీళ్లకొఱకు నేనిటునటు చూచుచుండగా "ఆ బిందెలో నీళ్లున్నవి. ఆ నీళ్లతో నీ వేల కడుగుకొనవు?" అని అమ్మ అడిగిరి. "మీరు తాకిననీటిని* నే నెట్లు వాడగలను?" అని కొంత అనిష్టముతో బదులు చెప్పితిని. అంతట "ఆ నీటిని కొంత నీ తలపై జల్లుకొనుము." అని యామె చెప్పిరిగాని నేను మాత్రము సందేహించి "ఆ నీటిని వాడుటకు వలనుపడదు." అని చెప్పి మరియొక పాత్రతో కుండీలోని నీటిని దీసికొని కాలుసేతులు కడిగికొంటిని. ఇంతవరకును అమ్మగారు నాకొరకు కనిపెట్టుకొని యుండిరి. పిమ్మట మే మందరమును మేడమీదికి వెళ్లితిమి. నైవేద్యము చేయు

---

* హిందూమతాచారము ప్రకారము, పూజ్యులైనవారు తాకిన నీటిని, కాళ్లు కడుగుకొనుటకు వాడకూడదు.

బడిన కొన్ని తియ్యని పదార్థములను, పండ్లను తెచ్చి రెండు విస్తళ్లలోనుంచి అమ్మ నన్ను తమ ప్రక్కను కూర్చుండు మనిరి. మిక్కిలి గారాబముతో ఆ ప్రసాదమును నాకు పెట్టి తాముకూడ భుజించిరి.

క్రమక్రమముగా చాలమంది భక్తురాండ్రు వచ్చిరి. నేను వారి నెఱుగను. మధ్యాహ్న సమయమున వా రిచ్చట భోజనము చేయుదురు. పూజయైన తరువాత మేమందరమును భోజనముచేయుటకు కూర్చుంటిమి. అమ్మగారుకూడ తమ స్థానములో కూర్చుండిరి. ఆమె మూడు కబళములనుతిని, పిమ్మట నా కిచ్చిరి. ఆ ప్రసాద మితరులందరికినికూడ నిచ్చిరి. ఇప్పుడు అమ్మగారు తమ సాధారణ రీతిని కనుబడిరి. ఎప్పటి వలె నవ్వుచు, మాటలాడజొచ్చిరి. నేను మంత్రోపదేశము నొందినప్పటినుండి యింతవరకును నామె బహుగంభీరముగను; అంతర్ముఖులుగను గనుపడిరి. ఇంతయేల ? ఆమె స్వరూపము శిష్టరక్షణమును దుష్టశిక్షణమునుగావింప సమకట్టిన సాక్షా త్పరదేవతను బోలియుండెను. నేను భయముతో వణకి పోయితిని. అమ్మగారు తరువాత చాలమంది భక్తులకు మం త్రోపదేశము చేయుటను జూచితిని గాని, ఇంతటి గంభీర వైఖరిని ఆమె ఆకృతిలో మరల నే నెన్నడును చూచియుండ లేదు. నవ్వుచు, వేళాకోళము చేయుచు యెందరికో యామె మంత్రోపదేశము చేసిరి. వారును సంతృప్తులై సుఖముగా నుండిరి. మంత్రోపదేశ సమయమున అమ్మగా రెట్లుండిరని ఆతురతతో నే నా భక్తురాండ్ర నొక్కొక్కప్పుడు అడుగు చుండెడి దానను. నలువది నలువదియైదేండ్ల ప్రాయముగల

వితంతువు నొకసారి నే నిట్లడిగినప్పుడు ఆమె యీ క్రిందివిధ మున బదులు చెప్పెను: "మన మెల్లప్పుడును జూచు చున్నట్టే కనబడిరి. విశేష మేమియు లేదు. ఇంతకుముందే మా కులగురువు నాకు మంత్రోపదేశము చేసియుండెను. పిమ్మట శ్రీ మాతృదేవిని గురించి విని నే నామెకడకు మంత్రోపదేశమునకు వచ్చితిని. మా యింటి పురోహితు డుపదేశించిన మంత్రమును పదిసార్లు చెప్పుమని మొదట నన్నడిగి, తరువాత నా కామె మంత్రోపదేశము చేసిరి. శ్రీ రామకృష్ణుల వారిని నా గురువుగను మఱియొక దేవతను నాయిష్ట దైవముగను భావింపుమనిరి. శ్రీరామకృష్ణుల నిట్లు ప్రార్థింప వలయునని బోధించిరి: 'ప్రభో! యీ జన్మములోను పూర్వ జన్మములలోను నే నొనర్చిన పాపముల నెల్ల పరిహరింపుము'. ఇదే విధమున ప్రార్థనా విధానము నింకను విపులముగా బోధించిరి. నే నిప్పుడు చాల బాధపడుచున్నాను. కారణ మేమో నీవు చెప్పగలవా? అరగంటకంటె నెక్కువకాలము మంత్రము నుచ్చరింపలేక యున్నాను. ఎవరో వచ్చి నా స్థానమునుండి నన్ను బయటకు లాగునట్లుండును. నీకుగూడ నిట్లేయుండునా? ఈ విషయమై శ్రీ మాతృదేవి నడుగవలెనని నే నెన్నిసారులో తలపెట్టితిని గాని, అట్లు చేయలేకున్నాను. ఆమెతో నీవు చాల చనవుగానుందువు. అమ్మగారొకవేళ నన్ను మోసపుచ్చినారా?" ఈ వివరములనన్నిటిని నే నెన్నడును తెలిసికొన గోరలేదు. కాని ఆ భక్తురాలు దాపరికమేమియు లేకుండ, ఈ వృత్తాంతమునంతను వెల్లడించినది. "అమ్మగారికి మనసిచ్చి మీరే యామె

నడుగుడు. మొట్టమొదట మీకు కొంచెము సందేహము, మోమోటము కలుగవచ్చును. కాని ఆ వైఖరి క్రమక్రమముగా తగ్గి, చనవేర్పడును. మేముకూడ మొట్టమొదట నామెతో నింత చనవుగా మెలగలేకపోయితిమి. ఇప్పుడు కూడ నొక్కొక్కప్పుడామె ముఖవైఖరి బహుతీక్ష్ణముగా నుండును. అట్టిసమయములందామెదగ్గరకు మేముపోలేము.''

సాయంకాలమున నొకరి తరువాత నొకరు భక్తురాండ్రు సెలవు తీసికొని వెడలిపోయిరి. అమ్మగారు తమ మేనకోడండ్రను ధ్యానప్రార్థనల జేసికొనుడని యానతిచ్చిరి. కాని వారాలస్యము చేసినందున, ''చూచితిరా! సాయంత్రమైనను, ధ్యానము చేసికొనుటకు మారుగా వీరెట్లు పనికిమాలిన ప్రసంగములను చేయుచున్నారో!'' అని యామె తమ యసంతుష్టిని వెలిబుచ్చిరి. గోలప్‌మాయి, యోగినిమాయి మొదలగు భక్తురాండ్రు శ్రీ మాతృదేవి పాదములకు ప్రణమిల్లిరి. కొంతమందిని గడ్డములను బట్టుకొని బుజ్జగించియు, కొంతమందిని ముద్దుపెట్టుకొనియు శీర్షములపై తమ హస్తములనుంచియు ప్రేమతో నామె వారినెల్లరను దీవించిరి. పిమ్మట శ్రీ రామకృష్ణుల పటము నెదుట ప్రణమిల్లి అమ్మగారు ధ్యానమునకు కూర్చుండిరి. ధ్యానమైన తరువాత నేను సెలవు తీసికొని యింటికి తిరిగి వచ్చితిని.

* * *

పాఠశాలలో పని యొత్తిడివలన కొన్నాళ్లవరకు శ్రీ మాతృదేవిని సందర్శింపలేకపోయితిని. నేడామెకు నేను

ప్రణమిల్లినతోడనే యామె నన్నెన్నివిధములనో ప్రేమతో నాదరించిరి. అప్పుడు భూదేవు డను బాలుడు మహాభారత మును చదువుచుండెను. మిక్కిలి చిన్నవాడగుటచే నాతడు త్వరితముగా చదువలేకుండెను. అమ్మగారికికూడ చేయవలసిన పనులింకను నెన్నియో యుండెను, అప్పటికి ప్రొద్దుక్రుంకినది. "ఆ పుస్తకము నీమె కిమ్ము. ఈమె దానిని బహుసులభ ముగా చదువును. ఈ యధ్యాయమును ముగించకుండ నేను పురాణపఠనమును ఆపుటకు వీలులేదు" అని యామె భూదేవునితో చెప్పిరి. అది యామె యాజ్ఞ కనుక మహా భారతమును నేను చదువ నారంభించితిని. ఇంతకుముం దెన్న డును అమ్మగారి సమక్షమున నే నే పుస్తకమును చదువలేదు. మొట్టమొదట కొంచెము సిగ్గుపడితిని గాని యెట్టకేలకు అధ్యాయమును ముగించితిని. అమ్మగారు చేతులు జోడించి, ఆ పుస్తకమునకు నమస్కరించిరి. పిమ్మట మేము సాయం కాలపూజను జూచుటకై దేవతార్చనమందిరములోనికి వెళ్లితిమి. ఉచితాసనమున అమ్మగారు కూర్చుండి శీఘ్రముగా ధ్యాననిమగ్నులైరి.

అమ్మగారు భగవన్నామమును బిగ్గరగా నుచ్చ రించుచు, జపమును బూర్తిచేసి శ్రీరామకృష్ణుల ప్రతిమ యెదుట ప్రణమిల్లిరి. పిమ్మట నందరకును ప్రసాదము పంచి పెట్టబడెను. తరువాత సంభాషణ మా దినకృత్యములపై మరలెను. జయరాంబటిలో తాముగడపిన కాలమునుగురించి ముచ్చటించుచు, ఎల్లప్పుడు నేదో యొకపని చేయుచుండుట వలన మనస్సునకును, శరీరమునకునుగూడ ఆరోగ్యకరముగ

నుండునని, మఱి మ్మట్లు పనిచేయుచుండుడని అమ్మగారు హితవ్రాసగిరి.

శ్రీ మాతృదేవిగారి యింటియెదుటగల గూడెములో, ఇతరరాష్ట్రములనుండి వచ్చి కూలిచేసికొని జీవించుచుండిన పాటకపు జనులు కొందఱు కాపురముండిరి.

చెడుగులో మంచిని జూచుట

వారిలో నొకని కొక యుంపుడుకత్తె యుండెను. వారిరువురును కలసి కాపురముచేయుచుండిరి. ఆ స్త్రీకి ఒకసారి చాల జబ్బుచేసెను. ఆ జబ్బును గురించి చెప్పుచు, "పాప మా కార్మికు డామెకెంత భక్తితో నుపచారము చేసెను! అట్టిది నే నెన్నడును చూచియుండలేదు. నిజమైన సేవాతత్త్వము నాతడు కనుబఱచెను," అని ఆతని శ్రద్ధను శ్రీ మాతృదేవి మిక్కిలి కొనియాడిరి.

ఉంపుడుకత్తె యనినతోడనే మన మసహ్యించుకొని, తప్పక నిరసనభావమును వెల్లడించియుందుము. ఆహా! చెడుగులో నణగియుండు మంచిని తఱచుగా మనము గుర్తింపలేముగదా!

ఉత్తరదేశమునుండి వచ్చిన యొక బీదస్త్రీ వ్యాధిగ్రస్తమైన తన శిశువును చంకబెట్టుకొని శ్రీ మాతృదేవి కడకువచ్చి యామె యాశీర్వాదమును గోరెను. అమ్మగారా శిశువునుజూచి కనికరించి, త్వరలో వ్యాధికుదురునని దీవించి పూజామందిరములో భగవదర్పితములైన రెండు పెద్దదానిమ్మపండ్లను, ద్రాక్షపండ్లను దెచ్చి "ఇవి నీ శిశువున

కిమ్ము'' అని యా స్త్రీ చేతికిచ్చిరి. అమ్మగారి యీ ధార్మికబుద్ధికి, ఆ స్త్రీ సంతోషపరవశయై, పలుమారామెకు ప్రణమిల్లెను.

1912 సం॥ ఫిబ్రవరి 11-వ తేది.

నేడు నేను శ్రీమాతృదేవినిజూచి ప్రణామముచేసి కూర్చుండిన వెంటనే, యామె మిక్కిలి విచారముతో నిట్లు చెప్పదొడగిరి: ''అయ్యో! గిరీశుడు చనిపోయెను. నేడు నాల్గవదినము. ఆతని బంధువులువచ్చి తమయింటికి నన్ను రమ్మని ఆహ్వానించిరి. కాని యిక నేనాయింటికెట్లు వెళ్లగలను? శ్రీరామకృష్ణులయందు గిరీశునకెంతభక్తి, ఎంత విశ్వాసము! ఈ విషయము నీ వెప్పుడైన వినియుంటివా? తనకు పుత్రుడుగా బుట్టుమని యాతడు శ్రీరామకృష్ణులను గోరెను. 'నీ పుత్రుడనుగా జన్మించుటకు నాకగత్యమేమి?' అని శ్రీరామకృష్ణులు ప్రత్యుత్తరమిచ్చిరి. కాని, దుర్గ్రాహ్యములైన భగవంతుని లీల లెవరికి తెలియును? శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరమున గొంతకాలమునకు గిరీశునకొక కొమరుడు కలిగెను. నిజముగా నివేదిత్యభుత బాలుడు! ఆ బాలునకు నాలుగేండ్ల వయస్సువచ్చినను, అతడెవరితోడను మాటాడడయ్యెను. అతని చేయు సంజ్ఞలను బట్టియే, జను లాతనిమనస్సులో నున్నదానిని గ్రహించుచుండెడివారు. వాని తల్లిదండ్రులు వానిని శ్రీరామకృష్ణునిగనే భావించుచుండిరి. అతనిదుస్తులను, కంచమును, గిన్నెను, ఇవియవి యననేల అతని సర్వవస్తువులను వేఱుగానుంచుచుండిరి. ఇతరు లెవరును వానినుపయోగించుటయే లేదు!

"ఒక నాడాబాలుడు నన్ను జూడవలెనని మిక్కిలి ఆతురత నొందెను. ఆ యింటిలో మేడమీద నా చిత్రపట ముండెను. అతడింటిలోని వారినందరిని అచ్చటికి లాగికొని పోయి ఒక కేక వేసి ఆ చిత్రపటమును వారికి చేతితో జూపెను. మొట్టమొదట బాలుని వైఖరి వారికేమియు అర్థముకాలేదు. పిమ్మట వారాతనిని నాకడకు తోడ్కొనివచ్చిరి. నాలుగేండ్ల పసిబిడ్డడైనను నతడు నాకు సాష్టాంగప్రణామముజేసెను. అటుతరువాత నతడు తనయింటికిబోయి తనతండ్రిని బట్ట పట్టుకొని లాగనారంభించెను. తనతండ్రికూడ నన్ను చూడ వలెనని యాతనికోరిక. గిరీశుడు వెక్కివెక్కి యేడ్చుచు, 'నాయనా! నేను మహాపాపిని! శ్రీమాతృదేవినిచూడలేను!' అని చెప్పెను. కాని, ఆ బాలుడు తానుపట్టిన పట్టు విడువ నందున, గిరీశుడు లొంగిపోయి, కుమారుని చంక బెట్టుకొని, శరీరమాపాద [illegible]ము వణకిపోవుచుండ, చెక్కిళ్ల పై కన్నీరు కాల్వలై [illegible]చుండ నాదగ్గరకువచ్చి 'అమ్మా! ఈ బాలుని [illegible] మీ పావనపాదపద్మములను సందర్శింప గలిగితిని.' [illegible]ని చెప్పుచు నాకు సాష్టాంగ ప్రణామముచేసెను. ఆ బా[illegible]శము నాలుగవయేటనే మృతినొందెను.

"ఈ విషయము జరుగుటకు కొంతకాలముముందు గిరీశుడును, అతనిభార్యయు వారి యింటిమిద్దెపై నుండిరి. నేనప్పుడు బలరామునింటిలో నుంటిని. ఈ రెండును ఇరుగు పొరుగిండ్లే. ఆ నాడు నేనుకూడ మిద్దెపైకి వెళ్లితిని. గిరీశుడు

తనయింటి మిద్దెమీదనుండి నన్నుచూడగలడని నేనుతలచి యుండలేదు. ఇంతలో 'అటుచూడుడు! ఆయింటి మిద్దెపైన శ్రీమాతృదేవిగారు, విహరించుచున్నారు' అని యాతనితో అతనిభార్య చెప్పెను. వెంటనే గిరీశుడు తనవీపును నావైపు నకుద్రిప్పి, 'ఇట్లు శ్రీమాతృదేవిని దొంగతనముగా చూడ జాలను, చూడజాలను. నా కన్నులు పాపపుగన్నులు' అని తనభార్యతో జెప్పుచు, మిద్దెపైనుండి చరచర క్రిందికిదిగి వెళ్లెను. నే నీవిషయము నతనిభార్య చెప్పగా వింటిని.''

1912-వ సం॥ జూన్ 15-వ తేది.

కొంతమంది భక్తురాండ్రతోగూడ శ్రీమాతృదేవి కూర్చుండియుండిరి. వారిలో కొంతమందిని నే నెఱుగుదును. అమ్మగారు చాల సంతోషముగానుండిరి. నేను వచ్చినతోడనే మందహాసముతో నన్ను సమ్మానించిరి. నివేదితా సోదరి జీవితమును, శ్రీవివేకానందస్వాములవారి భారతవర్షోపన్యాస ములను, ఈ రెండు పుస్తకములును తీసికొనిరమ్మని గౌరీ మాయిని నేను కోరియుంటిని. నివేదితాసోదరి జీవితములో నుండి కొంత భాగమును చదువవలెనని నాకోరిక. అమ్మగా రిందుకు సమ్మతించి, ''నివేదితా జీవితములోనుండి చదు వుము. ఈ పుస్తకముయొక్క ప్రతి మొన్ననే నాకుగూడ అందినది. కాని నేనింకను దానిని జదువలేదు,'' అని చెప్పిరి. అంతమంది యెదుట నే నాపుస్తకమును జదువుటకు సిగ్గు పడితిని. అయినను సరళబాల రచించిన శ్రీనివేదితా జీవిత ములోనుండి చదివి వినిపించవలెనని ఆత్రపడుచుంటిని. కనుక,

అమ్మగారి యాజ్ఞను శిరసావహించితిని. అమ్మగారును, ఇతర భక్తురాండ్రును అత్యంత శ్రద్ధతో వినుచుండిరి. శ్రీనివేదితా సోదరియొక్క అద్భుతభక్తిని గురించి వినినప్పుడు వారి కన్నులు బాష్పపూరితము లయ్యెను. అమ్మగారి చెక్కిళు లపై కన్నీరు ప్రవహించుచుండెను. నివేదితను గురించి చెప్పుచు, "నివేదితకు ఎంతగాఢమైనభక్తియుండెను! నా కెట్టియుపచారము నైనను చేయుటకు ఆమె యెల్లప్పుడును సంసిద్ధురాలై యుండెడిది. రాత్రి సమయమున తఱచుగ నామె నన్ను చూచుటకు వచ్చుచుండును. దీపపు కాంతి నాకనులకు మిక్కిలి తీక్ష్ణముగనుండుటను గనిపెట్టి దానికి ఆమె కాగిత మును తొడుగును. ఆమె నాకు సాష్టాంగ ప్రణామముచేసి, మిక్కిలి భక్తితో నాపాదధూళిని తన చేరుమాలుతో ప్రేమ మీఱ తీసికొనును. నా పాదములను స్పృశించుటకు గూడ నామె సందేహించుచుండినట్లు నాకుతోచినది," అని అమ్మ గారు సెలవిచ్చిరి. నివేదితను గురించి తలంచుటతోడనే యామె మానస మున్నతపథములందు విహరింపజొచ్చెను. ఆమె ముఖవైఖరి, హఠాత్తుగా గాంభీర్యమును దాల్చెను.

అచ్చటనుండినవారు నివేదితాసోదరితో తమకుగల పరిచయమును గురించి చెప్పదొడగిరి. "ఆమె అకాలమరణ మునకు లోనగుట హిందూదేశముయొక్క దురదృష్టము" అని దుర్గాదేవి చెప్పెను. "ఆమె హిందూదేశమునే తన జన్మభూమిగా భావించెను. ఆమెయే, పలుసారు లిట్లు చెప్పి యుండెను: సరస్వతీ పూజాదినమున హోమకుండమునందలి

పవిత్ర భస్మమును నుదుట తిలకముగా నుంచుకొని, పాద రక్షలు లేకుండగనే యామెనడచుచుండెడిది'' అని మరియొక యామె నుడివెను. ''సోదరిజీవితము'' నుండి నేను చదువుచుండినప్పుడు అమ్మగారామెయెడల తమకుగల భావముల నప్పుడప్పుడు వెల్లడించుచు చిట్టచివరకు, ''నిష్కపటమైన భక్తిగలవారు భగవంతునకు మిక్కిలి ప్రియులు; కావుననే మన అంతరాత్మకు వారియం దభిమానము'' అని చెప్పిరి.

సాయంకాల పూజకు వేళయైనది. అమ్మగారు వేఱు దుస్తులను ధరించి, శ్రీరామకృష్ణుని ప్రతిమకెదుట చిత్రాసనముపై గూర్చుండిరి. ప్రతిమ నలంకరించుటకై ఆమెయే కొన్ని పూలదండలను గ్రుచ్చియుంచిరి. రాసవిహారియను నొక బ్రహ్మచారి ఆ దండలకు దగ్గరగా నైవేద్యమునకై కొన్ని మధురపదార్థములనుంచెను. ఆ భక్ష్యములకు చీమలు పట్టినవి. దండలలోనికిగూడ కొన్ని చీమలు ప్రాకినవి. అమ్మగారు నవ్వుచు ''అమ్మా! రాసవిహారి యేమిచేసెనో చూడుము! శ్రీరామకృష్ణులను ఈ చీమలు కుట్టును,'' అని చెప్పుచు చీమలను దులిపి ప్రేమమీర పూలహారములతో ప్రతిమ నలంకరించిరి. ఇతరుల సమక్షమున నామె భర్తను పూలతో నలంకరించుటను జూచి ఆమె వదినెగారు* నవ్వెను. పిమ్మట ప్రసాద మందరికిని పంచిపెట్టిరి.

---

* ఈ ప్రసంగములలో నెక్కువగా వచ్చుచుండు శ్రీమాతృదేవి పిచ్చివదినెయును, రాధుతల్లియు నైన యీామె యుదంతమంతయు శ్రీమాతృదేవి జీవితకథా భాగములో కలదు.

బాలికల విద్యా, వివాహములు

"అమ్మా! నాకు అయిదుగురు కుమార్తెలు. వారికి తగిన వరులు దొరకుటలేదు. దీనివలన నా కెంతో ఆందోళనగా నున్నది." అని ఒక భక్తురాలు నుడివెను.

అమ్మగారు; వారి పెండ్లివిషయమై మీ కేల యీ చింత? వారికి తగినవరులు మీకు దొరకనిచో, నివేదితా సోదరీ బాలికా పాఠశాలకు వారినిపంపి వారికి విద్య నేర్పించుడు. పాఠశాలలో వారు హాయిగానుందురు.

మఱియొక భక్తురాలు: శ్రీ మాతృదేవి యందు మీకు నమ్మకమున్న యెడల, ఆమె చెప్పినట్లుచేయుడు. అందువలన మీకు శుభముకలుగును. ఆమెమాట మీరు వినినచో మీ కెట్టి మనోవ్యథయు నుండదు.

కాని, ఈ యయిదుగురు కూతుళ్ల తల్లికి అమ్మగారి హితోపదేశ మెంతమాత్రము నచ్చలేదని వేఱుగ చెప్పనక్కర లేదు.

మూడవ భక్తురాలు: ఈ కాలములో తగిన వరులు లభించుట బహు కష్టము. చాలమంది బాలురు పెండ్లిచేసికొనుట కిష్టపడుటలేదు.

అమ్మగారు: ఔను. బాలురు వివేచనచేయ నేర్చుకొనుచున్నారు. ప్రాపంచిక సౌఖ్య మనిత్యమని వారు క్రమక్రమముగా గ్రహించుచున్నారు. ప్రపంచమందు సక్తత మీ కెంత తక్కువగానుండునో, మనశ్శాంతి మీ కంత యెక్కువగా నుండును.

ఆ రాత్రి నేను శ్రీ మాతృదేవికడ సెలవుదీసికొని యింటికి తిరిగి వెళ్లుసరికి చాల నాలస్యమైనది.

మఱియొకనాడు నేను బాగ్ బజారుకు వెళ్లినప్పుడు, శ్రీ మాతృదేవి మధ్యాహ్నపు టల్పాహారమైన తరువాత పండుకొని యుండిరి. నన్ను పీవనతో విసరుమనిరి. నాయం దింత యనుగ్రహము కలిగెనుగదాయని నేను చాల సంతసించుచు, అమ్మగారికి విసరుచుంటిని. హఠాత్తుగా "మీ రందరు నిచ్చటకు వచ్చుచున్నారు. బాగుగనేయున్నది కాని, శ్రీ రామకృష్ణులవారేరి?" అని యామె తమలోతాము మాట్లాడిరి. "మే మీ జన్మలో నాయనను చూడలేకపోతిమి. ఇక నెన్నిజన్మములకు మే మాయనను చూడకలుగుదుమో కదా! అయినను మీ పావన పాదపద్మములను సేవించు మహాభాగ్యము మాకు కలిగినది!" అని నేను బదులు చెప్పితిని. "అది నిజమే!" అని శ్రీ మాతృదేవి అనతిచ్చిరి. అంగీకారసూచకమైన యీ మాటను విని కొంచె మాశ్చర్య పడితిని. తమ్ముగూర్చి అమ్మగా రెన్నడో కాని యిట్లు ప్రసంగించువారు కారు.

శ్రీ మాతృదేవియందు నమ్మకముంచి, కొంతమంది తమ రహస్యముల నామెకు వెల్లడించుచుండురను విషయమును నేనా కాలమున నా తెలివితక్కువచే గ్రహింపలేక పోతిని. ఈ కారణమువలన, నేను వచ్చినతోడనే అమ్మగారు తమగదిలో లేనియెడల, ఆమెకొరకై యింటినంతయు గాలించుచుందును. అమ్మ వచ్చువరకు కనిపెట్టుకొని యుండగల ఓపిక నాకులేదు. ఒకనాటి సాయంకాలమున నామె

గదికి నుత్తరపువైపుననున్న వసారాలో సౌందర్యవతులైన యువతు లిరువురు అమ్మగారితో నేదో రహస్యముగా సంభాషించుచుండిరి. ఇంటిలో నామె యింకెక్కడను కనుపడకపోవుటచే, నేనకస్మాత్తుగా వారి మధ్యకు వెళ్లి నిలుచుంటిని. అమ్మగారప్పుడు వారితో "మీ మనస్సులో నున్న కష్టములనెల్ల శ్రీ రామకృష్ణులకు విన్నవింపుడు. కన్నీటితో మీ క్లేశముల నాయనకు దెలుపుడు. ఆయన దయవలన మీ కోరిక లీడేరునని మీకే విశదమగును," అని చెప్పుచుండిరి. ఆ స్త్రీలు సంతానమునకై ప్రార్థించుచుండి రని వెంటనే నేను గ్రహింపగలిగితిని. నన్ను చూచి వారు సిగ్గుపడిరి. అంతకంటె నయోమయముగా నుండెను నా మనస్సు. కాని ఆనాడు నేనొక గొప్ప గుణపాఠమును నేర్చుకొంటిని. నేను వచ్చినసంగతిని ముందుగా తెలుపకుండ, శ్రీ మాతృదేవి సమక్షమునకు మరల నెన్నటికిని పోగూడ దని యానాడు ప్రతిజ్ఞ చేసికొంటిని. కొలదినెలలైన తరువాత ఆ స్త్రీల నిరువురను శ్రీ మాతృదేవియింటిలో తిరిగి నేను చూచినప్పుడు త్వరలో వారి మనోరథము ఫలింపనుండెనని తెలిసికొని, సంతోషించితిని.

గౌరీమాయి అప్పు డచ్చట నుండెను. మా కోరికపై నామె శ్రీరామకృష్ణులవారిని గురించి ముచ్చటించుచు, "చాలమంది భక్తులు రాకమునుపే శ్రీరామకృష్ణుని నేను సందర్శించితిని. అప్పటికి నరేంద్రుడును, కాళియునుగూడ చాల చిన్నవారు" అని చెప్పెను. అంతలో సాయంకాల మైనది. సంభాషణను త్వరలో ముగించితిమి. గౌరీమాయి

శ్రీ మాతృదేవికడ సెలవుతీసికొని వెళ్లెను. నేనుకూడ వెళ్లవలసి వచ్చెను. నేను సెలవుతీసికొనబోవుచుండునప్పుడు అమ్మగారు నన్ను వసారకడకు బిలిచి ప్రసాదము నిచ్చుచు "నీవు మరల రావలెను సుమా, ఎప్పుడు వచ్చినను చాలసేపు నీవిచ్చట నుండుటలేదు. ఈసారి యుదయముననే వచ్చి; మధ్యాహ్నము మాతోకూడ నీవు ప్రసాదము తీసికొనవలయును," అని చెప్పిరి.

1912-వ సం. సెప్టెంబరు 8.

గౌరీమాయి బాలికాపాఠశాలలో నేను పనిచేయుచుండినందువలన, నా యిష్టప్రకారము శ్రీ మాతృదేవిని దర్శింప నాకు వీలులేక పోయినది. ఒకనాటి యుదయముననే వారియింటికి వచ్చితిని. అది నాకెంతో సుదినము. అమ్మగారప్పుడు స్నానమునకై గంగానదికిపోవ నుద్యమించుచుండిరి. నన్ను చూచిన తోడనే సంతోషముతో "నీవీ నాడు వచ్చుట నాకు చాల ఆనందముగా నున్నది. నేడు రాధిక పుట్టినదినము. నేను తిరిగి వచ్చువరకు నిచ్చటనే యుండుము," అని చెప్పిరి. నేనుకూడ వచ్చెదనని చెప్పితిని. అమ్మగారందుకు సమ్మతించిరి. కాని అప్పుడు చినుకులు పడుచుండినందున, గోలప్‌మాయి వానలో వెళ్లవలదని నన్ను తీవ్రముగా వారించెను. అమ్మగారుగూడ గోలప్‌మాయి పక్షము వహించి తాము శీఘ్రముగా తిరిగి వచ్చెదమనియు, అంతవరకు నన్నచ్చట నుండుమనియు చెప్పిరి. శ్రీ మాతృదేవి తఱచుగా సాధుస్వభావయగు నొక చిన్నపిల్లవలె వర్తించుచుందురు.

తమ యభిప్రాయముల నితరు లామోదింపవలయునని యెన్నడును ఆమె హఠము చేయువారు కారు. ఆమె వీథి లోనికి వచ్చినతోడనే వానగూడ వెలిసెను. స్నానముచేసిన తరువాత తిరిగి యింటికివచ్చి, "నేను వీథిలోనికి వచ్చిన తోడనే వర్ష మాగిపోయెను. నీవుకూడ నాతో రాగోరితివి. నేనును నీవు వచ్చినచో బాగుండునని తలచితిని. శ్రీ గంగా దేవిని దర్శించి యుందువు," అని అమ్మగారు చెప్పిరి. నిజము చెప్పవలసినచో గంగాదర్శనముకంటె శ్రీ మాతృదేవి పావన సహావాసమే నే నెక్కువగా నభిలషించితిని. ఐహికములగు వేనవేలు పనులలో నెల్లప్పుడు మునిగి తేలుచుండు మావంటి వారికి అమ్మగారిని సందర్శించుట కెప్పుడో కాని తీరికయే కలుగదు. భాగ్యవశమున మే మామెకడకు రాగలిగిననాడు, నిమిషమైన నామె సమక్షమును విడనాడుటకు మాకు మన సొప్పదు. శ్రీ మాతృదేవి మాటలను వినుచుండిన గోలప్ మాయి, "ఈమె గంగానదిని చూడకున్న నేమి? మీ పావన పాదస్పర్శ మాత్రమున సర్వాభీష్టములు లభించును," అని నుడివెను. ఆమె చెప్పునది నిజమేయని అంగీకారసూచక ముగా నేనును తల నూపితినికాని, అమ్మగారుమాత్రము, "అట్లనవలదు! ఎన్ని చెప్పినను, శ్రీ గంగాభవానియేకదా పరమపావని!" అని గంగను స్తుతించిరి. తమ దివ్యోన్నతిని మాటలలోగాని పనులలోగాని సాధారణముగా నెన్నడును వెల్లడిచేయక అందరివలె తాముకూడ నొక సామాన్య మానవవ్యక్తియే యని జను లనుకొను రీతినే శ్రీ మాతృదేవి యెల్లప్పుడును వర్తించుచుందురు. కాని మిక్కిలి యరుదుగా

పుణ్యాత్ములైన కొంతమంది భక్తులపై తమ యవ్యాజ దయామృతమును కురిపించి, అమ్మగారు వారికి తమ దివ్య స్వరూపమును వెల్లడించి యుండుటకూడ నిజము. ఆమె గదిలోనికివచ్చి పరుపుపై బరుండి నన్నుజూచి "చూచితివా! గంగానదిలో స్నానముచేసి వచ్చితిని!" అని హెచ్చరించిరి. తమ పాదపద్మముల నారాధింపవలయునని నామానసమాత్ర పడుచుండెనని అమ్మ తెలిసికొనినట్లు నాకప్పుడు విశదమైనది. "నిత్య పవిత్రవతీ! తల్లీ! పావనమగుటకు గంగలో స్నానము చేయుట మీకనావశ్యకము," అని తలపోయుచు పూవుల తోడను, గంధముతోడను నేనామె పాదములకడ గూర్చుంటిని. "తులసీ దళములను మాత్రము వేయకుము," అని అమ్మగారు చెప్పిరి. పూవులతోడను, గంధముతోడను శ్రీమాతృదేవి పాదములను పూజించి ప్రణామముచేసితిని. తరువాత అమ్మగారు భోజనమునకు గూర్చుండిరి. నన్నుకూడ ప్రక్కను గూర్చుండ బెట్టుకొని తాము భుజించుచుండిన ప్రతి పదార్థమును అపారప్రేమతో సగము నాకీయ మొదలిడిరి. మహానందముతో నేనా ప్రసాదమును నావిస్తరిలో భుజించుచుండగా నాగమహాశయుడు నాకు జ్ఞప్తికివచ్చి, "ఈ విస్తరి తఱచుగా నాగమహాశయుని నా తలపునకు దెచ్చును," అని అమ్మగారితో నంటిని.

అమ్మగారు : అతని భక్తి యెంత అద్భుతమైనది! ఎండిపోయిన యీ విస్తరాకును చూడుము. దీని నెవరు తినగలరు. కాని, యతనిభక్తి మేరలేని మహాసముద్రమువంటిది. ప్రసాద మంటుకొనిన ఆకు నతడు మ్రింగివైచెను. ఆహా!

ఆతని కన్నులెంత ప్రేమరసభరితములు! అవి ఎల్లప్పుడు కెంపులవలె నెఱ్ఱబారి బాష్పపూరితములై యుండెడివి. ఆతని దేహము కఠినతపస్సుచే శుష్కించెను. అతడు నన్ను చూచుటకు వచ్చుచుండును. నన్ను చూచిన తోడనే భక్తిపరవశుడై, శరీరమంతయు కంపింప మెల్లమెల్లగ కుండును. తూలుచు నడచును. అట్టి భక్తి నితరులయం దెచ్చటను నే నెన్నడును చూచియుండలేదు.

భక్తురాలు: తన వైద్యవృత్తిని వదిలిపెట్టి అహో రాత్రము లతడు శ్రీ రామకృష్ణులవారిని ధ్యానించుచు తన్మయుడై యుండువాడని నేనాతని జీవిత చరిత్రలో చదివి యుంటిని. అతని తండ్రి యొకనాడు కోపముతో "ప్రపంచము నెడల నీ వింత నిర్లక్ష్యముగా నున్నావు. నీగతి యేమగునో కదా? నీకు కట్టుకొనుటకు గుడ్డపేలికకూడ నుండదు! ఆకలి తీర్చుకొనుటకు కప్పలను తినెదవు!" అని మందలించెను. వారి యింటిముందు వాకిటిలో నొక చచ్చిన కప్ప యుండెను. నాగమహాశయుడు తన యొంటిపైనున్న బట్టను దీసి పార వైచి, ఆ కప్పనుదిని, "నీ మాటలను ఇప్పుడే సార్థకపరచితిని. నా అన్నవస్త్రములను గుఱించిన ఆందోళన నెల్ల నీ వింక విడనాడి, భగవంతునిపై మనస్సును మరల్పుము" అని తన తండ్రితో జెప్పెను.

అమ్మగారు: తండ్రియం దతని కెంతభక్తి! పవిత్రతా పవిత్రతల కెట్టి భేదము నతడు పాటింపకుండెను. దీనిని బట్టి ఆతని యున్నతాధ్యాత్మిక వికాసము తెలియగలదు.

భక్తురాలు: అతడొకసారి యొక పర్వదినమున కలకత్తానుండి యింటికి వచ్చెను. అతని తండ్రి "గంగానదికి దగ్గరగా కలకత్తాలో నుంటివి. ఇట్టి పర్వదినమున గంగను విడిచి యింటికి వచ్చిన నీవెంత యవివేకివి! నీవు కలకత్తాలోనే యుండి ఆ పవిత్రనదిలో స్నానముచేసి యుండవలసినది," అని యతనిని మందలించెను. కాని యానాటి పుణ్యకాలమున వారి యింటిముందు వాకిటిలో నొకచోటినుండి నీటిధార పైకెగజిమ్ముచుండుటను అచ్చటి జనులందరును చూచిరి. వాకిలియంతయు నీటితో నిండిపోయెను. నాగమహాశయుడు పరమానంద భరితుడై "తల్లీ! గంగాభవానీ! రా! రా" అని పిచ్చివానివలె కేకలువేయుచు ఆ నీటిని తలపై చల్లుకొనెను. ఆ యూరిజను లానీటిలో స్నానముచేసి గంగానదిలో స్నానముచేసినట్లే తృప్తిపడిరి.

అమ్మగారు: నిజము. ఎంత అసాధ్యవిషయమైనను భక్తివలన సాధ్యమగును. ఒకసారి నేనతనికి ఒక వస్త్ర మిచ్చితిని. అతడు దాని నెల్లప్పుడును తలకు చుట్టుకొని యుండెడువాడు. ఆతని భార్యకూడ చాలమంచిది, పతివ్రత. వేసవికాలములో మొన్న నన్నామె చూడవచ్చెను. ఆమె యింకను బాగున్నది.

ఈ సమయమున కొంతమంది భక్తురాండ్రు వచ్చిరి. ప్రసంగ మాపివేయబడెను. వారు శ్రీమాతృదేవికి ప్రణామముచేసిరి. కొన్ని తమలపాకుల కిల్లీలను కట్టుమని అమ్మగారు పిమ్మట నాతోచెప్పిరి. నేను రెండు కిల్లీలను కట్టి

యిచ్చితిని. అందొకటి తాము వేసికొని, రెండవదినాకిచ్చిరి. మిగిలిన యాకులనుగూడ కిల్లీలుగా కట్టుటకు నేను వెళ్లితిని. కొంతతడవైన తరువాత, అమ్మగా రిరువురు భక్తురాండ్రతో మాగదిలోనికి వచ్చిరి. వారు నాకు సాయపడినందున, పని చాల త్వరితముగా ముగిసెను. భగవంతున కర్పించుటకై అమ్మగారు కొన్ని యాకులను తీసి వేఱుగానుంచిరి. ఆమె మిక్కిలి సంతసించుచు, "నా తల్లులు తమ పనిని చాల త్వరితముగా ముగించిరి," అని చెప్పిరి.

శ్రీ మాతృదేవి, ఆయింటి రెండవయంతస్తులోనున్న గోలప్మాయి గదిలోనికి వెళ్లిరి. కొలదినిమిషములైన తరువాత నే నచ్చటికి వెళ్లితిని. అమ్మగారు గదిగుమ్మపు గడపపై తలను పెట్టుకొని నేలపై బరుండిరి. అందుచే, గడపదాటి గదిలోనికి పోవుటకు సంకోచించుచుంటిని. అమ్మగారు నన్ను చూచి గడపమీాదనుండి తలను కొంచెమెత్తి "ఇప్పుడు తప్పు లేదు లోనికిరా!" అని చెప్పిరి. నేను గదిలోనికివెళ్లి, ఆమె ప్రక్కను గూర్చుండి, యామెకు విసనకఱ్ఱతో విసరుచుంటిని. గౌరీమాయి పాఠశాలనుగురించి అనేక విషయము లమ్మగారు నన్నడిగిరి. నేను సరియైన సమాధానములు చెప్పితిని. పైన పేర్కొనిన భక్తురాండ్రిరువురును అచ్చటికి వచ్చిరి. వారిలో నొకయామె అమ్మగారికి తలదువ్వెను. ఆమె యొకటిరెండు తెల్లని వెండ్రుకలను అమ్మగారి తలలోనుండి తీసి బట్ట కొంగున కట్టుకొని, "నేను వీనిని స్మారకచిహ్నములనుగా దాచికొందును," అని చెప్పెను. అమ్మగారు సిగ్గుపడి, సంకోచముతో "ఎందుకిట్లు చేయుచున్నావు? ఇంతకుముందు నా

తలవెంట్రుక లెన్నియో పారవైచితిని.'' అని చెప్పిరి. పిమ్మట యెండలో కూర్చుండుటకు అమ్మగారు మిద్దెపైకి వెళ్లిరి. మేముకూడ నామెవెంట వెళ్లితిమి. అచ్చట బట్టలెన్నియో ఆరవేయబడియుండెను. వానిని గదిలోనికి దీసికొని పొమ్మని అమ్మగారు నాతో చెప్పిరి.

అర్చనయైన తరువాత భక్తురాండ్ర మధ్యాహ్న భోజనమునకు గావలసిన సన్నాహము చేయుమని శ్రీ మాతృదేవి నా కానతిచ్చిరి. మేమందరమును గలసి భోజనమునకు గూర్చుంటిమి. అమ్మగా రొకటిరెండు కబళములను భుజించిరి. పైనజెప్పిన భక్తురాండ్రిరువురును మాతో నుండిరి. వారిలో నొకయామె ముదుసలియును, సుమంగలియును. ఆమె శ్రీరామకృష్ణులవారిని జూచియుండెను. రెండవస్త్రీ యామె కోడలు.

''శ్రీ రామకృష్ణులవారు మాకెన్నియో హితోపదేశములను చేసిరి. కాని మేము వానిని చాలవరకు అనుసరింపలేదు. ఆయన చెప్పినట్లే మేము చేసియుండినయెడల మేమీ ప్రపంచమున నింత కష్టపడి యుండెడివారము కాము. ఐహిక విషయాసక్తులమై ఎల్లప్పుడు నేదియో పనిని బట్టుకొని ప్రాకులాడుచుంటిమి,'' అని యావృద్ధస్త్రీ చెప్పెను.

''ఎల్లరు నేదోయొక పనిని చేయుచుండవలెను. కర్మబంధము కర్మమును చేయుటచేతనే తొలగవలెను; కర్మమును తప్పించుకొనుటచే మనము దానినుండి ముక్తులము కాలేము, పరిపూర్ణమైన విరక్తి, తరువాత వచ్చును. పని

లేకుండ నొక క్షణముకూడ నెవరునుండరాదు,'' అని అమ్మ గారు బదులుచెప్పిరి.

భోజనమైన తరువాత అమ్మగారు కొంచెము విశ్రాంతి గైకొనుటకై పరుపుపై బరుండిరి. భక్తురాండ్రందరును ఆమె కేమైన సేవను స్వయముగా చేయవలెనని కుతూహలపడు చుండిరి. కాని యామె వారినందరినిగూడ విశ్రమింపగోరి నందున, వారెల్లరు తమతమ పనులను జేసికొనుటకు వారి నివాసస్థలములకు వెళ్లిరి. నేనును, శ్రీరామకృష్ణుని సమ కాలీనురాలైన యొక వృద్ధవితంతువును మాత్రముంటిమి. నేను అమ్మగారికి ఒళ్లు పట్టుచుంటిని. వితంతువామె ప్రక్కను కూర్చుండి, తనసాంసారిక జీవితమునకుసంబంధించిన వేర్వేఱు సంఘటనలను దెలుపుచు, ''అమ్మా! నాలోపములను మీ రెల్లప్పుడు క్షమించుచుందురుగాని, నాబంధువులు మాత్రము నాయెడల మిక్కిలి కఠినముగా బ్రవర్తింతురు,'' అని చెప్పెను. ''శ్రీరామకృష్ణుని మీరు చూచియుంటిరా?'' అని నేనామెనడిగితిని. ''ఔనమ్మా! నే నాయనను చూచి తిని. మా యింటికాయన తఱచుగా వచ్చుచుండెడివారు. అప్పటికి శ్రీమాతృదేవి చాలచిన్నది,'' అని యామెబదులు చెప్పెను.

భక్తురాలు: శ్రీరామకృష్ణులవారిని గురించి యేమైన మాకు సెలవిండు.

వితంతువు: నన్ను కాదు; ఆయననుగూర్చి యేమైన మనకు దెలుపుడని అమ్మగారి నడుగుము.

అమ్మగారు కనులుమూసికొని విశ్రమించుచుండుటచే నే నామెనడుగ లేదు. కొంత సేపటికి అమ్మగారే యిట్లు చెప్పిరి : "హృదయ పూర్వకముగా ప్రార్థించువారికి భగవం

శ్రీరామకృష్ణులవారి జీవిత విశేషాంశములు

తుడు ప్రత్యక్షమగును. ఇటీవలనే మాభక్తులలో నొకడగు తేజచంద్రుడు మరణించెను. అతడెంత పరిశుద్ధాత్ముడు! శ్రీరామకృష్ణులవారు తఱచుగా నాతనియింటికి వెళ్లుచుండిరి. ఆతనియొద్ద నెవరో రూ. 200 ల నుంచిరి. ఒక నాడతడు ట్రాముబండిలో వెళ్లుచుండగా నెవరో యాపైకమును తస్కరించిరి. కొంతసేపైనతరువాత సొమ్ము పోయినట్లాతడు గ్రహించి, చెప్పనలవికాని మనోవ్యథతో గంగాతీరమునకు వచ్చి, కనులనీరు నించి, "ఓ ప్రభూ! నా విషయమున నీవేమిపని చేసితివి!" అని శ్రీరామకృష్ణులవారిని ప్రార్థించెను. ఆ పైకము నచ్చుకొనునంత భాగ్యశాలి కాడతడు. ఇట్లాతడు విలపించుచుండగా శ్రీ రామకృష్ణుల వారాతని యెదుట ప్రత్యక్షమై "ఎందుకు నీవట్లేడ్చెదవు? గంగయొద్దున నదిగో ఆ యిటుక క్రింద పైకమున్నది చూడుము." అని చెప్పిరి. అతడా యిటుకను పైకెత్తిచూడగా, అచ్చట నిజముగా బ్యాంకినోట్లకట్ట యతనికి దొరికెను. అతడీవిషయమును శరత్తుకు (శ్రీశారదానందస్వామికి) తెలిపెను. "నేడు కూడ నీకు శ్రీరామకృష్ణుని దర్శనము దొరికెను, నీవు చాల ధన్యుడవు. కాని మాకాయన కనుపడరు," అని శరత్తు చెప్పెను. వారాయననింకను చూచుటెందుకు? ఆయన సాన్నిధ్యభాగ్యమును తనివితీర వారనుభవించిరి. వారి యభీ

ప్సితములెల్ల నెరవేరినవి. తమ స్థూలనేత్రములతో శ్రీ గురు మహారాజును దర్శించియుండని వారాయనసందర్శనమునకై చాల నాత్రపడుచురు. అప్పుడు శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరములో నివసించుచుండిరి. రాఖాల్ మొదలగు భక్తులప్పటికి మిక్కిలి చిన్నవారు. ఒకనాడు రాఖాల్ (బ్రహ్మానందస్వామి) శ్రీరామకృష్ణులకడకువచ్చి తనకు చాల ఆకలిగానుండెనని చెప్పెను. శ్రీరామకృష్ణులు గంగానది దగ్గరకువచ్చి 'ఓ గౌరీదాసీ! ఇక్కడకు రమ్ము. నా రాఖాల్ ఆకలితో బాధపడుచున్నాడు.' అని అరచిరి. అప్పుడు దక్షిణేశ్వరములో తినుబండారముల యంగడిలేదు. కొంతసేపైన తరువాత గంగమీదుగా నొకపడవవచ్చుచుండినట్లు కనుపడెను. అది దేవాలయసమీపముననే యాగెను. ఆ పడవలో నుండి కొన్ని తియ్యనిభక్ష్యములతో కూడ బలరాంబాబు, గౌరీదాసి, మొదలగు కొంతమంది భక్తులు దిగిరి. శ్రీరామకృష్ణులెంతో సంతోషించి, రాఖాల్‌ను బిగ్గరగా పిలిచిరి. 'ఇటురమ్ము, ఇక్కడ భక్ష్యములున్నవి. నీకు ఆకలిగానున్నదంటివి,' అని ఆయన చెప్పెను. రాఖాల్‌కు కోపమువచ్చి, 'నా యాకలిని మీ రెందుకు చాటించుచున్నారు?' అని ఉటంకించెను. 'అయినను ప్రమాదమేమి? నీకు ఆకలిగానున్నది. తినుట కేదైన కావలసియుండెను. ఆ విషయమై మాట్లాడుటలో దోషమేమున్నది?' అని శ్రీరామకృష్ణులు చెప్పిరి. శ్రీరామకృష్ణులది కాపట్య మెంతమాత్ర మెఱుగని శిశుస్వభావము.''

ఇంతలో శ్రీమాతృదేవి మేనల్లుడు భూదేవుడు పాఠశాలనుండి యింటికి తిరిగివచ్చెను. అతనికి జ్వరము తగిలినది. శ్రీ మాతృదేవి యాతనికొక శయ్య నమర్పుమని నా కానతిచ్చిరి. ఆమె బలరాంబాబుగారి యింటికి బయలుదేరుచుండిరి. ఆతని కుమారుడు రక్తగ్రహణితో బాధపడుచుండెను. సాయంకాలపూజను పూర్తిచేసి అమ్మగారు నాకు కొంచెము ప్రసాద మీయబోయిరి; ప్రసాదమును తరువాత భుజింతునని చెప్పిన పిమ్మట, తన మేనకోడలగు నళినిని ఆ ప్రసాదమును కొంతసేపైన తరువాత నాకిమ్మని చెప్పిరి. ఇంతలో బండివచ్చినది. తాము తిరిగి వచ్చువరకు నచ్చటనే యుండుమని నాతో జెప్పి అమ్మగారు గోలప్‌మాయితోగూడ బయలుదేరి వెళ్లి, మరల నొకగంటయైన తరువాత వచ్చిరి. శ్రీమాతృదేవి నన్ను చూచి సంతోషముతో నీ కొరకే నేను త్వరగావచ్చితిని. ప్రసాదము తింటివికాదా?'' అని అడిగిరి. తినలేదని నేను చెప్పగా ''నళినీ! నీవీమెకు ప్రసాదమెందుకీయలేదు? ఇమ్మని నీతో చెప్పితినే,'' అని అమ్మగారు సెలవిచ్చిరి.

నళిని : ఇచ్చుటకు నేను మఱచి పోతిని. ఇప్పుడు తీసికొని వచ్చెదను.

అమ్మగారు : ఆ శ్రమ యింక నీ కక్కఱలేదు, నేనే యిచ్చెదనులే. (నాతో) ప్రసాదము నిమ్మని నీవెందుకడుగలేదు? ఇది నీ సొంతయిల్లే.

భక్తురాలు : నాకంత ఆకలిలేదు. ఆకలియే యుండినచో ప్రసాదమిమ్మని యడిగియే యుందును.

కొంచెము సేపైనతరువాత పూజామందిరములో నైవేద్యము చేయబడిన తీయని భక్ష్యములను దెచ్చి, అమ్మ గారు నాకిచ్చిరి. ఎంతో ప్రీతితో వానిని భుజించి అమ్మగారికి సాష్టాంగ ప్రణామముచేసి, యింటికిబోవ సెలవడిగితిని. "మా అమ్మా! దుర్గా! దుర్గా! నీవు మరల రావలెను సుమా! నీతోకూడ క్రిందియంతస్థునకు నేనుకూడ వత్తునా? రాత్రియైనది; నీవొక్కర్తెవు వెళ్లగలవా?" అని యామె యడిగెను. "అమ్మా, నేనొక్కర్తెనే వెళ్లగలను," అని నేను బదులు చెప్పితిని. అయినను నామె భగవన్నామమును పదే పదే యుచ్చరించుచు నాతోగూడ మేడమెట్లవరకు వచ్చిరి. "అమ్మా! మీరింక శ్రమతీసికొననక్కరలేదు. ఇటుపైని దారి సులభముగనే తెలిసికొనగలను," అని చెప్పి యింటికి వెడలితిని.

నా డక్షయ తృతీయ—హిందువులకు చాల సుదినము. ఆ నాడు నేను శ్రీమాతృదేవిని సందర్శింప వచ్చితిని. ఇంతకుపూర్వము పేర్కొనిన వృద్ధస్త్రీయు, నామె కోడలు నచ్చట నుండిరి. అట్టి పవిత్ర సమయములం దాచారప్రకా రము కొన్ని పండ్లను, పవిత్రసూత్రమును ఆ వృద్ధస్త్రీ అమ్మ గారికి సమర్పింపబోయెను. ఆమెను వారించి "వీనిని నా కెందు కిచ్చెదవు? వీనిని భూదేవునకిమ్ము," అని అమ్మగారు చెప్పిరి. పిమ్మట ప్రసంగవశమున శ్రీమాతృదేవి మా వైపు జూచి, "ఈ జన్మలోనే మీకు ముక్తి చేకూరునుగాక యని నే నీ పుణ్యదినమున మి మ్మాశీర్వదించుచున్నాను. జనన మరణములు మిక్కిలి దుఃఖకరములు. వానిబాధ మీ కెన్న

టికి నింక లేకుండుగాక !'' అని యవ్యాజదయతో బలికిరి.

అది పవిత్ర రథయాత్రా* దినము. ఉదయ మేడు గంటలకు గౌరీమాయి ఆశ్రమమునకు వెళ్లితిని. ఆమె నన్ను మధ్యాహ్న మచ్చట భోజనమునకు బిలిచినది. పాఠశాల నుండి శీఘ్రముగా శ్రీ మాతృదేవికడకు వచ్చుటకు నే నెంత కుతూహలపడినను, అవకాశము దొరక లేదు. మధ్యాహ్నము రెండుగంటలకు గౌరీమాయియు, నేనును భోజనము చేసి శ్రీ మాతృదేవి యింటికి వచ్చినప్పటికి సాయంకాలము నాలుగు గంటల వేళయైనది. అమ్మగారు పూజామందిర ములో సాయంకాలపూజ చేయుచుండిరి. మే మామెకు ప్రణామము చేసిన తరువాత గౌరీమాయి యామెను ప్రక్కకు బిలిచి రహస్యముగా నేమియో చెవిలో చెప్పెను. తరువాత వారు నన్నుకూడ రమ్మనిరి. అమ్మగారికొఱకు నేను తెచ్చిన పట్టుచీరను ఆమె పాదముల దగ్గరనుంచి ''అమ్మా! దయ యుంచి మీరు దీనిని ధరింపుడు,'' అని వేడితిని. ''ఆ! తప్పక ధరించెదను తల్లీ!'' అని అమ్మగారు నవ్వుచు చెప్పిరి. అదే సమయమున కొంతమంది పురుషులు, అమ్మగారి భక్తులు వచ్చి యామెకు సాష్టాంగప్రణామము చేసిరి. అంతట మేము వసారాలోనికి వెళ్లితిమి. ఒక భక్తుడు తాను తెచ్చిన గన్నేరుపువ్వులను గులాబిపువ్వులను మల్లెపూలదండను తియ్యని పదార్థములను అమ్మగారి పాదముల కడ నుంచి,

* ఈ పావన హైందవ పర్వదినమున శ్రీ జగన్నాథములోని విష్ణు మూర్తిని రథములో బెట్టి ఊరేగింతురు.

యామెను ఆరాధింప మొదలుపెట్టెను. దివ్యానందముతో నొడలెల్ల పులకరించు మహాద్భుత దృశ్యమది! అలౌకిక సౌందర్యామృతమొలుకు మందహాసము మోమున చిందు లాడ, శ్రీమాతృదేవి ప్రశాంతముగా గూర్చుండిరి. మెడలో మల్లెపూలదండ వ్రేలాడుచుండెను. పూవులు పాదముల నలంకరించుచుండెను. ఆరాధనమైన తరువాత భక్తుడు ప్రతిఫలమునుండియు తియ్యని పదార్థమునుండియు కొంత భాగమునుతీసి యామెను ఆరగింపుడని ప్రార్థించెను. గౌరీ మాయి నవ్వుచు, "మీ రిప్పు డొక వీరభక్తుని యాధీన ములో నున్నారు. ప్రతిపదార్థమును కొంచెము తినక తప్పదు," అని చెప్పిరి. అమ్మగారుకూడ నవ్వుచు, "ఇంత వలదు. ఇంత నేను తినలేను," అని చెప్పుచు, నివేదన చేయబడిన ప్రతిపదార్థమునుండియు, కొంచెము భుజించిరి. ఆ ప్రసాదమును భక్తుడు చేతితో దీసికొని తన నుదిటి కద్దు కొనెను. వర్ణింపనలవికాని ఆనందముతో నాతని మోము ప్రకాశించుచుండెను. అమ్మగారి కతడు ప్రణామముచేసి వెడలిపోయెను. మెడలోని పూలహారమునుదీసి అమ్మగారు గౌరీమాయి కిచ్చిరి. ఆమె కర్పితమైన పూవులన్నియు నచ్చటి భక్తురాండ్రకు పంచిపెట్టబడెను.

ఆనాడు రథయాత్ర యని నేనిదివరకే చెప్పితిని. భూదేవు డొక రథమును సిద్ధముచేసెను. శ్రీరామకృష్ణుల ప్రతిమ నీ రథములోపెట్టి యూరేగించుటకు సన్నాహము చేసిరి. పాఠశాలలో ముఖ్యముగా చేయవలసిన పనియుండి, గౌరీమాయి మమ్ముమవిడిచి వెళ్లవలసి వచ్చెను. పిమ్మట

ప్రసంగము గౌరీమాయి పైకి బోయెను. "పాఠశాలలోని బాలికలను పెంచుటకే, ఆమె తన శక్తినంతను ధారపోయు చున్నది. వారికి అనారోగ్యముగా నున్నప్పుడు, ఆమెయే సర్వోపచారములను జేయును. ఆమెకు సొంతకుటుంబ మేమియు లేదు. ఈ బాలికల నిమిత్తమున నామె మాతృ హృదయము సార్థకతను గాంచుచున్నది. ఆమె కిదియే కడపటి జన్మమగుటచే నీ యనుభవముల నెల్ల నొందు చున్నది," అని అమ్మగారు చెప్పిరి.

శ్రీ రామకృష్ణుని చిత్రపటమును రథములో నుంచిరి. తమ శయ్యలోనుండి అమ్మగారు ఆ పటమును జూచి మిక్కిలి సంతోషించిరి. రథమును బయటకు తీసికొనివచ్చి, వీధుల లోను గంగానదీతీరమందును నూరేగించిరి. కనుచీకటి పడిన తరువాత రథము మరల మాతృదేవి యింటికి వచ్చెను. మేడమీద వసారాలో భక్తురాండ్రు రథమును లాగిరి. అమ్మగారును, ఆమె మేనకోడం డ్రిద్దరును, నేనునుకూడ వారితోగలసి రథమును లాగితిమి. రథము వీధిలో వెళ్లు చుండినప్పుడు, "రథోత్సవము*ను చూచుటకు అందరును జగన్నాథము వెళ్లలేరు. ఈ రథములో శ్రీ రామకృష్ణులను చూచినవారు భగవత్సాక్షాత్కారమును బడసెదరు," అని అమ్మగారు చెప్పిరి.

---

* జగన్నాథములో రథమునందలి విష్ణు విగ్రహమును చూచిన వారికి భగవత్సాక్షాత్కారము కలుగునని హిందూజనసామాన్యము యొక్క నమ్మకము.

1912-వ సం॥ అక్టోబరు

దుర్గాపూజ సెలవులలో నొకనాడు శ్రీ మాతృదేవిని సందర్శింప వచ్చితిని. ఆమె చాలపనిలో నుండిరి. నేనామె సమీపమున గూర్చుంటిని. రాంచీనుంచి వచ్చిన భక్తుని దీసికొని రమ్మని యామె యొకరిని బంపిరి. అతడు చాల పువ్వులను, పండ్లను, ఒక చీరను, నూలుబట్టతో చేసిన పువ్వులదండను తెచ్చెను. ఆ దండను మెడలో ధరింపుడని ఆతడు కోరిన పిమ్మట, అమ్మగారు దానిని ధరించిరి. దండ లోని ఆ పూవులను తీగెతో గ్రుచ్చినందున, అమ్మగారికి హానికలుగవచ్చునని గోలప్‌మాయి యా భక్తుని మందలించెను. అమ్మగారు మాత్రము శాంతముగా "భయములేదు. దండను నా చీరపైననే వేసికొంటిని," అని చెప్పిరి. నేను కొన్ని పండ్లను మధుర పదార్థములను దెచ్చియుంటిని. వానిని భగవంతున కర్పింపుమని అమ్మగారు నాతో చెప్పిరి. ఒక ద్రాక్షపండును నోటిలో వేసికొని, అది చాల తియ్యగా నుండెననిరి. కొలదినాళ్ల క్రిందట నేనిచ్చిన చీరనే యామె కట్టుకొని యుండెను.

**ఆడువారికి ఓరిమి యుండవలయును**

దానిని నాకు చూపుచు, "చూచితివా? దానినే ధరించితిని. ఇప్పుడది మాసిపోయినది," అని యామె చెప్పిరి. దీనిని చూచి నేనాశ్చర్యపడి, నావంటి పనికి మాలిన భక్తురాలియెడలగూడ అమ్మగారికి ఎంతటి అపార ప్రేమయుండెనో గ్రహించితిని. ఆమె మేనకోడలు నళిని కోపముగానుండెను. "ఆడువారి కింత శీఘ్రముగా కోపము

రాకూడదు. వారు సహనము నభ్యసింపవలయును. బాల్య మునందు వారికి తల్లిదండ్రులే రక్షకులు, యౌవనములో భర్త రక్షణముక్రింద నుందురు. సామాన్యముగా ఆడువారికి అభిమాన మెక్కువగానుండును. వారిని కలవరపరచుటకు, ఒక మాటయే చాలును. ఈ రోజులలో మాటలకేమి కొదువ? కనుక ఓర్పుతో వారు కష్టసమయములందు, తల్లి దండ్రులనుగాని, భర్తలనుగాని యెదిరింపక వారికి విధేయులై యుండుటకు ప్రయత్నింపవలెను'' అని చెప్పి అమ్మగా రామెను మందలించిరి.

రాధు తన చీరను మోకాళ్లపైకి నెగద్రోసికొని మా దగ్గర కూర్చుండెను. అమ్మగారది చూచి, ''అమ్మా! ఆడుది యిట్లు తన చీరను మోకాళ్లపైకి నెగద్రోసికొనుట యెందుకమ్మా?'' అని యామెను మందలించి ''మోకాళ్ల పైకి బట్ట నెగద్రోసికొనుటయును, వివస్త్రయగుటయు నొక టియే కాదా?'' అను నర్థమిచ్చు నొక పద్యమును చదివిరి.

చంద్రబాబుసోదరి మమ్ము చూడవచ్చి, ''శ్రీ మాతృదేవి భర్తగా రింకను సజీవులై యున్నారా? ఈ పిల్లలందరు నాయన బిడ్డలును, కోడండ్రునా?'' అని ప్రసంగవశమున నడిగెను. ''మీ మాట యెంతో బాగున్నది! శ్రీ రామ కృష్ణులవారి యుపదేశములను మీరు చదువలేదా? కామ కాంచనముల రెండిటిని పరిత్యజింపుడని జనుల నందరిని ఆయన యెల్లప్పుడు హెచ్చరించుచుండెను'' అని నేను బదులు చెప్పితిని. ఆమె తెల్లపోయి, ''నన్ను క్షమింపుడు. వీరందరు నామె సొంత బిడ్డ లనుకొంటిని'' అని నుడివెను.

దుర్గపూజాసమయ మాసన్నమైనది. అమ్మగారి దగ్గర నుండిన క్రొత్త బట్టల మూటలోనుండి యామె తన ముగ్గురి మేనకోడండ్ర భర్తలకై యుద్దేశించిన బట్టలను దీసి వేఱుగా నుంచి మరియొకబట్టను చేతితో బుచ్చుకొని "ఈ క్రొత్త బట్టను పూజాసమయమున గ— ధరించి దానితోడనే బేలూరుమఠమునకు వెళ్లు," అని చెప్పిరి.

మధ్యాహ్నసేవయైన తరువాత మేము భోజనము చేసితిమి. అమ్మగారు విశ్రమించుచుండిరి. నే నామెప్రక్కను కూర్చుండి విసనకఱ్ఱతో విసరుచుంటిని. "అక్కడ ఒక తలగడ ఉన్నది. దానిని తెచ్చుకొని నాదగ్గర పరుండుము. నా కింక విసర నక్కరలేదు," అని ఎంతో ప్రేమతో నామె చెప్పిరి. ఆమె తలగడను వాడుటకు సందేహించి, రాధు గదిలోనుండి నేనొక తలగడను దెచ్చితిని. అమ్మగారు నవ్వుచు, "ఈ తలగడ పిచ్చిదియైన రాధుతల్లిది. ఆమె గొడవ చేయును. నా తలగడనే వాడుకొనుము. దానిలో ప్రమాదమేమియు లేదు," అని నాతో చెప్పి, పిమ్మట రాధును బిలిచి "నీవిచ్చుటకు వచ్చి నీ అక్కగారి చెంతను బరుండుము," అని యానతిచ్చిరి. తరువాత ప్రసంగము, పైన చెప్పిన చంద్రబాబుసోదరి మాటలపైకి పోయినది. "మంచిది! నా భర్త ఈ పూజామందిరములో నున్నారనియు మీరందరును ఆయన బిడ్డలే యనియు నీవు వెంటనే చెప్పియుండవలసినది," అని అమ్మగారనిరి. అందుపైని "ప్రపంచమందలి స్త్రీపురుషు లందరును ఆయన బిడ్డలే!" అని నే నంటిని. అమ్మగారు నవ్వుచు "జను లిచ్చుటకు రకరకముల కోరిక

లతో వచ్చుచుందురు. ఒక డొక్క దోసకాయను దెచ్చి శ్రీ రామకృష్ణులకు సమర్పించి, స్వప్రయోజనములకై న తన ఈప్సితముల నీడేర్పుమని ప్రార్థించును. సామాన్య జనుల స్వభావమిది,'' అని సెలవిచ్చిరి.

కొంచెము విశ్రమించి మేము లేచితిమి. కొందరు భక్తురాంఢ్రు ప్రక్కగదిలో నుండిరి. వారిలో నిద్దరు కాషాయవస్త్రములను ధరించిరి. వా రిరువురును శ్రీ మాతృ దేవికి ప్రణామము చేసిరి. తమతోకూడ భగవంతున కర్పిం చుటకై కొన్ని మధుర భక్ష్యములను దెచ్చిరి. వారు కాళీఘట్టమునందుండు శ్రీ నారాయణపరమహంస శిష్యురాం డ్రని మాకు తెలిసినది. అప్పుడాయన యొక పెద్ద యాగ మును చేయుచుండెను.

ఆ సన్న్యాసినులలో నొకరు "ప్రతిమార్చనలో

ప్రతి మార్చన

నేమైన సత్యమున్నదా? మా గురువు గారు దాని నొప్పుకొనరు. ఆయన అగ్ని, సూర్యారాధనలను జనులకు బోధింతురు'' అని చెప్పిరి.

అమ్మగారు : మీ గురువుగారి మాటలను మీరు సందేహింపకూడదు. ఆ విషయమై న న్నేల అడిగెదరు? మీ గురువుగారి యభిప్రాయమును మీరు వినియున్నారు కారా?

సన్న్యాసిని : మీ అభిప్రాయమేమో తెలిసికొన గోరుచున్నాము.

ఆ విషయమై అమ్మగారు తమ అభిప్రాయమేమియు నీయమనిరి. కాని, యా సన్న్యాసిని పట్టుబట్టి ప్రత్యుత్తరము కొరకు ఒత్తిడిచేయ నారంభించెను. అమ్మగారు చిట్టచివర కిట్లు చెప్పిరి : "మీ గురువుగారు నిజముగా సర్వజ్ఞులే యైనచో నిట్లు చెప్పియుండరు. ఇట్లనవలసి వచ్చినందుకు నన్ను క్షమింపుడు. అనాదిగా జను లెందరో ప్రతిమార్చన చేసి ఆధ్యాత్మికజ్ఞానమును బడసిరి. ఈ యథార్థవిషయమును మీరు కాదందురా? శ్రీ రామకృష్ణుల వారెన్నడు నిట్టి సంకుచితదృష్టిని, పక్షపాతబుద్ధిని గనుబరచియుండ లేదు. భగవంతుడు సర్వాంతర్యామి. అజ్ఞానాంధకారమునబడి దారి తెలియక పరితపించు మానవజాతికి తరణోపాయమును జూపింప, ప్రవక్తలును, అవతారపురుషులును ఈ లోకమున జన్మించుచుందురు. జనులకు వారి వారి మానసికతత్త్వములను బట్టి, వారు వివిధములైన యుపదేశముల చేయుచుందురు. సత్యమును గ్రహించుటకు మార్గము లనేకముగ నున్నవి. ఈ యుపదేశములన్నిటికిని సందర్భానుసారమైన ప్రయోజనమున్నది. ఉదాహరణమునకు ఒక చెట్టును దీసికొనుడు. దానికొమ్మలపై చాల పక్షులు వ్రాలియుండును; వానిలో కొన్ని తెల్లగను, కొన్ని నల్లగను, కొన్ని పచ్చగను, ఈ విధముగా వేర్వేఱురంగులు కలిగియుండును. వానికూతలు గూడ రకరకములుగా నుండును. కాని, మన మా కూతలన్నియు పక్షికూతలేయని చెప్పుదుము. ఆ కూతలలో నేదియో యొకటి మాత్రమే పక్షులకూతయనియు తక్కినవి పక్షులకూతలు కావనియు నెన్నటికిని చెప్పము."

ఆ సన్న్యాసినులు కొంతసేపటికి వాదమును విరమించుకొని, శ్రీ మాతృదేవి కలకత్తా నివాసము నడిగి తెలిసికొని, మరల వచ్చి యామెను దర్శింప కుతూహలపడుచుంటిమని చెప్పిరి. వారు వెళ్లిన తరువాత, అమ్మగారు "ఈ విధముగా వాదోపవాదములు చేయుట ఆడువారికి తగదు. వాదము వలన నెంతటి బుద్ధిమంతులకును భగవంతుని గ్రహించుటకు సాధ్యము కాదు. బ్రహ్మము వాదమువలన తేలెడు విషయమా?" అని చెప్పిరి. కొన్నాళ్లైనతరువాత అమ్మగారు కాశీకి ప్రయాణమగుటకు నిశ్చయించుకొనిరి. కొంత కాలము వరకు నే నామెను చూచుటకు వీలుండదు. నేను సెలవు తీసికొని వెళ్లునప్పు డామె నాయెడల గనుబరచిన కృపాతిశయము నా హృదయమును చూఱగొనెను. కేవలము నేను పరవశనై యా రాత్రి నింకెవరితోడను, మాటాడనే లేదు.

1913-వ సం॥ జనవరి 31-వ తేది.

శ్రీ మాతృదేవి కాశీనుండి తిరిగి వచ్చిరి. ఒక నాటి యుదయమున వారి యింటికి వెళ్లితిని. అమ్మగారప్పుడు పూజచేయుచుండిరి. పూజయైనతరువాతవచ్చి, "అమ్మా నిన్ను చూచుట నాకు చాలసంతోషముగానున్నది. నిన్నే నేను తలచుచుంటిని. కొలది కాలములో మేము మా గ్రామమునకు వెళ్లెదము. గ్రామమునుండి తిరిగి యిచ్చటకు వచ్చు వరకును నీవు కనుపడవేమోయని భయపడితిని," అని చెప్పిరి.

అప్పటికి ప్రొద్దుట తొమ్మిదిగంటలపైగా అయినది. అమ్మగారి మేనకోడలు రాధు కొలది దూరములోనున్న

కై క్రైస్తవ పాఠశాలకు పోవుటకు సిద్ధపడుచుండెను. ఇంతలో గోలప్‌మాయి వచ్చి, "రాధు పెద్ద పిల్ల అయినది. ఇంకను పాఠశాలకెందుకు వెళ్లవలెను?" అని అమ్మగారితో చెప్పి, రాధును బడికిపోవలదనెను. రాధు ఏడుపు నారంభించెను. "మరీ అంత పెద్దదికాలేదు. దానిని బడికి వెళ్లనిమ్ము. విద్యావతియైనచో పాఠశాలలో కొన్ని ఉపయోగకరమైన పనులను నేర్చుకొని యామె ఇతరులకెంతో మేలుచేయగలదు. ఈ పిల్లను నొక కుగ్రామములో నివసించు బాలునకిచ్చి పెండ్లి చేసిరి. చదువుకొనినయెడల ఈమె తాను బాగుపడుటయే కాకుండ, ఇతరులకు సాయము చేయగల స్థితిలోగూడ నుండును," అని అమ్మగారు చెప్పిరి. ఇందువలన రాధును బడికి వెళ్లనిచ్చిరి.

స్త్రీ విద్య

శ్రీ మాతృదేవియొద్ద మంత్రోపదేశము నొందుటకై కుతూహలపడుచుండిన యొక బాలికను అన్నపూర్ణతల్లి తన వెంట తీసికొనివచ్చి, "అమ్మా! మీ యొద్ద మంత్రోపదేశము నొందుటకు తనను తీసికొని వెళ్లుమని ఈ పిల్ల నన్ను వేధించుచున్నది. నేను కాదన లేకపోతిని. కనుక, మీకడ కిప్పుడీమెను తోడ్కొనివచ్చితిని" అని చెప్పెను.

అమ్మగారు : నే నప్పుడే భోజనము చేసితినే*. ఇక మంత్రోపదేశము చేయుట ఎట్లు పొసగును?

అన్నపూర్ణతల్లి : కాని, ఈ పిల్ల ఇంతవరకు భోజనము

---

* గురువు భోజనము చేయకముందు మంత్రోపదేశము చేయుట సామాన్యాచారము.

చేయలేదు. కనుక మీరు భోజనము చేసియున్నను, చేయక పోయినను ప్రమాదమేమియు లేదు.

అమ్మగారు : ఈమె మంత్రోపదేశమునకు సిద్ధముగా నున్నదా?

అన్నపూర్ణతల్లి : ఔనమ్మా! పూర్తిగా సిద్ధపడియే వచ్చినది.

అమ్మగారు మంత్రోపదేశము చేయుటకు సమ్మతించిరి. మంత్రోపదేశమైన తరువాత అన్నపూర్ణతల్లి ఆ బాలికను గురించి ప్రసంగింప మొదలుపెట్టి, "ఈమె సామాన్య బాలిక కాదు. శ్రీ రామకృష్ణులవారినిగూర్చి చదివిన తరువాత, ఈమె కఠినమైన ఆధ్యాత్మిక సాధనలను చేయనభిలషించి, జుట్టునుకత్తిరించుకొని, పురుషవేషమునుదాల్చి, తీర్థయాత్రకు బయల్వెడలెను. వైద్యనాథ్ వరకు వెళ్లెను. ఆ స్థలము కలకత్తాకు రెండువందల మైళ్లకు పైబడిన దూరములో నున్నది. అచ్చట నొక యడవిలో ప్రవేశించి విశ్రాంతి తీసికొనుచుండెను. అప్పుడామె తల్లియొక్క గురువు ఆ దారిని పోవుచు నామె యెక్కడ నివసించుచున్నదియు, నడిగి తెలిసికొని యామెతండ్రికి తెలిపెను. అంతవరకు నామెను ఆ గురువు తనసంరక్షణక్రింద నుంచుకొనెను. తరువాత ఆమె తండ్రి అచ్చటకువచ్చి యామె నింటికి తీసికొనిపోయెను," అని చెప్పెను.

అమ్మగారీ మాటలను విని "ఆహా! ఏమిభక్తి!" అని మెచ్చుకొనిరి. అప్పుడచ్చటనుండిన యితరభక్తురాండ్రు "ఏమి యీ వింత! ఎంత అందమైన పిల్ల! భక్తిశ్రద్ధలెంత

యెక్కువగానున్నను, ఒంటిగా నీమె యెట్లు వెళ్లగలిగెను?" అని తమ ఆశ్చర్యమును వెలిబుచ్చిరి. "మా ప్రాంతములలో నిట్టిది జరిగినయెడల తప్పక జనాపవాదము కలిగియుండెడిది," అని నళిని తన యభిప్రాయమును ప్రకటించెను.

మధ్యాహ్నభోజనమైన తరువాత మేమందరమును ప్రక్కగదిలోనికిబోయి విశ్రాంతి కొఱకు పరుంటిమి. అమ్మగారు తమ నూతన శిష్యురాలితోకూడ కొంతతడవు విశ్రమింపుమనిరి. పగటిపూట పరుండు నలవాటు తనకు లేదని యా బాలిక చెప్పెను. శ్రీమాతృదేవి యాజ్ఞను మీరకూడదని నే నంటిని. ఆమె యొప్పుకొనెను గాని కొలది నిమిషములైన తరువాత ప్రక్కలోనుండి లేచి వసారాలోనికి వెళ్లెను. "ఆమెకు కుదురు లేదు. అందుచేతనే యామె యింటిని విడిచి వెళ్లినది," అని చెప్పి, "ఆమెభర్త కేమిపని? ఆతడామెను తనయొద్ద నెందుకుంచుకొనడు?" అని అమ్మగారు ఆ బాలిక పరిచారిక నడిగిరి. "అతనికి స్వల్పజీతము వచ్చును. ఇంతేకాక, అతనియింటిలో నెవ్వరును లేరు. అతడీ బాలిక నొకతె నింటిలో నుంచుకొనలేడు కనుక, తన తండ్రియొద్దనే ఆమె యుండును. ప్రతి శనివారమును ఆదివారమును భర్త తనమామగారి యింటికి వచ్చుచుండును," అని యా పరిచారిక బదులుచెప్పెను. తరువాత అన్నపూర్ణ తల్లి అందుకొని "ఈ పిల్ల తనభర్తతో నీవు నాభర్తవు కావు. జగదీశ్వరుడే నా భర్త అని చెప్పుచుండును," అని నుడివెను. శ్రీమాతృదేవి యేమియు బదులు చెప్పక యూరకుండెను.

**కొన్ని యాధ్యాత్మిక బోధలు**

పూజామందిరమున కుత్తరము వైపునగల వసారాలో బిగ్గరగా మాట్లాడుచుండిరి. "నీవు వెళ్లి, వారిని మెల్లగా మాట్లాడుడని చెప్పుము. ఇట్టి గోల శ్రీ శారదానంద స్వామిని చీకాకు పఱచును," అని యొకరితో అమ్మగారు చెప్పిరి. అప్పు డామెగదిలో నింకెవరును లేరు. ఆధ్యాత్మిక సాధనలనుగురించి యామెను కొన్ని ప్రశ్నలడిగితిని. అమ్మగారిట్లు చెప్పిరి: "శ్రీరామకృష్ణులకును నాకును ఏవిధమైన భేదమును పాటింపకుము. నీకు కనుబఱచిన భగవంతుని విశేషస్వరూపమును ధ్యానించుచు, ప్రార్థింపుము. ధ్యానము హృదయములో నారంభమై, శిరస్సునందలి సహస్రారములో ముగియును. మంత్రములవలనగాని, వేదపఠనమువలనగాని లాభమేమియు లేదు. భక్తియే ముఖ్యము. భక్తికి సాధ్యముకాని దేదియు లేదు. గురువు, ఇష్టదైవము, సర్వము శ్రీరామకృష్ణులే. సర్వాధికారి ఆయనయే."

పిమ్మట ప్రసంగము గౌరీమాయిపైనను, ఆమె శిష్యురాలు ద–పైనను పోయెను. వీరిరువురను అమ్మగారు మిక్కిలి కొనియాడి, "అమ్మాయీ! సావధానముగా వినుము. సంసారసంపర్కమాలిన్యము తమతమ హృదయములలో చేరి కరుడుకట్టిన తరువాత, భగన్నామమును చాలమంది స్మరింతురు. కాని, బాల్యమునుండియు భగవద్భక్తి కలవాడే ధన్యుడు. ఈ బాలిక మల్లెపువ్వువంటి నిష్కళంకురాలు. గౌరీదాసి యామె శీలమును చక్కగాదిద్ది తీర్చినది. ఆమెకు పెండ్లిచేయవలెనని ఆమెసోదరు లెంతో ప్రయత్నించిరి.

కాని గౌరీదాసి యామెనింటిలోనుండి తీసికొనిపోయి పెచ్చు పెచ్చుటనో దాచియుంచి, చిట్టచివరకు జగన్నాథమునకు తోడ్కొనిపోయి, జగన్నాథునితో పూలదండను మార్చు కొనునట్లుచేసి, యామెకు సన్న్యాసమిచ్చెను. ఆ బాలిక జగత్ప్రభువైన జగన్నాథుని పెండ్లియాడెనని దీనియర్థము. అప్పటినుండి యామె సన్న్యాసినిగనే జీవితమును గడపు చున్నది. ఎంత మంచి నిర్మలమైనపిల్ల! ఆమె బాగుగా చదువుకొన్నది. ఏదియో సంస్కృతపరీక్షనిచ్చుటకు సిద్ధపడు చున్నదని వింటిని,'' అని చెప్పిరి. గౌరీమాయి జీవితప్రారంభ దశలోని యనేక విశేషముల నామె చెప్పగా విని, గౌరీమాయి జీవితములోకూడ నిటువంటి ఒడుదొడుకులుండెనని గ్రహిం చితిని. తమ కాశీయాత్రను గురించి ముచ్చటించుచు, అచ్చట కొన్నాళ్లు మిక్కిలి సుఖముగా గడపితిమని శ్రీ మాతృదేవి చెప్పిరి.

కొంత తడవైన తర్వాత నలుగురైదుగురు భక్తు రాండ్రువచ్చి, కొబ్బరి బొండములను కొన్ని పండ్లను సమ ర్పించిరి. వారిలో నొకయామె శ్రీ మాతృదేవి పాదములను స్పృశించుటకై దగ్గరకు వచ్చుచుండగా, ''దూరమునుండియే నమస్కారము చేయుడు,'' అని అమ్మగారు చెప్పిరి. వారు కొంతపైకమునుగూడ నీయబోయిరి. కాని, అట్లు చేయవల దని అమ్మగారు వారిని వారించిరి. పిమ్మట తమకేమైన ఆధ్యాత్మిక బోధలను చేయుడని వారు కోరిరి. అమ్మగారు మందహాసము చేయుచు ''నేను మీకు దేనినిగూర్చి బోధ చేయుదును ? శ్రీ రామకృష్ణులవారి యుపదేశములు పుస్తక

రూపమున వెలువడినవి. ఆ యుపదేశములలో నొకటియైనను మీరు గ్రహించి ఆచరింప గలుగుచో, జీవితములో సర్వము మీకు లభించును,'' అని బదులు చెప్పిరి. వారు సెలవు దీసికొని వెళ్లిన తరువాత ''ఆధ్యాత్మికబోధను గ్రహించుకొనగలవా రెక్కడున్నారు? మొట్టమొదట అభ్యాసకులకు అర్హత యుండవలయును; లేనిచో నెన్ని యుపదేశములైనను నిష్ప్రయోజనము లగును,'' అని శ్రీ మాతృదేవి సెలవిచ్చిరి.

ఇంతలో అన్నపూర్ణ తల్లి గదిలోనికివచ్చి, ''అమ్మా, మీరు నాకు కలలోకనుపడి మీ ప్రసాదమును నేను తీసికొన్నచో నా వ్యాధి కుదురునని చెప్పితిరి. కాని యెవరి ప్రసాదమునుగూడ నేను తినకూడదని శ్రీ రామకృష్ణులవారి ఆజ్ఞ. అయినను మీ ప్రసాదమును నాకు కొంచెము దయ యుంచి యిచ్చినచో, నేను సంతోషింతును'' అని చెప్పెను. ఆ రీతిని చేయుటకు అమ్మగారు వీలులేదనిరి. కాని, యా స్త్రీ ప్రసాదమీయుడని పట్టుపట్ట నారంభించెను.

అమ్మగారు : శ్రీరామకృష్ణుల వారిమాట నతిక్రమించుట నీ కిష్టమా?

అన్నపూర్ణతల్లి : మీరును శ్రీ రామకృష్ణులును వేఱని నేను తలచుచుండినంతవరకు, శ్రీ రామకృష్ణుల వారిమాట చెల్లతగి యుండును. కాని; మీ యిరువురకును భేదమేమియు లేదని నేనిప్పుడు గ్రహించియున్నాను. కనుక దయయుంచి మీ ప్రసాదమును నా కీయుడు.

అమ్మగారు లొంగిపోవలసి వచ్చెను. కొంతసేపటికి నేను సెలవు తీసికొని వెళ్లితిని.

మఱియొకనాడు శ్రీ మాతృదేవిని నేను సందర్శించినప్పుడు, నా భర్తనుగూర్చి అమ్మగారు నన్నడిగిరి. వారి యారోగ్యమంత బాగుగా లేదని నేను చెప్పితిని. పిమ్మట అమ్మగారు చెప్పిన ప్రకారము నేనొక యుత్తరమును వ్రాసి యామెకిచ్చితిని. మధ్యాహ్నమున భోజనముచేసి అమ్మగారు కొంచెము విశ్రమించుచుండగా, ఆమె గదిలోనికి కొందరు భక్తురాండ్రు వచ్చిరి. మామూలు మర్యాదలైన తరువాత వారిలో నొకరు, "నాకొక మంచిమేక యున్నది. అది రోజుకు నాలుగు శేర్ల పాలిచ్చును. మూడుపక్షులనుగూడ నేను పెంచుచున్నాను. వానితోడనే కాలమును వెళ్లబుచ్చుదును. ఇప్పుడు నేను చాల ముసలిదాననైతిని," అని ఆమె చెప్పుచుండగా, "మనమొక పిల్లినో కుక్కనో పెంచుచు భగవంతుని మరచిపోవునట్లు మహామాయ, విశ్వమునెల్ల నావరించియున్న ఆ మహాశక్తి చేయుచున్నది. ఈ విశ్వనాటక మీ విధముగా జరుగుచున్నది," అని యిట్టి లౌక్యుల విషయమున శ్రీరామకృష్ణులవారు చెప్పినమాటలు నాకు జ్ఞప్తికి వచ్చినవి. ఈ భక్తురాండ్రు సంభాషించుచుండినపుడు శ్రీ మాతృదేవి యొకమాటయైనను పలుకక, యూరక తలనూపుచుండిరి. మాకొరకై యామె యెంత దారుణబాధను సహించుకొనవలసి వచ్చెను! మే మామెను కొంచెమైనను విశ్రాంతి నొందనీయలేదు. పనికిమాలిన

యేవో చెత్తమాటలతో నామెను వేధించితిమి. నేను సెలవు దీసికొని సాయంకాలమున నింటికి వెళ్లితిని.

*     *     *

సాత్త్వికగుణము వలన త్యాగమలవడును

నే నొకనాటిరాత్రి అమ్మగారిని దర్శించినపు డామె శయ్యపై బరుండి యుండిరి. ఆమె ప్రక్క నింకొక స్త్రీ యుండెను. నన్ను చూచినతోడనే అమ్మగారు లేచి కూర్చుండిరి. నే నామెకు ప్రణామము చేయుటకు వీలుగా నుండుటకై యామె యిట్లు చేసిరి. ప్రసంగవశమున శ్రీ మాతృదేవి యిట్లు సెలవిచ్చిరి. "సృష్టి సమయమున జనులు సత్త్వగుణ యుక్తమైన తేజస్సుతో బుట్టిరి. పుట్టినప్పటి నుండియు వారు జ్ఞానులే. ఈ కారణమువలన, జగత్తు యొక్క అనిత్య స్వభావమును వారు వెంటనే గ్రహించి, దానిని పరిత్యజించి, పారమార్థిక సాధన చేయుచుండెడివారు. మిక్కిలి త్వరితముగా వారికి ముక్తి లభించుచుండెను. తన సృష్టి వ్యర్థమై పోవుచుండెనని సృష్టికర్త గ్రహించెను. ఇట్లు ముక్తినొందిన జ్ఞానులు జగన్నాటక నిర్వహణమునకు పనికి రాకుండిరి. పిమ్మట, భగవంతుడు సృష్టిని మరల ప్రారంభించి, సత్త్వముతో రజస్తమోగుణములను గూడ గలిపెను; ఆయన యుద్దేశ మప్పుడు నెఱవేరెను." పిమ్మట సృష్టిని గురించి, ప్రజలలో విశేష ప్రచారముగల యొకపద్యమును జదివి, "మా చిన్నతనమందు వీథి నాటకముల వలన మాకీ యూహలు పట్టువడినవి. ఇప్పు డీ నాటకములే అరుదై పోయినవి," అని అమ్మగారు సెలవిచ్చిరి.

కొంతమంది యువతులు, శ్రీ మాతృదేవి బంధుకోటి లోనివారు, మరియొక గదిలో నొక పుస్తకమును బిగ్గరగా చదువుచుండిరి. "వా రెంత బిగ్గరగా చదువుచున్నారో వినుడు. క్రింది అంతస్తులో చాలమంది జను లున్నారను విషయమును వారు మరచిపోయిరి," అని అమ్మగారు చెప్పిరి.

అమ్మగారి పిచ్చివదినెగారు, రాధుతల్లి, గదిలోనికి వచ్చి, "లక్ష్మమణి (శ్రీరామకృష్ణులవారి మేనకోడలు) నవద్వీప యాత్రకు పోవుచున్నది. నేనుకూడ నామెతో పోవ నిచ్ఛగించితిని. వెళ్లకుండ నన్ను మీ రాటంక పెట్టినారు," అని చెప్పి వీరావేశముతో గదిలోనుండి వెడలిపోయెను.

భక్తులు వర్ణనియమములకు అతీతులు

తరువాత అమ్మగారిట్లు చెప్పిరి: "ఈమె లక్ష్మతో గూడ వెళ్లుటకు నే నెట్లు సమ్మతింపగలను? లక్ష్మ భక్తురాలు. ఆమె యితర భక్తురాండ్రతో గలసి పాడును, నృత్యము చేయును. ఆమె వర్ణభేదమును పాటింపక యితరులతో భోజనము చేయును. రాధు తల్లికిది బోధపడదు. తమలో తాము భక్తురాండ్రు వర్ణనియమములను పాటింప నవసరము లేదను సంగతి యామెకు తెలియనే తెలియదు. ఇట్టి సందర్భములలో నామె యింటికి తిరిగివచ్చి అందరి యెదుటను లక్ష్మయొక్క ప్రవర్తనను ఖండించును. లక్ష్మని నీవు చూచితివా?"

భక్తురాలు: లేదమ్మా.

అమ్మగారు : ఆమె దక్షిణేశ్వరములో నున్నది. ఒకనాడు వెళ్లి యామెను చూడుము. నీవు దక్షిణేశ్వరమున కెప్పుడైనను వెళ్లియుంటివా ?

భక్తురాలు : ఔనమ్మా ! అచ్చటికి నేను చాల సారులు వెళ్లితిని. కాని, ఆమె యచ్చట నివసించుచుండెనని మాత్రము నాకు తెలియదు.

అమ్మగారు : దక్షిణేశ్వరములో నేను నివసించు చుండిన నౌబత్తుగది చూచితివా ?

భక్తురాలు : ఔనమ్మా ! దానిని బయటనుండి చూచితిని.

అమ్మగారు : మరి యొకనాడు నీ వచ్చటకు బోవు నెడల, ఆ గదిలోనికి వెళ్లుము. నేనచ్చటనుండినప్పుడు నా ప్రపంచమంతయు ఆ చిన్నగదియే......... బేలూరులో శ్రీ రామకృష్ణులవారి జయంత్యుత్సవమును చూచితివా?

భక్తురాలు : లేదమ్మా ! బేలూరునందలి మఠము నకు నే నెన్నడును వెళ్లలేదు. అచ్చట నివసించు సన్న్యాసు లకు, మఠములోనికి స్త్రీలు గుమికూడివచ్చుట యిష్టము లేదని వింటిని. కనుక నే నచ్చటికి వెళ్లుటకు వెనుదీయు చున్నాను.

అమ్మగారు : ఒక్కసారి యచ్చటకువెళ్లి శ్రీరామ కృష్ణులవారి జయంత్యుత్సవమును చూడుము.

* * *

నేను శ్రీ మాతృదేవిని సందర్శించుటకై బాగ్ బజారుకు వెళ్లినప్పటికి సాయంకాలమైనది. చిత్రాసనమును నేలపై బఱచి, జపమాలను దీసికొనివచ్చి, యిమ్మని అమ్మగారు ప్రేమతో నా కొసంగిచ్చిరి. నే నట్లుచేసినతోడనే యామె ధ్యానముచేయ నారంభించిరి. అమ్మగారున్న ఇంటి కెదురుగా నొక బయలుండెను. అచ్చట పాటకపుజాతి మనుష్యులు కొందరు తమ కుటుంబములతోకూడ కాపురముండిరి. వారిలో నొకడొక స్త్రీని (బహుశః తన భార్యనే) దారుణముగా కొట్టుచుండెను. లెక్కలేకుండ చెంపకాయలు గ్రుద్దులు కురిపియుచుండెను. పిమ్మట వాడామెను తన శక్తికొలదిని తన్నెను. అప్పుడామె తన చేతులలోనున్న చంటిబిడ్డతో కూడ దూరముగావెళ్లి పడిపోయెను. అంతతో వాడాగక యా స్త్రీని మరల తన్ననారంభించెను. అమ్మగారి కిక ధ్యానము సాగించుటకు సాధ్యముకాలేదు. సాధారణముగా శ్రీమాతృదేవికి లజ్జ మిక్కుటము; క్రింది యంతస్తులోని వారికికూడ వినపడనంత మెల్లగా నామె మాట్లాడుదురు; కాని యీ సమయమునమాత్ర మామె తమ సహజమృదుల స్వభావమునెల్ల విడనాడి, రెండవ యంతస్తునగల వసారాలోనికివచ్చి ఇనుపకమ్మల ప్రక్కను నిలువబడి "ఓరీ! దుర్మార్గుడా! ఏకముగా పిల్లను చంపివేసెదవురా! అది యిప్పటికే చచ్చిపోయినదేమో అని భయమగుచున్నది!" అని కోపోద్దీపితులై గర్జించిరి. ఏమి చిత్రమోకాని, అమ్మగారిని వాడు చూచిన వెంటనే మంత్రగాని యెదుటబడిన సర్పమువలె, నణగిపోయి, శాంతించి, యాస్త్రీని వదలి

వేసెను. అమ్మగారు కనుబఱచిన దయనుజూచి, పాపమా యీాడుది వెక్కి వెక్కి యేడువసాగెను. వేళకు వంటచేయక పోవుటయే యామె చేసిన గొప్పనేరమని తరువాత మాకు తెలియవచ్చెను. పిమ్మట తన దురాగ్రహావేశము విడనాడి, యీా మనుష్యుడు శాంతముగా నామెతో సఖ్యపడగోరెను. ఈ వైఖరిని చూచిన తరువాతనే, శ్రీ మాతృదేవి మరల తమ గదిలోనికివచ్చిరి.

కొంత తడవైన తరువాత ఆ సందులో నొక బిచ్చ గానికేక వినవచ్చెను. వాడు 'రాధాగోవిందా! భగవాన్‌కీ జై! గ్రుడ్డివారిని కనికరించు' అని అరచుచుండెను. వానిని గురించి అమ్మగారిట్లు చెప్పిరి : ''ఆ సందులో ప్రతిరాత్రి ఈ బిచ్చగాడు పోవుచుండును. మొట్టమొదట వాడు 'గ్రుడ్డి వాండ్రను కనికరించండి' అని కేకవేయుచుండువాడు. కాని ఒకనాడు ''ఆ కేకతోపాటు 'రాధాకృష్ణా!' యను భగవ న్నామమునుకూడ ఉచ్చరించుచుండుము. దీనివలన నీవు రెండు పనులను సాధించిన వాడవగుదువు. పావనమైన భగవ న్నామమును నీవు స్మరించుటయేకాక, గృహస్థుల జ్ఞప్తికి కూడ తెచ్చుచుందువు. లేనిచో అహోరాత్రములు నీగ్రుడ్డి తనమును గురించి మాత్రమే నీవు తలపోయుచుందువు,'' అని గోలప్‌మాయి వానికి సరియైన హితవు చెప్పెను. అప్పటి నుండి ఆగ్రుడ్డివాడు భగవన్నామమును బిగ్గరగా నుచ్చరిం చుచు ఈ సందులో పోవుచుండును. గోలప్‌మాయి వాని కొక బట్టనుకూడనిచ్చెను. ఇతర వస్తువులును వానికిదొరుకు చుండును

* * *

పూజామందిరములో స్వామినర్చించు పద్ధతి

నేనొకనాటి సాయంకాలమున బాగ్‌బజారుకు వెళ్లినప్పుడు శ్రీ మాతృదేవి ఇట్లు ప్రసంగించుచుండిరి :—"క్రొత్తగావచ్చు భక్తజనులకు పూజామందిరములో, స్వామిసేవావకాశము నిచ్చుచుండవలయును. నవనవోత్సాహపూరితులై వారు శ్రీ భగవానుని శ్రద్ధగా సేవింతురు. ఇతరులకీసేవ ఆయాసకరముగ నుండును. నిజమైన సేవయనిన వేళాకోళముకాదు. మనము చేయు భగవంతుని సేవలో నే విధమైన లోపము రాకుండ బహుజాగరూకులమై యుండవలయును. కాని, నిజమేమనగా దయామయుడైన శ్రీ భగవానుడు మనయవివేకమును గ్రహించి మనలను క్షమించుచుండును." అమ్మగారిప్రక్కనే యొక భక్తురాలుండెను. అమ్మగారీమాటల నామెనుద్దేశించియే చెప్పుచుండిరేమో యని నా యనుమానము. సరియైన రకపు పువ్వులనే కోయుమని, అర్చనకు గంధము తీయుమని, పూజామందిరములో పనిచేయుచుండునప్పుడు శరీరమందలి యేభాగమునుగాని, బట్టనుగాని వెంట్రుకనుగాని చేతితో తాకవలదని శ్రీమాతృదేవి యామెకు హితోపదేశము చేసి, "పూజామందిరములో మనము బహుశ్రద్ధతో వ్యవహరించుచు, నైవేద్యమును తక్కిన ఇతరసేవలను సరియైన కాలములో చేయుచుండవలయును," అని చెప్పిరి.

* * *

నేను శ్రీ మాతృదేవి యింటికి వెళ్లినప్పుడు రాత్రి యెనిమిది గంటల ముప్పదినిమిషములైనది. పూజా మందిర

మునకు ఉత్తరముననున్న వసారాలో నామె ధ్యాననిష్ఠలో నుండిరి. ఇంకొక గదిలో మేము కొంతతడవు వేచియుంటిమి. అమ్మగా రచ్చటకు వచ్చి మందహాసముచేయుచు, "నాతల్లీ! నీవు వచ్చుట నాకెంతో సంతోషముగా నున్నది," అని చెప్పిరి.

భక్తురాలు : అమ్మా! నాతో నా చెల్లెలినిగూడ తీసి కొని వచ్చితిని. సాయంకాల పూజయైనదా?

అమ్మగారు : లేదు మీరు దానిని చూడవచ్చును. నేనుకూడ ఇప్పుడే వచ్చెదను.

సాయంకాల పూజ త్వరలో ప్రారంభమయ్యెను. చాలమంది స్త్రీలు పూజామందిరములో గూర్చుండి ప్రార్థన చేయ మొదలు పెట్టిరి. పూజయైన తరువాత మేము ప్రతి మకు సాష్టాంగముచేసి, శ్రీమాతృదేవిని జూచుటకై ప్రక్క గదిలోనికి వెళ్లితిమి. ఆమె యింటిలో మే మున్నప్పుడు ఒక్కనిమిషమైనను ఆమెను విడిచియుండుటకు మా మన సొప్పదు.

**శ్రీ రామకృష్ణుల గాన నైపుణ్యము**

కొలది నిమిషములైన తరువాత అమ్మగారు గది లోనికి వచ్చిరి. ఒక వృద్ధస్త్రీ మఱి యొకరిచే నొక హరికీర్తనను చెప్పించు కొనుచుండెను. "ఆ పాట నామె సరిగా నేర్వలేదేమో యని నాకు సందేహముకలుగుచున్నది. ఆహా! శ్రీ గురుమహారాజుగా రెంత బాగుగా పాడెడువారు! ఆయన కంఠముకూడ ఎంతో మధురముగా నుండెడిది. పాట పాడు

చుండినప్పు డాయన తన్మయులై యుందురు. ఇప్పటికిని ఆయన పాటతీరు నా జ్ఞప్తికి వచ్చుచుండును. అది నాతలపునకు వచ్చినప్పు డితరుల పాటలు మిక్కిలి పేలవముగా కనుపడును. నరేంద్రుని కంఠముకూడ మధురముగా నుండెడిది. ఈ యూరువిడిచి వెళ్లునప్పు డాతడు నన్ను చూచుటకై వచ్చి కొన్ని పాటలు పాడెను. నాయొద్ద సెలవుతీసికొని వెళ్లునప్పు డాతడు 'అమ్మా! నా పురుషజన్మను సార్థకము చేసికొని, నేను మరల రాగలిగినచో మిమ్ము తిరిగి దర్శింతును; లేనిచో ఇదియే కడసారిచూపు!' అని చెప్పెను. 'నాయనా! నీ యుద్దేశ్యమేమి?' అని నిర్ఘాంతపడి అడిచితిని. అందుల కాతడు 'మంచిది! మీ దయావిశేషమువలన నేను త్వరలోనే తిరిగివచ్చెదను,' అని బదులు చెప్పెను. గిరీశబాబు కంఠముకూడ మధురమైనదే," అని అమ్మగారు చెప్పిరి.

ఇంతలో గదిలోనికి రాధువచ్చి, అమ్మగారిని తనయొద్ద పరుండగోరెను. "నీవు వెళ్లి పరుండుము. ఎంతో దూరమునుండి వీరు వచ్చినారు. కొంచెముసేపు వీరిదగ్గర కూర్చుండెదను," అని అమ్మగారు బదులుచెప్పిరి. కాని, యామె రావలయునని రాధు పట్టుపట్టెను. అంతట "మీ పడకగదిలోనికి బోవుదము రండు. అచ్చట మీరిరువురును బరుండవచ్చును," అని నేను మనవిచేయ, శ్రీ మాతృదేవి యట్లేచేసిరి. నేను కొంతతడవు వీవనతో విసరిన తరువాత, "ఇప్పుడు చల్లగానున్నది. ఇంక నీ వాయాసపడవలదు," అని అమ్మగారు సెలవిచ్చిరి. పిమ్మట నే నామె పాదములను బట్టుచుంటిని. ఒక వృద్ధస్త్రీ యోగశాస్త్రములోవచ్చు

షట్చక్రములనుగురించి మరియొకయామెకు బోధించుచుండెను. ఆ బోధను మానివేయుమని గోలప్‌మాయి యామెను కోరెను. కాని యామెవినక యింకను చెప్పుచుండెను. అమ్మగారామెమాటలనువిని, చిరునవ్వునవ్వుచు "నాకొరకు శ్రీ రామకృష్ణులు స్వహస్తముతో కుండలిని, యోగషట్చక్రములను చిత్రించిరి," అని నాతో చెప్పిరి. ఆచిత్రమింకను నుండెనాయని యామె నడిగితిని. "లేదమ్మా! మా కడకు భక్తులు వచ్చెదరని నేనప్పు డూహింపలేదు. ఆ కాగితము పోయినది," అని అమ్మగారు చెప్పిరి.

గృహస్థులు - ఆధ్యాత్మికాభివృద్ధి

అప్పటికి రాత్రి పదునొక్క గంటయైనది. అమ్మగారు మా ప్రణామముల నందుకొని, తమ పరుపుపై గూర్చుండి మమ్మాశీర్వదించి, నన్ను ప్రక్కకు పిలిచి, "భార్యాభర్తలు మతసాధనలను గురించి యేకాభిప్రాయులై యున్నచో, ఆధ్యాత్మికాభివృద్ధి వారికి సులభముగా కలుగును," అని చెప్పిరి. కొలదినాళ్లైన తరువాత అమ్మగారిని నేను మరల సందర్శించినప్పుడు,

గురుభక్తి

"అవసరమైనచో గురువునకుకూడ మనమేది ధర్మమో చెప్పవలసినదే. శిష్యులట్లు చేయుటలో దోషమెంతమాత్రమును లేదు. కాని, గురువునందు శిష్యునకు అచంచలమైనభక్తి యుండవలెను. గురుని ప్రవర్తన మెట్లున్నను, నాతనియం దట్టి భక్తి కలిగియున్నచో, శిష్యుడు ముక్తిని సాధింపగలుగును. తమ గురుదేవుడనిన శ్రీరామకృష్ణుల శిష్యులకు గల భక్తిని చూడుడు. తమ దేశికుని షట్ల

గల యీ ప్రేమచే, (శ్రీ)రామకృష్ణుల కుటుంబమునకు చెందిన నెవరినైన వారు ప్రేమింతురు; చివరకాయన గ్రామములోని పిల్లినిగూడ అభిమానముతో జూతురు,'' అని యామె చెప్పు చుండగా వింటిని.

*　　　　*　　　　*

1913-వ సం॥ నవంబరు 11-వ తేది.

బాలిగంజ్ నందలి మా యింటిలో పువ్వులు విస్తారముగా గలవు. పువ్వులనిన (శ్రీ) మాతృదేవికెంతో యిష్టము. నే నొకనాడు వానిని సమృద్ధిగా కోసికొని మా మెను దర్శింప వచ్చితిని. అప్పుడామె పూజచేయుటకు సిద్ధముగానుండిరి. ఆ పూలను పళ్లెరములో సర్ది యుంచితిని. కాని, అమ్మగారి పాదముల నర్చించుటకు కొన్నిటిని వేఱుగా దీసియుంచ మఱచినందున, ఆనాటికి (శ్రీ) మాతృదేవిని పూజించుటకు నాకు వీలుండదుగదా యని చింతించుచుంటిని. కాని, నా రహస్యాభిలాషను కనిపెట్టి అమ్మగారే కొన్ని పూలను పళ్లెరములో వేఱుగానుంచిరని త్వరలో కనుగొంటిని. పూజయైన తరువాత, ''అమ్మాయీ! ఇట్లు చూడుము! ఆ పళ్లెరములో నీకొఱకు నే నా పుష్పములనుంచితిని. వాని నిచ్చుటకు తీసికొనిరా,'' అని యామె నాతో చెప్పిరి. అప్పుడే యొక భక్తుడు పెద్దపండ్లగంపతో, అమ్మగారిని దర్శింపవచ్చెను. అతనిని జూచి శ్రీ మాతృదేవి మిక్కిలి సంతోషించి, యాతని నుదుట మంచిగంధపు బొట్టుపెట్టి, యాతని గడ్డమును నిమిరి

ముద్దాడెను. ఏ భక్తునిపైనను తమ ప్రేమామృతము నీ రీతిని అమ్మగారు వర్షించుట నే నెన్నడును జూడలేదు. పిమ్మట నన్ను, కొన్ని పుష్పము లాతని కిమ్మనిరి. భక్త్యావేశముతో శరీర మాపాదమస్తకము కంపించుచుండ, నతడా పుష్పముల గైకొని, మహానందముతో వానిని శ్రీ మాతృదేవి పాదములకు సమర్పించి, ప్రసాదము దీసికొని వెళ్లెను. ఆమె మంచముపై గూర్చుండి మిక్కిలి యాప్యాయముగా నన్ను దగ్గరకు రమ్మనిరి. నే నామెపాదములను అర్చించితిని. బహు ప్రేమతో తమ హస్తమును నా శిరస్సుపైనుంచి, నన్ను ముద్దాడిరి. ఆమె యాశీస్సులచే నా హృదయము కరగి పోయెను.

కొంత తడవైన తరువాత అమ్మగారు డాబామీద తల నార్చుకొనుచు, నన్ను గూడవచ్చి, తలపిడపను దీసివైచి తల నార్చుకొనుమని, లేకున్న జబ్బుచేయవచ్చునని చెప్పిరి. గోలప్ మాయి డాబామీదకువచ్చి పూజామందిరములోని ప్రతిమలకు నైవేద్యము చేయుడని శ్రీ మాతృదేవి నడిగెను. అమ్మగారు డాబామీదనుండి దిగివచ్చిరి. కొలది నిమిషము లైన తరువాత నేనుకూడ క్రిందికి దిగివచ్చితిని. ఆమె పూజామందిరములో నొక పెండ్లికూతురివలె సిగ్గుపడుచు "ఇకరండు! వడ్డనయైనది," అని శ్రీరామకృష్ణులవారిని పిలుచుచుండెను. పిమ్మట గోపాల ప్రతిమ దగ్గరకువచ్చి, "ఓ నా గోపాలా! భోజనమునకు రా!" అని సంబోధించుచు, అకస్మాత్తుగా వెనుకకు తిరిగి నన్ను చూచి నవ్వుచు "వీరినందరిని భోజనమునకు బిలుచుచుంటిని," అని అమ్మగారు చెప్పిరి.

ఈ మాటలు చెప్పుచు, శ్రీమాతృదేవి నైవేద్యముండిన గదిలోనికి వచ్చిరి. ఆమె శ్రద్ధాభక్తులనుజూచి ప్రతిమ లామె మాటలను శిరసావహించి యామెతో కూడ నైవేద్యపు గదిలోనికి వచ్చినట్లే యనిపించి, ఆశ్చర్యపారవశ్యమున నేను నిశ్చేష్టురాలనై నిలిచితిని.

ఎంత స్వల్పవస్తువునైనను వ్యర్థము చేయకూడదు

నైవేద్యమైన తరువాత మేమందరము కలిసి భోజనమునకు గూర్చుంటిమి. పిమ్మట అమ్మగారు నన్ను కొంతతడవు విశ్రమింపుమనిరి. అంతలో నొకపురుషుడు పండ్ల గంపతో వచ్చెను. పండ్లు నైవేద్యము చేయబడును. గంప నేమిచేయవలయునని యాత డచ్చటి సన్న్యాసుల నడుగగా, వారు దానిని సందులో పారవేయుమనిరి. అమ్మగారు తమ శయ్యలోనుండి లేచి వసారాలోనికివచ్చి, సందువైపుజూచి, "ఇటువచ్చిచూడుము, ఎంత చక్కనిగంపను సన్న్యాసులు పారవేయుమనిరి! వారికది చీమకుట్టినట్లైనను లేదు. వారందరు సన్న్యాసులు, పరిపూర్ణ విరక్తులు. కాని, మనమట్లు వస్తువులను పారవేయలేము. మన మా గంపను కూరల చెక్కనుంచుటకైనను వినియోగించియుందుము," అని నాతో చెప్పి యొకరినివెళ్లి యా గంపను తెచ్చి కడుగుమనిరి. అట్లే ఆ గంపను తెచ్చియుంచిరి. ఈ సంఘటనవలన నే నొక గుణపాఠమును నేర్చుకొంటిని. విషయగ్రహణములో మన మెంత మందముగా నుందుము!

కొంతతడవైన తరువాత నొకయాచకుడువచ్చి, బిచ్చమడిగెను. సన్న్యాసులు విసుగుకొని, వానిని గొడవచేయక

పొమ్మనిరి. ఈ మాటలను శ్రీమాతృదేవి విని "వారేమి చెప్పిరో వినుచుంటివా? పాప మా బిచ్చగానిని వారు వెడలగొట్టిరి. బద్ధకమును విడిచి కదలుటకిష్టపడక, వానికేమియు వారియ్యలేకపోయిరి. ఒక పిడికెడు బియ్యముకంటె వాడెక్కువ యేమియు నడుగలేదే! ఈ మాత్రపు చిన్నపనిని కూడ చేయుటకు వారు శ్రమపడలేక పోయిరి. విధ్యుక్త ధర్మము ప్రకారము ఒకనికి రావలసిన దానిని రాకుండ చేయుట న్యాయమా? ఆవులకుగూడ ఈ కాయగూరల చెక్కులను పెట్టుట మన విధాయకధర్మము. వీనిని దీసికొని వెళ్లి మన మావుల మూతులదగ్గర బెట్టవలెను," అని చెప్పిరి.

ఆయా విధ్యుక్తధర్మము ప్రకారము, మనము మనుష్యులందరి యెడలను ప్రవర్తింప వలయును

* * *

చాల నాళ్లకు నేను మరల శ్రీమాతృదేవిని సందర్శింప వెళ్లితిని. ఆమె తమస్వగ్రామములోని యింటికి వెళ్లి దుర్గాపూజకు కొన్నాళ్లముందుగనే కలకత్తాకు తిరిగివచ్చిరి. ఒకనాటి మధ్యాహ్నమున నేను వెళ్లినప్పుడు, ఒక స్త్రీ ఆమెపాదములచెంత సాగిలబడి మంత్రోపదేశమునకై కన్నుల నీరు పెట్టుకొని ప్రార్థించుచుండెను. అమ్మగారు మంచముపైన గూర్చుండిరి. "నా ఆరోగ్యము సరిగాలేదు, నేనిప్పుడు నీకు మంత్రోపదేశము చేయజాలనని యిదివరకే చెప్పితినే," అని యామె యాస్త్రీ కోరికను నిరాకరించుచుండిరి. కాని యాస్త్రీ తాను పట్టినపట్టు విడువదయ్యెను. అమ్మగారు విసుగుకొని, "మంత్రోపదేశమనిన,

నీ కంత తేలికగానున్నది. నీకు పరమమంత్రము దొరికెనను సంబరమే కాని, దానివలన కలుగు మంచి చెడ్డలను గురించి యెన్నడును ఆలోచింపవు,'' అని యామెను మందలించిరి. కాని, యాస్త్రీ 'సశేమిరా' యని యొకటేపట్టు పట్టెను. అచ్చట నున్నవారందరు నసహ్యాంచుకొనిరి. చిట్టచివరకు మాతృదేవి యామెను మఱియొకనాడు రమ్మనిరి. పిమ్మట, తనకచ్చటనుండిన సన్న్యాసులలో నెవరిచేనైన మంత్రోపదేశము చేయింపుడని యాస్త్రీ అమ్మగారి నడిగెను.

అమ్మగారు : వారు నామాట వినకపోవచ్చును.

స్త్రీ : అమ్మా! మీ యూహయేమి? వారు మీ మాటను శిరసావహించి తీరవలెను.

అమ్మగారు : ఈ విషయమున నాకోరికను వారు మన్నింపక పోవచ్చును.

ఆ స్త్రీ పట్టినపట్టును విడువకుండుటను జూచి, ''మంచిది. శా—స్వామినడిగెదను. ఆయన నీకు మంత్రోపదేశము చేయును'' అని అమ్మగారు చెప్పిరి. కాని యాస్త్రీ తన మొదటి కోరికనే తిరిగి ప్రారంభించి పట్టుపట్టుచు, ''మీరు నాకు మంత్రోపదేశముచేసినచో నాకు పరమానందముగా నుండును. మీ కిష్టమున్నయెడల, నాకోరికను మీరు తప్పక నెరవేర్పగల సమర్థులు,'' అని చెప్పి పది రూపాయలను బయటకుదీసి, ''ఈ పైకమును పుచ్చుకొని మంత్రోపదేశమునకు కావలసిన వస్తువులను మీరు కొనవచ్చును,'' అని పలుక సాహసించెను.

* * *

ఇట్టి అగౌరవకార్యమునకు మేమందరమును సిగ్గు పడితిమి. ఈతడవ శ్రీమాతృదేవి కోపము తెచ్చుకొని "ఏమి; నీవు నాకు డబ్బునుచూపి బెల్లింప కోరుచుంటివా? ఈ కాసులతో నీవు నన్ను వశపరచుకొనజాలవు. వీనిని తీసికొని పొమ్ము" అని పరుషముగ పల్కి వెంటనే గదిని విడచి వెళ్లిపోయిరి. ఆమె మిక్కిలి పట్టుపట్ట తుదకెట్లో మాతృదేవి మహాష్టమినాడు మంత్రోపదేశము నొనర్ప నంగీకరించిరి. తరువాత, ఆమె తొందరగనే వెళ్లిపోయెను. అప్పుడు నాతో మాట్లాడ అమ్మగారికి కొంత అవకాశము చిక్కినది.

* * *

రెండునెలల పదునైదు నాళ్లైన తరువాత, అమ్మగారిని నేను చూచినప్పుడు, 'ఆహా! నిన్ను చూచి యొక యుగమైనట్లున్నది!' అని తమకు నాయందుగల ప్రేమాతిశయమును ఉత్కంఠతో నామె వెల్లడించిరి. క్రిందటిసారి మంత్రోపదేశమునకై పట్టుపట్టిన స్త్రీనిగురించి ప్రసంగవశమున నామెనడిగితిని.

అమ్మగారు: నిర్ణీతమైనదినమున నామె రాలేకపోయెను. "నాకిప్పుడు జబ్బుగానున్నది. కొంచెము నెమ్మదిగానున్న తరువాత నీకు మంత్రోపదేశము చేసెదను," అని నే నామెతో చెప్పినట్లే జరిగినది. మహాష్టమిదినమున నామెయే జబ్బుపడి రాజాలక, చాలనాళ్లైన తరువాత వచ్చినది. మంత్రోపదేశముచేసితిని.

భక్తురాలు : మీ నోటినుండి వచ్చుమాటలు జరిగి తీరును. మీ సంకల్పములకు విరుద్ధముగ నడుచుటచేతనే మేము కష్టపడుచుందుము. మీకు జబ్బుగా నున్నప్పుడు కూడ, మాబోంట్లకు మంత్రోపదేశము చేయుటకు సమ్మతించుటవలన, మా బాధలనన్నిటిని మీరు భరించి, మును పటికంటె నెక్కువ కష్టపడుచుందురు.

అమ్మగారు : ఔనమ్మా! ఇతరుల బాధలను తాము వహించియుండనిచో, తమశరీర మెంతమాత్రము కష్టపడియుండెడిది కాదని శ్రీరామకృష్ణులుకూడ చెప్పుచుండెడు వారు.

నాతో నా వదినెకూడ వచ్చెను. ఆమెనుగుఱించి, "ఎంత మంచిపిల్ల! ఎంత శాంతస్వభావము! ఉన్నదొక టే కూర. ఆ కూరయొకటియు రుచిగానుండనిచో, భోజనమంతయు పాడై పోవునుగదా," అని అమ్మగారు చెప్పిరి. నాకొక వదినెయే యున్నదనియు, ఆమె మంచిది కానిచో నా జీవితము దుఃఖమయమై యుండెడిదనియు దీని అర్థము.

1914-వ సం॥ ఫిబ్రవరి.

నే నొకనాటి ప్రొద్దుట గంపనిండ పువ్వులను దీసికొని బాగ్‌బజారుకు వెళ్లి, వానిని శ్రీ మాతృదేవికి సమర్పించితిని. ఆమె యపరిమితముగా సంతోషించి, వానితో శ్రీరామకృష్ణుల ప్రతిమ నలంకరింప జొచ్చిరి. అందుండి అమ్మగారు కొన్ని నీలపురంగు పువ్వులను తమచేతులతో దీసి, "ఆహా! ఎంతసొగసైన రంగు! దక్షిణేశ్వరములో ఆశా యను పేరు

గల యొక బాలిక యుండెను. ఒక నా డామె గుడితోట లోనికివచ్చి, నల్లని ఆకులుగల యొక మొక్కనుండి యొక ఎఱ్ఱని పువ్వునుగోసి, 'అమ్మయ్యో! నల్లనియాకుల చెట్టునకు, ఎంత ఎఱ్ఱనిపువ్వు! భగవంతుని సృష్టి ఎంత విచిత్రమైనది! ఔరారా?' అని యేడ్వ మొదలుపెట్టెను. శ్రీరామకృష్ణు లా పిల్లనుజూచి, 'అమ్మాయీ! నీ బాధ ఏమి? ఆలాగున నీ వెందు కేడ్చుచున్నావు?' అని అడిగిరి. ఒక్కమాటయైన చెప్పలేక యామె విడువకుండ నేడ్చుచుండెను. శ్రీరామ కృష్ణులు చివర కామెను శాంతింపజేసిరి,'' అని చెప్పిరి.

అమ్మగా రున్నతమానసికస్థితిలో ''ఈ నీలిరంగు పువ్వులను చూడుము! ఇటువంటి సొగసైనపువ్వులు లేనిదే భగవంతుని అలంకరించుట యెట్లు?'' అని చెప్పి చేతినిండ పువ్వులనుంచుకొని శ్రీరామకృష్ణుని ప్రతిమకు సమర్పించు లోపున వానిలో కొన్ని యామెపాదములపై బడెను. ''ఇదేమమ్మా! భగవంతునకు సమర్పింపకముందే ఈ పువ్వులు నా పాదములపై నెట్లుపడినవో!'' అని యామె నిర్ఘాంతపడిరి. ''బాగుబాగు!'' అని చెప్పి, ''శ్రీరామకృష్ణులవారు మీకు మాత్ర మెక్కువవారు కావచ్చును. కాని మేము మీకును ఆయనకును ఏవిధమైన భేదమును పాటింపము,'' అని నేను లోలోన తలంచితిని.

ఇంతలో నొక వితంతుస్త్రీ గదిలోనికివచ్చెను. ఆమె విషయమై నే నడిగినమీదట ''ఇంచుమించుగా నొక నెల క్రింద నావద్ద నామె మంత్రోపదేశము నొందినది. అంతకు పూర్వ మీమె మఱియొక గురువును స్వీకరించి, పిమ్మట

తనపొరపాటును గ్రహించి నాకడకు మంత్రోపదేశమునకై వచ్చెను. నే నెంత చెప్పినను, గురువులందరు నొక టేయను విషయము నామె యొప్పుకొనలేదు. వారందరియందును ప్రజ్వలించు దైవబల మొక్కటే,'' అని అమ్మగారు చెప్పిరి.

శ్రీ రామకృష్ణుల జీవిత విశేషములు

మధ్యాహ్నము సంభాషణ మరల పువ్వులపైకి పోయెను. అమ్మగా రిట్లు చెప్పిరి: ''నేను దక్షిణేశ్వరములో నుండు నప్పుడు కొన్ని ఎఱ్ఱని పువ్వులను, కొన్ని మల్లెపూవులను గ్రుచ్చి ఏడుపేటల పెద్దదండగా నొక నాడు కట్టి, దాని నొక రాతి గోలెమున నీళ్లలో నానవైచితిని. దండలోని మొగ్గలు త్వరలో బాగుగా వికసించినవి. దండను అమ్మవారి అలంకరణమునకై కాళీదేవాలయమునకు పంపితిని. నగలనన్నిటిని తీసివైచి, శ్రీ కాళీవిగ్రహమును ఆ దండతో నలంకరించిరి. శ్రీరామకృష్ణులు దేవాలయము లోనికివచ్చి, పూలయలంకారముతో నతిశయించిన కాళికా దేవి సౌందర్యమును జూచినవెంటనే మహానందపరవశులై 'ఆహా! ఇంద్రనీలప్రభాసమానమైన అమ్మశరీరమునకు ఈ పూలెంత వింతయందమును గూర్చుచున్నవి! ఈ దండ నెవరు కట్టిరి?' అని రెట్టించి యడుగసాగిరి. అచ్చటనుండినవారిలో నెవరో నాపేరు చెప్పిరి. అంతట 'వెళ్లి ఆమెను దేవాలయమునకు తీసికొనిరండు' అని యాయన సెలవిచ్చిరి. నేను మెట్ల దగ్గరకు వచ్చి అచ్చట బలరామబాబు, సురేశ్‌బాబు మొదలైన భక్తులుండిరని కనిపెట్టి, అత్యధికలజ్జాపరవశనై

బాగుగా మేలిముసుగును మోమున సర్దుకొనుచు, బృంద యను పరిచారిక చాటున దాగుకొని దేవాలయమునకు వెనుకవైపునగల మెట్లమీదుగా లోనికి ప్రవేశింప సిద్ధపడు చుంటిని. ఈ నా ప్రయత్నమును శ్రీరామకృష్ణులు వెంటనే కనిపెట్టి, 'ఆ మెట్లమీదుగా వచ్చుటకు ప్రయత్నింపకుము. ఆ మెట్లెక్కుచు మున్నసే ఒక పల్లెది కాలుజారి క్రింద పడినది. పాప మామె ఎముకలు బ్రద్దలై చనిపోయెను! ముందువైపునగల ఈ మెట్లెక్కియే రమ్ము!' అని చెప్పిరి. ఆ మాటలు విని భక్తులందరు నాకు దారినిచ్చిరి. నేను దేవాలయములోనికి వెళ్లినప్పుడు, భక్తిభావోద్రేకముతో కంపించుచుండిన గద్గదస్వరముతో శ్రీ రామకృష్ణులు సంకీర్తనము చేయుచుండిరి.''

ఇంతలో కొంతమంది భక్తురాండ్రు గదిలోనికి వచ్చిరి.

భగవత్సాక్షాత్కారము- దైవకృప

అమ్మగారి సంభాషణ అంతటితో ముగిసెను. నేను సెలవుతీసికొని వెళ్లుటకు సమయమైనది. మరల అమ్మగారు భగవత్సాక్షాత్కారమును గురించి ప్రసంగించుచు ''అమ్మాయీ! ఈ విషయమెట్టిదో నీకు తెలియునా? ఇది యొక శిశువుచేతిలోని కలకండముక్క వంటిది. కొంతమంది యా శిశువును దానిని తమకిమ్మని ఎంత అడిగినను ఇయ్యడు; కాని, తనకిష్టమున్న మఱియొకనికి అడిగినవెంటనే ఇచ్చివేయును. తన యావజ్జీవము నొక మనుష్యుడు భగవత్సాక్షాత్కారముకొరకు ఎన్ని కఠిన సాధనలను చేసినను లాభము లేకుండును. కాని, మఱియొకరికి ప్రాయికముగా ఏ కృషియు

లేకయే పరమార్థము లభించును. ఇది భగవంతుని దయపై ఆధారపడియున్నది. ఆయన తనకిష్టమున్నవారికి తనదయను ప్రసాదించును. దైవకృపయే బహు ముఖ్యము.

*　　　*　　　*

1917-వ సంవత్సరము.

శ్రీ మాతృదేవిని సాయంకాలము సందర్శింప వెళ్లితిని. అప్పుడు నేను బాగ్‌బజారులోని మా యింటియందు నివసించుచు ప్రతిదినము అమ్మగారిని వెళ్లి చూచుచుంటినని చెప్పవచ్చును. ఆమె యొక్కరే యుండినందున "అమ్మా! ఒకనాటిరాత్రి శ్రీరామకృష్ణులవారు నాకు కలలో కనుపడిరి. అప్పుడు మీరు జయరాంబటిలో నివసించుచుంటిరి. నే నాయనకు నమస్కరించి 'అమ్మగా రెక్కడ నున్నారు?' అని యడిగితిని. 'ఆ సందులోనికి వెళ్లుము. నీకొక పూరియిల్లు కనుపడును. ఆమె యా యింటిముందరి వసారాలో కూర్చుండి యున్నా'రని యాయన బదులుచెప్పెను" అని కలలో జరిగిన విషయము నామెకు వివరించితిని. అమ్మగారు మహోత్సాహముతో శయ్యలోనుండి లేచి కూర్చుని, "నీవు చెప్పినదంతయు నిజము, నీ కల నిజము!" అని చెప్పిరి. అందుపై నే నాశ్చర్యపడుచు, "అట్లైన ఆ విషయమే నిజమా?" అని అడిగితిని. "జయరాంబటిలో మీ యిల్లు గచ్చుకట్టడమై యుండునని యూహించితిని. కాని కలలో మట్టినేల, పూరికప్పు మొదలైన వానిని జూచి, ఆ దృశ్యమంతయు కేవలము భ్రమయని నిశ్చయించితిని," అని చెప్పితిని.

భగవత్సాక్షాత్కారము కొఱకు చేయవలసిన సాధనను గురించి చెప్పుచు, "గోలప్‌మాయియు, యోగీనీమాయియు తమకాలములో విశేషభాగమును భగవద్ధ్యానస్మరణలకు వినియోగపరచిరి. యోగీనీమాయి చాల కఠిన సాధన చేసెను. ఒకప్పుడామె పాలను, పండ్లను మాత్రమే పుచ్చుకొనుచు, జీవించెను. నేడుకూడ తనకాలము నెక్కువగా ఆధ్యాత్మిక సాధనలలో నామె గడపుచుండును. గోలప్ మాయి మనస్సు బాహ్యవిషయములచే చలింపదు. బజారులో విక్రయింపబడు వంటకూరలు తినుట కామె సంకోచింపదు. హిందూ బ్రాహ్మణ వితంతువు లట్టికూరలను చేతితో కూడ నెన్నడును తాకరు," అని అమ్మగారు సెలవిచ్చిరి.

అమ్మగారి యింటిలో నాటి సాయంకాలము కాళికాదేవి భజన జరుపుటకు సన్నాహముచేసిరి. బేలూరు మఠ సన్న్యాసులువచ్చి సంకీర్తనములో పాల్గొనెదరు. రాత్రి యెనిమిదిన్నర గంటలకు భజన ప్రారంభమయ్యెను. కీర్తనలను వినుటకు చాలమంది భక్తురాండ్రు వసారాలోనికి వెళ్లిరి. నేను శ్రీ మాతృదేవి పాదములకు నూనెను మర్దన చేయుచుంటిని. ఆపాటలు నే నింతకుముం దెన్నిసారులో విన్నవే. గదిలోనుండి వానిని వినగలిగితిని. భక్తుల ముఖములనుండి వెడలివచ్చుచున్నందున నా కా పాటలు నాకు సరి క్రొత్తవిగా కనుపడినవి. వాని పటుత్వ మింతింతయని చెప్ప నలవిగాకుండెను. నాకన్నులు బాష్పపూరితము లైనవి. మధ్యమధ్య వారు శ్రీరామకృష్ణులు పాడిన కీర్తనలనే పాడుచుండిరి. అట్టి సమయములందు శ్రీ మాతృదేవి ఉత్సాహాతిశయమున,

"ఔను! శ్రీ రామకృష్ణు లీ కీర్తన పాడెడివారు!" అని బిగ్గరగా చెప్పుచుండిరి. సన్న్యాసులు "శ్రీ విశ్వేశ్వరీ పాదారవింద సౌందర్య సమ్మోహితమైనది నాచిత్త భ్రమరము!" అను చరణముతో ప్రారంభమగు కీర్తనను మొదలు పెట్టిరి. శ్రీమాతృదేవి యింక పరుండలేకపోయిరి. ఆమె చెక్కిళ్లపై కన్నీరు ప్రవహించుచుండ "అమ్మాయీ, రా! మనము వసారకడకు పోవుదము," అని చెప్పిరి. సంకీర్తన మైన తరువాత అమ్మగారికి నమస్కరించి, నే నింటికి తిరిగి వచ్చితిని.

1918-వ సం॥ జూలై 22-వ తేది

శ్రీ మాతృదేవి యింటికి నేను వచ్చినప్పుడు సాయంకాల మేడుగంటల ముప్పది నిమిషములైనది. అమ్మగారు స్వగ్రామమునుండి తిరిగివచ్చి రెండునెలలే యైనది. అచ్చట మన్యజ్వరముచే చాలకాలము బాధపడి, యామె మిక్కిలి చిక్కిపోయిరి. సహజ మందహాసముతో నన్నాదరించి, "నేడు చాల ఉక్కగా నున్నది. కొంచెము విశ్రమించి, కోలుకొనుము. మీ చెల్లెలెట్లున్నది? ఆమె యింటికివచ్చినదా?" అని కుశల మడిగిరి.

భక్తురాలు: ఔనమ్మా, ఆమె యింటికి వచ్చిన తరువాతనే, బయలుదేరితిని.

అమ్మగారు: "ఈ విసనకఱ్ఱ రాధుకిచ్చి, యీ తైలమును నా వీపుపై రాయుము. నా శరీరమంతటను ఉడుకు పొక్కులు బయలుదేరినవి." నేను నూనెను రాయుటకు

మొదలుపెట్టినతోడనే, సాయంకాలపూజకు గంటకొట్టిరి. అమ్మగారు, తాము పరుపుపై కూర్చుండి, చేతులు జోడించి భగవంతునకు నమస్కరించిరి. తక్కిన భక్తురాండ్రు పూజను చూచుటకు పూజామందిరమునకు వెళ్లిరి.

దుఃఖమునకు అర్థము

"'ఈ లోకము దుఃఖమయము. మేము దైవము నెంత ప్రార్థించినను, మా దుఃఖమున కంతము లేకున్నది,' అని యెల్లరు విచారముతో జెప్పుచుందురు. దుఃఖము భగవంతు డనుగ్రహించు వరమే కాని వేఱొకటి కాదు. అది పరమేశ్వరుని దయాచిహ్నము. ఇది నిజము కాదా?" అని అమ్మగారు చెప్పిరి.

ఆ నాడు నేను మనస్సులో చాల బాధపడుచుంటిని. ఆ సంగతిని తెలిసికొని, నన్నుద్దేశించియే శ్రీ మాతృదేవి యిట్లు చెప్పిరి. ఆమె యీ విషయమై యింకను నిట్లు సెల విచ్చిరి: "ఈ లోకములో దుఃఖమనుభవించని వా రెవ రున్నారు? శ్రీకృష్ణునితో నతని భక్తురాలు బృందయను నామె యిట్లు చెప్పెను: 'నీవు దయకలవాడవని యెవరు చెప్పుదురు? నీ రామావతారకాలమున యావజ్జీవమును నీ కొఱకై సీత నేడ్పించితివి. ఈ నీ కృష్ణావతారములో రాధ నీ నిమిత్తమై యేడ్చుచున్నది. నీ తల్లిదండ్రులు కంసుని చెఱసాలలో నపరిమితబాధ నొందుచు, రేయింబవళ్లు నీ నామముచ్చరించుచు విలపించిరి. అయినను, నే నెందుకు నీ నామస్మరణ చేయుచుందును? నీ నామము మరణభయమును సమూలముగా పెకలించివేయును గనుకనే!'"

"అటువంటి యాకారముగల జనులకు సామాన్యముగా భగవంతునియందు భక్తియుండదు. ఇది శ్రీ రామకృష్ణులవారు చెప్పగా వింటిని." అని యొక స్త్రీనిగురించి శ్రీ మాతృదేవి చెప్పిరి.

భక్తురాలు : ఔనమ్మా! కపటహృదయులకు ఆధ్యాత్మికాభివృద్ధి చేకూరదని ఆయన చెప్పుచుండినట్లు శ్రీ రామకృష్ణవచనామృతమను పుస్తకములో చదివితిని.

చేసిన పాపము, చెప్పిన పోవును

అమ్మగారు : ఓహో! నీ వావిషయమై చెప్పుచుంటివా? ఆ మాటలాయన నరేనను భక్తుని యింటిలో చెప్పెను. ఒక మనుష్యునకొక యుంపుడు కత్తె యుండెను. ఒక సారి యామె శ్రీ రామకృష్ణుల యొద్దకు వచ్చి, "ఆ పురుషుడు నన్ను నాశనముచేసి, పిమ్మట నాయొద్ద నుండిన సొమ్మును నగలను అపహరించెను," అని పశ్చాత్తాపముతో జెప్పెను. శ్రీ రామకృష్ణులు జనుల మనస్సులలో దాగియుండిన రహస్యముల నెఱిగియుండినను, వారి నోటినుండి ఆయావిషయములను గురించి వినగోరెడివారు. "ఇది నిజమా? ఆయన భక్తినిగురించి మాకు మహోపన్యాసములను చేయుచుండువాడే," అని ఆ స్త్రీతో చెప్పి, ఆధ్యాత్మిక వికాసము నడ్డగించు గుణములను వర్ణించిరి. అయినను, ఆ స్త్రీ తన పాపములన్నిటిని నాయనయొద్ద నొప్పుకొని వాని దుష్టఫలముల ననుభవింపకుండ తప్పించుకొనెను.

నళిని : అమ్మా! అది యెట్లు పొసగును? ఊరక తన పాపమును చెప్పినంతమాత్రమున నెవరైనను పాపవిమోచన నెట్లు పడయగలరు ? ఈ రీతిని పాపములను పోగొట్టుకొనుట సాధ్యమా ?

అమ్మగారు : ఎందుకు సాధ్యముకాదమ్మా? శ్రీ రామ కృష్ణులు పరిపూర్ణులు. అట్టి మహాపురుషునియొద్ద తన పాపము నొప్పుకొనినవారికి తప్పక ఆ పాపము నాశన మగును. శ్రద్ధగా వినుము : ఒకానొకచోట జనులు పాప పుణ్యములను గురించి సంభాషించినయెడల, అచ్చటనున్న వారికి ఆ గుణములు పట్టుపడును.

ఇది యెట్లు వీలగును ?

అమ్మగారు : నేను సవిస్తరముగా తెలిపెదను, వినుము. ఒక మనుష్యుడు తన పుణ్యమునో పాపమునో నీయొద్ద నొప్పు కొనె ననుకొనుము. అటుతరువాత ఆ మనుష్యుడు నీ తలపు నకు వచ్చినప్పుడెల్ల, అతని పుణ్యకార్యములో పాపములో నీకు జ్ఞప్తికి వచ్చుచుండును. ఆ విధముగా నీ మనస్సులో అవి హత్తికొనియుండును. అమ్మాయీ! ఇది నిజముకాదా ?

తిరిగి ప్రసంగము మానవజీవిత దుఃఖముపైకి మరలెను. "చాలమంది జనులు నా దగ్గరకువచ్చి తమ తమ వ్యథలను చెప్పుకొనుచుందురు. 'మాకు భగవత్సాక్షాత్కారము కాలేదు. మాకు శాంతి యెట్లు కలుగును?' అని గోలపెట్టు చుందురు. అందుపై, "మీ రెందు కిట్లు నాదగ్గర చెప్పెదరు? నేను అమానుషవ్యక్తినా? చింత యన నేమో నే నెన్నడు

నెఱుగను. కోరినపుడెల్ల భగవత్ప్రసన్నము నాకు కరతలా మలక మగుచుండును......'' అను భావము నా మనస్సులో మెఱుపువలె మెఱయును.

ప్రసంగము నింకను సాగించుచు అమ్మగారిట్లు చెప్పిరి : '' 'మ-' రచించిన శ్రీరామకృష్ణవచనామృతము చాల బాగున్నది. అతడు శ్రీగురుదేవుని మాటలను యథాతథ ముగా లిఖించియుండుటయే దీనికి కారణము. ఆహా! ఆ మాట లెంత మధురములు! నాలుగైదు పుస్తకములకు సరిపడిన సామగ్రి యాతనియొద్ద నున్నదని వినుచున్నాను. కాని, అతడిప్పుడు ముసలివాడైనాడు. ఈ పనిని నిర్వహింప గలడో లేడో యని నా సందేహము. ఆ గ్రంథమును విక్ర యించి ధనమెంతయో గణించి అత డొకచోట వడ్డీకి వేసి యుంచెను. జయరాంబటిలో నా గృహనిర్మాణమునకై వేయిరూప్యముల నిచ్చుటయే కాక, ఆ సందర్భమున తగిలిన యితర వ్యయములనుకూడ నాతడు భరించెను. ఇంతే కాక, నెలనెలకు పదిరూప్యము లతడు నాకు పంపుచుండును ; నేను కలకత్తాలో నుండునపు డిరువదియో, అంతకంటె నెక్కువ గనో రూప్యము లిచ్చుచుండును. ఇంతకు పూర్వము నెలకు రెండురూప్యముల నాతడు నాకిచ్చుచుండువాడు; అప్పు డత డొక పాఠశాలలో నుపాధ్యాయుడు.''

భక్తురాలు : ఆరంభములో సన్న్యాసుల పోషణ నిమిత్తము గిరీశబాబు విస్తారముగా ధనమిచ్చెనని చెప్పెదరు.

అమ్మగారు : అంత యెక్కువగా నీయలేదు. ఆ విషయమున సురేశమిత్రుడు సమృద్ధిగా ధనసాహాయ్యము

చేసెను. గిరీశుడుకూడ అప్పుడప్పుడు ధనమిచ్చుచుండెను. ఒకప్పు డతడు పదునెనిమిది నెలలవరకు నాకైన వ్యయము లన్నిటిని భరించెను. విస్తారముగా ధనమెక్కడనుండి తెచ్చి యియ్యగలడు? అతడెన్నడును భాగ్యవంతుడు కాడు. ఆతని జీవితప్రారంభదశకూడ అంత నిర్మలమైనది కాదు; దుష్టులతో సహవాసము చేయుచు, నాటకములలో వేషము వేయువాడు. కాని, అతని విశ్వాసము మహాద్భుతము. అందుచేతనే యాతనికి శ్రీ రామకృష్ణుల దయ లభించెను. ఈ అవతారములో శ్రీ రామకృష్ణులు గిరీశు నుద్ధరించిరి. భూమిపై భగవంతు డవతరించినప్పుడెల్ల, పతితుల నిట్లే ఆ దయామయుడు పావనమొనర్చుచుండును. గౌరాంగుడు జగాయ్, మధాయ్ (జగన్నాథమాధవులు) అను నిరువురు సోదరులను రక్షించెను. గిరీశునియందు శివాంశము కలదని శ్రీ రామకృష్ణు లొకసారి చెప్పిరి. అమ్మాయీ! ధనములో నేమున్నది? శ్రీ రామకృష్ణులు దానిని తాకజాలకుండిరి. ధనమును తాకినచో ఆయనచేయి కొంకరలు పోవును. 'ఈ లోకము స్వప్నమువంటిది. అది యథార్థమని నే నెఱిగియుండినచో, మీ కమార్పుకూరునకు బంగారు తొడుగును వేయించి యుందును. కాని, అది అనిత్యమని నాకు తెలియును. భగవంతుడొక్కడే నిత్యుడు,' అని ఆయన చెప్పిరి.

"నే నొకచోట కుదురుగా నుండలేను కదా!" అని అమ్మగారి మేనకోడలు మకు అను నామె విచారముతో చెప్పెను. "ఏమీ? నీవెచ్చట నున్నను నీయింటిలోనున్నట్లే

సుఖముగా నుండవలెను. నీ అత్తింటివారి గ్రామములో సుఖముగా నుందువని నీవు తలంతువు. అది యెట్లు సాధ్యము? అతని జీతము స్వల్పము. అంతస్వల్పద్రవ్యముతో నీ వెట్లు సంసారము గడపగలవు? నీవు నాతో నివసించుచున్నావు. ఇది నీ పుట్టినిల్లు వంటిదే. పెండ్లియైన బాలిక లొక్కొకపుడు తమ పుట్టినిండ్లకుబోయి, కొంతకాల ముండుటవాడుక కాదా? కొంచెము త్యాగ మభ్యసింపలేవా?''

ఆ సమయమున యోగీనీమాయి కిటికీయొద్ద నిలువబడియుండ, నే నామెతో మాట్లాడుచుంటిని. ఆమె నుద్దేశించి, ''లోనికి రా, ఈదినములలో నీదర్శనమే అరుదైపోయినది,'' అని అమ్మగారు చెప్పిరి. యోగీనీమాయి నవ్వి, గదిలోనికి వచ్చినది. ఆమె పాదము నాకు తగిలెను. ఆమె చేతులు జోడించి నాకు నమస్కరింప బోవుచుండగా, నే నామెను వారించి, సాష్టాంగదండప్రణామముచేసి, ''యోగీన్‌మా! ఇదేమమ్మా! మీపాదధూళిని గ్రహించుటకుగూడ నే నర్హురాలనుగాను. మీ పాదము నాకు తగిలినంతమాత్రమున, నాకు మీ రేల నమస్కరింపవలయును?'' అని విన్నవించితిని. అప్పుడామె, ''ఎందుకా? చిన్నదైనను పెద్దదైనను పాము పామే. మీవంటి భక్తురాండ్రందఱును మాకు గౌరవనీయులు,'' అని బదులు చెప్పెను. అమ్మగారి వైపు తిరిగి నేను చూచితిని. ఆమె మోముకూడ దయామృత తేజోవిరాజితమగు మందహాసముతో నొప్పుచుండెను. నేను సెలవుతీసికొని, రాత్రి ప్రొద్దుపోయి యింటికి వచ్చితిని.

1918 సం॥ జూలై 28-వ తేది.

బాగ్‌బజారులోని శ్రీమాతృదేవి యింటికివచ్చి నేనామెను సందర్శించునప్పటికి సాయంకాలమైనది. సాయంకాలపూజ ప్రారంభము కానున్నవేళకు, వృద్ధవితంతు వొకయామె వచ్చి, తనశిరస్సును అమ్మగారి పాదములపై నుంచి నమస్కరించెను. అమ్మ చాలవిసిగికొని, "తలతో పాదములెందుకు తాకెదవు? నా ఆరోగ్య మెంతమాత్రము బాగు లేదు. ఇటువంటి సందర్భములవలన అది మఱింత చెడును," అని చెప్పెను. ఆ వితంతువు వెళ్లినతరువాత, శ్రీమాతృదేవి తన పాదములను కడిగికొనెను.

కొంత తడవైన తరువాత, అమ్మగారికి నేను తైలమును రాయుచుంటిని. ప్రసంగము లలితబాబుపైకిమరలెను. గృహస్థులగు గొప్పభక్తులలో నతడొకడు. "అతడొకప్పుడు ప్రాణాపాయకరమైన వ్యాధితో బాధపడుచుండెను. కాని, మీ దయావిశేషమువలన మరల నారోగ్యవంతుడైనాడని వింటిని," అని చెప్పితిని.

అమ్మగారు : అతని కెన్నికోరికలో యుండెను. కాని శరీరమంతయు రక్తహీనమై యుబ్బుచూప, బ్రతుకుననుఆశయేలేక చివరకాతనికి ప్రాణముమీదికి వచ్చెను. ఇట్టి స్థితిలో "అమ్మా! నాకు కామార్పకూరులోను, జయరాంబటిలోను దేవాలయములను, ఆసుపత్రు (ఔషధశాల) లను కట్టించవలెనను కోరిక మిక్కుటముగా నున్నది. కాని ఈ నాకోరిక ఫలించునట్లులేదు," అని ఆతడొకసారి బహుదీన

స్వరమున నాతో జెప్పెను. ఆహా! ఆసారి శ్రీ రామకృష్ణు లవా రతని ప్రాణమును కాపాడిరి. ఇప్పు డతడు తన యూహలను ఆచరణలోనికి తేగోరుచున్నాడు. ప్రయత్నింప నిమ్మ. ఆతడు నా కొక చెరువును కొనియిచ్చెను.

1918-వ సం॥ జూలై 29-వ తేది.

ప్రేమానందస్వామిని గురించి

శ్రీ రామకృష్ణుల శిష్యుడు, ప్రేమానందస్వామి సాయంకాలమున పరమపదించెను. కనుచీకటి పడుచుండినప్పుడు నేను అమ్మగారిని దర్శింప వెళ్లితిని. "అమ్మాయీ! లోనికివచ్చి కూర్చుండుము. నేడు నా బాబూరామ్ వెళ్లిపోయెను. ఉదయమునుండి యేడ్చుచున్నాను," అని చెప్పి అమ్మగారు మరల కన్నీరు నించుచు, ఇట్లు నుడివిరి: "బాబూరామ్ నాకు అత్యంతాప్తుడు. బేలూరుమఠ మహా వటవృక్షమునకు ప్రాణబీజములగు మనోజవము, భక్తి, యుక్తి మున్నగు సుగుణములన్నియు నతనిలో మూర్తీభవించినవి. ఇంతయేల? అతడు మఠమునకు జీవమని చెప్పవచ్చును. ఆతని తల్లి నిజముపేద. వారసత్వరీతిని తండ్రి సొత్తు సంక్రమించిన కారణమున, నామె యించుక గర్వపడుచుండెను. ఈవిషయ మామెయే నాయొద్ద నొప్పుకొని 'నాకు కొన్ని బంగారునగ లుండెను. ప్రపంచ మొక బురదగుంటయని తలంచితిని,' అని చెప్పెను. ఆమెకు నలుగురు బిడ్డలుండిరి. ఒకబిడ్డమాత్ర మామె కంటిముందుగా చనిపోయెను." శ్రితసాధుజీవులయం దిట్టి యవ్యాజవాత్సల్యముగల జగదేక జనని శ్రీమహాలక్ష్మి

కదా శ్రీ మాతృదేవి! శ్రీ మాతృదేవి కొంతతడవైన తరు వాత చిత్రపటమునందలి శ్రీ రామకృష్ణుల పాదములపై తన తలనుంచి హృదయభేదకమైన స్వరముతో "ప్రభూ! నా బాబూరామ్‌ను తీసికొనివెళ్లితివి!" అని విలపించెను. నేను కన్నీళ్లు నాపుకొనలేక పోయితిని. గోలప్‌మాయి కూడ రక్తగ్రహణితో మిక్కిలి బాధపడుచు ప్రాణాపాయస్థితిలో నుండెను.

1918-వ సం॥ జూలై 30-వ తేది.

అప్పటికి రాత్రి యేడుగంటల ముప్పది నిమిషము లైనది. శ్రీ మాతృదేవి పూజామందిరములో గూర్చుండిరి. ఈనాడుకూడ ఆమె ప్రసంగము కీర్తిశేషుడైన ప్రేమానంద స్వామిపైననే పోయెను. "అమ్మాయీ! కడసారి జబ్బువచ్చిన పిదప బాబూరామ్ శరీరము రక్తమాంసము లెంతమాత్రము లేని యస్థిపంజరమైపోయెను," అని ఆమె చెప్పిరి. ఈ సమయ మున గదిలోనికి చంద్రబాబు వచ్చి మా ప్రసంగములో పాల్గొనెను. కొందరు భక్తులు స్వాములవారి అంత్యక్రియలకై నాలుగైదువందల రూప్యముల విలువగల గంధపుచెక్కలు, వెన్న, పువ్వులు, సాంబ్రాణి మొదలగు వస్తువుల నిచ్చిరని, అతడమ్మగారితో చెప్పెను. "వారి ద్రవ్యము నిజముగా సార్థకమైనది. ఒక భక్తునికై దానిని వారు వ్యయపరచిరి. భగవంతుడు వారికి సమృద్ధిగా సంపదనిచ్చెను, ఇంకను నెక్కు వగా నియ్యగలడు," అని అమ్మగారు చెప్పిరి. శ్రీ మాతృ దేవియొద్ద సెలవుదీసికొని చంద్రబాబు వెళ్లెను.

శ్రీ మాతృదేవి యింకను నిట్లు సెలవిచ్చిరి: "అమ్మాయీ, వినుము. మనుష్యు డెంత ఆధ్యాత్మిక సంపత్తిగలవాడైనను శరీర సంబంధములైన బాధలను, తుదకు మరణమును తప్పించుకొనజాలడు. కాని, మహాత్మునకును సామాన్యమానవునకును గల భేదమేమనగా, ఈ శరీరమును విడిచిపెట్టునప్పుడు సామాన్య మానవు డేడ్చును, మహాత్ముడు నవ్వును. మహాత్మునకు మరణ మొక యాటవలె కనుపడును."

సామాన్యమానవులకును, మహాత్ములకును గల భేదము

"హా! శ్రీ రామకృష్ణులవారిదగ్గరకు వచ్చినప్పుడు నా నాయన, బాబురాము చాల చిన్నవాడు. శ్రీ రామకృష్ణు లాతనితో వేళాకోళము చేసెడివారు. నరేను (వివేకానందస్వాములవారును,) బాబురామును కడుపుబ్బ నవ్వెడువారు. ఒకసారి కాశీపూర్ ఉద్యానభవనములో మేము నివసించుచుండినప్పుడు 5 సేర్ల పాలచెంబును చేత బట్టుకొని మెట్లెక్కుచుండగా నాకు తల తిరిగినది; పాలు నేలపైనొలికి పోయెను. నా మడమలు పట్లుతప్పిపోయినవి. నరేను, బాబురాములు అక్కడకు పరుగెత్తుకొనివచ్చి నా కుపచారముచేసిరి. కాళ్లు వాచి చాల పోటుపెట్ట నారంభించెను. ఈ ప్రమాదమును విని శ్రీ రామకృష్ణులు 'సరే, బాబురామూ! నేను చక్కని అవస్థలోనే చిక్కుకొంటిని, నాకింక పథ్యపానములనుసిద్ధము చేసి యిచ్చువా రెవరు?' అని బాబురాముతో చెప్పిరి.

ప్రేమానందస్వాముల వారియు శ్రీ రామకృష్ణుల వారియు జీవిత విశేషాంశములు

అప్పుడాయన గొంతులో పుండువలన బాధపడుచు, నూకల జావను మాత్రము తీసికొనుచుండిరి. నేను జావను సిద్ధము చేసి, మేడమీది యాయన గదిలోనికి తీసికొనివెళ్లి తినిపించెడు దానను. ఆకాలమున నాకు ముక్కునకొక నత్తు ఉండెడిది. శ్రీ రామకృష్ణులు తమ ముక్కును చేతితో తాకి వ్రేలితో చక్రాకారముగా త్రిప్పి, అట్టి నగను ధరించు నన్నావిధముగా నాతనికి తెలుపుచు, 'బాబురామ్! నీ నామెను నొకగంపలో వేసికొని, ఆ గంపను నీ భుజముపై నిడుకొని ఈ గదిలోనికి మోసికొని రాగలవా?' అని సంజ్ఞ జేసి బాబురాముతో జెప్పిరి. నరేను బాబురాములు ఈ మాటనువిని కడుపు చెక్కలగునట్లు నవ్విరి. ఈ రీతిని వారితో శ్రీవారు హాస్యము లాడెడివారు. మూడునాళ్లయిన తరువాత నా పాదములవాపు తగ్గినది. వారి సాయముతో నేను పథ్యమును మేడలోనికి మరల తీసికొని వెళ్లి యిచ్చుచుంటిని.

'నాయందు నీకుగల ప్రేమ ఎంత స్వల్పమమ్మా, శ్రీ రామకృష్ణులు నన్ను ప్రేమించునంతగా నీవు నన్ను ప్రేమింతువా?' అని బాబురాము తన తల్లితో చెప్పుచుండువాడు. 'ఏమి నీ అవివేకము! నేను నీ తల్లినై యుండి నిన్ను ప్రేమింపనా! ఏమి నీ యూహ?' అని యామె రోషముతో బదులు చెప్పును. అంత అపారప్రేమామృత సాగరులు శ్రీ రామకృష్ణులు! నాలుగేండ్లబాలుడై యుండినపుడు 'నేను పెండ్లి చేసికొనను, అట్లు కానిచో చనిపోవుదును,' అని బాబురామ్ చెప్పుచుండువాడు. శ్రీ రామకృష్ణులవారు కంఠవ్రణ

ముతో బాధపడుచు, నాహారమును మ్రింగ లేని స్థితిలోనుండి నపు డొకనాడు 'ఇటు తరువాత సూక్ష్మశరీరముతో నేను లక్షలకొలది నోళ్లద్వారమున భోజనము చేయుచుందును,' అని చెప్పిరి. 'మీ లక్షలకొలది నోళ్లతోను, సూక్ష్మశరీరము తోను నాకు బనిలేదు. ఈ నోటి ద్వారమున మీరు భోజనముచేయుట, నేను మీ స్థూలశరీరమును జూచుచుండుట— ఇవియే నాకు కావలసినవి,' అని బాబురామ్ ప్రత్యుత్తర మిచ్చెను.

"చాలమంది బిడ్డలుకలవారి నెవరిని శ్రీ రామకృష్ణులు తమ శిష్యులుగా నెన్నడును స్వీకరింపలేదు. ఒక పురుషున కిరువదియైదుగురు బిడ్డలా? ఎంత సిగ్గుచేటు! అట్టివాడు మనుష్యుడా? ఆత్మనిగ్రహ మెంతమాత్రమును లేని పశు ప్రాయుడు వాడు."

గోలప్‌మాయి కొంతకాలమునుండి రక్తగ్రహణితో బాధపడుచుండెను. నేడే యామెకు కొంచెము నయముగా నుండెను. ఆమె పూర్తిగా కోలుకొనుటకు మూడునెలలు పట్టునని వైద్యుడు చెప్పెను. అమ్మగా రిట్లు నుడివిరి: "రక్త గ్రహణి సామాన్యమైన వ్యాధి కాదు. శ్రీ రామకృష్ణుల వారా వ్యాధితో తఱచుగ బాధపడుచుండువారు. అది యెక్కువగా వర్షకాలములో వచ్చెడిది. ఒకసారి ఆయన మిక్కిలి ప్రమాదావస్థలోనుండిరి. నేనే యాయన కుపచారము చేయుచుండు దానను. కాశీనుండి యొక స్త్రీ దక్షిణేశ్వరమునకు వచ్చి, యొక మందును చెప్పెను. నేనామె

చెప్పినప్రకారము చేసితిని; త్వరలో శ్రీ గురుదేవుని వ్యాధి నివారణమైనది. ఆ స్త్రీ కూడ అంతర్ధానమయ్యెను. ఆమె మరల నా కెన్నడును కనుబడలేదు. నిజముగా నామె నా కమూల్యమైన సాయము చేసెను. కాశీలో నామెను గురించి యెందరి నడిగినను, నేనామెజాడను కనుగొనలేక పోతిని. శ్రీ రామకృష్ణుల కవసరము కలిగినప్పుడెల్ల యెక్కడెక్కడి నుండియో మనుష్యులు దక్షిణేశ్వరమునకు తమంతట తామే వచ్చి, ఆ యవసరము తీరిన వెంటనే యెట్లు వచ్చిరో అట్లే అకస్మాత్తుగా మాయమగుచుండువారు. ఇది మేము తఱచుగ చూచిన విషయము.

"అమ్మాయీ, నేనుకూడ గ్రహణితో బాధపడితిని. శరీరమస్థిపంజరమై పోయెను. నేను చెరువు దగ్గర పరుండెడు దానను. ఒకనాడు నీటిలో నా నీడనుచూచి, నా శరీరములో కొలదియెముకలు మాత్రము మిగిలియుండెనని గ్రహించి 'అయ్యో! ఈ శరీరమువలన నుపయోగమేమి? ఈ శరీరము నిక నిచ్చుటనే, యిప్పుడే చాలింతునుగాక!' అని తలచితిని. అంతలో నొక స్త్రీ వచ్చి 'ఏమమ్మా! మీ రెందు కిక్కడనున్నారు? ఇంటికిపోవుదము రండు,' అని చెప్పి నన్నింటికి తీసికొని వెళ్లెను." శ్రీమాతృదేవియొద్ద సెలవు గైకొని, నే నింటికి వెళ్లునప్పటికి రాత్రి యాలస్యమైనది.

1918-వ సం॥ జూలై 31-వ తేది.

నేడు నేను వెళ్లినప్పుడు శ్రీమాతృదేవియొక్కరే యుండినందున, మా సంభాషణ ముఖ్యముగా శ్రీరామ

కృష్ణుల సన్న్యాస శిష్యులను గురించి జరిగెను. ప్రేమానంద స్వామి నిర్యాణమువలన గాబోలు, అమ్మగారీ సన్న్యాసులను గురించియే విడువకుండ తలంచుచుండిరి. వారి

శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులు

విషయమై శ్రీమాతృదేవి యిట్లు చెప్పిరి: శ్రీరామకృష్ణులు బాగుగా పరిశోధన చేసిన తరువాతనే తమ శిష్యులకు ఆశ్రయమిచ్చుచుండిరి. ఆయన నిర్యాణమైన తరువాత, బారానగర్ మఠములో వారెంత కఠినదీక్షాబద్ధమైన జీవితమును గడపిరి! నిరంజనుడు మున్నగువారు తఱచుగా నిరాహారులై తమకాలమునంతయు ధ్యానప్రార్థనములందే వినియోగించుచుండిరి. ఒకనాడీ బాలసన్న్యాసులు 'మనము శ్రీ రామకృష్ణుల పేరిట సర్వసంగపరిత్యాగము చేసితిమి. మన మాయనపై కేవల మాధారపడి యూరకున్నచో, మనకాయన అన్నము పెట్టునో పెట్టడో చూతుముగాక! మనకేమి కావలయునో యెవరితోడను గూడ మనము చెప్పవలదు. యాచనకైనను మనము బయలు దేరము!' అని తమలో తాము కూడబలుకుకొని తమశరీరములనిండ బట్టలను కప్పుకొని, ధ్యానమునకు గూర్చుండిరి. పగలంతయు గడచిపోయెను, రాత్రికూడ చాలవరకు గతించెను. అప్పుడెవరో తలుపు కొట్టుచున్నట్లు వినవచ్చెను. నరేను తన స్థానమునుండి లేచివచ్చి, సోదరసన్న్యాసులలో నొకనితో 'తలుపు తెరచి యెవరువచ్చిరో చూడుము. ఆ మనుష్యుని చేతిలో నేమైననున్నదేమో మొట్టమొదట చూడుము,' అని చెప్పెను. ఎంత అద్భుతమహిమ! తలుపు తెరచినతోడనే

గంగానదీ తీరమునగల గోపాలస్వామివారి యాలయమునుండి రుచియైన ప్రసాదమును తీసికొని వచ్చిన మనుష్యుడొక డచ్చట నిలువబడియుండెను. అపరిమితానందభరితులై, శ్రీ రామకృష్ణుల అభయహస్తమెల్లపుడును తమ్మురక్షించుచుండెనను విశ్వాసమతిశయిల్ల వారాపదార్థమును శ్రీరామకృష్ణునకు సమర్పించి, పిమ్మట ప్రసాదముగా భుజించిరి. ఇట్టి సంఘటనలెన్నిసారులో జరిగినవి....సన్న్యాసుల కిప్పు డిట్టి కష్టమేమియును లేదు. నరేను (వివేకానందస్వాముల వారు)ను, బాబూరాము (ప్రేమానందస్వాములవారు)ను ఎంతకష్టపడిరి! ఇప్పుడు రామకృష్ణ ధర్మప్రచారసంస్థకు అధ్యక్షుడైన నా రాఖాల్ కూడ ఎన్నాళ్లో వంటగిన్నెలు మొదలైనవానిని శుభ్రము చేయవలసివచ్చెను. ఒకప్పుడు నరేను ఉత్తరహిందూస్థానములో నొక సామాన్య సాధువుగ దేశాటనము చేయుచుండెను. రెండునాళ్లవరకు తినుట కాహారమేమియు దొరకక అతడొక చెట్టుక్రింద పరుండెను. రుచియైన భక్ష్యములను ఒక చెంబుతో మంచినీటిని పట్టుకొని ఒక మనుష్యు డతనిదగ్గరకువచ్చి నిలువబడి "ఇది శ్రీ రామప్రసాదము, దయయుంచి మీరు దీనిని తీసికొనుడు!" అని చెప్పెను. 'నా ప్రియమిత్రుడా! నీవు నన్నెఱుగవు. పొరపడితివి. బహుశః ఈ పదార్థములను వేఱొకరికొరకు నీవు తెచ్చియుందువు,' అని నరేను బదులు చెప్పెను. అప్పుడా మనుష్యుడు బహునమ్రుడై "స్వామీ! లేదులేదు. మీకొరకే ఈఆహారమును నేను తెచ్చితిని. మధ్యాహ్నము నాకు కొంచెము కునుకు వచ్చినప్పుడు కలలో నొకపురుషుడు

కనపడి 'త్వరగ లెమ్ము. ఆ చెట్టుక్రింద నొక సాధువు పరుండి యున్నాడు. అతని కేదైన ఆహారము నిమ్ము' అని నాతో చెప్పెను. ఇది కేవల మొకకలయని నిర్లక్ష్యముచేసి, ప్రక్కకుదొర్లి మరల నిద్రించితిని. ఆ పురుషుడు తిరిగి కలలో నాకు కనపడి నన్ను చేతితో త్రోయుచు, 'నిన్ను నేను లెమ్మనుచుండగా నీవింకను నిద్రించుచున్నావే! ఇక నెంత మాత్ర మాలస్యము చేయక నా యాజ్ఞను నెరవేర్చుము,' అని నన్ను హెచ్చరించెను. అప్పుడు నేనిది కేవలము స్వప్నముకాదని గ్రహించితిని. స్వామీ! ఇది శ్రీరామాజ్ఞ! కనుక, దేవుని యానతి ప్రకారము మీ కొరకీ భక్ష్యములను తీసికొని వచ్చితిని'' అని విన్నవించెను. అది యంతయు శ్రీరామకృష్ణుల మాయావిశేషమే కాని వేరొండుకాదని తెలిసికొని ఆ పదార్థములను నరేను సంతోషముతో స్వీకరించెను.

''ఇటువంటి సంఘటనమే మరి యొకనాడు జరిగెను. నరేను హిమాలయ పర్వత ప్రాంతములో మూడునాళ్ల వరకు ఆహారమేమియు లేక సంచారము చేయుచు మూర్ఛపోవుటకు సిద్ధముగా నుండినప్పుడు, ఒక మహమ్మదీయఫకీరువచ్చి అతని కొక దోసకాయనిచ్చెను. అప్పటి కతని ప్రాణమును ఆ కాయయే రక్షించినది. అమెరికాఖండమునుండి తాను తిరిగి వచ్చిన తరువాత అల్మోరాలో నొకనాడొక సభయందు నరేను ఉపన్యసించుచుండెను. అప్పుడచ్చట నొకమూల గూర్చొనియుండిన ఆ మహమ్మదీయుని చూచి, నరేను వెంటనేవెళ్లి యతనిచేతిని బట్టుకొని తీసికొనివచ్చి ఆ సభలో

మధ్యను కూర్చుండబెట్టెను. ప్రేక్షకులందరు నాశ్చర్యపడుచుండ 'ఈయన యొకసారి నాప్రాణమును రక్షించెను.' అని జరిగినదంతయు చెప్పి ఆ ఫకీరునకు నరేను కొంత సొమ్ము గూడ నిచ్చెను. కాని ఫకీరు 'నేనేమి చేసితినని ఈ రీతిని నాకు బహుమానమియ్యవలెనని మీ రాందోళన పడుచున్నారు?' అని చెప్పి మొట్టమొదట దానిని తీసికొనలేదు. కాని ఆతనిమాట నరేను వినక, ఆ పైకము నతని జేబులో బలవంతముగానుంచెను.

"మొట్టమొదటి దుర్గపూజామహోత్సవమునకు, నరేను నన్ను బేలూరుమఠమునకు తీసికొనివెళ్లి అచ్చట పూజను జరిపించుచుండిన ఆచార్యునకు దక్షిణగా నిరువదియైదు రూప్యముల నాచే నిప్పించెను. ఆ శుభసమయమున వారు పదునాల్గువందలరూప్యములను వ్యయపఱచిరి. మఠమంతయు జనులచే క్రిక్కిరిసియుండెను. సన్న్యాసులందరు కష్టపడి పనిచేసిరి. నరేను నా దగ్గరకువచ్చి 'అమ్మా! దయచేసి నన్ను జ్వరముతో పరుండనిండు,' అని చెప్పెను. ఈ మాట లతని నోటినుండి వెలువడిన వెంటనే, అతడుతీవ్రమైన జ్వరమువచ్చి పరుండెను. 'దైవమా! ఇది యేమికర్మము! ఇతని జ్వరము కుదురుటెట్లు' అని నేను విచారపడుచుంటిని. 'అమ్మా! ఆందోళన పడకుడు. నా అంతట నేనే ఈ జ్వరము కొరకు ప్రార్థించితిని. దీనికి కారణమున్నది. ఈ బాలురు కష్టపడి పనిచేయుచున్నారు, అయినను వారెంత చిన్నతప్పు చేసినట్లు నాకు కనుపడినను, పట్టరాని కోపముతో నేను

వారినితిట్టి చెంపకాయలుగూడ కొట్టవచ్చును. ఇది వారికిని నాకునుకూడ బాధను కలిగించును కనుక, కొంతతడవు నేను జ్వరముతో పరుండుటయే మేలని తలచితిని' అని నరేను చెప్పెను. ఉత్సవము పూర్తియైన తరువాత నేను నరేనుని కడకువచ్చి 'నా తండ్రీ! కార్యకలాప మిప్పుడు ముగిసినది. ఇక లెమ్ము' అని చెప్పితిని. నరేను తన కప్పుడు జ్వరము పూర్తిగా పోయినదనుచు శయ్యలో నుండి లేచి కూర్చుండెను.

"అతడు దుర్గపూజకు తన తల్లినికూడ తీసికొని వచ్చెను. ఆమె ఒకతోటలోనుండి మఱియొకతోటలోనికి తిరుగుచు మిరపకాయలు మొదలైనవానిని కోయుచు, ఆ మఠవైభవమంతయు తన కుమారుడు నరేనుని కృషిఫలిత మని తలంచుచు, కొంచెము గర్వపడజొచ్చెను. ఆమెదగ్గరకు నరేనువచ్చి, 'అచ్చట నీ వేమిచేయుచున్నావు? వెళ్లి శ్రీ మాతృదేవి నెందుకు చూడవు? ఊరక ఈ కాయగూరలను మాత్రము కోయుచున్నావు. నీ కుమారుడే ఈ మఠనిర్మాణమునకు గారణభూతుడని నీవు తలంచవచ్చును. అమ్మా! కాదు, కాదు! నీవు పొరపడితివి. ఇదియెల్ల నాగురు భగవానుని మహిమ! నరేనుని లెక్కయేమి?' అని చెప్పెను. ఈ మఠము శ్రీరామకృష్ణుల దయవలన నిర్మింపబడెనని నరేనుని యభిప్రాయము. ఎంత మహోన్నతమైనభక్తి!... నా బాబూరాము గతించెనే! అయ్యో! ఈ సంవత్సరము దుర్గపూజ నెవరు జరిపింతురు?"

1918-వ సం॥ జూన్ 8-వ తేది.

నేడు శ్రీ మాతృదేవిని సందర్శింప నేను వెళ్లినప్పుడు, వసారాలో నామె ధ్యాననిమగ్నురాలై యుండిరి. కొంతతడవైన తరువాత, అయిదారుగురుభక్తురాం డ్రామె దర్శనార్థము వచ్చి పూజామందిరములో శ్రీ రామకృష్ణుల ప్రతిమయెదుట సాష్టాంగప్రణామము చేసిరి. అమ్మగారు వారి విషయమై వారినే అడిగిరి. నళిని అమ్మగారికి వారిని పరిచయపఱచెను. వారిలో నొకరు కలకత్తాకు చికిత్సకొరకై వచ్చిరి. ఆమె వ్యాధి కడుపులో వ్రణమని వైద్యుడు నిర్ణయించి, అందుకు శస్త్రము చేయించుకొనుమని యామెకు చెప్పెను. ఈ శస్త్ర చికిత్సకు ఆమె మిక్కిలి భయపడుచుండెను. అమ్మగారు వారిలో నెవరిని తమ పాదములను తాకనియ్యలేదు. కారణము నాకు తెలియదు. వారుమాత్రము పలుసారు లామె పాదములను తాకి అందలి ధూళిని గైకొనుటకెంతో ప్రార్థించిరి. కాని అమ్మగారు వారిని దూరముగానుండి నమస్కరించి, వెళ్లుడని నిష్కర్షగా చెప్పిరి. వారపుడు వ్యాధిగ్రస్తురాలైన బాలికను గనుపరచి, 'అమ్మా! ఈమె వ్యాధి నివారణ యగునట్లాశీర్వదింపుడు, తిరిగి యీచిన్నది మిమ్ములను దర్శింపగలుగునట్లు అనుగ్రహింపుడు' అని విన్నవించిరి. "శ్రీరామకృష్ణులకు ప్రణామముచేసి ఆయనను మనఃపూర్వకముగా ప్రార్థింపుడు, సర్వమునువారే," అని ప్రత్యుత్తరమిచ్చి, పిమ్మట మాతృదేవి తత్తరపాటు కనబఱచుచు "నాతల్లులారా! ఇక వెళ్లిరండు. మీకాలస్యమగుచున్నది," అని వారిని పంపివైచిరి.

వారు వెళ్లినతర్వాత "గదిని శుభ్రముగాతుడిచి గంగాజలమును జల్లుడు. ఇంక స్వామికి నైవేద్య సమయ మైనది," అని అమ్మగారు సెలవిచ్చిరి. వెంటనే వారి యాజ్ఞ ప్రకారము జరిగించిరి.

ఆధ్యాత్మిక గురువుల బాధలు

అమ్మగారు పరుపుపై బరుండి నా చేతికి విసనకఱ్ఱనిచ్చి "అమ్మాయీ! కొంచెము నాకు విసరుము. శరీరమంతయు మండుచున్నది. మీకలకత్తాకొక నమస్కారము! జనులిచ్చటకువచ్చి తమతమ విచారపరంపరల నా యెదుట నేకరువు పెట్టెదరు. ఎన్నియో పాపములుచేసి వచ్చువారు మఱికొందరు. ఈ రెండు రకములవారును గాక, ఇరువది యైదుమంది బిడ్డలను కన్నవారుకూడ వచ్చుచుందురు. ఆబిడ్డలలో పదిమంది చనిపోయినారని వారి యేడ్పు. వీరు మనుష్యులా? కారు కారు! హద్దుపద్దులేని ఆత్మనిగ్రహము లేని కేవల పశువులు. ఇందువలననే 'అయిదుసేర్ల నీళ్లలో కలిపిన ఒకసేరు పాలవలెనున్న దీవ్యవహారము! ఇట్టి పాలను చిక్కపరచు టెంతకష్టము. ఈ కలగలుపు పాలను మరగ కాచుటకు, విధివిరామము లేక మంటనూది యూది నా కన్నులు వాచిపోవుచున్నవి. అట్టిపాలను చిక్కపరచుట బహుకష్టమైనపని. భగవంతునికొరకు సర్వమును త్యజించుటకు సిద్ధముగానున్న విశుద్ధాత్ములగు నా బిడ్డ లెక్కడ నున్నారు? వారే నా కడకువత్తురు గాక! వారితోడనే నేను సంభాషింతునుగాక! లేనిచో జీవితము చాల దుర్భరము,' అని శ్రీరామకృష్ణులు చెప్పుచుండువారు. ఈ మాటలెంతయు

నిజము. అమ్మా! విసరుము. నేడు సాయంకాలము 4 గంటల నుండి జను లేకధారగా వచ్చుచున్నారు. ప్రజల దుఃఖమును నే నింక భరింపలేను.

"బలరాముని భార్యకూడ నేడిచ్చుటకు వచ్చెను. ఆమె నా బాబురామునకు తోబుట్టువు. అతడు నిజముగా దేవతలలో చేరినవాడుగాని నా కతడు సామాన్య సోదరుడటమ్మా!" అని యామె వెక్కి-వెక్కి- యేడ్చెను.

1918-వ సం॥ ఆగష్టు 4-వ తేది.

శ్రీ మాతృదేవి నేను వచ్చినప్పుడు డాక్టరు బ-గారి సోదరియగు నొక వితంతువుతో మాట్లాడుచుండిరి. ఈ డాక్టరుగారి సోదరికి చిన్నతనమందే వైధవ్యము సంభవించెను. ఆమె భర్తఆస్తి విషయమై కొన్ని చిక్కు-లు బయలు దేరినవి. మరణ శాసనమును ధృవపరచు పత్రము నామె సంపాదింప లేకపోయెను. ఈ విషయములను గురించి వారు మాట్లాడిన తరువాత చిట్టచివరకు "ఆస్తిని విక్రయించుటకు నీకు హక్కు- లేదు గనుక, నమ్మకమైన యొక సజ్జనుని సంరక్షణక్రింద దాని నుంచుట మంచిదని నా సలహా. ధనవిషయములలో లౌక్యుల నెన్నడు నమ్మరాదు. నిజమగు సన్న్యాసి యొకడే కనకవ్యామోహమున కతీతుడు. అమ్మా! అంతగా ఆందోళన పడకుము. భగవత్సంకల్పము ప్రకారముజరుగును. నీవు ధర్మమార్గమున ప్రవర్తించుచున్నావు. భగవంతు డెన్నడును నిన్ను కష్టములపాలు చేయడు. ఇక వెళ్లిరమ్మా. అప్పుడప్పుడుత్తరము వ్రాయుచుండుము. మరల రమ్మా" అని శ్రీ మాతృదేవి సెలవిచ్చిరి.

ఆమె వెళ్లిన తరువాత శ్యామదాసను నాయుర్వేద వైద్యుడు గోలప్‌మాయిని చూడవచ్చెను. అతని కొఱకు శ్రీ మాతృదేవి కొంతతడవు వేచియుండెను; కాని అతడు వెళ్లినతరువాత పరుపుపై బరుండి నావైపుచూచి, "ఇక నీ పనిని చేయవచ్చును" అని చెప్పిరి. నేనామెకు తైలమును రాయ మొదలు పెట్టితిని. 'గిరీశఘోషుసోదరికి నేననిన బహుప్రీతి. తాను వండుకొనిన ప్రతిపదార్థమును కొంచెము నా కొరకు వేఱుగ తీసియుంచి యిక్కడకొక బ్రాహ్మణునిచే పంపి, నేనావస్తువులను తినునప్పుడు నా ప్రక్కనే కూర్చుం డును. నా యందామెకు నిజమైన ప్రేమయుండెను. ఆమె యత్తవారు చాలభాగ్యవంతులు. ఆమెకును మంచి యాస్తి యుండెను. కాని, యామె బంధువు లా ధనమును దుర్వ్యయముచేసిరి. గిరీశునిసోదరుడగు అతులుడు, అయిదువేల రూపాయల పెట్టుబడితో నొకవ్యాపారమును ప్రారంభించెను. తన మరణశాసనములో నామె నాకు నూరురూప్యము లియ్యవలయునని కోరెను, తాను బ్రదికియుండగా నా కీ పైకము నిచ్చుట కామె సిగ్గుపడెను. నూరురూపాయలు చాలతక్కువ మొత్తమట! ఆమె చనిపోయిన తరువాత నామె సోదరుడిక్కడకువచ్చి ఆ సొమ్ము నా కిచ్చెను. దుర్గపూజకుముందటి దినమున నన్ను చూచుటకామె వచ్చెను. ఇచ్చట నుండి నంతకాలము నన్నామె యొకక్షణమైనను విడిచిపెట్టియుండ లేదు. దుర్గపూజయైనవెంటనే, నేను కాశీప్రయాణమును తలపెట్టితిని. అందువలన నా సామానులను సర్దుకొనుచు నే నొకగదిలోనుండి మఱియొక గదిలోనికి తిరుగుచుంటిని. చిట్ట

చివరకు 'నాకింక సెలవా?' అని యామె యడిగెను. నేను కొంచెము పరధ్యానముగానుండి 'మంచిది, వెళ్లుము,'* అని చెప్పితిని. ఆమె తొందరగా మెట్లుదిగి వెళ్లినతరువాత, నాలోనేను ఎంత తెలివితక్కువపని చేసితిని! 'వెళ్లు' మని చెప్పితినే ఇంతకుముం దెన్నడును నేనట్లెవరిని వెళ్లుడనలేదు, అని విచారించితిని. అయ్యో! ఆమె తిరిగి యిచ్చటికిక నెన్నడును రాలేదు. ఇట్టిమాటలు నా నోట నెట్లు వచ్చెనో నాకు తెలియదు.''

*          *          *          *

సాయంకాలము నేను 'ఉద్బోధన' పత్రికా కార్యాలయమునకు వెళ్లినప్పుడు అమ్మగారు పరుండిరి. రాధకూడ నామె ప్రక్కనింకొక చాపపై బరుండి, యామెను తనకొక కథచెప్పుమని బలవంతపెట్టుచుండెను. తాము చెప్పుటకు మారుగా నన్నొక 'కథచెప్పు' మని అమ్మగారు కోరిరి. ఏమి చెప్పుటకును నాకు పాలుపోక, కొంతవడి విషమావస్థలో నుంటిని. తుదకు నాకు తెలిసిన మీరాబాయియను వైష్ణవ భక్తురాలి కథను జెప్పితిని. ''ప్రేమలేనిదే భగవంతుడు ప్రసన్నుడుకాజాలడు.'' అనుచరణముతో నంతమగు మీరాబాయి కీర్తనను నేను పాడుచుండగా అమ్మగారు తన్మయులై

* తమతమయిండ్లకు తిరిగివెళ్లుటకు సంసిద్ధులై సెలవుతీసికొను వారితో 'వెళ్లిరండు!' అని చెప్పుట హిందువుల దేశాచారము. ఎవరినైనను 'పొ'మ్మనుట మిక్కిలి అశుభప్రదము, ఆమె ఆరాత్రియే చనిపోయెను.

"ఔను అది చాలనిజము, హృదయపూర్వకమైన ప్రేమలేనిదే దేనినిగూడ సాధింపలేము," అని బిగ్గరగా చెప్పిరి. కాని, రాధుకుమాత్ర మా కథ అంతగానచ్చలేదు. చిట్టచివరకు సరళ నా సాయమునకువచ్చి యొకచిత్ర కథను చెప్పెను. దానిని రాధు మెచ్చుకొనెను. శ్రీ మాతృదేవికి సరళయందు మక్కువ మిక్కుటము. సరళ గోలప్‌మాయి పరిచారిక. అందువలన నామె కొంతతడవైన తరువాత గదిలోనుండి వెళ్లిపోయెను. పిమ్మట రాధు నన్ను తనకాళ్లను మర్దనము చేయుమనెను. కాని నా మర్దన మామెకునచ్చక, ఇంకను గట్టిగా బట్టుమని నన్నడిగినపిదప, "శ్రీ రామకృష్ణులు స్వయముగా నాపాదములకు మర్దనముచేసి మర్దనముచేయు పద్ధతిని నాకు నేర్పిరి. ఏదీ? నీచేతిని జూడనిమ్ము," అని అమ్మగారు సెలవిచ్చినపిమ్మట, నాచేతి నామెవైపు చాపితిని. అప్పుడామె మర్దనమెట్లు చేయవలయునో తెలిపిరి. రాధు బహుత్వరితముగ నిద్రపోయెను. "దోమలు నా కాళ్లను కుట్టుచున్నవి. నీ చేతితో మెల్లగా విసరు మమ్మా!" అని నన్నడిగి, పిమ్మట కొంతతడ వూరకుండి, "ఈ సంవత్సరము బేలూరుమఠమునకు మిక్కిలి చెడ్డది. బాబురాము, దేవవ్రతుడు, శచీంద్రుడును మరణించిరి" అని అమ్మగారు చింతించిరి.

దేవవ్రతుని మరణమునకు కొలదినాళ్లముందు శ్రీ బ్రహ్మానందస్వామికి పిశాచములు కనుపడెనని 'ఉద్బోధన' పత్రికా కార్యాలయములో వింటిని. ఆ విషయమై అమ్మగారి నడిగితిని. అమ్మ యిట్లు చెప్పెను: "అమ్మాయీ! మెల్లగా

మాట్లాడు ; లేనిచో ఈ సంభాషణవిని యిచ్చటి జనులు భయపడుదురు. శ్రీ రామకృష్ణులుకూడ, ఇట్టి పిశాచము లను చాలసారులు చూచిరి. ఒకనాడాయన రాఖాల్ (బ్రహ్మానందస్వామి) తో గూడ వేణీపాలుని యింటికి వెళ్లి యుండిరి. ఆ యింటిలో పెద్దతోటగలదు. ఆ తోటలో శ్రీవారు విహరించుచుండగా, ఒక పిశాచము దగ్గరకువచ్చి 'నీ విక్కడ కెందుకువచ్చితివి? మా శరీరములు నీ సమక్షమున దహించుకొని పోవుచున్నవి. ఈ బాధను మేము భరింపలే కున్నాము. ఇక్కడనుండి వెంటనే వెడలిపొమ్ము' అని ఆయ నతో చెప్పెను. అగ్నివంటి పవిత్రమైన శ్రీహరి సమక్ష మున, ఆ పిశాచ మెట్లు నిలువగలదు? శ్రీరామకృష్ణులు మందహాసము చేయుచు ఆ స్థలమును విడిచివచ్చిరి. ఈ విషయ మాయన ఎవరితోడను చెప్పలేదు.

''రాత్రి భోజనమైన వెంటనే ఆయన యొకరిని బండిని తీసికొని వచ్చుటకొరకు పంపిరి. ఇంతకుపూర్వ మాయన ఆ రాత్రి అక్కడనే యుండుటకు ఏర్పాటు జరిగియుండినను, బయలుదేరి వెళ్లుటకే ఆయన నిశ్చయించిరి. బండి వచ్చెను. ఆరాత్రియే శ్రీవారు దక్షిణేశ్వరమునకు తిరిగి వచ్చిరి. దక్షి ణేశ్వర దేవాలయ ముఖద్వారము దగ్గర బండిచక్రముల చప్పుడు నాకు వినబడినది. శ్రీ రామకృష్ణులు రాఖాల్‌తో మాట్లాడుచుండగా చెవులు నిక్కబొడుచుకొని విని, యులికి పడితిని. 'రాత్రి యాయన భోజనముచేసి యుండనిచో ఈ యర్ధరాత్రి నేనెక్కడనుండి శ్రీవారి కాహారము దీసికొని వత్తును?' అని తలపోయనారంభించితిని. సాధారణముగా

నేనెప్పుడును ఆయన కేదైనను, తుదకు నూకలజావనైనను తినుటకుంచుదును. ఎందుచేతననగా, వేళకాని వేళలందు కూడ ఆయన ఆహార మడుగుచుందురు. ఆ రాత్రిమాత్ర మాయన తిరిగి రారని నమ్మియుండుటచే ఏపదార్థమును గూడ నేనుంచలేదు. దేవాలయపు తోటగుమ్మముల నన్నిటిని మూసి తాళములను వేసిరి. అప్పుడు రాత్రి యొంటి గంట యైనది. ఆయన చేతులతో చప్పట్లుగొట్టుచు భగవన్నామముల నుచ్చరింప మొదలుపెట్టిరి. ఎట్లో ద్వారము తెరచుకొనెను. ఆయన కాకలిగానుండినచో అన్నమెక్కడ నుండి తీసికొనివత్తునా యని ఆందోళనపడుచుంటిని. 'నా భోజనము విషయమై ఆందోళన పడకుము. రాత్రిభోజనము చేసియే వచ్చితిని,' అని శ్రీవారు బిగ్గరగా నాతో చెప్పి, పిమ్మట పిశాచము విషయమై రాఖాల్‌కు తెలిపిరి. ఉలికిపడి రాఖాల్ 'ఓయి బాబోయి! ఆ విషయమై మీపుణ్యమా యని, మీరా సమయమున నాకు చెప్పలేదు. చెప్పియే యున్నచో భయముతో కొయ్యబారి పోయియుందును. ఇప్పుడుకూడ నాకు భయమగు చున్నది,' అని తనభయ విస్మయములను వెలిబుచ్చెను.'' అమ్మగారీ కథనుచెప్పి మనసు తీర నవ్విరి.

భక్తురాలు: అమ్మా! ఆపిశాచము లెంత తెలివి తక్కువవియై యుండవలయునో కదా! శ్రీ గురుదేవుని తమ మోక్షమును కోరుటకు మారుగా అవి ఆయనను వెడలి పొమ్మనినవి.

అమ్మగారు : అవికూడ ముక్తినొందుననుటకు సందేహము లేదు. శ్రీవారి దర్శనము వ్యర్థము కాజాలదు. ఒకసారి నరేను (వివేకానందస్వామి) చెన్నపురిలో నొక పిశాచమునకు ముక్తి నొసంగెను.

నాకు వచ్చినయొక కలను అమ్మగారితో నిట్లు చెప్పితిని : "అమ్మా! నా భర్తతోకూడ నే నెక్కడకో పోవుచున్నట్లు కలగంటిని. మే మొక నదిదగ్గఱకు వచ్చితిమి. ఆ నదియొక్క యావలియొడ్డు మాకు కనుబడుట లేదు. ఆ నది ప్రక్కనే చెట్లనీడగల బాటపై మేముపోవుచుండగా నా చేతులకు పచ్చని తీగెయొకటి బాగుగా చుట్టుకొనెను. నా చేతులనుండి ఆ తీగెను వదలించుకొనలేకపోతిని. ఆ నదికి ఆవలివైపుననుండి యొక నల్లని బాలుడు రేవును దాటించు పడవలోవచ్చి, 'నీ చేతినుండి ఆ తీగెను నీవు నరికివేసినప్పుడే నిన్నీనదిని దాటింతును,' అని చెప్పెను. ఆ తీగెను మువ్వాతిక మూడువీసములు నరికివైచితిని గాని, చిట్ట చివరకు మిగిలిన ముక్కను తీసివేయలేకపోతిని. ఈలోపున నా భర్త కూడ కనుపడలేదు. నేను నిరాశచేసికొని 'ఈ ముక్కను వదిలించుకొనలేకున్నాను. నీవు నన్నావలివైపునకు తీసికొని వెళ్లవలెను,' అని యా బాలునితో చెప్పి, పడవలోని కురికితిని. పడవయు సాగిపోయెను. నాకు మెలకువ వచ్చెను."

అమ్మగారిట్లు చెప్పిరి : "ఈ యనంత విశ్వమునెల్ల మాయలో ముంచి నడిపించుచున్న మహామాయాశక్తియే యా బాలుడు. ఆ రూపమున నిన్ను జగజ్జనని సంసారసాగరమును దాటించెను. భర్త, భార్య యీశరీరము – సర్వము

మాయయే. ఇవన్నియు మాయ కల్పించిన బంధములు. ఈ బంధములనుండి విడుదల కాగలిగి ననేతప్ప, నీవీ సంసారసాగర పార మెన్నడును చేరజాలవు. ఈ శరీరము నందలి మమకారము, ఈ శరీరమే నేననుకొనుటకూడ పోవలెను. నా

ఐహిక వస్తువు లెల్ల ఎండ మావులవంటివి. వాని బంధము నుండి విడుదల నొందుడు

తల్లీ! ఈ శరీరమన నేమి? ఇది దహనమైనప్పుడు మూడు శేర్ల బూడిదయేకాదా? నిజ మిట్లుండ ఈ శరీరము విషయమై యింతగర్వ మెందుకు? ఈ శరీర మెంతబలమైనదైనను, ఎంత అందమైనదైనను, చిట్టచివరకిది ఆమూడు శేర్ల భస్మమేయగును: అయినను జనులు దానియం దెంత ఆసక్తులై యుందురు! జయ్ పరమేశ్వరా!

"ఆరాజిల్లాయందలి కైల్వారను నూరిలో నే నొకసారి రెండు నెలలుంటిని. గోలప్‌మాయియు, బాబూరామ్ తల్లియు, బలరాముని భార్యయు, నితరులును నాతోకూడ నుండిరి. ఆ దేశములో లేళ్లు విస్తారముగా నుండెను. అవి మందలు కట్టుకొని తిరుగుచుండును. మనుష్యులను చూచినవెంటనే అవి, పక్షులెగిరి పోవునట్లు, రెప్పపాటులో పారిపోవును. అంత వేగముగా పరుగెత్తు జంతువును దేనిని నే నెన్నడును జూడలేదు. శ్రీ రామకృష్ణులు 'లేడిబొడ్డున కస్తూరి పుట్టును. దాని పరిమళమునకు మోహపడి యిటునటు లేళ్లు పరుగెత్తును. ఆ సువాసన యెక్కడనుండి వచ్చుచున్నదో వానికి తెలియదు. ఈ విధ

కస్తూరి మృగమును, భగవంతుని సర్వవ్యాపకత్వమును

ముగనే భగవంతుడు తనశరీరములో నున్నాడని గ్రహింపక, ఆనందముకొఱకు మనుష్యు డన్నిచోట్లను వెదకును. అది యిదివరకే తనలో నున్నదని యతనికి తెలియదు', అని చెప్పుచుండువారు. భగవంతుడొక్కడే నిత్యము. తక్కిన దెల్ల అనిత్యము. అమ్మాయీ! నీ వేమందువమ్మా!"

శ్రీ మాతృదేవికి శరీరమంతట నుడుకుపొక్కులు బయల్వెడలి యుండెను. "కడచిన మూడు సంవత్సరముల నుండి నేనీ బాధ ననుభవించుచున్నాను. ఎవరిపాపములకు గాను, నేనీ బాధపడుచుంటినో నాకు తెలియదు ; అట్లు కానిచో, నాకే వ్యాధియైనను వచ్చుటకెట్లు వీలగును," అని యామె చెప్పిరి.

1918-వ సం॥ ఆగస్టు 22-వ తేది.

నేడు శ్రీ మాతృదేవికడకు నేను వెళ్లినప్పుడు, సాయంకాలమయ్యెను. మంచముదగ్గర నేలపై బఱచిన చాపమీాద నామె పరుండియుండిరి. నేను ప్రణామముచేసి, "అమ్మా, నేను కాళీఘట్టములోని మా యింటికి వెళ్లి ఎంతకాలమో అయినది. ఇప్పు డచ్చటకు వెళ్లుదునా?" అని మా ప్రసంగ సరళిలో విన్నవించితిని.

అమ్మగారు : ఇచ్చటనే మఱి కొన్నాళ్లు నీ వెందు కుండవు? ఒకసారి కాళీఘట్టమునకు వెళ్లినచో నీవిచ్చటకు తఱచుగ రాజాలవు. ఒకనాడు నీవు రానియెడల, నేను మిక్కిలి యాందోళనపడుదును. నిన్న నీవిచట లేనందున, నీ యారోగ్య మెట్లుండెనో యని కలవరపడితిని. నేడుకూడ

నీవు రాకుండిన, కారణమడిగి తెలిసికొని వచ్చుటకు నేనెవరి నైన బంపియుందును. నీ భర్తకు జబ్బుగానున్న యెడలగాని, అతడు తనయొద్ద నీవుండవలయునని కోరుచున్న యెడలగాని, నీవు కాళీఘట్టమునకు వెళ్లవలసినదే.

అట్టి చిక్కేదియును లేదనియు, చాలకాలము నా చెల్లెలింట నుండుచో లోకులేమనుకొనెదరో యని భయపడు చున్నాననియు చెప్పితిని. ఆ విషయమును లెక్కచేయవల దనియు, ఇంకొక నెల కలకత్తాలోనే యుండుమనియు నా కామె హితవొసంగిరి.

ఇంతలో నొక బ్రహ్మచారివచ్చి శ్రీమాతృదేవి దర్శ నార్థమై యెవరో భక్తురాలు వేచియుండెనని చెప్పెను. అమ్మగారు చాల విసిగికొని, "ఏమిరా దైవమా! నేనింకొ కరిని చూడవలయునా! బాగుగానున్నదే!" అని చెప్పి తమ శయ్యలో గూర్చుండిరి. పిమ్మట, చక్కని బట్టలు కట్టుకొని యొక స్త్రీ గదిలోనికి వచ్చి శ్రీమాతృదేవి పాదములను తన తలతో దాకి ప్రణామము చేసెను.

"మీరు దూరముననుండియే నమస్కారముచేసి యుండవచ్చునే. పాదములెందుకు దాకెదరు?" అని చెప్పి, అమ్మగారామె యోగక్షేమము నడిగిరి.

స్త్రీ : అమ్మా, నా భర్తకు కొంతకాలమునుండి జబ్బుగా నున్నదని మీ రెఱుగుదురు.

అమ్మగారు : ఔను, జబ్బుగానున్నట్లు వింటిని. ఇప్పు డాతని కెట్లున్నది? అతని బాధ ఏమి? ఎవరు మందిచ్చు చున్నారు?

స్త్రీ : మధుమేహముతో వారు బాధపడుచున్నారు. పాదము లుబ్బుచూపినవి. ఇది అపాయకరమైన వ్యాధియని వైద్యులు చెప్పుచున్నారు. వారి అభిప్రాయములతో నాకు పనిలేదు. అమ్మా! ఆయనకు మీరు వ్యాధినివారణ చేయవలయును. దయయుంచి ఆయనకు వ్యాధి కుదురునని యానతిండు.



అమ్మగారు : అమ్మాయీ! నా కేమియు తెలియదు. సర్వమును శ్రీ రామకృష్ణుల ఆజ్ఞప్రకారము జరుగును. నీ భర్త కాయన వ్యాధిని కుదుర్చునెడల నీ భర్త పూర్ణారోగ్యవంతుడగును. అతనికొఱకు శ్రీ గురుదేవుని ప్రార్థింతును.

స్త్రీ : నా కిప్పు డెంతో సంతోషముగా నున్నది. అమ్మా! శ్రీ రామకృష్ణుల వా రెన్నడును మీ ప్రార్థనను త్రోసివేయరు.

ఇట్లు చెప్పుచు నామె శ్రీ మాతృదేవి పాదములపై తలనుంచి యేడువ సాగెను. 

అమ్మగారు : (ఆమె నోదార్చి) శ్రీ గురుదేవుని ప్రార్థింపుడు. ఆయన నీ భర్త వ్యాధిని కుదుర్చును. నీ భర్త కిప్పుడేమి పథ్యమిచ్చుచున్నారు?

స్త్రీ : వారు పూరీలు, మొదలైన పదార్థములను, వైద్యుడు చెప్పినప్రకారము తినుచుందురు.

ఆమె త్వరగ శ్రీ మాతృదేవి సెలవుదీసికొని శారదానందస్వాములవారిని సందర్శింప వెళ్లెను.

"నే నితరుల బాధతోను, దుఃఖముతోను రేయింబవళ్లు దగ్ధమై పోవుచున్నాను," అని అమ్మగారు చెప్పిరి. నే నామె

శరీరమునకు తైలమును రాయబోవుచుండగా, పైనజెప్పిన స్త్రీకి బంధువగు నొకరు గదిలోనికివచ్చి యామెకు నమస్కారము చేసిరి. శ్రీ మాతృదేవి మరల లేవవలసి వచ్చెను. అతడు గదిలోనుండి వెళ్ళిన తరువాత అమ్మగారు మరల పరుండి, "ఇంక నెవరువచ్చినను సరే నేను లేవను. అమ్మాయీ, నొప్పులెత్తుచున్న నా పాదములతో నిమిష నిమిషము లేచుట యెంత కష్టము! ఇంతేకాక, ఉడుకు పొక్కులవలన నా వీపంతయు మంటపెట్టుచున్నది. తైలమును బాగుగా రాయుమమ్మా!" అని చెప్పిరి.

నేను నూనె రాయుచుండగా సంభాషణ ఇంతకుముందు వచ్చి సెలవుతీసికొని వెళ్లిన స్త్రీ మీదకు పోయెను. "చూచితివా! ఆమెభర్త ఎంతో ప్రాణాపాయస్థితిలోనున్నాడు; ఆమెయు నాతని వ్యాధినివారణకొరకు భగవంతుని ప్రార్థించుట కిచ్చుటకు వచ్చినది. పశ్చాత్తాపముతో వినమ్రమైన భక్తిభావముతో నుండుటకు బదులుగా నామె శరీరమునిండ అత్తరువులను రాసికొనివచ్చినది. ఇదియా మనము దేవాలయమునకు పోవలసిన విధము? ఆహా! మీ నవనాగరకుల స్వభావ మిట్లున్నదికదా!" అని అమ్మగారు చెప్పిరి. నేను సెలవుతీసికొని వెళ్లబోవుచుండగా, నాకు ప్రసాద మిమ్మని అమ్మగా రొకరికి ఆనతిచ్చిరి.

* * *

1918-వ సం॥ ఆగస్టు 23-వ తేది.

అమ్మగారిని నేను సాయంకాలమున చూడవెళ్లితిని. ఒకభక్తురాలిని గురించి ప్రసంగించుచు ఆమె ఇట్లు చెప్పిరి :

"ఆయమ్మ తన కోడలిని చాల కఠినముగా చూచుచుండును. అంత అతికర్కశత్వము కూడదు. కోడలి ప్రవర్తన నొక కంటితో చూచుచుండవలసినదే. కాని, అత్తగారు తన కోడలికి కొంచెము స్వేచ్ఛనుగూడ నియ్యవలయును. ఎన్ని చెప్పినను కోడలింకను చిన్నపిల్లయేకదా. సహజముగా బాలికలు కొన్ని కొన్ని ముద్దుముచ్చటలను తీర్చుకొని సుఖపడవలెనని కోరుచుందురు. అత్తగారి అధికారము మితిమీరి క్రౌర్యముక్రిందకు మారినచో, కోడలు చెప్పకుండ ఇల్లువిడిచి వెళ్లిపోవచ్చును; ఒక్కొకప్పుడు బలవంతముగా తన్నుదాను చంపుకొనవచ్చును. కోడలట్లుచేసినయెడల, ఈయత్తగారేమిచేయును? (నావైపుచూచుచు) ఈమె పాదములకు కొంచెము పారాణి పెట్టుకొన్నది. ఇదికూడ ఒక తప్పా! పాప మా పిల్ల తన భర్తను చూచుటకుకూడ వీలులేదు! భర్త సన్న్యాసి యయిపోయెను. నా భర్తను నా కన్నులార చూచి, ఆయనకు నా చేతులతో వంటవండి ఉపచారము చేయుచు, అనుమతి ఇచ్చినపుడెల్ల వారిదగ్గరకు పోవుచుంటిని......"

**ఆధ్యాత్మిక సాధన-భగవత్సాక్షాత్కారము**

మఱియొకనాడు శ్రీ మాతృదేవియింటికి నేను వెళ్లినపుడొక సన్న్యాసివచ్చి, యామెకు ప్రణామముచేసి యిట్లు విన్నవించెను: "అమ్మా! ఒక్క నిమిషమైన కుదురుపాటు లేక యెందుకీ మనస్సు కోతివలె నెప్పుడును తిరుగాడుచుండును? అవిచ్ఛిన్నముగా నే నేల మిమ్ము ధ్యానింప

లేకున్నాను? పనికిమాలిన తలంపులెల్ల వచ్చి నా మనస్సును కలవరపఱచుచుండును. కోరినంతమాత్రమున తుచ్ఛపదార్థములను సులభముగా మేము సంపాదింపగలుగుచున్నాము. భగవత్సాక్షాత్కార మెన్నటికిని నాకు కానేకాదా? అమ్మా! శాంతిని సంపాదించు టెట్లో దయయుంచి సెలవీయుడు. ఇప్పుడు దివ్యదర్శనములే నాకు కరువైపోయెను. పరమార్థమును గాంచలేనిచో, నే బ్రతికి లాభమేమి? అట్టి పనికిమాలిన బ్రతుకు బ్రతుకుటకంటె చచ్చుటయే మేలు."

అమ్మగారు: ఏమిమాటలివి నాయనా? ఇట్టి యూహలనుకూడ నీ వెన్నడును పెట్టుకొనవలదు. 'ఎవరైనను ప్రతిదినము భగవద్దర్శనమును బడయగలరా? ప్రతిదినము గాలమును వేసిన వెంటనే, చేపల వేటకానికి పెద్దగండుచేప దొరుకునా? వలసిన ఏర్పాటులెల్ల చేసికొని అతడు గాలము వేసి కనిపెట్టుకొని యుండును. ఎప్పుడో, యొకసారి గండు చేప గాలమును మ్రింగును. కాని ఎన్నిసారులో అతనికి ఆశాభంగమే కలుగుచుండును. కనుక సాధనను సడలించవలదు. జపమును (భగవన్నామ స్మరణమును) వెనుకటికంటెను ఎక్కువగా చేయుచుండుము,' అని శ్రీరామకృష్ణులు చెప్పుచుండువారు.

యోగినీమాయి: ఔను, అదియే నిజము. భగవన్నామమునకును, భగవంతునకును భేదమేమియు లేదు. ఆరంభదశలో మన స్వైకాగ్రముగ నిలువలేక పోయినను, చిట్టచివరకు జయము గాంతువు.

సన్న్యాసి : అమ్మా! భగవన్నామ మెన్నిసారులు నేను జపింపవలయునో దయయుంచి సెలవిండు. ఏకాగ్రముగా మనస్సును నిలుపుటకు నాకది తోడ్పడవచ్చును.

అమ్మగారు : పదివేలసారులో, ఇరువదివేలసారులో, నీవు జపింపగలన్ని సారులు.

సన్న్యాసి : ఒకనాడు నేను పూజామందిరములో నేడ్చుచు బండుకొనియుంటిని. హఠాత్తుగా మీరు నా ప్రక్కను నిలువబడి యుండినట్లు నాకు గనుపడెను. "నీకేమి కావలయును" అని నన్ను మీరడిగితిరి. "అమ్మా! మీ దయ సురథరాజు నెట్లు కృతార్థుని జేసెనో? నన్ను కూడ కృతార్థుని జేయుడు," అని బదులు చెప్పి, వెంటనే "అమ్మా! వలదు, వలదు. అది మీ దుర్గాస్వరూపమున జరిగెను. ఆ రూపము నాకక్కర లేదు. మీ ప్రస్తుతరూపముననే మిమ్ము దర్శించుచుండవలయునని నా కోరిక," అని నా పొరపాటును సవరించుకొంటిని. అప్పుడు మీరు మందహాసముచేయుచు అంతర్ధానమైనారు. అప్పటినుండి నా మనస్సు మునుపటి కంటెను కలవరపడుచుండెను. ఇప్పుడు నా కెందును సంతుష్టియే లేదు. "శ్రీమాతృదేవి సాక్షాత్కారమును బడయజాలనప్పుడు, నేను బ్రతికి యేమిలాభము?" అని తఱచుగ చింతించుచుందును.

అమ్మగారు : అంత తొందర యెందుకు నీకు, నాయనా? నీకు దొరికినదానిని వదలక నీ వెందు కనుసరింపవు? "ఎవరు లేకపోయినను చివరకు నా కొక మాతృదేవి యున్నది," అని యెల్లప్పుడును జ్ఞప్తియందుంచుకొనుము. తమ పావన

పాదాశ్రయులైనవారికి, తుదకు వారిజీవితములో కట్టకడపటి దినముననైన దర్శనమిత్తుమని శ్రీరామకృష్ణులు చెప్పిన మాటలు నీవు మఱచిపోలేదుకదా! ఆయన అందరినిగూడ తన సన్నిధికి తీసికొని తరింపజేయును.

సన్న్యాసి : గొప్ప భక్తుడగు నొక గృహస్థునింటిలో నేను నివసించుచున్నాను. ఆయనభార్య మిక్కిలి భాగ్యవంతులైనవారి యింటి ఆడపడుచు. నాకొఱకామె ద్రవ్యమును విస్తారముగా వ్యయపఱచుచుండును.

అమ్మగారు : అట్లు చేయవలదని ఆమెతో చెప్పుము. భక్తులగు గృహస్థులసొమ్ము సన్న్యాసుల అవసరములకు వినియోగపడును. దానితో వర్షకాలమున నాలుగునెలల వరకు వా రొకచోటనే యుండుటకు వీలగును. ఆ కాలమున భిక్షాటనమునకై బయటకు పోవుట వారికి బహుకష్టముగా నుండును.

పిమ్మట, ఆ సన్న్యాసి అమ్మగారికి ప్రణామముచేసి, వెళ్లెను.

1918-వ సం॥ సెప్టెంబరు 3-వ తేది.

కొన్నాళ్లనుండి నా శరీరారోగ్యమంత బాగుగాలేదు.

శ్రీ రామకృష్ణుల జీవిత విశేషములు

నాకు నెమ్మదిగానుండిన తరువాత, ఒకనాటి సాయంకాలమున శ్రీ మాతృదేవి దర్శనార్థము వెళ్లితిని. ప్రసంగవశమున శ్రీ రామకృష్ణులను గురించి అమ్మగారు మాట్లాడ నారంభించిరి.

అమ్మగారు : (నన్ను ద్దేశించి) నిన్న నెంత సంతోష ముగా మేము కాలము గడిపితిమి! సరళ శ్రీ రామకృష్ణులను గురించి చదివెను. ఎంత చక్కనిమాటలు! ఆ నాటి చర్య లింత మహాద్భుత పరిణామమునకు దారితీయునని మే మెట్లు తెలిసికొనియుండగలము! ఎంత మహానుభావు డవతరించెను! ఎంతమంది జను లాయన మాటలవలన జ్ఞానవికాసమును గాంచిరి! శ్రీరామకృష్ణులనిన, మానవాకారము దాల్చిన బ్రహ్మానందమే! దిన మరువది గడియలును భక్తియుతమైన సంగీతముతోను, సంతోషముతోను, నవ్వులతోను, బోధల తోను, కథలతోను, గడచిపోయెడివి. నాకు జ్ఞాపకమున్నంత వరకు శ్రీరామకృష్ణు లే విషయమైకాని వ్యాకులపడుచుండుట నే నెన్నడును చూడలేదు. తఱచుగా వారు చక్కనిమాట లతో నాకు హితోపదేశము చేయుచుందురు. నేను వ్రాయ నేర్చియే యుండినయెడల, ఆ మాటలను వ్రాసియుందును. మంచిది! అమ్మా, సరళా! నేడుకూడ నేమైన చదువుమమ్మా!

సరళ శ్రీరామకృష్ణ వచనామృతమను పుస్తకము చదువ నారంభించెను.

అమ్మగారిట్లు చెప్పిరి : "'సింహమునకు సింహమే పుట్టునుగదా?' అని శ్రీ గురుదేవులు రాఖాలుని సంబోధించి చెప్పిన యీ మాటలను గమనించుచున్నారా? ఆయన రాఖాలుని తండ్రి నీ విధముగా సంతోషపెట్టును. అతడు దక్షిణేశ్వరమునకు వచ్చినప్పుడు, శ్రీరామకృష్ణులు జాగ్రత్తగా రుచియైన భక్ష్యములతో నతనికి విందుజేయుదురు. అత డొకవేళ బాలుని (రాఖాలుని) తీసికొని పోవునేమో యని

ఆయన భయము. రాఖాలుని కొక సవతితల్లి యుండెను. తండ్రి దక్షిణేశ్వరమునకు వచ్చినప్పుడు, 'ఆయన కిక్కడ నున్నవన్నియు గనుబఱపుము. ఆయనకు కావలసినవెల్ల సమకూర్చి, యేవిధమైన లోటును కలుగకుండ చూడుము,' అని శ్రీ గురుమహారాజుగారు రాఖాలుతో జెప్పుచుండు వారు.''

బృంద యను పరిచారికను గురించియు పూరీలకథను గురించియు సరళ యిప్పుడు చదువుచుండెను. అమ్మగారిట్లు సెలవిచ్చిరి: ''అది దురుసునోటిమనిషి. దాని మధ్యాహ్నపు టల్పాహారమునకై కొన్ని పూరీలను ప్రత్యేకముగా నుంచుట అలవాటు. అవి లేనియెడల నోటికివచ్చినట్లెల్ల అది తిట్టును. 'ఈ పెద్దవారి కొడుకులను చూడుడు. వీరు నాకు రావలసిన భాగమునుకూడ తినివైచిరి. తియ్యని పదార్థములు కొంచెము కూడ నాకు మిగులనీయలేదు' అని యది బాలభక్తులను దుమ్మెత్తిపోయును. ఈ మాటలెక్కడ ఆ భక్తుల చెవుల బడునో యని శ్రీ రామకృష్ణులు భయపడుచుందురు. ఒకనాటి యుదయ మాయన నౌబత్తుగదికడకువచ్చి 'బృందకొరకుంచిన పూరీల నితరులకిచ్చితిని, ఆమెకు కొన్ని పూరీలు చేయుము. లేనిచో, అది యిష్టము వచ్చినట్లెల్ల తిట్టును. దుష్టులకు మనము దూరముగ నుండవలయును,' అని నాతో చెప్పిరి. బృంద వచ్చినతోడనే, 'బృందా, నీకు నేడు తినుట కేమియులేదు. నే నిప్పుడు పూరీలు చేయుచున్నాను,' అని దానితో చెప్పితిని. 'సరే, మీరు శ్రమపడవలదు. వంట చేసికొనుటకు ఏవైన సామానులను నాకీయుడు,' అని

యది చెప్పెను. నేను దానికి పిండి, వెన్న, బంగాళదుంపలు, మరికొన్ని కాయగూరల నిచ్చితిని.''

ఒక అధ్యాయము చదివిన తరువాత, సరళ గోలప్ మాయికి జబ్బుగానున్నందున నామె కుపచారముచేయుటకు వెళ్లెను.

శ్రీ మాతృదేవి మెల్లగ నిట్లు ప్రసంగింప నారంభించిరి : ''ఈ మానవశరీరమును చూచుచున్నారుగా! ఇది నేడున్నది, రేపుండదు. ఈ ప్రపంచము దుఃఖమయము. వేలాకజన్మ

సన్న్యాస సాదర్శము

మెత్తుటకు జనులేల కోరి, వ్యసనపడవలయును? దాని నైసర్గిక బాధలనుండి శరీర మెన్నటికిని తప్పించుకొనజాలదు. 'అమ్మా! మేమెల్లప్పుడును బహు జాగరూకులమై యుండవలయును. మనస్సులోనైనను మా కేదియైన అపవిత్రాలోచన కలుగునేమో యని మేమెల్లప్పుడును భయముతో వణకిపోవుచుందుము,' అని మొన్న విలాసుడు నాతో జెప్పెను. ఇది యెంతయు నిజము. చలువచేసిన వస్త్రమువంటి వాడు సన్న్యాసి; గృహస్థుడన్ననో నల్లని వస్త్రమువంటి వాడు. నల్లని బట్టయందలి మచ్చలంతగా కనుపడవు; తెల్లనిబట్టపైని సిరాబొట్టుకూడ ఎంతో ప్రాముఖ్యముగా కనుపడును. ఈ జీవిత మెల్లప్పుడును ప్రమాదభూయిష్ఠము. ప్రపంచమంతయు కామకాంచన వశమై యున్నది. సన్న్యాసి నిరంతరము త్యాగశాంతముల నభ్యసింపవలయును. కనుక శ్రీరామకృష్ణులు 'సన్న్యాసి అనుక్షణము జాగరూకుడై, వివేకియై ప్రవర్తింపవలయును' అని యుపదేశించు చుండువారు.

గృహస్థులకు ఇంద్రియ నిగ్రహము తప్పక ఉండవలెను

ఇంతలో స్వామికి నైవేద్యము చేయుటకు హరిహర మహారాజు పూజామందిరములోనికి వచ్చెను. అమ్మగారాయనను గురించి, "సంసారమును త్యజించిన యీతనిని చూడుడు. ఇతడు సర్వమును శ్రీరామ కృష్ణులపేరున పరిత్యజించెను. లెక్కలేకుండ పిల్లలను కనుటయే యీ లోకమున తమ ధర్మమైనట్లు, సంసారులు బిడ్డలను కనుచుందురు. 'ఒక రిద్దరు పిల్లలు పుట్టినతరువాత జను లాత్మనిగ్రహమభ్యసింపవలయును' అని శ్రీరామ కృష్ణులు చెప్పుచుండువారు. ఆంగ్లపురుషులు తమతమ సొత్తునుబట్టి పిల్లలను కనెదరని నేను వినుచున్నాను. వారికి కావలసినంతమంది బిడ్డలు పుట్టినతరువాత భార్యాభర్తలు వేర్వేరుగా కాపురముండి, ఎవరిపనివారు చూచుకొను చుందురు. ఇకమన జాతినిచూడుడు!"

అమ్మగారు చిఱునవ్వు నవ్వుచు ఇంకను నిట్లుచెప్పిరి: "నన్ను చూచుటకు నిన్న నొకయువతి వచ్చెను. ఆమెవెంట కొంతమంది పిల్లల మందకూడ వచ్చెను. వారిలో కొందరామె వీపున వ్రేలాడుచుండిరి, మఱికొందరామె చేతులను గట్టిగా బట్టుకొనుచుండిరి. వారిని చూచుకొనుటయే యామెకు కష్టముగా నుండెను. ఆమె నాతో యేమిచెప్పెనో మీ రూహింపగలరా? 'అమ్మా! ఈ సంసారజీవనము నాకెంతమాత్రము సుఖముగా లేదు.' అని యామె చెప్పెను. 'అమ్మాయీ! అది యెట్లు? నీ కింతమంది పిల్లలున్నారే!' అని నేను బదులుచెప్పితిని. 'వీరితో చాలును. ఇంక పిల్లలను

కనను' అని యామె చెప్పెను. 'నీవు నీ యుద్దేశమును నెరవేర్చగలుగుచో చాలబాగుండును,' అని నేనంటిని." ఈ మాటలు చెప్పి అమ్మగారు నవ్వనారంభించిరి.

భక్తురాలు: మన హిందూమతము ప్రకారము భర్తయే మన కత్యంత గౌరవనీయుడైన గురువు. భర్తను సేవించుటవలన స్త్రీకి స్వర్గము లభించుటయేకాక, యామె భగవంతునితో నైక్యమొందుననికూడ శాస్త్రములు చెప్పుచున్నవి. భర్త వలదనుచుండగా ప్రార్థనాదిసాధనలద్వారమున ఆత్మనిగ్రహ మభ్యసించుటకు ప్రయత్నించిన యెడల, ఆమె పాపమును చేయుచున్నదా ?

అమ్మగారు: లేదు! ఎంతమాత్రము పాపముచేయుట లేదు. ఈశ్వరసాక్షాత్కారము కొఱకు మీరేమి చేసినను, దానివలన ఏ విధమైన పాపమును కలుగదు. ఆత్మనిగ్రహము మిక్కిలి అవసరము. హిందూవితంతువులకు విధింపబడిన కఠిన నియమములెల్ల ఆత్మ నిగ్రహమును సాధనచేయుట యందు వారికి తోడ్పడుటకే ఏర్పడినవి.

శ్రీరామకృష్ణ లేపని చేసినను భగవంతుని ఆరాధన నిమిత్తమే చేసిరి. ఆయన యొకసారి నన్నే ఆరాధన దేవతగా ప్రతిష్ఠించి, షోడశీపూజ చేసిరి. ఆ గాజులను బట్టలను, ఇతర ఆరాధన వస్తువులను నే నేమి చేయవలయునని ఆయన నడిగితిని. కొంచె మాలోచించి వానినన్నిటిని నేను నా తల్లికిచ్చివేయవచ్చునని శ్రీవారు చెప్పిరి. అప్పుడు మాతంగ్రి బ్రతికియుండెను. 'ఈ వస్తువులను మీ అమ్మగారి కిచ్చినప్పుడు, నీవామె నొక సామాన్య మానవస్త్రీగా భావింపక,

శ్రీ విశ్వేశ్వరీ ప్రత్యక్షస్వరూపమే యామెయని తలంప వలయును,' అని శ్రీరామకృష్ణులు నాతో చెప్పిరి. శ్రీవారి యుపదేశముల రీతి యట్లుండెడిది.

1918-వ సం॥ సెప్టెంబరు 4-వ తేది.

అమ్మగారు చిత్రాసనముపై గూర్చుండి జపము చేయుచుండిరి. సాయంకాలపూజ పూర్తియైనది. ఒక భక్తురాలు (ఈమె అమ్మగారి వదినెగారే) అక్కడకువచ్చి "దయ యుంచి నా మనస్సును సరిచేయుడు. అన్నివిధములైన విచారములతో బాధపడుచున్నాను. ఇంక ఒకనాడైనను బ్రతుకవలెనని నాకులేదు. ఒక మరణ శాసనమును వ్రాసి నా ఆస్తినంతను మీకు అప్పగించెదను. నామరణానంతరము ఆమరణ శాసనము ప్రకారము జరిపింపుడు.'' అని అమ్మగారితో చెప్పెను, అమ్మగారు నవ్వుచు, "అయితే నీ వెప్పుడు చచ్చిపోవుచున్నావు? అని మొదటకొంచెము వేళాకోళముచేసి, వెంటనే తీక్ష్ణస్వరూపము దాల్చి, అట్టి యవివేకపు తలంపులెల్ల సోమరితనమువలనను, భావోద్రేకమువలనను కలుగునని, అట్టి యూహల నెంతమాత్రము మనసున బెట్టుకొనకూడదని యామెను మందలించిరి.

పిమ్మట, శ్రీమాతృదేవి నవ్వుచు నావైపుచూచుచు "అమ్మాయీ! చూచుచున్నావా శ్రీరామకృష్ణుల దురవగాహ లీల! నాసొంతబంధువులను చూడుము! ఎంతదుస్సహవాసము నాకు ప్రాప్తమయ్యెనో పరికింపుము. ఒకరికిదివరకే పిచ్చి. ఇప్పుడీమెకుకూడ ఆ యవస్థయే పట్టనున్నట్లున్నది.

ఇక నా మూడవబంధువును చూడుము! ఆమెను సన్మార్గములో బెట్టుటకు నేనెంతకష్టపడితిని! నా శ్రమ ఆవగింజంతయయినను ఫలింపలేదు. దానికి సరియైన బుద్ధిలవలేశము కూడ కలుగలేదు. అటుచూడుము. వసారాలో ఇనుపకమ్ములకానుకొని తనభర్త రాకకై ఆత్రముతో చూచుచున్నది. సంగీతము వినవచ్చుచున్న ఆ ఇంటిలోనికి అతడొకవేళ వెళ్లునేమోయని దానిభయము. రేయింబవళ్లు తనయెదుట భర్తనుంచుకొనవలెనని దాని ప్రయత్నము. ఎంత తీవ్ర మోహము! దానికింత వలపు కలుగునని నేనెన్నడును కలలోకూడ తలంప జాలకుంటిని,'' అని చెప్పిరి.

అమ్మగారి వదినెగారు విచారభావమును ప్రకటించు ముఖ (వికాస) ముతో, గదినివిడిచి వెళ్లిరి. శ్రీమాతృదేవి పరుపుపై బరుండిరి.

అమ్మగారు: అమ్మాయీ, ఎంతో పుణ్యముచేసియుండుటచేతనే నీకీమానవజన్మము లభించెను. భగవంతునియందు తీవ్రమైన భక్తిగలిగి ప్రార్థింపుము. మనము కష్టపడి పనిచేయవలయును. కష్టపడనిదే మనము దేనినైన నెట్లు సంపాదింపగలము? పగలెంత సమృద్ధిగా పనియున్నను, కొంతకాలమును నీవు ప్రార్థనకై తప్పక వినియోగింపవలెను. దక్షిణేశ్వరములో నుండినపుడు నేనెంతో పనిచేయుచుంటిని. అయినను ధ్యానప్రార్థనములకు ఎట్లో తీరికను కల్పించుకొనెడు దానను......మనోవ్యథతో బాధపడుచున్నానని మొఱపెట్టుచున్న నా వదినెగారుకూడ అట్లే పనిచేయనిమ్ము.

తెల్లవారు జామున మూడుగంటలకే మేల్కొని లేచి, నాగడి ప్రక్కనున్న వసారాలో నామెను ధ్యానముచేయు మనుము. అప్పుడామె మనస్సులో నేమైన విచారముండునేమో చూతము. కాని యామె ఆ పనిచేయక, తనకష్టములను గురించి మాత్ర ముపన్యాసము లిచ్చుచుండును! ఇంతకు నామె పడుకష్టమేమి? అమ్మాయీ, మనోవ్యథయననేమో నే నెన్నడు నెఱుగను. కాని, నే నిపుడు మా బంధువుల కొరకు రేయింబవళ్లు కష్టపడుచున్నాను. ఈ వదినెగారు మాయింటికి వచ్చినకాలము మిక్కిలి చెడ్డది. ఈమె కొమార్తెయగు రాధును నేను పెంచబూనుకొనుట వలననే నాకీ కష్టములన్నియు కలిగినవి. వారందరును వెళ్లిపోవచ్చును. నా కెవరు నక్కరలేదు. ఈ పిల్లలను చూడుము. వీరెన్న డును నే చెప్పినమాట వినరు. ఎంత అవిధేయులు!

గోలప్‌మాయి: వీరెట్లు సింగారించుకొందురో చూడుము. తమ భర్తలప్రేమను సంపాదించుట కదియే మార్గ మని వారితలంపు.

అమ్మగారు: హా! శ్రీ రామకృష్ణులెంత దయతో నన్ను చూచుచుండిరి. ఒక్క పరుషమైన మాటనుకూడ వారెన్నడును పలుకలేదు. ఏనాడును నామనస్సును నొప్పింప లేదు. "మనమెల్లప్పుడును పనిచేయుచుండవలెను. పని లేకుండ మనమెన్నడు నుండరాదు. సోమరులమై యుందు మేని బహువిధములైన చెడుతలంపులన్నియు మనస్సులో బయలుదేరును," అని శ్రీవారు నాతో చెప్పుచుండువారు.

అమ్మాయీ! అడవియేనుగ వంటిది ఈ మనస్సు. అది వాయువేగముతో బరుగెత్తుచుండును. కనుక మన మెల్లప్పుడు వివేచన చేయుచుండవలెను. ఈశ్వర ప్రసన్నమునకు మనము కష్టపడి సాధన చేయవలెను. దక్షిణేశ్వరములో రాత్రి యెవరో పిల్లనగ్రోవితో పాడుచుండెడివారు. ఆ పాట వినుటతోడనే భగవత్సాక్షాత్కారముకొరకు నా మనస్సు మిక్కిలి తహతహపడుచుండును. ఆ నాదము సరిగా భగవంతుని ముఖమునుండి వెలువడి వచ్చుచుండెనని భావించి, నేను యోగసమాధి స్థితిలోనికి బోవుచుందును. బేలూరు మఠములోకూడ ఈ ఆనందమే నే ననుభవించితిని. అప్పుడా స్థలము బహుప్రశాంతముగా నుండెడిది. తఱచుగా నేను ధ్యాన నిమగ్ననై యుండెడిదానను. ఈ కారణమునుబట్టి నరేంద్రుడు (వివేకానందస్వామి) నాకచ్చట నొకయింటిని కట్టించవలెనని తలపెట్టెను. ఈ యిల్లుగల నేలను కేదారుదాసు దానముగా నిచ్చెను. కాని, యిప్పుడు నేల వెల చాల పెరిగినందున స్థలము కొనుటకే సాధ్యముకాదు. ఇదియంతయు దైవకృపవలననే జరుగుచున్నది.

మనోనిగ్రహము - భగవత్సాక్షాత్కారము

ఇంతలో అమ్మగారి మేనకోడలు మకు, తన చంటి పిల్లవాని నెత్తుకొని, 'అమ్మా! నే నేమిచేతును? కుఱ్ఱవాడు నిద్రపోవుటయే లేదు', అని చెప్పుచు వానిని క్రిందికి దింపెను. 'ఆ కుఱ్ఱవాడు సత్త్వగుణ ప్రధానుడు. అందుచేతనే నిద్రపోవుట లేదు', అని అమ్మగారు బదులుచెప్పిరి.

ఉడుకు పొక్కులతో శ్రీమాతృదేవి దారుణముగా బాధపడుచుండెను. ఆమె కోరికపైని నేనామెకు తైలమును రాసితిని.

ఒకనాడమ్మగారు తమయింటి మేడమీద నుత్తరపు వసారాలో కూర్చుండిరి. ఉడుకు పొక్కులతో నింకను చాల బాధపడుచునేయుండిరి. తమ పాదస్పర్శ చేసిన ఎంతమందియో భక్తుల పాపములు సంక్రమించినందుననే ఆ బాధ తమకు కలిగినదని తెలిపిరి. పిమ్మట శ్రీరామకృష్ణులను గురించి ప్రసంగము జరిగెను.

శ్రీ రామకృష్ణుల జీవిత విశేషములు

అమ్మగారు : కాశీపూరులో శ్రీరామకృష్ణులు జబ్బుతో పరుండి యుండినపు డొకసారి, కొంతమంది భక్తులు దక్షిణేశ్వర దేవాలయమందలి కాళీమాతకొరకై కొన్ని భక్ష్యములను దెచ్చి, శ్రీ గురుదేవుడు కాశీపూరులో నుండెనని విని, వారా పదార్థములనెల్ల ఆయన చిత్రపటము* నెదుటనుంచి సమర్పణజేసి, ఆ ప్రసాదమును భుజించిరి.

ఈ సంగతివిని శ్రీ రామకృష్ణులిట్లు చెప్పిరి : "జగన్మాతయైన శ్రీ కాళికాదేవికొరకీ పదార్థములనెల్ల తీసికొనివచ్చి,

* ఈ విషయము కాశీపూరులో జరిగెను. కాళీమాతకు సమర్పించుటకై కొంతమంది భక్తులు వేరువేరు రకముల మధుర భక్ష్యములను తీసికొని వచ్చిరి. కాని యా పదార్థములను దక్షిణేశ్వరములోని కాళీమాతకు నివేదనచేయుటకు మారుగా, కాశీపురోద్యాన గృహములోని చావడిలోనుండిన శ్రీ గురుదేవుని చిత్రపటమునకు సమర్పించిరి.

(తనను ఉద్దేశించుచు) దీనికి సమర్పించిరి!" ఈ విషయమై నేను మిక్కిలి భయపడి "అయ్యో! ఈయన అపాయకర మైన వ్యాధితో బాధపడుచున్నారే! ఏమి యుపద్రవము దీనివలన సంభవించునోకదా! దైవమా! ఈ భక్తులెందు కిట్లు చేసిరి?" అని పరిపరివిధముల తలంచితిని. శ్రీ గురు దేవులుకూడ దీని విషయమై మరల మరల చెప్పుచుండిరి. రాత్రి చాల ప్రొద్దుకడచిన మీదట "కొంత కాలమునకు జను లింటింట నన్నెట్లారాధింతురో నీవు చూచెదవు. దీనిని (తన్ను ద్దేశించుచు) జనులందరు స్వీకరించుటను నీవు చూతువు. ఇది వాస్తవముగా జరుగబోవు విషయమే." అని శ్రీవారు నాతో జెప్పిరి. ప్రథమపురుషైకవచనమగు 'నేను' అను మాటను ఆయన తన్ను గురించి ప్రయోగించుచుండగా ఆ యొకనాడే నేను వింటిని. తన్ను గురించి మాటలాడునపు డాయన సామాన్యముగా తమశరీరమును చూపుచు 'ఈ తొడుగు' అనికాని 'దీనికి చెందిన' అనిగాని చెప్పుటయే కాని 'నేను' అనికాని 'నన్ను' అనికాని చెప్పరు.

శ్రీ గురుదేవుని నిర్యాణానంతరమున ఆయన ధరించు చుండిన ఉన్నిదుప్పటి, శాలువ మొదలగు దుస్తులవంటి విలువయైన కొన్నివస్తువు లెవరు తీసికొనవలయునను విషయ మున వివాదము బయలుదేరెను. ఎవరెన్ని చెప్పినను ఈ వస్తువులను అమూల్యమైన ఆస్తిగా భావించి, ఆచంద్రార్క ముగా కాపాడువారు భక్తులే. తుదకు వారే వీనినన్నిటిని ఒక పెట్టెలో పెట్టి బలరామబాబు నింటియందు ఒక గదిలో నుంచిరి. కాని శ్రీ గురుదేవుని సంకల్ప మేమని చెప్పుదును,

తల్లీ! ఆ యింటిలో పనిచేయుచుండిన పరిచారకుడా వస్తువు లలో చాలవరకు దొంగిలించి, కొన్నిటిని అమ్మివైచెను. మరికొన్నిటిని తన ఇష్టమువచ్చినట్లు వినియోగపఱచెను. అటువంటి వస్తువుల నొక సాధారణమైన ఇంటిలో, పదిమంది కూర్చుండు గదియందుంచుట ఉచితముకాదు. ఇంటిలోపలి భాగమున నెచ్చటనైన వారు వాని నుంచియుండవలసినది. శ్రీ గురుదేవునివైన ఆ వస్తువులలో చివరకు మిగిలినవానిని, బేలూరుమఠములో నిప్పుడు కాపాడుచున్నారు.

నా మామగారు (శ్రీ రామకృష్ణుల తండ్రి) సాధువును, పవిత్రవర్తనుడును, స్వాతంత్ర్యప్రియుడునైన బ్రాహ్మణోత్తముడు. ఇతరులు చేయు దానములను తానెన్నడును తీసికొనకుండుటయేకాక, తాను లేని సమయమున నెవరైన నింటికి వచ్చి, ఇచ్చుదానమును తనకుటుంబములో నెవరునుగూడ స్వీకరింపవలదని శాసించిన పరధనాపేక్షారహితు డాయన. కాని మా అత్తగారి స్వభావ మటువంటిది కాదు. ఎవరైనను కాయగూరలను తెచ్చి ప్రత్యేకముగా నామెకిచ్చుచో, ఆమె వానిని పుచ్చుకొని, వండి కులదేవతకు సమర్పించి పిమ్మట ప్రసాదముగా నందరికిని పెట్టును. ఈ సంగతి మా మామగారికే తెలిసినయెడల, ఆయన కోపపడెడువారు. స్వార్థమెంతమాత్రమును పాటింపని నిరంతర భగవత్సేవాదీక్షయే, యా భక్తాగ్రేసరుని జీవనజ్యోతి కాజ్యధార! ఇందుచేతనే శ్రీ గురుదేవు లాయనవంశమున జన్మించిరి.

హరిదాసి యను నొక స్త్రీ నవద్వీపమునకు తీర్థయాత్రగా వెళ్లవలయునని కోరెను. కాని, యామె వాస్తవ

ముగా నక్కడకు పోకుండ కామార్పుకూరులోనే యుండెను. ఆమెకు నాయందు బహుప్రేమ. ఆమె విశ్వాసము మిక్కిలి గాఢమైనది. శ్రీ గురుదేవుడుపుట్టిన స్థలములోని కొంత ధూళినితీసి తనయొద్ద నుంచుకొని, 'ఇదియే నా నవద్వీపము; శ్రీ గౌరాంగుడుకూడ నిచ్చటనే జనించెను. నే నిక నవద్వీప మున కెందుకు పోవలయును?' అని చెప్పుచుండును. ఎంత దృఢవిశ్వాసము!

శ్రీ గురుదేవుని నిర్యాణానంతరమున, ఒరిస్సానుండి ఒక సాధువు కామార్పుకూరుకు వచ్చియుండెను. నేనాతనికి బియ్యము, పప్పుదినుసులు మొదలైన జీవితావసరపదార్థ ముల నిచ్చుచుండుదానను. ప్రతిదినముదయము, సాయం కాలముగూడ నేనాతనికడకు వెళ్లి, 'స్వామీ! క్షేమముగా నున్నారా?' అని అడుగుచుందును. ఆహా! నేనెంతకష్టపడి ఆతనికొరకొక పూరియిల్లును కట్టించితిని! ప్రతిదిన మాకాశ మున కారుమబ్బులు క్రమ్మి, వర్షము దిమ్మరించునేమోయని తోచుచుండెను. కనుక నేను చేతులుజోడించి, "ఓ దైవమా! కొంచెము తడవాగుము! నేనీ కుటీరమును ముగించిన తరు వాత కుంభవృష్టిగా వర్షము కురియనిమ్ము!" అని భగవంతుని ప్రార్థించుచుండు దానను. గ్రామములోని జనులుకూడ కుటీరమున కవసరమైనకలప, గడ్డి మొదలైన సామగ్రినిచ్చి నాకు తోడ్పడిరి. కుటీరమెట్లో పూర్తియైనది కాని, పాప మాసాధువు కొలదినాళ్లైన తరువాత ఆ కుటీరములోనే చని పోయెను.

శ్రీ రామకృష్ణులు తమ శరీరము గయలోనుండి వచ్చెనని చెప్పుచుండువారు. ఆయన తల్లి మరణించిన తరువాత నన్ను గయకువెళ్లి ఆమెకచ్చట పిండప్రదానము చేయుమనిరి. కుమారుడు బ్రతికియుండగా నాకాకర్మలను చేయుట కధికారములేదని బదులు చెప్పితిని. "కాదు కాదు, నీకందుకు అధికారముకలదు. ఎటువంటి సందర్భములోనైనను, నేను గయకు పోజాలను. అక్కడకు వెళ్లితినేని, మరలనిచ్చటకు వచ్చుటకు నాకు సాధ్యమగు ననుకొనుచున్నావా?" అని శ్రీ గురుదేవులు సెలవిచ్చిరి. అందుచేతనే నాయనను అక్కడకు వెళ్లుడని కోరలేదు. తరువాత గయలో నేనే ఆ కర్మలను చేసితిని.

1918-వ సం॥ సెప్టెంబరు 28-వ తేది.

ఉద్బోధనా పత్రికా కార్యాలయమునకు నేను వెళ్లునప్పటికి తెల్లవారినది. శ్రీ మాతృదేవి పండ్లచెక్కు తీయుచుండిరి. పూజలో నైవేద్యమునకు వినియోగపఱచుటకే ఆ పండ్లు. నన్ను చూచుటతోడనే, "నీవు వచ్చుట నాకెంతో ఆనందముగానున్నది. నేడే బోధన్ పండుగ. నేనా విషయమే మరచిపోతిని.* శ్రీ రామకృష్ణుల పూజకై యీ పువ్వులను సర్దుము. పండ్లతట్టను ఈ వైపున నుంచుము," అని అమ్మగారు చెప్పిరి. ఆమె చెప్పినప్రకారము చేసితిని. తరువాత అమ్మగారికి తలదువ్వితిని. తలదువ్వుచుండగా కొన

---

* ఇది దుర్గపూజా ప్రారంభమునకు ముందటిదినము. హిందువులకు పండుగ.

వెంద్రుకలూడి బైటకు వచ్చినవి. "అమ్మాయీ! ఇవిగో నమ్మా! వీటిని దాచియుంచుకో," అని అమ్మగారు చెప్పిరి. నిజముగా నేను ధన్యురాలనైతి ననుకొంటిని. అమ్మగారి తల వెంద్రుక లొకటి రెండు స్మారకచిహ్నములుగా దాచి యుంచుకొనవలయునని నాకు మిక్కుటమైన కోరికయుండెను.

సుప్రసిద్ధ వైద్యుడగు శ్యామదాసు కవిరాజు, రాధను చూచుటకు వచ్చెను. ఆమె నతడు చూచిన తరువాత, ఆయనకు నమస్కారము చేయుమని అమ్మగారు రాధనడిగిరి. ఆప్రకార మామెచేసిన తరువాత వైద్యుడు వెళ్లిపోయెను. పిమ్మట "ఆ వైద్యుడు బ్రాహ్మణుడా?" అని యెవరో అడిగిరి.

అమ్మగారు : కాడు, ఆయనది వైద్యజాతి.

భక్తురాలు : అట్లైనచో మీరెందుకాతనికి రాధను నమస్కరింపు మన్నారు?

అమ్మగారు : నే నట్లెందు కనకూడదు? ఆ వైద్యుడు చాల బుద్ధిమంతుడు, బ్రాహ్మణునితో సమానమైనవాడు. అట్టివానికిగాక మరెవరికి నమస్కరింపవలయును? అమ్మాయీ, నీ యభిప్రాయమేమి?

1918-వ సం॥ సెప్టెంబరు 30-వ తేది.

నేడు పవిత్రమైన మహాష్టమి. నాచెల్లెలును నేనును ఉద్బోధనపత్రికా కార్యాలయమున కుదయమున శీఘ్రముగ వచ్చితిమి. కొంత తడవైన తరువాత కొందరు భక్తురాండ్రు పువ్వులనుదెచ్చి, వానితో శ్రీ మాతృదేవిని పూజించి స్నాన

మునకై గంగకు వెళ్లిరి. "నేటి కిక్కడ నీవుందువు కాదా? నేడు మహాష్టమి. దుర్గపూజాదినములలో రెండవది," అని మాతృదేవి చెప్పెను. ఉందునని నేను చెప్పితిని. కొలది నిమిషములైన తరువాత శరత్ మహారాజు (శారదానంద స్వామి) అమ్మగారికి నమస్కారము చేయుటకై యచ్చటకు వచ్చెను. మేము ప్రక్కగదిలోనికి వెళ్లితిమి. అమ్మగారు పరుపుపై కూర్చుండిరి. ఆమె పాదములు నేల నానుకొని యుండినవి. చాలమంది భక్తులువచ్చి శ్రీమాతృదేవికి నమస్కరించిరి.

పిమ్మట మేము మకుతోను, ఇతర భక్తురాండ్రతోను స్నానమునకై గంగకు వెళ్లితిమి. ప్రతిదినము మేహవాతపు నొప్పులవలన గంగలో స్నానము చేయుటకు వీలులేనందున, ఇంటియొద్దనే స్నానము చేసెదమని అమ్మగారు చెప్పిరి. స్నానముచేసి మరల వచ్చిన తరువాత చాలమంది భక్తురాండ్రువచ్చి, శ్రీ మాతృదేవిని పూజించుచుండగా చూచితిమి. అమ్మగారికి సమర్పించుటకై వారిలో నెందరో క్రొత్త బట్టలను తీసికొనివచ్చిరి. పూజయైన తరువాత కాళీఘట్టములోని కాళీవిగ్రహమునకు జనులు చేయునట్లు, వారా వస్త్రములను అమ్మగారి యొంటిమీద కప్పిరి. పిమ్మట, ఆ బట్టలను ఒకదాని తరువాత నొకటి తీసివేయుచు, అమ్మగారు "ఈ బట్ట బాగున్నది," అని చెప్పుచుండిరి.

ఇంతలో నొక బ్రహ్మచారి గదిలోనికివచ్చి, ఇంక భక్తులు అమ్మగారికి నమస్కరించుటకై లోనికి రానున్నారని చెప్పెను. ఓహో! అది యెంత రమ్యమైన దృశ్యము! తమ

చేతులతో పువ్వులను, బాగుగా వికసించిన పద్మములను, మారేడు పత్రిని బట్టుకొని భక్తులొకరివెంట నొకరువచ్చి శ్రీమాతృదేవిని ఆరాధించి, ప్రణామముచేసి వెళ్లుచుండిరి. ఈ విధముగా కొంతకాలము గడచిన తరువాత బలరాముని కుటుంబమువచ్చి అమ్మగారిని అర్చించెను. చిట్టచివరకు నా వంతువచ్చినది. పూజచేసిన తరువాత, నే నొక బట్టను కప్పుచుండగా తటాలున, "ఈ నాడు నే నొక క్రొత్తబట్టను కట్టుకొనవలసి యుండుటచే, ఈ బట్టనే కట్టుకొందును," అని చెప్పి శ్రీమాతృదేవి వెంటనే నేనిచ్చిన చీరనే కట్టుకొనిరి. ఇది చూచి నేను కన్నుల నీరు పెట్టుకొంటిని. అది బహు సాధారణమైన చీర. అమ్మగారి చుట్టును విలువైన చీర లెన్నియో పడియుండినవి. అమ్మగారు తమ బీదపుత్రికనైన నాయందు వెలిబుచ్చిన యీ ప్రేమాతిశయమును జూచి సిగ్గుపడితిని. "ఈ చీరయంచు ఎంత బాగున్నది!" యని ఆమె సెలవిచ్చిరి.

కావిరంగు చీరను కట్టుకొనిన యొక స్త్రీ అమ్మగారి నారాధించి రెండు రూప్యములను వారి పాదములకడ నుంచిరి. "శ్రీహరీ! నీ వట్లేల చేయవలయును? కాషాయవస్త్రమును కట్టుకొని చేతికి రుద్రాక్షపూసలను పెట్టుకొంటివే!" అని చెప్పి, యా స్త్రీని 'నీ గురువెవరు?' అని అమ్మగా రడిగిరి. తన కెవరును మంత్రోపదేశము చేయలేదని యామె బదులు చెప్పెను. "మంత్రోపదేశము లేకుండ, పరమార్థానుభూతి యేమియు లేకుండ నీ పవిత్ర కాషాయవస్త్రమును ధరించితివి. ఇది నీకు తగనిపని, నీ విప్పుడు కట్టుకొనిన వస్త్రము బహు

పవిత్రమైనది. చేతులు జోడించి నీకు "నేను నమస్కరింప నుంటిని. అందరు నీ పాదములకు ప్రణామము చేయుదురు; ఇట్టి గౌరవమును స్వీకరించుటకు అధికారమును నీవు సంపాదింపవలయును," అని అమ్మగారు మందలించిన పిమ్మట, "నేను మీయొద్దమంత్రోపదేశము నొందవలయునని ఆశపడుచున్నాను," అని ఆ స్త్రీ చెప్పెను.

అమ్మగారు: అది యెట్లు పొసగును!

కాని యా స్త్రీ అమ్మగారిని మంత్రోపదేశము చేయుడని పట్టుపట్టి పోరుచుండెను. గోలప్ మాయికూడ ఆమెను సమర్థించెను. అమ్మగా రందుపైని కొంచెము సమ్మతించుచున్నట్లు కనుపడి, "సరే! ఆ విషయ మాలోచించెదము," అని సెలవిచ్చిరి.

తన ఆశ్రమ బాలికలతోకూడ గౌరీమాయి వచ్చెను. వారందరును అమ్మగారి నారాధించి ప్రసాదము తీసికొని వెళ్ళిరి.

పూజామందిరములో పూజ ముగిసిన తరువాత, బిలాస్ మహారాజు శ్రీ మాతృదేవికడకువచ్చి, ఎందుచేతనో శ్రీ రామకృష్ణు లానాడు నైవేద్య మారగింపలేదని, గాలికి కొట్టుకొని వచ్చిన అపరిశుద్ధమైన ఆకొకటి నైవేద్యముపై పడుటవలననో, భక్తులు తెచ్చిన పదార్థములలో నేదైన దోషముండుటవలననో, ఎందుచేతనో తనకీ యనుమానము కలిగినదని శ్రీ మాతృదేవితో రహస్యముగా చెప్పెను. అందుపైని "నైవేద్యముమీద గంగాజలమును జల్లితివా?"

యని అమ్మగా రతని నడుగగా, "జల్లితి" నని చెప్పి యతడు వెడలిపోయెను. ఈ విషయమును విని నేను మనసున నాయాసపడితిని.

శ్రీ మాతృదేవి ఆరాధన యింతకు మున్ను చెప్పినట్లో కేవిధముగా జరిగెను. పువ్వులును, మారేడు పత్రియును కుప్పలు కుప్పలుగా నామె పాదములదగ్గర ప్రోగుపడుచుండెను, ఒకప్రోగు తరువాత నింకొకప్రోగును, పరిచారకులు తీసి వేయుచుండిరి.

దీనులయెడల శ్రీ మాతృదేవికి గల దయ

మధ్యాహ్నపూజా సమయమయినది. చాలదూరము నుండి కొంతమంది పురుషులును, ముగ్గురు స్త్రీలును శ్రీ మాతృదేవిని సందర్శింపవచ్చిరి. వారు నిజముపేదలు. ఒక్కొక్కరికి ఒకే బట్టతప్ప వేరేమియు లేదు. యాచించి కొంతసొమ్మును సంపాదించి, దానితో వారు కలకత్తాకు వచ్చిరి. వారిలో నొకభక్తుడు అమ్మగారితో ఏమేమో రహస్యముగా సంభాషించుచుండెను. మధ్యాహ్న పూజా సమయము గడచి పోవుచుండెను. కాని, ఆ భక్తుని సంభాషణకు అంతు కానరాకుండెను. అమ్మగారే పూజచేయవలసి యుండెను. ఉద్బోధనాపత్రికా కార్యాలయములోని యుద్యోగులకు విసుగుపుట్టెను. వారిలో నొకరు "ఇంకను నీవేమైన చెప్పవలసి యున్నయెడల, మేడక్రిందకు దిగివచ్చి, సన్న్యాసులలో పెద్దలగు వారితో మాట్లాడవచ్చును," అని యా భక్తునితో స్పష్టముగా చెప్పిరి. కాని, "పూజాసమయము దాటిపోయినను భయములేదు. వీరు చెప్పవలసి

యున్న విషయములను నేను విని యే తీరవలయును,'' అని అమ్మగారు కొంత పట్టుదలతో చెప్పి, అతడు చెప్పిన దాని నెల్ల మిక్కిలి యోరిమితో విని, రహస్యముగ వాని కేవియో హితబోధ లొనర్చి, పిమ్మట వానిభార్యనుకూడ దీసికొని రమ్మని యొకరిని పంపిరి. వారికి కలలో నేదియో అనుభూతి కలిగియుండవలయునని మే మూహించితిమి. కలలో వారొక పవిత్రమంత్రోపదేశము నొందిరని మాకు తరువాత తెలియ వచ్చెను. ఒక గంటయైన పిదప వా రమ్మగారియొద్ద సెలవు తీసికొని వెళ్లిరి. ''అయ్యో! వా రెంత పేదవారు! మిక్కిలి ప్రయాసపడి వా రిక్కడకు వచ్చిరి,'' అని అమ్మగారు సెలవిచ్చిరి.

మధ్యాహ్నపూజ యైనతరువాత మేము భోజనము చేసితిమి. శ్రీమాతృదేవి కొంతతడవు విశ్రమింప దలచిరి. మేము ప్రక్కగదిలోనికి పోయితిమి.

సాయంకాలము నాలుగు గంటలైనది. పూజామందిర ములో పూజయైన తరువాత రాసవిహారి మహారాజువచ్చి, 'అమ్మా! మిమ్ము సందర్శింపవచ్చి, ఒక ఐరోపీయస్త్రీ యెంత కాలమో కనిపెట్టుకొని యుండెను,'' అని చెప్పెను. అమ్మగా రామెను తోడ్కొనిరమ్మనిరి. ఆమె అమ్మగారికి ప్రణామము చేయుచుండగా కరస్పాలనము చేయునపుడు, మన మొనర్చు రీతిని అమ్మగా రామె చేతిని బట్టుకొనిరి. దేశకాలానుసార ముగా మనము ప్రవర్తింపవలయునని శ్రీగురుదేవుడు చెప్పిన మాట లీసందర్భమున నిజమయ్యెను. పిమ్మట అమ్మగా రా స్త్రీ గడ్డమును నిమిరి, ముద్దుపెట్టుకొనిరి. ఆ దొరసాని,

"నా రాకవలన నేను మీ కిబ్బంది కలుగజేయలేదని నమ్ము చున్నాను. మీ దర్శనార్థము నేను చాలసేపటినుండి, క్రింద కనిపెట్టుకొనియున్నాను. నేనిప్పు డొక పెద్దయాపదలో నున్నాను. నా యేకైకపుత్రిక ప్రాణాపాయకరమైన అనారోగ్యస్థితిలో నున్నది. అందుచే మీ దయను, ఆశీర్వాదముల నర్థింప నిచ్చుటకు వచ్చితిని. నా కుమార్తెను కటాక్షించి, ఆమెకు వ్యాధి నివారణచేయుడు. అది చాల మంచి పిల్ల. ఈ కాలమున మాలో మంచిస్త్రీ కనుపడుటయే అరుదు. నా కుమార్తెను పొగడుట కిదియే కారణము. మాలో చాలమంది దుర్మార్గులని, దుష్టమనస్కులని నేను నిష్కర్షగా చెప్పగలను. కాని నా కుమార్తె స్వభావమిందుకు కేవలము భిన్నము. దయయుంచి దానిని రక్షింపుడు," అని ఆ స్త్రీ వంగభాషలో చెప్పెను.

అమ్మగారు : మీ కుమార్తెకొరకు నేను భగవంతుని ప్రార్థింతును. ఆమె వ్యాధి కుదురును.

శ్రీమాతృదేవి చేసిన యీ అభయప్రదానమువలన చాల ధైర్యముకలిగి, "ఆమెకు వ్యాధి నివారణ యగునని మీరు చెప్పినప్పుడు, ఆమె వ్యాధి తప్పక నివారణమైతీరును. ఈ విషయమున సందేహమేమియు లేదు," అని యాదొరసాని ప్రబలవిశ్వాసముతో, నుత్కంఠగా ముమ్మారు చెప్పెను. అమ్మగారు దయార్ద్రదృష్టిని ప్రసరించుచు, "పూజావేదికలో నుండి యొక పువ్వును దెచ్చి యీమెకిమ్ము. ఒక తామర పువ్వును తీసికొనిరా," అని గోలప్‌మాయితో చెప్పిరి. అట్లే గోలప్‌మాయి యొక తామరపువ్వును, నొక బిల్వదళమును

తీసికొనివచ్చెను. అమ్మగారా తామరపువ్వును చేతితో తీసి కొని, కొలది క్షణములు తమకన్నులను మూసికొని ధ్యాన నిమగ్నులైరి. తరువాత కనులు తెరచి శ్రీ రామకృష్ణుల ప్రతిమవైపు రెప్పవ్రాల్పక చూచుచు, అమ్మగారా పువ్వును "దీనితో మీ కుమార్తె తలను అద్దుచుండుడు," అని చెప్పి ఆ దొరసాని కిచ్చిరి. దానిని మిక్కిలి భక్తితో తీసికొని ఆమె అమ్మగారికి ప్రణామముచేసి, "తరువాత నేనీ పువ్వు నేమి చేయవలెను?" అని అడిగెను.

గోలప్మాయి: అది యెండిపోయిన తరువాత గంగలో పారవేయుడు.

దొరసాని: కాదుకాదు. ఇది భగవంతునిది. దీనిని పారవేయజాలను. ఒక క్రొత్తబట్టనుదెచ్చి, దానితో నొక సంచినిచేసి దానిలో ఈ పువ్వునుంచెదను. ప్రతిదినము నా కుమార్తె తలను దీనితో నద్దెదను.

అమ్మగారు: మంచిది, అట్లే చేయుడు.

దొరసాని: భగవంతుడే పరమసత్యము. భగవంతు డున్నాడు. నేనొక విషయమును మీకు తెలుపగోరు చున్నాను. కొలదినాళ్లక్రిందట నాశిశువులలో నొకరు జ్వరము వచ్చి, మంచముపట్టిరి. అత్యధిక భక్తితో "ఈశ్వరా! నీవున్నట్లు నాహృదయమునకు పొడగట్టుచుండును. అయినను వాస్తవమైన ఋజువు కోరుచున్నాను," అని భగవంతుని ప్రార్థించి, యేడ్చి నా చేరుమాలును బల్లపై నుంచితిని. చాల తడవైన తరువాత ఆ రుమాలు మడతలలో మూడు పుల్లలు

చూచి ఆశ్చర్యపడితిని. ఈ మూడు పుల్లలతో శిశువు శరీరమును మూడుసార్లు మెల్లగా అద్దితిని. త్వరలో జ్వరము నివారణ యయ్యెను.

ఈ విషయమును చెప్పినప్పుడు దొరసాని చెక్కిళ్లపై కన్నీటికాల్వలు ప్రవహించెను. చివరకామె, "అమూల్యమైన మీకాలమును పాడుచేసితిని. దయయుంచి నన్ను క్షమింపుడు," అని చెప్పెను. "లేదు లేదు. మీతో మాట్లాడుట నాకెంతో సంతోషముగా నున్నది. మంగళవారము నాడు మరల నిచ్చుటకు మీరు రండు," అని అమ్మగారామెను గోరిరి. పిమ్మట దొరసాని వంగి అమ్మగారియొద్ద సెలవుగైకొని వెళ్లెను.

కొన్నాళ్లైన తరువాత నేను అమ్మగారిదగ్గరకు వెళ్లినప్పుడు, మంగళవారమునాడు దొరసాని శ్రీ మాతృదేవిని సందర్శింపవచ్చెనని వింటిని. అమ్మగారామెకు ప్రత్యేకాభిమానమును గనుపఱచి మంత్రోపదేశమును చేసిరి. ఆమె కుమార్తెకుకూడ వ్యాధి నివారణమైనది.

* * *

1920-వ సం॥ మార్చి 24-వ తేది.

శ్రీ మాతృదేవి జయరాంబాటిలో స్వగృహమందు రమారమి ఒక సంవత్సరముండి, కలకత్తాకు వసంతఋతువులో తిరిగి వచ్చిరి. చాలకాల మామె చలిజ్వరముతో బాధపడి, చిక్కి శల్యావసిష్టులైనారు. ఆమెకు సాష్టాంగ ప్రణామము చేసినమీదట తమ చేతిని నా తలపైనుంచి

నన్నాశీర్వదించి, నా కుశలమడిగిరి. శుష్కించిపోయిన యామె శరీరమును చూచినప్పుడు, నాకు మాటయేరాలేదు. ఆమె మోమును రెప్పవ్రాల్పక చూచి "అయ్యో! ఈమె శరీరమెంతపాలిపోయి నీరసముగా నున్నది?" అని చింతించితిని. నా చెల్లెలి పరిచారికకూడ నాతోనుండెను. అది ప్రణామము చేయుచు అమ్మగారిపాదములను తాకబోవుచుండగా "దూరముననుండియే నీవు నమస్కరింపవచ్చును," అని అమ్మగారు దానితో చెప్పిరి. ఆ పనికత్తె తలుపు గుమ్మముదగ్గర నుండియే నమస్కరించి వెళ్లెను.

ఆ నీరసస్థితిలో ఒక్కమాట మాటాడినను అమ్మగారి కెంతో బాధగానుండెను. నేను నేలపై గూర్చుంటిని. ఇంతలో రాసవిహారీ మహారాజు వచ్చి అమ్మగారితో విశేషముగా మాట్లాడవలదని నాతో చెప్పెను. అమ్మగారుమాత్ర మప్పుడప్పుడు వేర్వేరు విషయములను గురించి నన్నడిగిరి. నేను మిక్కిలి క్లుప్తముగా బదులు చెప్పితిని. పిమ్మట తన బిడ్డనెత్తుకొని రాధు వచ్చెను. నే నా బిడ్డనెత్తుకొని ఒక చిన్న బహుమాన మతని కిచ్చితిని. దానిని తీసికొనవలదని రాధు పట్టుపట్టెను. "ఇదేమే రాధూ? ఆమె నీ సోదరియే. అంత ప్రేమతో బహుమాన మిచ్చినప్పుడు నీవేల దానిని పుచ్చుకొనవు?" అని చెప్పుచు, అమ్మగారే ఆ పైకమును పుచ్చుకొనిరి. తల్లి, అమ్మమ్మల అశ్రద్ధవలన ఆ శిశువు పడుచుండిన పాట్లకు అమ్మగారు చాల చింతించిరి. ఆవేశముతో రాధు నోటికి వచ్చినట్లు మాట్లాడుచుండెను. "దానితో మాట్లాడి

లాభము లేదు,'' అని చెప్పి అమ్మగారూరకుండిరి. కొంత తడవైన తరువాత సరళయును కొంతమంది భక్తురాండ్రును, అమ్మగారిని చూడవచ్చిరి. ఆమె పరుపుపై బరుండియే వారితో సంభాషింప నారంభించిరి.

1920-వ సం॥ మార్చి 30-వ తేది.

అయిదారు నాళ్లైన తరువాత శ్రీ మాతృదేవిని సందర్శించుటకై వెళ్లితిని. అప్పుడామెకు జ్వరము వచ్చుచుండుట లేదు కాని, రాధుకు తన పసిబిడ్డను చూచుకొను సమర్థత కూడ లేదే యని అమ్మగారు చాల వ్యసనపడుచుండిరి. ఇంతే కాక నేడు రాధు తన చేతిని ఇనుపకమ్ములకు వేసి కొట్టుకొని యుండుట చేత, చేయియంతయు వాచి, దానికి ఆముదములో ముంచిన యొక మురికిగుడ్డను కట్టు కట్టుకొని ఆమె అప్పుడే అమ్మగారిని పరీక్షచేయుటకు వచ్చిన డాక్టరు కంజీలాల్ అను వైద్యునకు చేతిని చూపించుటకు అమ్మగారి గదిలోనికి వచ్చెను.

రాధు చేతికి బాగుగా కట్టుకట్టిన తరువాత అమ్మగారు పరుపుపై పరుండి తమ పాదములను నన్ను రాయమనిరి. పాదములను రాయుచు, నాకొక విషయమడిగి తెలిసికొనవలెనని యున్నదని అందు విషయమై ప్రశ్నించినచో ఇబ్బంది లేని యెడల అడుగుదునని చెప్పితిని.

అమ్మగారు : లేదు. ఎంతమాత్ర మిబ్బంది లేదు. చెప్ప దలచుకొన్న దానిని నీవు చెప్పవచ్చును.

పారమార్థిక సాధనలను అనుభవములను గురించి

నాకు కలిగిన ఒకానొక అనుభవమును గురించి అమ్మగారితో చెప్పితిని. అందుపై అమ్మగారిట్లు సెలవిచ్చిరి: "ఆహా! నా తల్లీ, ఇట్టి యనుభవ మెవరికైన ప్రతిదినము కలుగునా? నీవు చెప్పినది సర్వము నిజమె. అసత్యమేమియు లేదు. సర్వము శ్రీగురుదేవుడే. ఆయనయే ప్రకృతి. ఆయనయే పురుషుడు. ఆయనవలననే నీకు సర్వమును లభించును."

శిష్యురాలు: అమ్మా! నేనొకనాడు ఏకాగ్రచిత్తముతో జపము చేయుచుండగా చాలకాలము తెలియకుండగనే కడచిపోయెను. ఆ కారణమువలన మీరు నాకు చెప్పిన ఇతరసాధనల నేవియు చేయకయే నేను తొందరగా ఇంటిపనులను చూచుకొనవలసి వచ్చెను. నే నట్లు చేయుట దోషమా?

అమ్మగారు: కాదు, కాదు. అందులో దోషమేమియు లేదు.

శిష్యురాలు: అర్ధరాత్రి ధ్యానముచేయుచుండునపుడు ఒక విచిత్రమైన నాదము వినవచ్చుచుండునని యొకరు నాతో చెప్పిరి. సాధారణముగా తన కుడిప్రక్కనుండి ఈ నాదము వచ్చుచుండునట్లును, ఒక్కొక్కప్పుడు మనస్సు దిగువ స్థాయిలో ప్రవర్తించినప్పుడు ఎడమప్రక్కనుండికూడ వచ్చుచుండునట్లును అతని యనుభవము.

అమ్మగారు: (కొంత తడవు ఆలోచించి) నిజము, కుడిప్రక్కనుండియే ఆ నాదము వచ్చును. శరీరస్మృతి

యున్నప్పుడు మాత్రమే, ఎడమప్రక్కనుండి నాదము వచ్చును. కుండలినీశక్తి ఊర్ధ్వముఖమైనప్పుడు ఈ సంఘటనలు జరుగును. కుడిప్రక్కనుండి వచ్చునాదమే నిజమైనది. కొంత కాలమునకు మనస్సే గురువగును. ఏకాగ్రచిత్తముతో రెండు నిమిషములైనను భగవంతుని ప్రార్థించుటయును, ధ్యానించుటయును, చంచలమైన మనస్సుతో గంటలకొలది చేయు జపతపాదులకంటె చాల మేలు.

'శరీరస్మృతి' అన నేమో అడుగుటకు, అమ్మగారారోగ్యముగా లేనందున నాకు మనస్కరింపలేదు.

నేను సెలవుతీసికొని వెళ్లునప్పుడు అమ్మగారు వెంటనే తలగడపైనుండి తమ తలను పైకెత్తి "అమ్మాయీ! మంచిది! నేను తలను పైకెత్తి యున్నాను," అని చెప్పిరి. ఆచారము ప్రకారము పరుండియున్నవారికి నమస్కరింప కూడదు కనుక శ్రీ మాతృదేవి యిట్లు చేసిరి. నేను ప్రణామముచేసిన తరువాత "మరల రావలెను సుమా! సాయంకాలము కొంచెము త్వరగా రా. నీ యింటిపనులను కొంచెము వేగముగా ముగించి రాలేవా?" అని అమ్మగారు చెప్పి, నా క్షేమముకొరకు దుర్గపేరును ప్రార్థనగా నుచ్చరించుచు, వెళ్లుటకు నాకు సెలవిచ్చిరి. నేను వసారలోనికి వచ్చిన తరువాతకూడ దయార్ద్రస్వరముతో దుర్గపేరు నామె స్మరించుచుండగా వింటిని. ఎంత అపారమైనప్రేమ! మేమామెయొద్ద నున్నంతకాలము మా విచారములను, జీవిత కష్టములను పూర్తిగా మఱచిపోవుదుము.

* * *

అమ్మగారి వ్యాధి నయమగు సూచనలేవియు కనబడ లేదు. ఆమె శరీరము నానాటి కెక్కువగా నీరసించుచుండెను. ఒకనాటి మధ్యాహ్నమున నేనామెను సందర్శింప వెళ్లి నప్పుడు, సాయంకాల స్నానముచేయుట కామె సిద్ధపడుచు లేచుటకు నా సాయముగోరి, "నాకు చాల తఱచుగా జ్వరము వచ్చుచున్నది. శరీరముకూడ మిక్కిలి నీరసించుచున్నది," అని చెప్పిరి.

1920 సం॥ మార్చి 14-వ తేది.

సాయంకాలపు మంగళహారతి యైనది. అమ్మగారు జ్వరముతో పరుండిరి. రస్‌బిహారి మహారాజు శ్రీ మాతృదేవి చేతులను, వరదా బ్రహ్మచారి యామెపాదములను రాయు చుండిరి. ఆమెకు జ్వరమెంతయున్నదో యింకొకరు చూచు చుండిరి. అమ్మగారు కన్నులు మూసికొనియే పరుండిరి. నేనామెప్రక్కను నిలువబడి యుంటిని. "ఎవరక్కడ?" అని యొకసారి అమ్మగా రడిగిరి. రస్‌బిహారి మహారాజు మెల్లగా ప్రత్యుత్తర మిచ్చెను. జ్వరము 100·1 డిగ్రీలుండె నని వింటిని. సంవత్సరాది కనుక సుధీరాసోదరి నివేదితా పాఠశాలలోని బాలికలకు విందుచేయుచుండెను. అందువలన, శ్రీ మాతృదేవికి పరిచర్య చేయుచున్న సరళయను శిష్యు రాలు నివేదితా పాఠశాలకు వెళ్లెను. అక్కడనుండి సరళను తీసికొనిరమ్మని అమ్మగారు వరదా బ్రహ్మచారికి జెప్పిరి. ఆమెయే రాధు పసిబిడ్డకు అన్నము పెట్టవలసి యుండెను. బిడ్డకు అన్నము పెట్టువేళ యింకను కాలేదు. కాని బిడ్డ

డేడ్చుచుండుటచే రాధు వానికి అప్పుడే అన్నమును పెట్ట గోరెను. అమ్మగా రామెను వారింపప్రయత్నించిరి. అందుపై రాధుకు కోపమువచ్చి అమ్మగారిని తిట్టుటకు మొదలుపెట్టి, "నీవు చచ్చిన బాగుండును. నీ కాష్టమునకు నేనే నిప్పంటిం చెదను!" అని ఆవేశముతో పలికెను. ఈమాటలు మా కెంతో కష్టముగానుండెను. అమ్మగారెంతో జబ్బుగా నుండి నప్పుడు రాధు తిట్టినతిట్లివి. ఇంతతో ఆగక ఆమె యింకను ఎన్నియో కేకలువేయుచుండెను. ఇదియే రాధు సర్వసాధా రణ ప్రవర్తన. మూర్తీభవించిన సహనమని చెప్పదగిన శ్రీ మాతృదేవి, ఎల్లవేళలందు నిట్టి ప్రవర్తనను సహించు చుండెను కాని, యీసారిమాత్రము వ్యాధిప్రకోపమువలన అమ్మగారుకూడ విసుగుకొని, "ఔను; నేను పోయిన తరువాత నీదురవస్థలన్నినీవేగ్రహింతువు! ఎన్ని తన్నులు, ఎన్నిచీపురుకట్టదెబ్బలు నీకు ముందున్నవోకదా!" అని చెప్పిరి.

ఈ మాటలను విని రాధు మరింత ఆగ్రహాపరవశు రాలై యెక్కువగాతిట్ట నారంభించెను. కొంతతడవైతరువాత సరళవచ్చి యాకుఱ్ఱవానికి అన్నము పెట్టెను. ఆనాడు జరిగిన విషయములవలన నా మనస్సు మిక్కిలి విచారగ్రస్త మయ్యెను. అమ్మగారు నన్ను తమపాదములను రాయుమనిరి.

సరిగా ఆ సమయమున రాసబిహారి మహారాజు వచ్చి మంచమునకు దోమ' తెరను కట్టనుండెను. కనుక నేను సెలవు దీసికొంటిని. అమ్మగారు తుదిమాటగా "వెళ్లిరా"

అని చెప్పిరి. ఇదియే అమ్మగారు కడసారిగా దయచేసిన ఆజ్ఞ! ఆమె దివ్యవాణినుండి నేను వినిన చిట్టచివరిమాట!

ఆనాడు నేను కాళీఘట్టమునకు వెళ్లవలసి వచ్చెను. తరువాత, ఇంటిలో చాలమందికి జబ్బుగానుండుటవలనను, ఇతర కష్టములవలనను అమ్మగారిని చూచుటకై వెళ్లు నవకాశము నాకు కలుగలేదు. ఆమె ఆరోగ్యము విషయమై యెప్పటికప్పుడు నాకు వర్తమానము వచ్చుచుండెను. ఆనాటి కానాడామె వ్యాధి యెక్కువగు చుండెనని తెలియవచ్చెను. పిమ్మట, నే నతిశీఘ్రముగ నొకనాడామెను సందర్శించుటకై వెళ్లినప్పుడు, మా జీవితములలో పరమేశ్వరుడు మా కనుగ్రహించిన మహాభాగ్యమును కోల్పోవ నున్నారమని నా హృదయము చాల భయకంపితమయ్యెను. నేను నిరాశాపరవశను కాజాలనైతిని.

---

## (ద్వితీయ భాగము)*

జయరామ్‌బాటి.........1909-వ సంవత్సరము.

"అమ్మగారు మిమ్ము తీసికొనిరమ్మని ఒక మనుష్యుని పంపినారు," అని వరదామామ నాతో చెప్పెను. నేను లోపలికి వెళ్లితిని. శ్రీ మాతృదేవి తమ గది గుమ్మము నొద్ద నాకొరకు కనిపెట్టుకొని నిలువబడియుండిరి. నేను

* అమ్మగారి శిష్యులలో నొక సన్న్యాసి ఉల్లేఖించినది.

నమస్కారము చేసినప్పుడు, "మీదేయూరు?" అని అమ్మగారడిగిరి. నా స్వగ్రామమున్న జిల్లాపేరు చెప్పితిని.

అమ్మగారు : నీవిప్పుడు శ్రీగురుదేవుల ఉపదేశములను చదువుచున్నావని తలంతును.

ఈ మాటలకు నే నేమియు బదులు చెప్పలేదు. నన్నెంతకాలమునుండియో ఎరిగియుండినట్లు అమ్మగారు మాట్లాడిరి. ఆమె నన్నెంత వాత్సల్యముతో చూచిరో నేనింకను మఱచిపోలేదు.

అమ్మగారు : నీది కాయస్థకులమా?

శిష్యుడు : ఔను.

అమ్మగారు : మీరెంతమంది అన్నదమ్ములు?

శిష్యుడు : నలుగురము.

అమ్మగారు : కూర్చొని, కొంచెము ఫలాహారములను తీసికొనుము.

ఈమాటలు చెప్పి అమ్మగారు వసారాలో నేలమీద నొక చిన్న తివాచిని పరచి, క్రిందటిరాత్రి నైవేద్యము చేయబడిన కొన్ని పూరీలను, మధురభక్ష్యములను నాకిచ్చిరి. తారకేశ్వరమునుండి దారిపొడుగున నడచి, రాత్రికి జయరామ్‌బటికి వాయవ్యమూలనున్న దేశ్రాగ్రామమందు, మార్గమధ్యమున హరిపాల్ రయిలుస్టేషనునొద్ద నాతో కలసిన, యొక యువకుని ఇంటిలో నతని యతిథిగా ఆగితిని. అమ్మగారీ మాటలన్నియువిని, ఫలాహారము చేసినతరువాత, 'నీవిప్పుడు

స్నానము చేయవలదు. చాలదూరము నడచివచ్చితివి,' అని చెప్పి నాకు తాంబూలమిచ్చిరి.

తిరిగి మధ్యాహ్నపూజ యయినతరువాత అమ్మగారు నన్ను రమ్మని వర్తమానము పంపిరి. నైవేద్యమైనతరువాత తమగదికి చేరియున్న వసారాలో మొట్టమొదట నాకు తమ స్వహస్తములతో విస్తరివేసి అన్నమును వడ్డించి "బాగుగా భోజనము చేయుము. మోమోటముపడకుము," అని చెప్పిరి. భోజనమైనతరువాత నాకు తాంబూలమిచ్చిరి.

నేను మరల సాయంకాలము 3, 4 గంటలకు వెళ్లినప్పుడు, శ్రీ మాతృదేవి రొట్టెలకై గోధుమపిండిని పిసుకుచుండిరి. ఆమె పొయ్యిప్రక్కను కూర్చొనియుండిరి. నన్ను దయార్ద్రదృష్టితో జూచుచు 'నీ కేమికావలయును?' అని అమ్మగారడిగిరి.

శిష్యుడు : నేను మీతో ప్రసంగింపగోరుచున్నాను.

అమ్మగారు : దేనినిగురించి? అక్కడ కూర్చుండుము.

శిష్యుడు : (కూర్చొని) అమ్మా! శ్రీగురుదేవుడే సచ్చిదానంద పరబ్రహ్మమని కొందరందురు. మీ అభిప్రాయ మేమి?

అమ్మగారు : ఔను. నా కాయనయే సచ్చిదానంద పరబ్రహ్మము.

'నా కాయనయే' యని యామె చెప్పినప్పుడు నేనిట్లంటిని : "ప్రతిస్త్రీకిని భర్త సచ్చిదానంద పరబ్రహ్మమను విషయము నిజమే. ఆ అర్థములో నే నీప్రశ్న నడుగుటలేదు".

అమ్మగారు: ఔను. నాభర్తగనేకాకుండ, సామాన్యముగకూడ నాకాయన సచ్చిదానంద పరబ్రహ్మమే.

శ్రీరామకృష్ణుడు శాశ్వతుడైన భగవంతుడైనప్పుడు, జగజ్జననియగు పరాశక్తియే శ్రీమాతృదేవియై యుండవలయునని నేను అనుకొంటిని. రామునకు సీతవలె, కృష్ణునకు రాధవలె ఆమె శ్రీగురుదేవునకు దేవియై యుండవలెను. నా హృదయాంతరాళమున దేదీప్యమానముగ వెలుంగుచుండిన ఈ విశ్వాసముతోనే, శ్రీమాతృదేవికడకు వచ్చితిని.

శిష్యుడు: అట్లయినచో మీరొక సాధారణ స్త్రీవలె రొట్టెలు చేయుచున్నట్లు నాకెందుకు కనుపడుచున్నారు? ఇది మాయయని తలతును. నిజమేకదా?

అమ్మగారు: నిజమే. ఇది మాయ. లేనిచో నేనీ స్థితిలోని కేలరావలయును? కాని, భగవంతుడు మానవ వ్యక్తిగా విహరింప గోరుచుండును. శ్రీకృష్ణుడు గోప బాలుడుగను శ్రీరాముడు దశరథుని కుమారుడుగను పుట్టిరి.

శిష్యుడు: మీ కెప్పుడైన మీనిజస్వరూపము జ్ఞప్తికి వచ్చునా?

అమ్మగారు: ఔను. అప్పుడప్పుడు నాకారూపము జ్ఞప్తికి వచ్చుచుండును. అట్టిసమయములందు, "నేనిప్పుడేమిచేయుచున్నాను? ఇదియంతయు నెందుకు?" అని నాలోనే ననుకొనుచుందును. ఆవిధముగా నే ననుకొనునప్పుడు (తమ అరచేతితో అచ్చటి ఇండ్లను చూపుచు), ఈయిండ్లు,

బిడ్డలు నాజ్ఞప్తికివచ్చి, నా నిజస్వరూపమును మఱచిపోవు చుందును.

అమ్మగారిని నేను ప్రతిదినము వారిగదిలో చూచు చుంటిని. శ్రీదేవిగారు పరుపుపై బరుండి నాతో మాట్లాడు దురు. ఆమెప్రక్కనే, రాధు నిద్రపోవును. గదిలో నూనె దీపము వెలుగుచుండును. ఒక్కొక్కనాడు శ్రీ దేవిగారి పాద ములకు పరిచారిక తైలమును రాయుచుండెడిది.

ఒకనాడు ప్రసంగవశమున అమ్మగారిట్లు నాతో చెప్పిరి : "నాశిష్యులలో నెవరైనను నాతలపునకువచ్చి, ఆతనిని నేను చూడగోరునెడల, ఆ శిష్యుడిచ్చటకు రానైనవచ్చును, లేనిచో ఉత్తరమైనను వ్రాయును. ఏదోయొక భావమును మనస్సులో పెట్టుకొని నీవిచ్చటకు వచ్చియుండవలయును. బహుశః శ్రీ జగన్మాతను తలచుకొనుచున్నావు."

శిష్యుడు : జీవులందరికిని మీరే తల్లియా?

అమ్మగారు : ఔను.

శిష్యుడు : ఈ పశుపక్ష్యాదులకు కూడనా?

అమ్మగారు : ఔను, వీనికికూడను.

శిష్యుడు : అట్లైనచో, అవి యెందుకింత కష్టపడు చుండవలయును?

అమ్మగారు : ఈ జన్మలో వాని కీలనుభవము లుండ వలయును.

ఒకనాటి సాయంకాలమున శ్రీమాతృదేవికిని, నాకును ఈక్రింది సంభాషణ జరిగెను.

అమ్మగారు : మీరు నా స్వజనము కనుక నే యిక్కడకు వచ్చుచున్నారు.

శిష్యుడు : నేను మీ స్వజనములోనివాడనా?

అమ్మగారు : ఔను. అందువిషయమై సందేహ మేమున్నది? ఒకమనుష్యుడింకొకరి సొంతమైనయెడల యుగయుగములకును వారిసంబంధ మెన్నటికిని వీడిపోదు.

శిష్యుడు : మిమ్మందరును 'మీరు' అని సంబోధింతురు. నేనుమాత్ర మా మాట నుచ్చరింపలేను. నేను 'నీవు' అని సంబోధింతును.

అమ్మగారు : అదియే మంచిది, నిజము, ఇది నాతో నీకుగల చనవును సూచించును.

''మీరు మంత్రోపదేశము చేసినవారి బాధ్యతలను మీరే వహించియుండవలయును గదా; అట్టి సందర్భములో, ఏదైన కోర్కెను నెరవేర్పుడని మేము మిమ్మడిగినప్పుడు 'ఆ విషయమై శ్రీ గురుదేవునితో మాట్లాడెదను' అని మీరేల చెప్పుదురు? మా బాధ్యతను మీరే వహింపలేరా?'' అని నేను మా సంభాషణ సరళిలో అమ్మగారితో చెప్పితిని.

అమ్మగారు : నిజముగా నీ బాధ్యతను నేను వహించియున్నాను.

శిష్యుడు : ఓ తల్లీ, నాకు చిత్తశుద్ధియు భగవద్భక్తియు నుండునట్లు దయయుంచి ఆశీర్వదింపుడు. అమ్మా! మా బడిలో నాకొక సాధ్యాయుడున్నాడు. నా ప్రాణస్నేహితుడైన ఆ బాలునియందు నాకుగల ప్రేమలో నాల్గవవంతు

ప్రేమనైనను శ్రీరామకృష్ణులకు నేను కనుబరచగలుగు నెడల, కృతజ్ఞుడనై యుందును.

అమ్మగారు: అయ్యో! అది నిజమే! మంచిది నే నీ విషయమై శ్రీ గురుదేవునితో మాట్లాడెదను.

శిష్యుడు: శ్రీ గురుదేవునితో మాట్లాడెదమనిమాత్రమే మీరేల చెప్పెదరు? ఆయనకంటె మీరు వేరా? మీ ఆశీర్వాదములుమాత్రమే యున్నయెడల, ఈ కోరిక తప్పక సిద్ధించును.

అమ్మగారు: నాయనా! నా ఆశీస్సులవలన నీకు పరిపూర్ణజ్ఞానము కలుగునెడల, నా మనసార నిన్నాశీర్వదించుచున్నాను. ఇతరసాహాయ్యము లేకుండ, మాయాబంధములనుండి తప్పించుకొనుట కెవరికైన నెప్పటికైన సాధ్యమగునా? ఇందుకే శ్రీ గురుదేవుడు బహుకఠినతపస్సును చేసి, మానవకోటి విమోచనకై దానినెల్ల ధారవోసెను.

శిష్యుడు: శ్రీరామకృష్ణులను చూడకుండగనే ఎవరైన ఆయనను ప్రేమింపగలరా?

అమ్మగారు: ఔను, నీవుచెప్పినది నిజము. గాలివంటి బూటకపువ్యక్తికి ఎవరైన ప్రియస్నేహితులుగా నుండగలరా?

శిష్యుడు: శ్రీ గురుదేవుని దర్శనము నాకెన్నడు కలుగును?

అమ్మగారు: తప్పక నీ వాయనను చూచెదవు. సకాలమున శ్రీ గురుదేవుని దర్శనభాగ్యము నీకు కలుగును.

*  *  *

ఒకనాడు తమశయ్యపైని అమ్మగారు పరుండిరి. కామిని యను పరిచారిక, ఆమె మోకాలునకు మేహవాతపు నొప్పి పోవుటకై, ఏదో తైలమును రాయుచుండెను. ''శరీరము వేఱు, ఆత్మ వేఱు. ఆత్మ శరీరమంతట నిండి యుండును. అందుచేతనే నా కాలులోని బాధ నాకు తెలియు చున్నది. ఈ మోకాలులోనుండి నా మనస్సును నేను తీసి వేయునెడల అక్కడ నా కే బాధయు నుండదు,'' అని అమ్మ గారు నాతో చెప్పిరి.

మంత్రోపదేశ మవసర మే

మంత్రోపదేశము విషయమై ముచ్చటించుచు, ''అమ్మా! గురుముఖమున మంత్రోప దేశము నొందవలసిన అవసరమేమి? ఎవడైన నొకడు తన మంత్రము నుచ్చ రింప డనుకొనుడు. ఊరకే, 'అమ్మా! కాళీ!, అమ్మా! కాళీ' అని అతడు స్మరించుచున్నయెడల చాలదా?'' అని నేను అమ్మగారితో చెప్పితిని.

అమ్మగారు : మంత్రమువలన శరీరము పావనమగును. భగవన్మంత్ర ముచ్చరించుటవలన మానవుడు నిర్మలుడగును. ఒక కథ గలదు, వినుము. ఒకనాడు నారదుడు శ్రీ స్వామి వారిని సందర్శించుటకై వైకుంఠమునకువెళ్లి, వారితో చాల కాలము సంభాషించెను. అప్పటికి నారదుడు మంత్రోపదేశ మొందియుండలేదు. నారదుడు వైకుంఠమునుండి వెళ్లిన తరువాత ''ఆ స్థలమును ఆవుపేడతో పరిశుద్ధముచేయుడు'' అని స్వామివారు లక్ష్మీదేవి కానతిచ్చిరి. ''ఎందుకు స్వామీ?

నారదుడు మీ యుత్తమభక్తకోటిలోనివాడే! సందర్భమిట్లున్నను, మీ రేల ఈ రీతిని చెప్పుచున్నారు?'' అని లక్ష్మి అడిగెను. ''నారదున కింకను మంత్రోపదేశము కాలేదు. మంత్రోపదేశము లేనిదే, శరీరము పవిత్రము కాజాలదు,'' అని శ్రీ స్వామివారు బదులు చెప్పిరి.

ఆధ్యాత్మికాభివృద్ధి విషయమున మనస్సునకు గల ప్రాముఖ్యము

అధమము శరీరశుద్ధికొరకైనను గురుముఖమున మనము మంత్రోపదేశము నొందవలెను. మంత్రోపదేశము చేసిన తరువాత ''ఇప్పుడింక సర్వము నీ మనస్సుపైన నాధారపడియుండును,'' అని వైష్ణవాచార్యులు శిష్యునితో జెప్పెను. ''చెవిలో మానవగురువు మంత్ర ముచ్చరించునే కాని భగవంతుడే ఆత్మకు తేజస్సు నిచ్చును'' అని చెప్పుదురు. సర్వము మన మనస్సుపైననే ఆధారపడియున్నది. చిత్తశుద్ధిలేనిదే, మన కేమియు లభింపదు. సాధకునకు గురుకటాక్షమును, భగవత్కటాక్షమును, వైష్ణవకటాక్షమునుకూడ కలిగినను, ఒకని దయలేనిచో నతనికి దుఃఖము సంభవించును. మనస్సే ఆ యొకడు. సాధకునకు వానిమనస్సు సుముఖముగా నుండవలయును.

ప్రసంగ మింకను సాగించుచు, శ్రీ మాతృదేవి యిట్లు చెప్పిరి: ''శ్రీ గురుదేవుని నిర్యాణానంతరమున నేనుకూడ శరీరమును చాలింపదలచితిని. ఆయన నాయెదుట కనుపడి 'వలదు. నీ విచ్చట నుండవలయును. చేయవలసిన పను

లెన్నో కలవు' అని చెప్పిరి. తరువాత నేనిది నిజమని గ్రహించితిని. నేను చేయవలసిన పనులెన్నియో యుండెను. 'చీకటిలో గుమికూడి సంచరించు పురుగులవలె కలకత్తాలోని జనులు నివసించుచున్నారు. వారివిషయమై నీవు శ్రద్ధతీసికొని, వారి యోగక్షేమమును కనిపెట్టుచుండవలయును' అని శ్రీ గురుమహారాజుగారు చెప్పుచుండువారు. భక్తుల హృదయములలో సూక్ష్మశరీరముతో మూడువందల యేండ్లవరకు తాము జీవించియుందుమని, శ్వేతజాతులవారిలో తమకు చాలమంది భక్తులుగా నుందురనికూడ ఆయన చెప్పిరి.

"శ్రీ గురుదేవుని నిర్యాణమైనతరువాత నేను సన్నని యెఱ్ఱంచుల* చీరను కట్టుకొని, నా మణికట్టుపైన బంగారు గాజులను తొడుగుకొనుచుంటిని. అందుచే జనులు నన్నొక వేళ ఆక్షేపింతురేమోయని మొట్టమొదట చాల భయపడితిని. కాని, క్రమక్రమముగా నా కాభయము పోయెను. ఒకనాడు శ్రీ గురుదేవుడు నాకు కనుపడి తనకు పులగమును చేసియిమ్మని యడిగిరి. ఆ పదార్థమును నేను సిద్ధముచేసి దేవాలయములో, శ్రీ రామకృష్ణుల కుటుంబమునకు కుల దేవతయగు రఘువీరున కర్పించి మానసికముగా నేను దానిని శ్రీ గురుదేవున కారగింపుచేసితిని."...

తమ్ముగురించి ముచ్చటించుచు "బలరాంబాబు 'మహాతపస్విని, మూర్తీభవించిన క్షమ' యని నన్నుగురించి

---

* మతాదేశము ప్రకారము హిందూ వితంతువులు అంచుకూడలేని తెల్లని-చీరను కట్టుకొని, ఆభరణముల నన్నిటిని తీసివేయవలయును.

చెప్పువాడు. దయలేనివానిని మానవుడని మనము చెప్ప వచ్చునా? కేవల మతడు పశువు. ఒక్కొకప్పుడు దయార్ద్రహృదయనై నన్ను నేను మఱచిపోవుచుందును. అప్పుడు నేనెవరినో నాకు జ్ఞప్తియుండదు,'' అని అమ్మగారు చెప్పిరి.

''నీతో నే నెక్కువ చనవుగా మెలగుచున్నాను. కలకత్తాలో నా నివాసమునకువచ్చి, నాయొద్ద నుండుము,'' అని శ్రీ మాతృదేవి కడసారిగా నా కానతిచ్చిరి.

ఆ కాలమున నేను నా బంధువులతో సంసారములో నుంటిని. కాని, సన్న్యాసాశ్రమము తీసికొనవలెనని నాకు ప్రబలమైనకోరిక యుండెను. ''బహుశః ముందుముందు శ్రీ మాతృదేవి కృపవలన నేను సన్న్యాసినై, అమ్మగారి యొద్ద నివసింపవచ్చును,'' అని నాలో నే ననుకొంటిని.

నేను జయరాంబటిలో నుండినప్పుడు, రాధు తల్లికి పిచ్చియెత్తి యామె రాధు నగలను తన తండ్రియింటికి తీసికొనిపోయెను. ఆ నగల నామెతండ్రి, యామెయొద్దనుండి లాగుకొనెను. ఇందువలన నామెమనస్సు మఱింత వికలమై, జయరాంబటికి తిరిగివచ్చి ఆ నగలకొర కామె సింహవాహినీ దేవాలయములో ఏడ్చుచుండెను. సాయంకాలము కనుచీకటి వేళ నేను శ్రీ మాతృదేవితో, వారిగదిలో మాట్లాడుచుండగా, హఠాత్తుగా ''నాయనా! నేనిక వెళ్ళవలెను. నేనుతప్ప నా పిచ్చివదినెకు తనవారని చెప్పుకొనతగినవారు వేఱెవ్వరునులేరు. ఆమె యిప్పుడు నగలకొరకు అమ్మవారి యెదుట ఏడ్చుచున్నది'' అని చెప్పి అమ్మగారు గదిలోనుండి

వెడలిపోయిరి. నాకుమాత్రము మనుష్యులెవరుకాని యేడ్చు చుండినట్లు వినబడలేదు; అంతదూరమునుండి వినబడుటకు కూడ వీలులేదు. కాని ఆ కంఠస్వరము అమ్మగారు గుర్తిం చిరి. రాధు తల్లితోకూడ, ఆమె తిరిగివచ్చెను. "ఓవదినా! నా నగలను నీవే కనుపడనియ్యక, నాకు లేకుండజేసితివి," అని రాధుతల్లి చెప్పగా "ఈ నగలు నావే యైనయెడల, నేను వానిని పెంటవలె వెంటనే పారవేసియుందును," అని అమ్మగారు ప్రత్యుత్తరమిచ్చిరి. రాధుతల్లినిగురించి ప్రసం గించుచు "ఆమె నాపిచ్చి చెలికత్తెయని గిరీశుడు చెప్పు చుండువాడు," అని నవ్వుచు శ్రీ మాతృదేవి ఛలోక్తిగా నాతో బలికిరి.

మొట్టమొదట శ్రీ మాతృదేవిని 'అమ్మా' యని సంబోధించుటకు నేను సందేహించుచుండువాడను. నా సొంత తల్లి నా చిన్నతనమందే చనిపోయెను. ఒకనాటియుదయ మున, శ్రీ మాతృదేవి నన్నొక పనిమీద ఒకరియొద్దకు పంపిరి. నేను బయలుదేరబోవుచుండగా "ఆయనతో నేమని చెప్పెదవు?" అని అమ్మగారు నన్నడిగిరి. "ఏమనియా? 'ఆమె మీతో నిట్లు నన్ను చెప్పుమన్నారు...' అని నే నాయనతో చెప్పెదను," అని బదులు చెప్పితిని. "నాయనా! అట్లుకాదు. 'అమ్మ మీతో నిట్లు చెప్పుమని పలికెను;' అని ఆయనతో నీవు చెప్పవలెను," అని శ్రీ మాతృదేవి చెప్పిరి. 'అమ్మ' యనుమాటను శ్రీ దేవివారు నొక్కి చెప్పిరి.

ఒకనాటియుదయమున శ్రీ మాతృదేవి గదికి చేరి యున్న వసారాలో, అమ్మగారికిని చాలమంది భక్తులకును

శ్రీ రామకృష్ణుని జీవితమును గురించిన 'శ్రీ రామకృష్ణపుధి' యను పద్యకావ్యమును బిగ్గరగా చదివి వినిపించుచుంటిని. శ్రీ రామకృష్ణుల వివాహాసందర్భమున గ్రంథకర్త అమ్మ గారిని మిక్కిలి స్తుతించుచు, ఆమెను జగన్మాతగావర్ణించెను. ఆ ఘట్టమును నేను చదువుచుండినప్పుడు వసారాలోనుండి అమ్మగారు బయటకు వెడలిపోయిరి. ఈ గ్రంథమును చదువు టకు కొలది నిమిషములుముందు, ఉద్బోధనపత్రికలో ప్రక టింపబడిన 'మ.' రచించిన శ్రీ రామకృష్ణవచనామృత మందలి యొకభాగమును చదివితిని. అమ్మగారుతప్ప వేరెవ్వ రును అప్పుడు లేరు. నేనీ క్రిందిఘట్టమును చదువుచుంటిని :

గిరీశుడు : నా కొక కోరిక యున్నది.

గురుదేవుడు : ఏమది ?

గిరీశుడు : ఏ విధమైన ఫలాపేక్ష లేకుండ భగవంతుని ప్రేమింప గోరెదను.

గురుదేవుడు : అట్టి ప్రేమ యీశ్వరకోటికిమాత్రమే సాధ్య మగును. సామాన్యమనుష్యుల కది లభింపజాలదు.

"ఈశ్వరకోటులని శ్రీ గురుదేవుడు చెప్పెను. ఆ మాట కర్థమేమి ?" అని శ్రీ మాతృదేవి నడిగితిని.

దివ్యప్రేమ-ఈశ్వరకోట్లు

అమ్మగారు : ఈశ్వరకోటులు భగవంతునియందే పూర్ణకామసిద్ధిని గాంతురు. కనుక వారికైహికవాంఛ లేవియు నుం డవు. ఏవిధమైన ఫలాపేక్షలేని దివ్యప్రేమ, ఆశ యేమాత్ర మున్నను నెవరికిని సాధ్యముకాదు.

శిష్యుడు : అమ్మా, మీ సొంతసోదరులీ ఈశ్వరకోటు లకు సమానులా ?

అమ్మగారి సొంతతమ్ములుగా జన్మించినారు కనుక వారికి శ్రీ రామకృష్ణుని సన్న్యాసశిష్యులకుగల మాహాత్మ్యమే యుండి యుండవలయునని యనుకొని, నే నడిగిన యీ ప్రశ్నకు "ఏమి పోలిక ! నాతమ్ముడుగా నున్నంతమాత్రమున నెవరికైననేమి వచ్చును ? శ్రీ గురుదేవునకు ఆప్త శిష్యుడుగా నుండుస్థితియే వేఱు !" అని సూచించుచున్నట్లు తమ నిరసనను మాత్రము వెల్లడించి అమ్మగారూరకొనిరి.

ఒకనాటియుదయమున శ్రీ మాతృదేవి వడ్లుదంపు పనికి సాయపడుచుండిరి. ప్రాయికముగా నామెకిది నిత్య కృత్యము. "అమ్మా ! మీరేల ఇంతకష్టపడి పనిచేయు చున్నారు ?" అని నే నడిగితిని. "నాయనా ! ఆదర్శప్రాయ ముగా నా జీవితముండుటకై, నేను అవసరమైన దానికంటె ఎక్కువపనినే చేయుచున్నాను," అని అమ్మగారు బదులు చెప్పిరి.

ఒక నాటిరాత్రి శ్రీ మాతృదేవి ఇంటిలో నెల్లరును నిద్రపోవుచుండగా ఆమె మేనకోడలగు నళిని భర్త, తన ఇంటికి నళినిని తీసికొనిపోవుటకై హఠాత్తుగా నొక ఎద్దు బండిలోవచ్చి దిగెను. నళిని తన అత్తవారింటినుండి తిరిగి వచ్చినది. ఆమె మరల నక్కడకు వెళ్లుటకిష్టపడలేదు. తన భర్త యుద్దేశ్యమునువిని, నళిని తనగదిలోనికిపోయి తలుపు గడియవేసికొని, తనతోకూడ తిరిగి వచ్చుటకు తనభర్త

తన్ను బలవంతపెట్టినయెడల తానాత్మహత్య చేసికొందునని బెదరించెను. కాని యామె తన భర్తతోకూడ తిరిగి వెళ్ల నక్కరలేదని శ్రీ మాతృదేవి యామెకు అభయమిచ్చి, గదిని తెరపించెను. ఆ రాత్రియంతయు కుటుంబములో అలజడికలిగి, అమ్మగారు నళిని గది వసారాలో తెల్లవారు వరకును కూర్చుండిరి. సూర్యోదయమగు చుండునపుడు దీప మార్పివేసి "గంగా, గీతా, గాయత్రీ, భాగవత్, భక్త, భగవాన్, రామకృష్ణా!" అని తమలోతాము స్మరించిరి.

అమ్మగారొకనాడు నన్నొక వృద్ధసేవకునితోకూడ పగ్లి (పిచ్చివదినె)గారి తండ్రికడకు, ఆయనను జయరామ్ బాటికి రమ్మని, లేకున్న నగలను తిరిగి ఇచ్చివేయుమని ప్రోత్సాహపరచుటకై పంపిరి. ఎంతో నచ్చచెప్పినమీదట, నగలను తీసికొని రాకుండ ఆయన మాత్రము మాతో వచ్చెను. నగలను తిరిగి ఇచ్చివేసి ఈ విషయమై పగ్లికి మనోవేదన లేకుండ చేయుడని అమ్మగా రాయనను ఎంత ప్రార్థించినను దురాశాపరుడైన యా బ్రాహ్మణుడా మాట లను పెడచెవిని బెట్టెను.

శివరాత్రికి ముందటిదినమే నేనింటికి తిరిగి వచ్చుటకు నిశ్చయించుకొంటిని. శివరాత్రియైన రెండునాళ్ల తరువాత బేలూరు మఠములో జరుగు శ్రీ రామకృష్ణుల జన్మదిన మహోత్సవమును చూడగోరి, నేనిట్లు చేయదలంచితిని. అమ్మ గారితో నే నీ విషయమై చెప్పినప్పుడు మొట్టమొదట కామార్పుకూరునకు వెళ్లుమని యామె నాకానతిచ్చిరి. శ్రీ

మాతృదేవిని నేనొంటిగా వెళ్లిచూడవలయునను ఆత్రతలో నా గొడుగునుగాని, కట్టుకొనుటకు మారుబట్టనుగాని తీసికొని వచ్చుటకు మఱచిపోయితిని. అమ్మగారి కోరికపైని శ్రీ గురుదేవుని జన్మప్రదేశమును దర్శించుటకు సమ్మతించితిని. ఆమె నా కొక క్రొత్తబట్టను కట్టుకొనుటకిచ్చి, దానిని నాతోకూడ తీసికొని పొమ్మనిరి.

అమ్మగారు : నీయొద్దనేమైన పైకమున్నదా? బండి కిరాయికిగాను నీకు కొంతపైకము కావలసియుండును. నా యొద్ద పైకమును తీసికొనుము.

శిష్యుడు : నాయొద్ద పైకమున్నది. మీ దగ్గరనుండి నేను పైకమును తీసికొన నక్కఱలేదు.

అమ్మగారు : నీ వింటికి వెళ్లినతరువాత, నాకు త్తరము వ్రాయుము. అయ్యో! నా పుత్రునకు బాగుగా అన్నము పెట్టలేకపోతిని! మంచిపదార్థమొకటికూడ చేయలేదు. ఎందుచేతననగా, ఆ సమయమున ఇంటిలో నళినిని గురించియు, పల్గిని గురించియు పెద్దగొడవజరిగెను.

అమ్మగారికి నేను సాష్టాంగప్రణామముచేసి, కన్నుల నీరుపెట్టుకొని బయలుదేరితిని. శ్రీ మాతృదేవి మాతోకూడ కొంతదూరమువరకువచ్చి, మేము కనుబడునంతవరకు మా వైపునకు చూచుచు నిలువబడిరి. నేను కామార్పుకూరుకు వెళ్లువరకును భక్తి పారవశ్యమున నేడ్చుచునే యుంటిని.

కామార్పుకూరుకు వెళ్లినతరువాత, శ్రీమాతృదేవి నివసించుచుండిన గదిని నాకు కనుబరచిరి. అచ్చటనున్న

అమ్మగారి పటమునుచూచి, నేనామెను మరలచూచుటకు మునుపటికంటెకూడ ఎక్కువగా ఆత్రపడజొచ్చితిని. ఆ మరునాడు 'మ.' * యను ప్రబోధబాబును జయరాంబటికి పోవుచు, కొలదిగంటలవరకు కమార్పకూరులో ఆగిరి. ఆసాయంకాలమున, అమ్మగారి శిష్యుడగు లలితబాబు ఇజారును, మోకాళ్లక్రిందకువచ్చు పొడవైన కోటును తొడుగుకొని, తలపాగపెట్టుకొని అక్కడకు వచ్చెను. నేనొంటిగా కలకత్తాకు వెళ్లుట కష్టముగానుండును గనుక, లలితబాబు జయరాంబటికి వెళ్లి తిరిగివచ్చినతరువాత నేనాయనతో గలిసి కలకత్తాకు తిరిగిపోవుట మంచిదియని కొంతమంది భక్తులు చెప్పిరి. అట్లే నే నాయనతోకూడ జయరాంబటికి మరియొకసారివెళ్లి, "ఇక్కడ మరల సిద్ధమైనాను," అని అమ్మగారితో చెప్పితిని. అమ్మగారు చాలసంతోషించి "చాల బాగున్నది. నీవు లలితునితో కలకత్తాకు వెళ్లవచ్చును," అని చెప్పిరి.

శివరాత్రి పండుగయైనతర్వాత భక్తులందరును భోజనమునకు గూర్చుండిరి. మొట్టమొదట వారికి విస్తళ్లలో ప్రసాదమును వడ్డించిరి. అదియేమని నేనడుగగా, శ్రీ మాతృదేవి ప్రసాదమని వారు చెప్పిరి. నేనుకూడ ఆప్రసాదమును భుజించితిని. తరువాత అమ్మగారితో, వారందరు మీ ప్రసాదమును సంతుష్టిగా భుజించిరి, కాని మీరుమాత్రము నాకెన్నడును దాని నీయలేదు," అని చెప్పితిని. "నాయనా! నీ వెన్నడును ఆ ప్రసాదమడిగియుండలేదు. అడుగనిదే, దాని

---

* శ్రీరామకృష్ణవచనామృత గ్రంథకర్త, శ్రీమహేంద్రనాథగుప

నెట్లు తీసికొనుమని చెప్పగలను?'' అని అమ్మగారు బదులు చెప్పిరి. ఎంత నమ్రత!

మరునాడు, రాధు తాతగారియొద్దనుండి ఆమె నగలను తీసికొనివచ్చుటకు లలితబాబును సవారీలో పంపిరి. లలితబాబు తానొక ప్రభుత్వోద్యోగినని చెప్పుకొనుచు, కలకత్తాలోని యొక గొప్పపోలీసు ఉద్యోగస్థుడు వ్రాసినట్లు కనుపడు నొక యుత్తరమునుకూడ తనతో తీసికొనివెళ్లెను. యువకుడైన లలితబాబు, వృద్ధబ్రాహ్మణుడగు రాధు తాతగారి నొకవేళ తిట్టి అవమానించునేమో యనుభయముచే శ్రీ మాతృదేవి 'మ.'నుకూడ నతనితో బంపిరి. కాని, లలితబాబు మరునాటి మధ్యాహ్నమున నగలతోకూడ రాధు తాతను జయరాంబటికి తీసికొని రాగలిగెను. ఈలోపున రాత్రి ఇంచుమించుగా రెండుగంటలవేళ, అమ్మగారికి నిద్రపట్ట లేదని మాకు తెలియవచ్చెను. 'మ.'యును, నేనును లోపలి గదులలోనికి వెళ్ళితిమి. మిగిలిన వారందరును మందుల కొరకు వెదకుచుండగా, బాధయేమని అమ్మగారి నడిగితిని. అందుపైనామె ''నగలను తీసికొనివచ్చుటకు వారువెళ్లిన తరువాత, పాప మావృద్ధబ్రాహ్మణునకు వారేమి అవమానము చేసెదరోయను చింత నన్ను బాధింప మొదలు పెట్టెను. అందుచేతనే నాకీ ఆయాసము,'' అని చెప్పిరి. ఈ చిక్కులన్నిటికిని కారణభూతుడైన యా బ్రాహ్మణుని యెడల అమ్మగారికిగల దయనుచూచి, నేనాశ్చర్యపడితిని.

మరునాటి మధ్యాహ్నమున నేను కలకత్తాకువెళ్లు వారితో ప్రయాణమైతిని. నావిషయమై ''ఇతడు భగవంతు

నకు బహు ప్రియమైనభక్తుడు. మీరితనిని మీతోకూడ తీసికొని వెళ్లుడు,'' అని అమ్మగారు లలితబాబుతో చెప్పిరి. మేమందరమును అమ్మగారికి ప్రణామము చేసితిమి. ఆమె కనుల నీరు పెట్టుకొని మాతోకూడ ఇంటి వెలుపలి గుమ్మము వరకును ఏడ్చుచునే వచ్చిరి. కలకత్తాకు పోవుదారిలో విష్ణుపూర్ అను గ్రామమున, 'మ.' యును ప్రబోధ్ బాబును మరి కొందరును మృణ్మయి యను పేరుగల ఆ యూరి అమ్మవారి విగ్రహమును చూచుటకు వెళ్లిరి. కాని లలితబాబును నేనును అదివరకే రైలెక్కితిమి. 'మ.' మమ్ముకూడ వచ్చి యా విగ్రహమును చూడుడని కోరుటకు ప్రబోధ్ బాబును పంపెను. కాని చిన్మయిని (సచేతనమైన శ్రీ శ్రీ శారదా దేవిని) చూచిన కన్నులతో మృణ్మయిని (మట్టితో చేయ బడినదానిని) చూచుటకు మే మిష్టపడలేదు. నేను బేలూరు మఠమునకువచ్చి, శ్రీ రామకృష్ణవర్ధంత్యుత్సవమును చూచినతరువాత తిరిగియింటికి చేరుకొంటిని.

ఉద్బోధన పత్రికాకార్యాలయము కలకత్తా : 1909 సం॥

శీతకాలములో నేను శ్రీ మాతృదేవిని కలకత్తాలో బలరామ్‌బోసుగారి యింటిలో చూచితిని. అమ్మగారిని తరువాతసారి నేను సందర్శింప వెళ్లునప్పటికే, యామె తమ కొఱకు నూతనముగా కట్టిన ఇంటిలోనికి, అనగా ఉద్బోధన పత్రికా కార్యాలయములోనికి మారిరి. ఆ యింటిలోపలికి నేను వెళ్లినప్పుడు, డాక్టర్ కంజీలాల్ వార్తాపత్రికను చదువుచు కూర్చుండియుండెను. అమ్మగారికి ఆటలమ్మ వచ్చెను.

ఇంకను పూర్తిగా నయముకాలేదు. "రెండువారములైన తరువాత మీ రామెను చూడవచ్చును," అని యాయన నాకు బదులుచెప్పెను. అమ్మగారు జబ్బుపడిన సంగతియే నాకు తెలియలేదు. "రేపురా, ఆమెను చూచుటకుపిలగుదును. నీ విచ్చుటనే ప్రసాదమునుకూడ తీసికొనవలయును," అని శారదానందస్వాములవారు నాతో చెప్పిరి. మరునాడు నేను వచ్చినప్పుడు నాకు శ్రీ మాతృదేవి పొంగుమచ్చలను చూపిరి. అవి చాలవరకు పోయినవి. అమ్మగారి ఆశీస్సుల వలనను శారదానందస్వాములవారు చేసిన యేర్పాటువలనను నేను బేలూరుమఠములో నివసించుచుంటిని. ఈ విషయము తెలిసినప్పుడు, "బాగుబాగు! సన్న్యాసజీవిత సౌందర్య మహిమ కితడు పూర్తిగా వశుడయ్యెను. బేలూరు మఠము లోనే యుండుము. శ్రీ గురుదేవునియందు నీకు ప్రేమ కలుగును గాక! నా ఆశీస్సులు నీ కొసంగుచున్నాను," అని అమ్మగారు నాతో జెప్పిరి.

బేలూరుమఠమునుండి శ్రీ మాతృదేవికి నే నప్పుడప్పుడు పాలనుతీసికొని వచ్చుచుండెడువాడను. ఇందువలన నాకు అమ్మగారి దర్శనభాగ్యముకూడ లభించుచుండెను. ఒక నాడు నేను పాలుతీసికొని వచ్చినప్పుడు, అమ్మగారు తమల పాకుకిల్లీలు కట్టుచుండిరి. ఆమె మేనకోడలు నళిని యామెకు సాయము చేయుచుండెను. నన్ను చూచి, నళిని గదిలోనుండి బయటకు వెళ్లబోయెను. "వెళ్లవలదు. ఇతడు నా కుమారుడు," అని మేనకోడలను వారించి, నన్ను చూచి, "ఇక్కడ, కూర్చుండుము" అని చెప్పిరి. ప్రసంగవశమున,

తమ యింకొక మేనకోడలగు 'మకు' అత్తింటి బంధువులను గురించి ముచ్చటించుచు "వారి విషయమై నేను ప్రత్యేక శ్రద్ధతీసికొనవలయును; లేనిచో వారు కోపగించుకొని బుస కొట్టుదురు. కాని, మీరు నా పిల్లలు. నేను మీకేమి చేసినను, దానితోనే తృప్తిపడెదరు. ఎప్పుడైన మీకు నేను మర్యాద కనుబరచనిచో మీరేమియు అనుకొనరు. కాని, ఆ బంధువులుమాత్రము బహుశ్రేష్ఠమైన వస్తువులెల్ల నేను వారికీయనిచో, వారికి తగినమర్యాదలు చేయుటలో ఎంత స్వల్పలోపమైనను చేసినచో, మిక్కిలి ధుమధుమలాడుదురు," అని అమ్మగారు చెప్పిరి. పిమ్మట "అమ్మా, చిత్తశుద్ధియు, భగవంతునికొఱకు ఆత్రతయు మనుజుల కెట్లు కలుగును?" అని నామె నడిగితిని.

అమ్మగారు : ఓ! నీ కివి తప్పక కలుగును! శ్రీగురుదేవుని శరణుజొచ్చిన నీకు సర్వము లభించును. ఆయనను హృదయపూర్వకముగ ప్రార్థింపుము.

శిష్యుడు : ప్రార్థించుటకు నాకు శక్తిలేదు. దయయుంచి నా కొఱకు మీరే ప్రార్థింపుడు.

అమ్మగారు : నీకు చిత్తశుద్ధి ననుగ్రహించుటకు శ్రీరామకృష్ణులను నే నెల్లప్పుడును ప్రార్థించుచునే యున్నాను.

శిష్యుడు : ఔను తల్లీ! నాకొఱకు మీరు ప్రార్థించిన యెడల, నాకు సర్వమును లభించును.

కొలది నెలలయిన తరువాత నన్ను జయరాంబాటికి సమీపమునగల ఘాటాల్ అను గ్రామమునకు వరదలవలన

నష్టపడిన జనులకు సాయముచేయుటకై పంపిరి. నేను మూన్నాళ్లు సెలవుతీసికొని, జగద్ధాత్రీ పూజాసమయమునకు జయరాంబాటిలో శ్రీ మాతృదేవిని సందర్శించితిని. అతులుడు నాతోకూడ నుండెను. అమ్మగారిని చూచుటకిదియే అతనికి మొదటిసారి. మేము జయరాంబాటికి కామార్పుకూరు మీదుగాపోయి అమ్మగారియింటికి వెళ్లినతోడనే, ఆమె పరిచారకుడగు ఆశు మహారాజు "మీరువచ్చుట చాల మంచిదైనది. కొంతకాలమునుండి భక్తులెవరినికూడ చూడక పోవుటచే, అమ్మగారు విచారముగ నున్నారు," అని చెప్పెను. శ్రీ మాతృదేవి మమ్ము భోజనమునకుండుడని చెప్పి మాకు సంతృప్తిగా అన్నముపెట్టిరి. ఆ మరునాటియుదయమున మేము శీఘ్రముగా ఘాటాల్ గ్రామమునకు తిరిగి వెళ్లవలసి వచ్చెను. అమ్మగారియొద్ద సెలవుదీసికొని నప్పుడు "నేను వెళ్లి మరల వచ్చెదను," అని నేనామెతో చెప్పితిని. పాఠశాలలోని బాలునివలె, "దయయుంచి నన్ను జ్ఞప్తి యందుంచుకొనుడు" అని అతులుడు చెప్పెను.

ఘాటాల్‌లో పని పూర్తియైనతరువాత నేను జయరాంబాటికి మరల వచ్చితిని. అప్పుడు శీతకాలము; సాయంకాలమున శ్రీ మాతృదేవి యింటికి, నేను వెళ్లినప్పుడు, అమ్మగారు వసారాలో కూర్చొని తమకాలికి మందురాచు కొనుచుండిరి. అప్పటి కింకను మోకాళ్లలో మేహవాతపు నొప్పులతో బాధపడుచుండిరి.

శిష్యుడు : ఏమి మందిది ?

అమ్మగారు : ఈ ఆకును ఎవరో చెప్పిరి. నీవీ దిన మంతయు పస్తుపడియున్నావా ?

శిష్యుడు : లేదు. దారిలోమాత్రము నే నాహార మేమియు తీసికొనలేదు.

అమ్మగారు : తినుట కేమైన నీవేల కొనుక్కొనలేదు? దారిలో అంగడు లున్నవే.

నా యొద్ద ఒక రూపాయమాత్రమే యుండెను. దానిని బేలూరుమఠములో సమర్పింపవలెనని నిలువచేసి యుంచితిని. కాని, అమ్మగారి కీ విషయమునుమాత్రము నేను తెలుపలేదు. ఆమె వేడివేడి అన్నమును నాకుపెట్టిరి. సంతృప్తిగా నేను భోజనముచేసిన తరువాత అమ్మగారు తాము ప్రతిదినము వాడుకొనుకంబళీని నాకిచ్చి దానిని రాత్రి కప్పు కొనుమనిరి. నా సోదరులలో నొకరి యొద్దనుండి అమ్మగారికి మరునా డొకయుత్తరమువచ్చెను. దానిలో చక్కని శైలిలో, సద్భావములతో తిరిగి ఇంటికి వచ్చునట్లు నన్ను ప్రోత్సహింపు డని అమ్మగారిని నా సోదరుడు క్లుప్తముగా కోరియుండెను. ఆ యుత్తరమునుగురించి "ఆహా! ఎంతచక్కనియుత్తరము," అని ప్రశంసించి, నన్ను సంబోధించి "నీవు తిరిగి ఇంటికెందుకు వెళ్లవు ? సంసారములోనేయుండి, ధనమార్జించి కుటుంబమును పోషింపుము." అని శ్రీమాతృదేవి నన్ను శోధించుటకై చెప్పిరి. "అమ్మా ! దయయుంచి మీ రా విధమున చెప్ప వలదు," అని చెప్పి నే నేడువ నారంభించితిని. అమ్మగారు పిమ్మట బహు ప్రేమతో ఇట్లు చెప్పిరి : "నాయనా! ఏడు

వకుము! మానవరూపమునుదాల్చిన దేవతవేనీవు. భగవంతునికొరకు సర్వము నెవరు త్యాగము చేయగలరు? భగవంతుని శరణుజొచ్చిన వారి విషయమున విధించిన

త్యాగమును–పరమార్థ సిద్ధియును

యాజ్ఞలనే, విధి మాపుచేయును. భగవత్సాక్షాత్కారమైన మానవు లెట్లుందురు? వారికి తలపై కొమ్ములు మొలుచునా? అట్టి దేదియు జరుగదు. అట్టివారికి నిత్యానిత్యవివేచనాశక్తి వికసించి, అపరోక్షజ్ఞానముకలిగి, వారు జననమరణముల కతీతులగుదురు. పరతత్త్వానుభవము కలవారే భగవంతుని తెలిసికొనగలరు. మరియొకవిధమున నెవరైన భగవంతుని చూచిన వారున్నారా? అఖండ సచ్చిదానంద తన్మయత లేనిదే భగవంతు డెవరితోనైన సంభాషించియున్నాడా? అట్టి మహోన్నతస్థితిలోమాత్రమే భగవంతుని సందర్శించి ఆయనతో మాట్లాడి సన్నిహిత సంబంధ మేర్పఱచుకొనుటకు మానవులకు వీలగును.

శిష్యుడు: అమ్మా! కాదు, కాదు! దీనికంటెను వేఱైన స్థితికలదు. కొందరు భగవంతుని ముఖాముఖముగ జూడగలరు.

అమ్మగారు: అట్టి యనుభవము నరేంద్రునకు (వివేకానందస్వామికి) ఒక్కనికిమాత్రమే కలిగెను. నరేంద్రుని తరణోపాయ రహస్యమును శ్రీగురుదేవుడు తనచేతిలోనే యుంచుకొనెను. పారమార్థిక జీవితమనిన శ్రీగురుదేవుని ప్రార్థించుటకంటె, ఆయన దివ్యనామస్మరణము చేయుటకంటె, ఆయఖండజ్ఞానానంద తేజోమయమూర్తిని ధ్యానిం

చుటకంటె వేఱేమైన ఏమున్నది? ఎప్పటికిని ఆయన మన సొంతమే.

శిష్యుడు : అమ్మా! శ్రీ రామకృష్ణులు నా సొంతమను సద్విషయమొకటియే నాకనుభవైక వేద్యమౌనట్లు కటాక్షింపుడు!

అమ్మగారు : నేను దానినితిరిగి చెప్పవలయునా? (ఉత్కంఠగా) నీకిది తప్పక అనుభవైక వేద్యమగును. ముమ్మాటికి నిజము!

* * * *

భగవత్సాక్షాత్కారము

మరునాటి సాయంకాలమున అమ్మగారితో నే నామె గదిలో మాట్లాడుచుంటిని. ఆమె పరుపుపై బరుండిరి. సంభాషణ వేదాంతముపైకి పోయెను. "నామరూపములు తప్ప ఈ ప్రపంచములో వేఱేమియు లేదు. జడపదార్థమున్నదను విషయము ఋజువుచేయుటకు వీలులేనిది. కనుక, భగవంతుడు మున్నగున వేవియులేవను విషయమే చివరకు తేలు సారాంశము," అని అమ్మగారితో చెప్పితిని.

శ్రీగురుదేవుడు, శ్రీమాతృదేవి మున్నగువిషయములు కూడ భ్రమలే యని నాయూహ. అమ్మగారు నా భావమును వెంటనే గ్రహించి, "అమ్మా! శ్రీగురుదేవుని పాదపద్మములు వాస్తవముగా లేవని చెప్ప జూచు జ్ఞానము, అజ్ఞానమే కాని వేఱేమియు కాదు. 'గురుదేవ్రుడు లేడని ఋజువుచేయు జ్ఞానమునకు ప్రమాణాధికారమేమి యుండును?' అని నరేంద్రు

డొకసారి నాతో జెప్పెను. ఈ శుష్కవాదమును, ఈ కలగలుపు వేదాంతమును విడనాడుము. యుక్తివలన భగవంతుని తెలిసికొనజాలిన వారెవరైన నున్నారా? శుకుడు, వ్యాసుడు, శివుడు మున్నగు ఋషులుకూడ చివరకు పెద్దచీమలవంటివారు,'' అని సెలవిచ్చిరి.

శిష్యుడు : నేను విషయములను తెలిసికొన గోరుచున్నాను. ఏకొంచెమో నాకు బోధపడుచున్నది కూడ. ఎవరైన యుక్తిని, హేతువాదము నెట్లు మానగలరు.

అమ్మగారు : పరిపూర్ణజ్ఞానము కలుగనంతవరకు, హేతువాద మంతరింపదు.

పిమ్మట సంభాషణ సృష్టిని గురించి జరిగెను.

శిష్యుడు : అమ్మా! ఈ లెక్కలేని జీవరాసులనన్నిటిని భగవంతు డొక్కసారియే సృజించెనా లేక వేరువేరు కాలములలో సృజించెనా?

సృష్టి, పరిణామము, యుగముల సిద్ధాంతమును

అమ్మగారు : చిత్రకారుడు తనకుంచెతో కనులు, మొగము, ముక్కు మొదలైనవానిని చిత్రించునట్లు, కుమ్మరివాడు ఒక్కొక్క అవయవమును ముందుచేసి చివరకు పూర్ణస్వరూపములతో బొమ్మలను నిర్మించునట్లు, భగవంతుడుకూడ ఒక జీవుని తరువాత మరియొక జీవుని సృష్టించెనని నీ యూహయా? కాదు. ఆ రీతిగా సృష్టి జరుగలేదు. భగవంతునకు విశేషమైన శక్తి కలదు. ఇచ్ఛామాత్రమున భగవంతుడు కావలెననిన ప్రపంచము లుత్పన్నమగును,

భగవంతుడు వలదనిన అవి యెల్ల నిర్మూల మగును. ఇప్పు డున్నదియెల్ల ఒకేసారి సంభవించెనేకాని, ఒకదాని తరువాత నొకటి రాలేదు.

అమ్మగారి గదిలో పెద్దచీమలు ఆహారమునకై తిరుగుచుండెను. వీనిలో నొకదానిని చేతితో జూపుచు "ఈ చీమ తక్కినవానికంటె ఏల వెనుకబడియున్నది? ఈ చీమ మానవజన్మమెత్తుటకు కొన్నియుగములు పట్టును," అని చెప్పితిని. "ఔను, అది నిజము. ఒక యుగమైన తరువాత గాఢనిద్రలో నుండి మేల్కొనిన విధమున నెల్లరును మేల్కొందురు," అని అమ్మగారు చెప్పిరి.

జపమును, ఇంద్రియ నిగ్రహమును, భగవత్సాక్షాత్కారమును

జపమును గురించియు, పారమార్థిక సాధనలను గుఱించియు నేను శ్రీమాతృదేవి నడిగితిని. అమ్మగా రిట్లు చెప్పిరి: "ఈ సాధనలవలన పురాకృత కర్మబంధములు తొలగిపోవును. భగవంతునియెడల ప్రేమభక్తిలేనియెడల భగవత్సాక్షాత్కారము లభింపదు. జపమును, పారమార్థిక సాధనలును ఎంతముఖ్యములో నీకు తెలియునా? వీనివలన ఇంద్రియనిగ్రహము కలుగును.

ధర్మము

ప్రాణాపాయకరమైన జబ్బులోనుండిన లలితఛాటర్జీని గురించి ముచ్చటించుచు, అమ్మగా రిట్లు చెప్పిరి:—"లలితుడు నాకు చాల ద్రవ్యసహాయము చేయుచుండువాడు. అతడు నన్ను తన బండిలో తీసికొని వెళ్లుచుండును. కామార్పుకూరులోను, జయరామ్

బటిలోను గల పూజామందిరములలో జరుగు సేవకుకూడ నాతడు చాల సాయము చేయును. నా లలితుని హృదయము కోటిరూప్యములకంటెను నెక్కువ విలువయైన పెన్నిధి. ఇంట కోట్లకొలది ధనము మూలుగుచున్నను, పిల్లికికూడ బిచ్చము పెట్టని పినాసులుకూడ గలరు. భగవంతునకును భగవద్భక్తులకును భాగ్యవంతులు ధనరూపమున సేవచేయవలెను. పేదలు భగవన్నామస్మరణరూపమున భగవంతుని ఆరాధింపవలయును.''

ప్రేమభక్తి - భగవత్సాక్షాత్కారము

ప్రేమభక్తినిగూర్చి ముచ్చటించుచు, అమ్మగారిట్లు సెలవిచ్చిరి : ''జపమువలననా బృందావన గోపబాలురు శ్రీకృష్ణుని తమ సొంత పెన్నిధిగా వశపఱచుకొనగలిగిరి? తమ ప్రేమభక్తిచేతనే వారు భగవంతుని దయను చూఱగొని, ముక్తులైరి. ''కృష్ణా! కృష్ణా! రా! ఇటు రా! ఈ వెన్నతినుము! ఈ పూలుతీసికొనుము!'' అని తమ ప్రాణస్నేహితునితోవలె ఆ జగన్నాథునితో వారు మాటలాడుచు, కడుచనవుగా గలసిమెలసి వర్తించిరి.''

శిష్యుడు : భగవంతుని ప్రేమ నిదర్శనమును స్వాయముగా చూడకుండ, భగవంతునికొఱకు మన కాత్ర మెట్లు కలుగును?

అమ్మగారు : నీవట్టి గాఢవాంఛను బడయుగలుగుదువు. అందే భగవంతుని దయ కలదు.

* * *

జయరాంబటి, 1909 సం॥ డిశంబరు.

అప్పు డుదయమున నించుమించుగా తొమ్మిదిగంటల వేళ. నేను వెళ్ళినప్పుడు శ్రీ మాతృదేవి తమలపాకుల కిల్లీలను కట్టుచుండిరి. త్వరలో నేను ప్రసంగమును మొదలుపెట్టితిని.

శిష్యుడు : అమ్మా! మి మ్మెన్నిసారులో సందర్శించితిని; మీ ప్రసంగముల నెంతయో వింటిని. కాని మిమ్ము నా సొంత తల్లిగా గ్రహింపలేకున్నాను.

అమ్మగారు : నాయనా! నేను నీ సొంతతల్లిని కానిచో తఱచుగా నిచ్చటికేల వచ్చుచున్నావు? సరియైన కాలమున నీ 'సొంతతల్లి'ని తెలిసికొనగలవు!

కొంత తడవైన తరువాత నా సొంత తల్లిదండ్రులను గూర్చియు, సోదరులనుగూర్చియు శ్రీ మాతృదేవితో నే నిట్లు చెప్పితిని : "నా తల్లిదండ్రులు నన్ను పెంచిరి. (మరణానంతరమున) వా రిప్పు డెక్కడనున్నారో, ఎట్లు జీవించుచున్నారో నాకు తెలియదు. నా సోదరులకు మంచి సంస్కారములు కలుగుగాక యని మీ రాశీర్వదింపుడు.

అమ్మగారు : సామాన్యముగా భగవంతు డెవరికి కావలయును? ఈ నా కుటుంబములోనే యెంతమందియో యున్నారు. కాని వారందరకును భగవంతుడు కావలయునా? (కొలది నిమిషము లాలోచించి) ఆందోళనపడకు. పెండ్లి చేసికొని, సంసారములో దిగవలదు. బ్రహ్మచారిగా నుందు వేని, నీవు భయపడవలసిన యవసరమేమి? నీ వెచ్చట నున్నను స్వతంత్రుడవుగ నుందువు.

శిష్యుడు : అమ్మా! నా కెందుచేతనో కాని భయమగు చున్నది.

అమ్మగారు : వలదు, వలదు! భయపడవలదు! సర్వమును శ్రీ గురుదేవుని సంకల్పము పైననే ఆధారపడి యున్నది.

శిష్యుడు : మనస్సే సర్వమును, మనసు నిర్మలముగా నున్నయెడల నే నెచ్చట నివసించినను ప్రమాదములేదు. అమ్మా! నా మనసెల్లప్పుడును నిర్మలముగా నుండునట్లు కటాక్షింపుడు.

అమ్మగారు : అట్లే యగుగాక! ఆనాడు శ్రీమాతృదేవి పుట్టిన దినము. దీనికి కొలదినాళ్లముందే ప్రబోధబాబు జయరాంబాటికి వచ్చి ఆ నాటి ప్రత్యేక సేవకొరకై అయిదు రూప్యములను శ్రీ మాతృదేవి సోదరులకిచ్చెను. "నేడు విశేషముగా మీ రేమియు చేయనక్కరలేదు. నేనొక క్రొత్త చీరను కట్టుకొనెదను. శ్రీ గురుదేవునకొక మధురపదార్థము నైవేద్యము చేయబడును. పిమ్మట నే నా ప్రసాదమును భుజింతును. నేడు చేయవలసినదింతే." అని అమ్మగారు తమ తమ్ములతో చెప్పిరి.

పూజామందిరములో సేవయైన తరువాత శ్రీమాతృదేవి క్రొత్తబట్టను కట్టుకొని, కాళ్లుక్రిందకుజాపి మంచము మీద కూర్చుండిరి. ప్రబోధబాబువచ్చి కొన్నిపువ్వులను అమ్మగారి పాదములదగ్గరనుంచెను. నేను వసారాలో గుమ్మముకడ నిలువబడియుంటిని. అమ్మ నన్ను చూచి, "ఏమి?

నీవుకూడ పువ్వులను సమర్పింపవా? పువ్వు లిచ్చుటనున్నవి; తీసికొనుము.'' అని చెప్పిరి. పిమ్మట నేనుకూడ శ్రీ మాతృదేవి పాదాలకు పూలు సమర్పించితిని. మధ్యాహ్నమునను, అటుతరువాతను సంతుష్టిగా విందు నారగించితిమి. ప్రబోధబాబు కలకత్తాకువెళ్లెను. కాని నా ఆరోగ్యము సరిగా లేనందున, నేను జయరాంబాటిలోనే యుంటిని.

1909-వ సం॥ డిశంబరు నెల.

భగవంతుని బంధించుట

ప్రసంగవశమున అమ్మగారిట్లు చెప్పిరి: భగవంతుని బంధింపగలిగిన వారెవరైన నున్నారేమో నాకు చెప్పగలవా? యశోదా జనయిత్రి శ్రీకృష్ణుని బంధింపకలిగెను. ఎందుచేత? ఆ జగన్నాథమూర్తి తాను కట్టువడుటకు ఒప్పుకొనెను గనుక. బృందావన గోపబాలురకును, గోపికలకును కూడ భగవత్సాక్షాత్కారము కలిగెను.

ఆశలు - పునర్జన్మము

మానవున కాశయున్నంత కాలము వాని జన్మలకంతమే లేదు. ఆశవలననే అతడొక శరీరమును విడిచి మఱియొక శరీరమును దాల్చుచున్నాడు. చివరకొక కలకండపలుకును తినవలయునను ఆశయైన ఉన్నయెడల, అతనికి పునర్జన్మ కలుగును. ఇందుచేతనే బేలూరు మఠమునకు పలురకములైన తినుబడి పదార్థములను తీసికొని వచ్చుచుందురు. ఆశను చిన్నవిత్తనముతో పోల్చవచ్చును. మఱ్ఱివిత్తనము మిక్కిలి చిన్నది.

అందుండి శాఖోపశాఖలుగల పెద్దవృక్షము పెరుగును. ఒక ఒరలోనుండి తీసి మరియొక ఒరలో తలగడనుంచునట్లు, జీవాత్మ ఒక శరీరమును విడిచి మరియొక శరీరమును దాల్చును. ఆశ లేవియు లేనివారు కోటికే యొకరో, యిరువురో మాత్రముందురు. ఆశవలన నూతనశరీరము వచ్చినను, పూర్వజన్మములలో పుణ్యకార్యములను చేసియున్న యెడల మానవునకు పారమార్థిక జ్ఞానము పూర్తిగానశింపదు. బృందావనమందలి గోవింద దేవాలయములోని యర్చకు డొకడు తనయుంపుడుకత్తెకు స్వామి ప్రసాదమును తీసికొని వెళ్లి యిచ్చుచుండెను. ఈ పాపఫలితముగా మరణానంతరమున వానికి ప్రేతశరీరము కలిగెను. కాని దేవాలయములో స్వామి వారి యర్చనచేసిన పుణ్యవిశేషమువలన, వాడొకనాడు తన ఎప్పటి స్థూలశరీరముతో జనులందరియెదుట కనుపడెను. వాని పురాకృత సుకృతము వలననే, వానికిది సాధ్యమయ్యెను. అతడు తన అధమజన్మకుగల కారణమును జనులకుచెప్పి "ఈ యవస్థనుండి నా ఆత్మకు విమోచనకలుగుటకై మీరు దయయుంచి హరినామసంకీర్తనముచేసి ఉత్సవమును జరిపింపుడు. అప్పుడు నాకు ముక్తికలుగును" అనికూడ వారిని హెచ్చరించెను.

శిష్యుడు : హరినామ సంకీర్తనవలనను, ఉత్సవముల వలనను ఇట్టి అవస్థను బాపుకొనుటకు వీలున్నదా ?

అమ్మగారు : ఔను. వైష్ణవుల కదిచాలును. వారు శ్రాద్ధము మొదలగు అపరక్రియలను చేయరు.

నేనొకసారి రథోత్సవసమయమున శ్రీ జగన్నాథ ములో జగన్నాథుని విగ్రహమును సందర్శించితిని. ఆ విగ్ర హము నెంతమందియో సందర్శించుచుండగా చూచి, కేవల సంతోషాతిశయముచేనేడ్చి, 'ఆహా! బాగుబాగు! వీరందరి కిని మోక్షముకలుగును' అని నేను తలంచితిని, కాని తరు వాత నా యూహ సరికాదని గ్రహించితిని. ఏవిధమైన ఆశయు నెంతమాత్రమును లేని, యేయొకరిద్దరో ముక్తిని బడయ గలిగిరి. నే నీవిషయమును చెప్పినప్పుడు, 'ఔనమ్మా! కోరిక లేవియు లేనివారు మాత్రమే ముక్తిని గాంతురు,' అని యోగినీ మాయి చెప్పెను.

* * *

ఒకనాటి యుదయమున శ్రీమాతృదేవిగది వసా రాలో నేను భోజనముచేయుచు "అమ్మా! బేలూరు మఠ ములో నివసింతునేని, సన్న్యాసము పుచ్చుకొనవలయునా?

అమ్మగారు : ఔను, నాయనా.

శిష్యుడు : అమ్మా! సన్న్యాసినైనచో గర్వము దారు ణముగా పెరుగును.

అమ్మగారు: ఔను. అది నిజమే సన్న్యాసి చాల గర్విమై 'ఏమిది! ఈ మనుష్యుడు నన్ను గౌరవింపకున్నాడే! ఆమనుష్యుడు నాకు ప్రణామము చేయుటలేదే,' అని తలంచ వచ్చును. (తమ తెల్లబట్టను* వ్రేలితోచూపుచు) మన

---

* గృహస్థాశ్రమ జీవనమునకు తెల్లబట్ట చిహ్నము, సన్న్యా సులు కాషాయవస్త్రముల ధరింతురు.

స్సులో త్యాగబుద్ధి కలిగి జనులిట్లు జీవించుట మంచిది.

సన్న్యాసాశ్రమము : గర్వము

ముసలివాడై ఇంద్రియముల పటుత్వము తగ్గిన తరువాతనే, గౌరీశిరోమణి* సన్న్యాసము పుచ్చుకొనెను. నాయనా! సౌందర్యము, పుణ్యము, జ్ఞానము, పవిత్రశీలము మొదలగు నవి తమకుగలవను గర్వమును విడనాడుట సులభమా ?

త్యాగయుక్తమైన జీవితమునకు నన్ను సంసిద్ధునిగ నుండుమని శ్రీమాతృదేవి హెచ్చరించుచు ఇట్లు చెప్పిరి : "నీ వింటికి వెళ్లి 'నే నే యుద్యోగమును చేయను. నా తల్లి చనిపోయినందున, నేనెవరికిని పరాధీనుడుగనుండను. అట్టిపని నే నెన్నడు చేయను. మీ గృహస్థధర్మములను నిర్వహించి మీరు సుఖముగ నుండుడు' అని నీ సోదరులతో కడసారిగా చెప్పుము."

పిమ్మట సన్న్యాసజీవితమునకుగల కఠిననియమములను గురించి ప్రసంగించుచు అమ్మగారిట్లు చెప్పిరి : "మఠము†లో నా బిడ్డలెంత కఠిన జీవనమును గడపుచున్నారు! రుచిగల భోజనపదార్థములను తినుటకు, మంచిబట్టలను కట్టుకొనుటకు, లోకములో నే సౌఖ్యమునైన అనుభవించుటకు వారికి వీలు లేదు. నాకిది యిష్టము లేదు. బహుకఠినములైన నియమ

---

* సుప్రసిద్ధ వైష్ణవ సాధువగు నితడు బృందావనములో శ్రీమాతృదేవిని సందర్శించెను.

† బేలూరులోను, ఇతరచోట్లనుగల మఠముల విషయమై అమ్మగారిచ్చట చెప్పిరి.

ములకు లోబడి జీవించుటవలన, జోగిను (యోగానందస్వామి) మితిమీరిన శోషణచే చివరకు శరీరము చాలించెను.''

సాయంకాలమున నాకును అమ్మగారికిని ఈ క్రింది విధమున సంభాషణ జరిగెను.

దైవానుగ్రహము - పరమార్థసిద్ధి

శిష్యుడు : అమ్మా! భగవంతుని దయయున్నచో, మానవున కెప్పుడైనను పరమార్థసిద్ధి కలుగును. సరియైన కాలమునకై అతడు వేచియుండనక్కరలేదు.

అమ్మగారు : నిజమే కాని, అకాలమున దొరకు మామిడిపండ్లు జ్యేష్ఠమాసములో పండిన ఫలమంత తియ్యగా నుండునా? అకాలమున పండ్లకై జను లిప్పుడు ప్రయత్నము చేయుచున్నారు. ఆశ్వయుజమాసములోకూడ మన కిప్పుడు మామిడిపండ్లును, పనసపండ్లును దొరకుచున్నవి. కాని యివి సరియైనకాలములో దొరకు పండ్లంత రుచిగా నుండవు. ఇది పరమార్థానుభూతికొఱకైన ప్రయత్నముల విషయములో కూడ నిజము. ఈ జన్మలో జపమును కఠినసాధనలను చేసిన యెడల, రాబోవు జన్మలో నీ వింకను నెక్కువగా నభివృద్ధి గాంతువు.

హఠాత్తుగా గలుగు జ్ఞానవికాసమునుగురించి అమ్మగారిట్లు చెప్పిరి: ''భగవంతుడొక శిశువువంటివాడు. అడుగని వారికి ఆ పరమార్థ మాతడిచ్చును; మరియొక రెంత అడిగినను వారి కీయడు. అదియంతయు నాతని చిత్తవిలాసము!''

* * *

మరియొకనాడు శ్రీ మాతృదేవి వసారాలో కూర్చుండి తమలపాకుల కిల్లీలు కట్టుచుండగా "ఇటుతరువాత మిమ్ము సంతోషపఱచుటకై యెన్ని పారమార్థిక సాధనల నెంతమంది చేసెదరో కదా!" అని నే నంటిని. ఇందుపైని చిఱునవ్వు నవ్వుచు, "ఏమనుచున్నావు! 'హా! అమ్మ యెంతలావుగ నుండి, ఎట్లు కుంటుచుండెడిది!' అని జనులందరు చెప్పు కొనెదరు!" అని సెలవిచ్చిరి.

శిష్యుడు : మీ ర ట్లనవచ్చును.

అమ్మగారు : మంచిది. ఇందుచేతనే కాశీపూర్ తోట యింటిలో అనారోగ్యస్థితిలో నుండినప్పుడు శ్రీ గురుదేవు లీ క్రిందివిధమున చెప్పుచుండువారు : "ఏదియో యైహికలాభ మాశించి నాకడకు వచ్చినవారు 'ఆహా! ఈయన భగవదవ తారమే! ఈయన జబ్బుగానుండుట యెట్లు తటస్థించును? ఇదంతయు మాయ!' అని చెప్పుచు మాయమైపోయిరి. కాని, నా 'సొంత' జను లీ నా దుఃస్థితిని చూచి యెంతయో పరితపించుచున్నారు."

ఉద్బోధనపత్రికా కార్యాలయము, కలకత్తా, 1910-వ సంవత్సరము.

నేను మంత్రోపదేశము నొందుటకు ముందటిదినమున "అమ్మా! నేను మంత్రోపదేశము నొందగోరుచున్నాను," అని నేను శ్రీ మాతృదేవితో చెప్పితిని. అందుపైని నీకు మంత్రోపదేశము కాలేదా?" అని అమ్మగా రడిగినమీదట కాలేదని నేను బదులు చెప్పితిని. "నీకు మంత్రోపదేశమైన దేమో యనుకొంటిని," అని అమ్మగారు చెప్పిరి. నాకు

మంత్రోపదేశము చేసిన తరువాత, శ్రీమాతృదేవి, "నీ శరీరమును మనస్సును భగవన్నామస్మరణచే పరిశుద్ధము లగుగాక!" అని నన్నాశీర్వదించిరి.

వ్రేళ్లతో జపము చేయుట

శిష్యుడు : వ్రేళ్లతో మంత్రమును జపింపవలసిన అవసరమేమి? మనస్సులో మన మట్లు చేయవచ్చునే.

అమ్మగారు : భగవన్నామమును జపించి సార్థకము లగుటకే భగవంతుడు మనకు వ్రేళ్ల నిచ్చియున్నాడు.

* * *

ఉదయమున అమ్మగారు నాతో ప్రసంగము చేయుచుండిరి.

భగవంతుడు - లోకములో దుఃఖము

శిష్యుడు : అమ్మా! భగవంతుడనువాడొక డున్న యెడల లోకములో నింత దుఃఖమును, కష్టము నెందు కున్నవి? వీనిని భగవంతుడు చూచుట లేదా? చూచుచున్నను వానిని తొలగించుటకు ఆయనకు శక్తిలేదా?

అమ్మగారు : సృష్టిలో సుఖదుఃఖములు రెండును కలవు. దుఃఖమే లేనియెడల, సుఖము నెవరు మెచ్చుకొనగలరు. ఇంతేకాక, అందరును సుఖముగానుండుట కెట్లు సాధ్యపడును? "మీ ప్రజలందరి కష్టమును, అసౌఖ్యమును మీ రేల పోగొట్టరు? దయయుంచి మీ రాజ్యములోని పౌరుల కందరికిని సౌఖ్యమొనగూర్పుడు. మీరు తలచినచో, మీ కిదియొక కష్టములోనిది కాదు," అని సీతాదేవి రాముల

వారితో జెప్పెను. "ఒకేసారి జనులెల్లరు సుఖముగానుండుట యెన్నటికైన సాధ్యమగునా?" అని రాములవారు బదులు చెప్పిరి. "ఎందుకు కాదు? రాజధనాగారములోనుండి ధనమును వెచ్చించి, జనుల కెవరికేమి కావలయునో సమకూర్పుడు." అని సీతాదేవి విన్నవించెను. "మంచిది, నీవు కోరినట్లే జరుగును," అని రాములవారు సెలవిచ్చి, లక్ష్మణుని పిలిపించి "నీవు వెళ్లి, నా సామ్రాజ్యమందలి జనుల కేది కావలసియున్నను రాజధనాగారమునుండి వారు తీసికొని వెళ్లవచ్చునని ప్రకటింపుము," అని సోదరు నాజ్ఞాపించిరి. ఇదివిని రాములవారి రాజ్యములోని ప్రజలందరు రాజాంతఃపురముదగ్గరకువచ్చి, తమతమ కోరికలను వెల్లడించిరి. రాష్ట్రకోశములోని ధన మడ్డులేక యేకధారగా ప్రవహింపజొచ్చెను. ఈవిధముగా రాష్ట్రములోని ప్రజలందరు నానందసాగరమున నోలలాడుచుండ, రాములవారిమాయచే, సీతారాములు నివసించుచుండిన భవనమున వర్షకాలములో రంధ్రములుపడి, లోనికి వాన కురియుచుండెను. ఆ యింటి కప్పును సరిచేయుటకు పనివారల తోడ్కొనివచ్చుటకు చారులను బంపిరి. కాని, పనివార లెక్కడ దొరుకుదురు? రాజ్యములో పనివా డెక్కడను లేడు. మేస్త్రులు, వడ్రంగులు మొదలైన వివిధ వృత్తులవా రెవరును కలికమునకైన కానరాకపోవుటచే, దేశములోని యిండ్లన్నియు పాడయ్యెను. వానిని చక్కజేయుటకు పనివా రెవరును దొరకక ప్రజలు శ్రీరామచంద్రప్రభునికడకు బోయి, తమ కష్టములను మనవి చేసికొనిరి. గత్యంతరమేదియులేక సీతాదేవి "ఇంటికప్పు

చిల్లులుపడి లోనికి వాన కురియుచుండుటవలన, నిక నిచ్చట నివసింప సాధ్యముకాకున్నది. దయయుంచి పూర్వపురీతినే రాజ్యవ్యవహారములు జరుగున ట్లేర్పరచుడు. అట్లైనచో ప్రజలందరికిని పనివారు దొరుకుదురు. ఒకేసారి మానవు లెల్లరు సుఖముగానుండుట అసాధ్యమని నాకిపుడు బోధపడు చున్నది,'' అని రాములవారితో మనవిచేసెను. ''అట్లే కానిమ్ము'' అని రాములవా రానతిచ్చిరి. వెంటనే వ్యవహా రములన్నియు నింతకుపూర్వముండినట్లే మరల జరుగ నారం భించినవి. పనివారు మరల సమృద్ధిగా దొరుకుచుండిరి. ''ప్రభూ! ఈ సృష్టియెల్ల మీ యద్భుతలీలయే కదా?'' అని సీతాదేవి రాములవారి నుగ్గడించెను.

ఎల్లకాల మెవరును కష్టపడరు. ఈ భూలోకములో యావజ్జీవమును కష్టమే యనుభవించువారెవరు నుండరు. ప్రతికర్మకు ఫలముండును. ఈ విధముగా అవకాశము లెల్ల రకును లభించుచుండును.

శిష్యుడు: అట్లైనచో సర్వమునకును కర్మయే కార ణమా?

అమ్మగారు: కర్మ కాక, వేరేది కారణము? పాకీ వాడు తలపైని బాల్చిని పెట్టుకొనిపోవుట నీవు చూచు చున్నావు కావా?

శిష్యుడు: జీవునకు సత్కర్మకుగాని, దుష్కర్మకుగాని మొట్టమొదటి ప్రేరణ యెచ్చటనుండి వచ్చుచున్నది? ఈ జన్మలోని ప్రేరణలకు పూర్వపుజన్మలో చేసిన కర్మలే

కర్మ-దైవసంకల్పము-పురవగాహ రహస్యము

కారణమని, ఆ పూర్వపు జన్మలోని ప్రేరణలకు దానికిముందుండిన జన్మలో చేసినకర్మములే కారణమని సమాధానరూపముగా మీరు చెప్పవచ్చును. కాని దీనికి మొదలెక్కడ?

అమ్మగారు: భగవంతుని సంకల్పములేనిదే యేమియు జరుగదు; గడ్డిపరకకూడ చలింపదు. మంచికాలము వచ్చినప్పుడు భగవంతుని ధ్యానించవలెనను కోరిక మానవునకు కలుగును; చెడ్డకాలము వచ్చినప్పుడు దుష్కర్మలను చేయుటకు తగిన సదుపాయములన్నియు నాతనికి లభించును. భగవత్సంకల్పమునుబట్టి యేది యెప్పుడు జరుగవలెనో అది అప్పుడు జరుగుచుండును. మనుష్యుల కర్మలలో దైవసంకల్పము ప్రతిబింబించుచుండును. నరేను (వివేకానందస్వామి) తనంతతానే అంత ఘనకార్యములను చేయగలిగియుండునా? భగవంతు డాతనియందుండి పనిచేసెను కావుననే, అతడట్టి దిగ్విజయమునొందగలిగెను. ఆతడుచేయవలసిన పనులన్నిటిని శ్రీ గురుదేవుడు ముందుగనే నిర్ణయించెను. పరిపూర్ణముగా తనకాత్మ సమర్పణచేయువారికి, శ్రీ గురుదేవుడే సర్వమును సమకూర్చును. మన సదుపాయములన్నియు మనమనకర్మలచే నిర్ణీతములగుచున్నందున, మనము సర్వసహనభావము కలిగియుండవలయును. ఇదియటుండ, కర్మలను కర్మలే హరించును.

శిష్యుడు: కర్మ యెన్నడైన కర్మను పోగొట్టగలదా?

పారమార్థిక సాధనవలన పాపములు పోవును

అమ్మగారు : ఎందుచేత పోగొట్టజాలదు? నీవు సత్కర్మ చేయుదువేని అది నీ పురాకృత దుష్కర్మను పోనాడును. ధ్యాన, జప, పారమార్థికచింతనాదుల బలిమిచే పూర్వపాపములు నశించును.

మీర్జాపూరు వీథిలో నొక బాలునకు దయ్యము పట్టినదని వింటిని. ఉద్బోధనపత్రిక కార్యాలయోద్యోగులు కొందఱా బాలుని నిన్న వెళ్లిచూచిరి. "పిశాచ శరీరములో మనుజు లెంతకాలముందురు?" అని అమ్మగారి నడిగితిని.

మరణానంతర జీవితము

అమ్మగారు : ఆధ్యాత్మికోన్నతి నెక్కువగా గాంచిన జీవులు తప్ప, మిగిలిన జనులందరు ప్రేతశరీరములో నొక సంవత్సరము వరకునుందురు. పిమ్మట, ఆ గతించిన జీవుల సంతృప్తికొరకు గయలో పిండప్రదానముచేసి తర్పణము విడుతురు. దీని వలన, గతించినజీవులకు ప్రేతశరీరమునుండి విమోచన కలుగును. తరువాత, వా రితర జీవలోకములకువెళ్లి, అచ్చట సుఖమో దుఃఖమో కొంతకాల మనుభవించి వారివారి కోరికలకు అనుగుణమైన మనుష్యజన్మనెత్తుదురు. మఱికొందరాలోకములలోనుండియే, మోక్షమును బడయుదురు. ఈ జన్మలో నేదోయొక పుణ్యకార్యమును చేసిన మనుష్యునకు ప్రేతావస్థలో పారమార్థికజ్ఞానము పూర్తిగా నశింపదు.

ఈ సందర్భమున బృందావనమందలి గోవింద దేవాలయార్చకునిగురించి అమ్మగారు మరల ప్రస్తావించిరి.

శిష్యుడు : గయలో శ్రాద్ధము చేసినంత మాత్రమున నెవరికైన, నున్నతతరస్థితిని బడయుటకు వీలగునా ?

అమ్మగారు : ఔను. అది నిజమే.*

---

* ఈ సందర్భమున మరొకవిషయము నాకు జ్ఞప్తికివచ్చుచున్నది. శ్రీ మాతృదేవి కాశీలోనుండిరి. అప్పటికి ఒకటిరెండునాళ్లు ముందుగనే, నా కుటుంబసంబంధులగు పూర్వీకులలో మృతజీవులైనవారికి శ్రాద్ధము పెట్టుటకు గయకు వెళ్లుచు, "అమ్మా ! నా పూర్వీకులకు స్వర్గము కలుగునట్లు దయయుంచి మీ యాశీర్వాదముల నొసంగుడు," అని నేను శ్రీ మాతృదేవిని ప్రార్థించితిని. నా పితృదేవతల సంతృప్తికై గయలో నేను పిండప్రదానముచేసి తర్పణమువిడిచిన నాటిరాత్రియే, (శ్రీ మాతృదేవితోకూడ కాశీకి వెళ్లిన యామె మేనల్లుడు) భూదేవుడు శ్రీ మాతృదేవి జపముచేయుచుండినట్లును, ఆమె చుట్టును కొంతమంది జనులుమూగి 'నాకు ముక్తినొసంగుడు' 'నాకు ముక్తినొసంగుడు !' అని ప్రాధేయపడి అడుగుచుండినట్లును కలకనెను. కలలో అమ్మగారొక పాత్రలోనుండి పవిత్రజలమును తీసి, వారిపై జల్లి, 'మీ కిప్పుడు విమోచనయైనది, వెడలి పొండు !' అని చెప్పిరి. వారును బహు సంతుష్టాంతరంగులై వెడలి పోయిరి. పిమ్మట మరియొక మనుష్యుడు వచ్చెను. వానిని చూచి 'ఇంక నేనిట్లు చేయజాలను' అని అమ్మగారు చెప్పిరి. చాలకాలమువరకు వాడమ్మగారిని ప్రార్థించి, చిట్టచివరకు వారి యనుగ్రహమును బడసెను. మరునాడీ కలను భూదేవుడు శ్రీ మాతృదేవికి చెప్పినప్పుడు, "తన పితృదేవతలకు శ్రాద్ధము పెట్టుటకై, ర—— గయకు వెళ్లియుండెను. కనుక ఈ జనులందరికిని విమోచన కలిగినది," అని యామె బదులు చెప్పిరి. బహు భక్తిశ్రద్ధలతో నా పితృదేవతలకు తర్పణములు విడుచుచు, నా కా సమయమున పేళ్లు జ్ఞప్తికిరానివారందరికిగూడ విమోచన కలుగు

శిష్యుడు : అట్లైనచో పారమార్థిక సాధనలను చేయవలసిన యవసరమేమి?

అమ్మగారు : గతించినజీవు లున్నతతరస్థితిని బడసి, అచ్చట కొంతకాల ముందురనుటకు సందేహము లేదు కాని, తరువాత వారు తమతమ పూర్వవాంఛలకు అనుగుణముగా ఈ లోకమున మరల జన్మింతురు. నరజన్మ మెత్తినతరువాత వారిలో కొందరి కీజన్మలోనే ముక్తి లభించును ; మరికొందరు వారివారి కర్మఫలముల ననుభవించుటకు హీనజన్మ లెత్తెదరు. ఈప్రపంచ మొక చక్రమువలె గిరగిర తిరుగుచుండును. ఆశలన్నియు ఏ జన్మలో పూర్తిగా తొలగిపోవునో, అదియే మనుష్యులకు తుదిపుట్టుక.

శిష్యుడు : మృతినొందిన జీవులు దివ్యస్థితికి పోయెదరని మీరిప్పుడే చెప్పియుంటిరి. అచ్చటికి వారు తమంతట తామే పోవుదురా లేక ఎవరైనను వారిని తీసికొని వెళ్లుదరా?

అమ్మగారు : ఎవరునువచ్చి వారిని తీసికొనివెళ్లరు ; వారంతట వారేవెళ్లెదరు. సూక్ష్మశరీరము గాలితో చేయబడిన శరీరమువంటిది.

శిష్యుడు : మరణించినవారికి గయలో శ్రాద్ధము పెట్టనిచో, ఆ జీవుల కేమి సంభవించును?

అమ్మగారు : తమతమ కుటుంబములలో పుణ్యాత్ము లెవరైన పుట్టి గయలో శ్రాద్ధము పెట్టువరకుగాని, వేఱె

---

టకై, నేను వాస్తవముగా పిండప్రదానముచేసి తర్పణము విడిచితిని. వారందరి విమోచనకొరకు ప్రార్థించితిని.

అపరకర్మలను చేయువరకుగాని, వారా ప్రేతశరీరములోనే యుందురు.

శిష్యుడు : భూతములు మొదలగువానిని గురించి వినుచుందుము. అవి శివుని పరివారములోనివా? లేక పిశాచములా? చనిపోయిన జనుల దయ్యములా?

అమ్మగారు : చనిపోయిన జనులదయ్యములే యవి. శివుని పరిచారకులగు భూతములు వేఱు. జనులు చాలజాగ్రత్తగా జీవింపవలయును. ప్రతికర్మకు ఫలముతప్పక కలుగును. పరుషములాడి యితరుల నవమానపరచుటకాని, వారిబాధకు కారణభూతులగుటకాని యెవరికిని మంచిదికాదు.

శిష్యుడు : అమ్మా వేపచెట్టునకు మామిడిపండు పుట్టదు; మామిడిచెట్టునకు వేపపండును పుట్టదు. ఎవరి కర్మఫలమును వా రనుభవింతురు.

అమ్మగారు : నాయనా, నీవు చెప్పునది నిజము. కాలక్రమమున భగవంతుడున్నట్లుకూడ మనకు అనిపించదు. జ్ఞానవికాసము కలిగినవానికి దేవతలందరును మాయయని తోచును. సర్వమును కాలములో ఉత్పన్నమై, కాలములోనే అంతమొందును......నిజముగా భగవంతుడు మున్నగు విషయములు జ్ఞానోదయమైనతోడనే మాయమగును. అమ్మయే విశ్వమంతట నిండియున్నట్లు సాధకుడప్పుడు గ్రహించును. యథార్థమిదియే.

(అద్వైతస్థితి)

* * * *

నిత్యారాధనకై శ్రీమాతృదేవి బిల్వపత్రముల నెంచి యుంచుచుండగా, వారినూతన ఛాయాపటమును కనుబఱచి, అది తమ రూపమును సరిగా ప్రతిబింబించుచున్నదాయని యడిగితిని.

అమ్మగారు : ఔను. ఈబొమ్మ బాగుగనే యున్నది. కాని దీనిని తీయకముందు నే నెక్కువ లావుగానుంటిని. ఆ సమయమున జోగినుకు (యోగానందస్వామికి) చాల జబ్బుగా నుండెను. అతని విషయమైన చింతవలన నేను చిక్కిపోతిని. అప్పుడు నాకు సౌఖ్య మెంతమాత్రమును లేదు. జోగిను జబ్బు విషమస్థితిలోనికి దిగినయెడల, నేడ్చుచుందును; అతనికి కొంచెము నయముగానుండినచో, సంతోషించుచుందును. సారాబుల్ అనుదొరసాని యీ ఛాయాపటమును తీసెను. అందుకు మొట్టమొదట నేను సమ్మతింపలేదు; కాని ఆమె పట్టుపట్టి, "అమ్మా! ఈ బొమ్మను నే నమెరికా దేశమునకు తీసికొనివెళ్లి, పూజింతును," అని చెప్పినందున, తుట్టతుదకు నేనీ బొమ్మతీయుట కొప్పుకొంటిని.

శిష్యుడు : అమ్మా! మీయొద్దనున్న శ్రీరామకృష్ణుల వారి ఛాయాపటము చాల బాగున్నది. ఆ బొమ్మనుచూచిన వారికి నిజముగా శ్రీగురుదేవుని చూచినట్లే తోచును. మంచిది, శ్రీ గురుదేవు లిట్లేయుండెడివారా!

అమ్మగారు : ఔను, ఆబొమ్మ మిక్కిలి చక్కగా నున్నది. మొట్టమొదట అది వంటవండు నొక బ్రాహ్మణుని యధీనమందుండెను. శ్రీ వారి ప్రథమ ఛాయాపటమునకు

తన చిత్తరువును తానే శ్రీరామకృష్ణుడు పూజించుట

ముద్రిత ప్రతులను చాలతీసిరి. వానిలో నొకప్రతిని ఈ బ్రాహ్మణుడు తీసికొనెను. కాళీవిగ్రహము వలెనే ఆ బొమ్మ కూడ మొట్టమొదట చాల నల్లగా నుండి నందున, దాని నాబ్రాహ్మణునకిచ్చిరి. అతడు దక్షిణేశ్వరమునువదలి మరి యొకచోటునకు (ఎక్కడకో నేను మఱచిపోతిని) వెళ్లు నప్పుడు దాని నాతడు నాకిచ్చెను. ఇతర దేవదేవీ చిత్రము లతో పాటు నేనా ఛాయాపటమును కూడ భద్రపరచు కొని, పూజించుచుంటిని. ఆకాలములో నేను నౌబత్తుగది యడుగుననుండు భాగములో నివసించుచుంటిని. ఒకనాడు శ్రీగురుదేవు లచ్చటకువచ్చి ఆబొమ్మనుచూచి "ఓహో! ఇది యేమి!" అని తమ ఆశ్చర్యమును వెల్లడించిరి. అప్పుడు నేనును, లక్ష్మియు మేడమెట్ల క్రింద వంటచేయుచుంటిమి. పిమ్మట శ్రీ రామకృష్ణు లచ్చట పూజకై యుండిన బిల్వదళ ములను, పూలను చేతితో తీసికొని ఆఛాయాపటమునకు సమర్పించి, పూజచేసిరి. అదే ఈబొమ్మ. ఆబ్రాహ్మణు డెన్నడును తిరిగి రాకపోవుటచే, బొమ్మ నాయొద్దనే యుండి పోయెను.

శిష్యుడు : అమ్మా! సమాధిస్థితిలో శ్రీగురుదేవుని ముఖము వెలవెల బారియుండుట మీరెన్నడైన చూచి నారా?

అమ్మగారు : ఏల? చూచినట్లు నాకు జ్ఞప్తి లేదు. ఇంతే కాక, అట్టి దివ్యస్థితిలో వారిమోమున చిఱునవ్వు తాండవింప నే నెల్లప్పుడును చూచియుంటిని.

శిష్యుడు : భావసమాధిస్థితిలో చిఱునవ్వుండవచ్చును; కాని కూర్చుండినట్లుండు ఛాయాపటము విషయమున అది యెంతో మహోన్నతస్థితిలో తీసిన బొమ్మయని శ్రీగురుదేవులు చెప్పిరి. ఆ స్థితిలోకూడ, మందహాసముండుటకు వీలగునా?

అమ్మగారు : శ్రీగురుదేవుల సమాధిస్థితులన్నిటి యందును, నేనుమాత్రము శ్రీ వారి మోమున మందహాసమునే చూచితిని.

శిష్యుడు : ఆయన మేనిచాయ యెట్లుండెడిది?

శ్రీరామకృష్ణుల జీవిత విశేషాలు

అమ్మగారు : హరిదళమువంటి బంగారుచాయతో శ్రీవారి శరీరము మిసమిసలాడుచుండెడిది. ఆయన మేని చాయకును, చేతి బంగారు కడియమునకును ప్రకాశమునందెంతమాత్రము భేదము కానరాకుండెను. వారి యొడలికి నూనె రాయునప్పుడు, నేనొక దివ్య తేజ మాశరీరమంతటను వెలువడి వచ్చుచుండుటను కన్నులార చూడగలిగితిని. దేవాలయమునందలి తమ గదిలోనుండి శ్రీవారు బయటకు వచ్చునప్పుడు జనులు బారులుకట్టి నిలిచి "ఆహా! అదే వారు వచ్చుచున్నారు!" అని ఆశ్చర్య పరవశులై యొకరితో నొకరు చెప్పుకొనుచుండువారు. ఆయన కొంచెము స్థూలముగా నుండెడివారు. మధురబాబిచ్చిన పీట వారికి చాలకుండెను. నెమ్మదిగా, తొట్రుపాటులేని నడకతో స్నానమునకై వారు గంగానదికి పోవునప్పుడెల్ల, జనులాశ్చర్య పరవశులై యాయనను చూచుచుందురు.

శ్రీరామకృష్ణులు కామార్పుకూరులో నుండినప్పుడు, జను లాయన బయటకువచ్చునప్పుడెల్ల, నోళ్లు తెరచుకొని రెప్పవాల్పక వారివంక చూచుచుండెడువారు. ఒకనాడు శ్రీవారు ''భూతీఖాల్'' అని పిలువబడు కాలువవైపునకు విలాసార్థము వెళ్లినప్పుడు, నీళ్లు తెచ్చుకొనుటకై యచ్చటకు వచ్చిన స్త్రీలు నోళ్లు తెరచుకొని యాయన వంకచూచుచు ''అదే! గురుదేవులు వచ్చుచున్నారు!'' అని చెప్పుకొనిరి. ఈ దృశ్యమునుచూచి విసుగుకొని ''హృదూ! వెంటనే నా తలపై బట్టను కప్పివేయుము; లేనిచో, నాకట్టుబట్ట నిప్పుడే తీసి పారవైచెదను.'' అని తమతోకూడ వచ్చుచుండిన హృదయునితో శ్రీరామకృష్ణులు చెప్పిరి. ''వలదు, బాబూ! కట్టుబట్టను నీవు తీసివైచి, దిగంబరుడవైనచో జనులేమనెదరు?'' అని హృదయుడు బదులుచెప్పెను. తాను వివస్త్రుడై యుండచూచిరేని, ఆ స్త్రీలు పారిపోయెదరని యెరిగి యుండుటచే శ్రీగురుదేవు డట్లు చెప్పెను. హృదయుడు త్వరితముగా శ్రీరామకృష్ణుల మోముపై బట్టను కప్పెను.

శ్రీగురుదేవులు విచారముతో నుండగా నే నెన్నడును చూడలేదు. అయిదేండ్ల బాలునితో నుండినను, శ్రీవారెల్లప్పుడు సంతోషముగ నుండువారు. అబ్బాయీ! ఆయన ధుమధుమలాడు ముఖముతోనుండగా నే నెన్నడును చూడలేదు. ఆహా ఎంత సుదినములవి! కమార్పుకూరులో నుండినప్పుడు శ్రీరామకృష్ణులు వేకువజాముననే లేచి ''నేడు నేనీ ఆకుకూర తినెదను. నాకొరకు దానిని వండుము.'' అని నాతో చెప్పుచుండువారు. పిమ్మట నేనింటిలోని ఇతరస్త్రీ

లతో చెప్పి ఆకూరనువండి శ్రీవారికి భోజనము సిద్ధముచేయు దానను. కొలదినాళ్లయిన తరువాత "ఏమి యీమార్పు నాలో? నిద్రలోనుండి మేల్కొనినవెంటనే 'నేనేమి తినుదును, నేనేమి తినుదును?' అనియే గొడవచేయుచున్నాను. విశేషమైన ఏ ఆహారముపైనను నాకిక వాంఛ యెంతమాత్రము లేదు. నీవు నాకొరకేది వండిన నే నదియే తినెదను," అని శ్రీగురుదేవులు తమకుతామేవచ్చి నాతో చెప్పిరి.

దక్షిణేశ్వరములో శ్రీగురుదేవు లతిసారముతో బాధపడి, నివారణకొరకు కామార్పుకూరునకు వచ్చుచుండుట పరిపాటి. అట్టి సమయములలో 'అయ్యో! దైవమా! నా కడుపునిండ మలముతప్ప వేరేమియు లేదే. దీనికి అంతమే కనపడకున్నది!' అని విసుగుదలతో చెప్పుచుందురు. ఇట్లు బాధపడుచు, శరీరము నెడల నొకవిధమైన అసహ్యము నలవరచుకొని, అటు తరువాత దానినంతగా లక్ష్యముచేయుట మానివైచిరి............

ఇప్పు డెక్కడ జూచినను శ్రీరామకృష్ణుల భక్తులే! ఎంత యుద్రేకము! ఎంతహడావుడి! ఎంత గందరగోళము! కాని, శ్రీవారు వ్యాధిగ్రస్తులై యుండినప్పు డొకభక్తుడిరువది రూప్యము లీయకుండ తప్పించుకొనుటకై పారిపోయెను. అప్పుడు చందాలుసేకరించి, శ్రీగురుదేవుని చికిత్సకగువ్యయమును భరించుచుండిరి. ఈభక్తుని ఆపైకమిమ్మని యడిగిరి. ఇప్పుడు శ్రీగురుదేవుని సేవించు టెంతమాత్రము కష్టము కాదు. ఆహారము శ్రీవారికి సమర్పితమగుచున్నను, నిజముగా దానిని భుజించువారు భక్తులే. శ్రీగురుదేవుడు మీరు

కూర్చుండుమనిన కూర్చుండును, పరుండుమనిన పరుండును, తుదకిప్పుడాయన యొకచిత్తరువేకదా!

తలపాగ చుట్టుకొని, చేతులుజోడించి కాళీవిగ్రహము ప్రక్కను నిలువబడి యుండినట్లు శ్రీగురుదేవు డొక దివ్య దృశ్యమును గాంచెను. అటుతరువాత శ్రీవారియెదుట బలరా మెల్లప్పుడును చేతులుజోడించుకొనియే యుండువాడు. ఆత డెన్నడును శ్రీ గురుదేవుని పాదములు తాకి ఆయనకు నమస్క రింపలేదు. ఆతని భావమును గ్రహించి యొకనాడు "బల రామూ! నా పాదము దురదపెట్టుచున్నది, దయయుంచి అచ్చట మెల్లగ మర్దన చేయుము," అని శ్రీరామకృష్ణు లాతనితో చెప్పిరి. వెంటనే బలరాము నరేనునో, రాఖా ల్నో, శ్రీగురుదేవునకు పరిచర్య చేయుయువకులలో మఱి యొకరినో పిలుచుకొని రమ్మని మనుష్యునిబంపి, ఆ వచ్చిన వారిని శ్రీగురుదేవుని పాదములను మర్దనచేయగోరెను.

శిష్యుడు : ఒకసారి శ్రీరామకృష్ణుల మేనిచాయను గూర్చి నేను బ్రహ్మానందస్వాములవారి నడుగగా, "శ్రీగురు దేవులు నావలెనే (అనగా నల్లగా) నుండెడువారు," అని యాయన చెప్పెను.

అమ్మగారు : ఔను, రాఖాల్ మొదలగు శిష్యు లాయనదగ్గరకు వచ్చినప్పుడు శ్రీగురుదేవు లావిధముగనే యుండెడివారు. అప్పటికి శ్రీవారి పూర్వపుటారోగ్యమును, రూపవిలాసములును చెడిపోయినవి. ఇంత యెందుకు? నా విషయమే ఆలోచింపుడు. నాప్రస్తుత శరీరారోగ్యమును, రూపమును చూడుడు. నేను పూర్వమిట్లే కనుపడెడిదాననా?

లేదు లేదు. నేనాకాలమున మిక్కిలి యందముగ నేయుంటిని. ఇటీవల నా శరీరము స్థూలమయ్యెను గాని, పూర్వమిట్లుండెడిదిగాదు.........

పూజాసమయమైనది. అమ్మగారు పూజామందిరము లోనికి వెళ్లుటకు సంసిద్ధులగు చుండిరి. నేను క్రిందికిదిగి వచ్చితిని. పూజయైన తరువాత, భక్తులకు ప్రసాదమును తీసికొని వచ్చుటకై నేను మరల మేడమీాదకు వెళ్లితిని. మధురభక్ష్యములును, పండ్లునుగల యాకులను తీయుచుండగా నా మోచేయి శ్రీమాతృదేవి పాదములకు తగిలెను. “హా!” యని కేకవేసి అమ్మగారు చేతులుజోడించి నాకు నమస్కరించిరి. “ఇది అంతపాటింప దగినదేకాదు,” అని నేను విన్నవించినను, అమ్మగారు నాయెదుటవంగి నమస్కరించుటతో తృప్తినొందక, “నాయనా! రా! నిన్ను ముద్దు పెట్టుకొననిమ్ము,” అని చెప్పుచు తమచేతితో నాగడ్డమును నిమిరి, ముద్దాడిరి. అప్పటికామెకు మనస్సు కుదుటబడినది. ఈ విధముగా శ్రీమాతృదేవి తమశిష్యులను భగవత్స్వరూపులుగ గౌరవించుచు, తల్లి తనబిడ్డలనువోలె వారిని ప్రేమతో జూచుచుండువారు.

1919-వ సం॥ అక్టోబరు 25-వ తేది.

అప్పుడే తెల్లవారుచుండెను. అమ్మగారి శయ్యదగ్గర నే నేను కూర్చుండియుంటిని. ఆమె శ్రీ గురుదేవుని గురించి నాతో ప్రసంగింప నారంభించిరి.

శిష్యుడు : శ్రీగురుదేవులు చిత్తరువులో నిజముగా సజీవులై యున్నారా!

అమ్మగారు : ఉన్నారు, సందేహము లేదు. శరీరమును, ఛాయయు నొకటే* శ్రీ వారి చిత్ర పటము ఛాయయేకదా?

శ్రీ గురుదేవుని యునికి

శిష్యుడు : ఆయన అన్ని చిత్తరువుల లో కూడ నున్నారా?

అమ్మగారు : ఔను. శ్రీ వారి చిత్రపటము సమక్షమున నీ వెల్లప్పుడు నాయనను ప్రార్థింతు వేని, ఆ చిత్రపటము ముఖముననే నీకు వారు ప్రత్యక్షమగుదురు. ఆ చిత్రపట మున్నచోటు పూజామందిరమగును. (ఉద్బోధన పత్రికా కార్యాలయమున కుత్తరముననున్న ప్రదేశమును చేతితో చూపుచు) అచ్చట శ్రీ గురుదేవు నెవరైన నారాధించు చున్నా రనుకొనుము. శ్రీ వారి యునికిచే ఆ స్థలము పావన మగును.

శిష్యుడు : దాని కేమి? ప్రతిస్థలము విషయమునను జనులు మంచిచెడ్డలను చెప్పుకొనుచుందురు.

అమ్మగారు : ఈ విషయము కేవల మటువంటిది కాదు. అట్టి స్థలము శ్రీ గురుదేవుని విశేషదయకు పాత్రమగును.

---

* ఈ కారణమును బట్టియే తమకంటె పెద్దలగువారి నీడపై నెవరును నడువరు. జయరాంబటిలో నే నొకనాడు స్నానము చేసి, యింటికి తిరిగి వచ్చుచుంటిని. అమ్మగారుకూడ స్నానము పూర్తిచేసికొని తిరిగి వచ్చుచుండిరి. నేను వారిప్రక్కనే నడచుచు, వారినీడ నప్పు డప్పుడు త్రొక్కుచుంటిని. ఇదిచూచి అమ్మగారు నన్ను తన రెండవ ప్రక్కకువచ్చి, నడుపుమనిరి. వారి నీడపై నడుచుచుంటినని మొదట నేను గ్రహింపలేదు.

శిష్యుడు : మీరు నైవేద్యముచేయు భోజనపదార్థములను శ్రీ గురుదేవులు నిజముగా తినుదురా ?

అమ్మగారు : ఔను, తినుదురు.

దేవుడు నైవేద్యమును భుజించును

శిష్యుడు : కాని అందుకు తగిన నిదర్శన మేదియు మాకు కనుపడకున్న దే.

అమ్మగారు : శ్రీ వారికన్నులలోనుండి యొక తేజస్సు బయటకువచ్చి ఆహారపదార్థము లన్నిటిని నాకుచున్నట్లు కనుబడును. ఇదంతయు నెందులకు ? శ్రీ గురుదేవుల కేదైన ఆహారము కావలయునా ? అక్కరలేదు. భక్తుల సంతృప్తి కొరకే వారు నైవేద్య మారగింతురు. ఆ పవిత్ర ప్రసాదము వలన చిత్తశుద్ధి కలుగును. మొట్టమొదట భగవంతునకు నైవేద్యము చేయకుండ నెవరైన భోజనము చేసినయెడల,* వారి అంతఃకరణ అపవిత్రమగును.

---

* ఒక భక్తుడొకసారి శ్రీ మాతృదేవియొద్దనుండి సన్న్యాసులకు యోగ్యమైన కాషాయవస్త్రములను పుచ్చుకొనెను. పిమ్మట కొన్ని సంవత్సరములవరకు వ్యాధిగ్రస్తుడై ఆరోగ్యము కొఱకత దెచ్చటకో వెళ్లి తుదకు మఠములోనికివచ్చి నివసింపక, తనయింటికిబోయి అచ్చట కొంతకాలమును గడపి యొకనాడు జయరాంబాటికివచ్చి కాషాయవస్త్రములను శ్రీ మాతృదేవికి మరల నిచ్చివేసెను. ఈ విషయమునుగురించి ముచ్చటించుచు, "పాపము ! లౌకికవిషయలోలుర అన్నమును తినుట వలన, నాతని మానస మపవిత్రమైపోయెను," అని అమ్మగారు సెలవిచ్చిరి.

శిష్యుడు : శ్రీ గురుదేవులు నిజముగా నైవేద్యము తినుదురా ?

అమ్మగారు : ఔను. శ్రీవారు నైవేద్యమును తినుచున్నారో లేదో నేను చూచుటలేదా? పళ్లెరము ముందు కూర్చొని నైవేద్యమును భుజింతురు.

శిష్యుడు : తినునప్పుడు మీరు వాస్తవముగా చూచుచున్నారా ?

అమ్మగారు : ఔను. కొన్ని పదార్థములను శ్రీ గురుదేవులు నిజముగా తినెదరు. మఱి కొన్నిటి నూరక చూచి విడిచివేసెదరు. నీ స్వవిషయమునే యోచింపుము. ఈ వేళ ఆ వేళ అను నియమము లేక, అన్ని వస్తువులను తినుటకు నీవు మాత్ర మిష్టపడుదువా ? ఇంతేకాదు, ముక్కు మొగ మెఱుగని వారెవరో పెట్టిన భోజనముకూడ నీకు రుచింపదు; అటువంటిదే యీ విషయముకూడ. భగవంతుని మన మెంతవరకు ప్రేమించుచున్నామను విషయము కేవలము మన ఆంతరంగిక భావతీవ్రతపై నాధారపడి యుండును. అన్నిటికిని భగవత్ప్రేమయే ముఖ్యము.

శిష్యుడు : భగవంతునియందు ప్రేమ మనకెట్లు కలుగును ? ఒకరి సొంతకుమారుడైనను మఱియొకరిచే పెంచబడిన యెడల, తన సొంతతల్లినే యతడు తన తల్లిగా గుర్తింపడు.

భగవత్కృప—భగవంతుడు మన సొంతము

అమ్మగారు : ఔను; అది నిజమే. కావలసినది భగ

వంతుని దయయే. కనుక జనులు భగవంతుని దయకొఱకు ప్రార్థింపవలెను.

శిష్యుడు : భగవంతుని దయకు పాత్రులైనవారని, పాత్రులుకానివారని మన మెట్లు చెప్పగలము? దయ అందరకు నొకటియేకదా.

అమ్మగారు : సాధకులు నదీతీరమున గూర్చొని భగవంతుని ప్రార్థింపవలయును. సముచితకాలమున వారు తరింతురు.

శిష్యుడు : ప్రాప్తకాలమున సర్వము జరుగుచుండు నప్పుడు భగవంతుని దయతో పనియేమి?

అమ్మగారు : నీవు చేపలను బట్టగోరెదవేని, యేటిగట్టున కూర్చొని గాలమువేసి కనిపెట్టుకొనియుండ నక్కఱ లేదా?

శిష్యుడు : భగవంతుడు మన సొంతమైనప్పుడు, మనము కూర్చొని వేచియుండనేల?

అమ్మగారు : అది నిజము. అకాలమునగూడ భగవంతుని దయ కలుగవచ్చును. మామిడి, పనస మొదలగు పండ్లు నేడకాలముననైన జనులకెట్లు దొరకుచున్నవో నీవు చూచుటలేదా? ఇప్పుడు భాద్రపద మాసములో మామిడి చెట్లెంత విస్తారముగా కాపు కాయుచున్నవి!

శిష్యుడు : మనము కోరినదానినిచ్చి భగవంతుడు మనలను పంపివేయునా? ఇదియే మనహద్దా? లేక పరమేశ్వరుని మన సొంతముక్రింద మనము భుక్తపరచుకొనవచ్చునా? భగవంతుడు నా సొంత పెన్నిధి యగునా?

అమ్మగారు : ఔను. భగవంతుడు కేవలము మన సొంతమే. ఇదియే శాశ్వత సంబంధము. మనకు భగవంతుని యందుగల భక్తితీవ్రతనుబట్టి, మనకాయన సాక్షాత్కారము కలుగుచుండును.

శిష్యుడు : భావోద్రేక మొక స్వప్నము వంటిది. మన తలంపులనుబట్టియే మనకు కలలు వచ్చుచుండును.

అమ్మగారు : అది స్వప్నమే. ఈ ప్రపంచమంతయు కూడ స్వప్నమే. ఈ జాగ్రదవస్థకూడ స్వప్నమే.

శిష్యుడు : కాదు. జాగ్రదవస్థ స్వప్నమే యైనచో రెప్పపాటులోనే అది అంతమై యుండవలసినది. అట్లుకాక ఈ స్థితి చాల జన్మలవరకట్లే యుండును.

అమ్మగారు : అట్లయ్యు నిది స్వప్నమే. నిన్నరాత్రి నీకు వచ్చినకల యిప్పుడుండదు. (నిజముగాకూడ కడచిన రాత్రి యీ శిష్యునకొక యద్భుత స్వప్నము వచ్చెను.) ఒక కుమారుని గోల్పోయిన వ్యవసాయదారునకు, రాత్రి తానొక రాజుగా నుండినట్లును తన కెనమండ్రు కొడుకులుండినట్లును కలవచ్చెను. ఆ కల అయినతర్వాత "నా యెనమండ్రు బిడ్డల కొరకేడ్తునా, ఈ యొకనికొరకేడ్తునా?" అని అతడు తన భార్య నడిగెను.

ఈ విధముగా అమ్మగారితో వాదించి "అమ్మా ఇప్పుడు నేను మీకు విన్నవించిన విషయమై నిజముగా నా కెంతమాత్రము చింతలేదు, నా 'సొంతము' అని నేను చెప్పుకొనదగినవా రెవరైన నున్నారేమో యనియే నేను తెలిసికొనగోరినదెల్ల," అని శిష్యుడు చెప్పెను.

అమ్మగారు : అట్టివాడున్నాడు.

శిష్యుడు : నిజముగా?

అమ్మగారు : ఔను.

శిష్యుడు : అట్టివాడు నిజముగా మన 'సొంతమే' యైనచో, అతనిని చూచుటకై మనమేల యాతనిని ప్రార్థింప వలయును? వాస్తవముగా నా సొంతమైనవాడు, నేనాతనిని పిలువలేకపోయినను నా కడకు వచ్చును. మన తల్లిదండ్రులవలె భగవంతుడుకూడ మనకు కావలసినవానినెల్ల సమకూర్చుచున్నాడా?

అమ్మగారు : ఔను, నాయనా, అది నిజము. వాడే మనకు తల్లియు తండ్రియు నయ్యెను. మన తల్లిదండ్రులవలె మనలను పెంచినవాడు వాడే. వాడే మనకేమి కావలయునో కనిపెట్టి మన యోగక్షేమములను చూచుచున్నాడు. లేనిచో, ఇంతకుపూర్వము నీ వెక్కడుంటివి, ఇప్పు డెక్కడున్నావు? నీ తల్లిదండ్రులు నిన్ను పెంచిరి కాని, నీవు వారివాడవు కావని కట్టకడకు గ్రహించిరి. కాకిగూటిలో పెరుగు కోయిలను నీవు చూచుటలేదా?

శిష్యుడు : భగవంతుడు నిజముగా నా 'సొంతము' అని నేను గ్రహింతునా?

అమ్మగారు : ఔను, నిజముగా నీవు వానిని గ్రహింతువు. నీవు తలచినదెల్ల నీకు దొరకును. స్వామీజీ (వివేకానందస్వామి) భగవంతుని తెలిసికొనలేదా? స్వామీజీ తెలిసికొనినట్లే నీవును భగవంతుని తెలిసికొనెదవు.

శిష్యుడు : అమ్మా! నేను భయమువలనగాని, విశ్వాస శూన్యతవలనగాని చెడిపోకుండ ననుగ్రహింపుడు.

అమ్మగారు : అటువంటి ప్రమాదమేమియు నీకు లేదు. ఏలన, నేనే చేపను గాలమువేసి పట్టితిని.

శిష్యుడు : మంచిది, మేమందరముకూడ ఆ పరమ సుఖము ననుభవింతుము.

అమ్మగారు : ఔను. అచ్చుదిమ్మ నొకరు చేసిపెట్టిన, దానిసాయమువలన నితరులెందరో తమతమ బొమ్మలను చేసికొనెదరు.

శిష్యుడు : ఔను. మాకొరకు మీరుమాత్రము కృషి చేసినయెడల, మాకు సర్వము లభించును. మమ్ము మీరు త్రోసివేయజాలరు.

అమ్మగారు : ఔను, నాయనా. నీకొరకు నేను కృషి చేసినచో, నీకు సర్వము దొరకును.

* * *

ఉదయమున 'షిల్లాంగు' నుండి యొకభక్తుడు వచ్చెను. అమ్మగారి దివ్యస్వభావము విషయమై సందేహించి, తా నేడు సారులు శ్రీమాతృదేవిని కలలో చూచిననేతప్ప, తా నామెను పోయి సందర్శింపనని ప్రతిజ్ఞపట్టెను. ఆతనికి కావలసిన స్వప్నములు వచ్చినతరువాత శ్రీమాతృదేవిని సందర్శింప జయరాంబటికి అరుదెంచి, మధ్యాహ్నమున దేవివారియొద్ద సెలవుతీసికొనునప్పుడు "అమ్మా! నేనిపుడు వెళ్లవలెను. నాకింక కోరదగిన దేదైన నున్నదా!" అని యాత డడిగెను.

అమ్మగారు : ఔను, నీ వవశ్య మపేక్షింపదగిన దొకటి యున్నది. నీవు మంత్రోపదేశము నొందవలయును.

భక్తుడు : నేను కలకత్తాలో బాగ్‌బజారుకు వచ్చి, మంత్రోపదేశము నొందవచ్చునుగదా.

అమ్మగారు : నాయనా! ఆ పనిని నీవిప్పుడే ముగించుట మంచిది. నేడే మంత్రోపదేశము నొందుము.

భక్తుడు : నేను ప్రసాదమును తినియుంటినే.

అమ్మగారు : అయిననేమి? అందువలన ప్రమాదమేమియు లేదు.

మంత్రోపదేశమునొంది, ఆ భక్తుడు బయలుదేరి వెళ్లెను.

ఉదయమున నింతకంటె ముందుగనే, విపరీతస్వభావుడగు నొక యువ-భక్తుడువచ్చి తనకు సన్న్యాస మిప్పింపుడని అమ్మగారిని వేధించెను; అమ్మగారు తనను 'పిచ్చి' వానినిగా జేసి, శ్రీగురుదేవుడు వెంటనే తనకు ప్రత్యక్షమగునట్లు చూడవలయుననికూడ పట్టుపట్టెను. అమ్మగారెట్లో వానినప్పటికి సమాధానపరచి యింటికి పంపిరి. ఈ విచిత్ర భక్తుని మానసికస్థితి జయరాంబటినుండి యింటికి తిరిగివచ్చిన తరువాత మఱింత చెడిపోయి, అతడు శ్రీగురుదేవుని సందర్శనమునకై తత్తరపడజొచ్చెను. తమ సంకల్పమాత్రమున శ్రీరామకృష్ణుల దర్శనప్రాప్తి నొసంగగల శ్రీమాతృదేవి అట్లు చేయనందున మనస్సున నొచ్చుకొని తీవ్రకోపాయత్తచిత్తుడై "అమ్మా! నేను శ్రీగురుదేవుని చూచునట్లు కటా

క్షింపరా ?'' అని యాత డడిగెను. ''ఔను. నీ వాయనను చూచెదవు. ఇట్లు తొందరపాటు పడకుము,'' అని అమ్మగారు ప్రేమతో చెప్పిరి. తనయాగ్రహమింక పట్టజాలక ''మీరు నన్ను మోసముచేయుచున్నారు. మీరు నాకిచ్చిన జపమాల నిదే, మరల తీసికొనుడు. దీనిని నే నింక లక్ష్యముచేయను,'' అని చెప్పి అత డా జపమాలను అమ్మగారిమీద విసరివేసెను. ''మంచిది. ఎప్పటికిని శ్రీరామకృష్ణుల బిడ్డడవై యుండుము!'' అని అమ్మగారు చెప్పిరి. అతడు వెంటనే అచ్చటినుండి వెడలి పోయెను.

కొంతకాలమైన తరువాత ఈ భక్తుడు నిజముగా వెఱ్ఱి వాడై రామకృష్ణ ధర్మసంస్థలోని స్వాముల(వారల)ను తిట్టుచు ఉత్తరములు వ్రాయ నారంభించెను. అత డీ విషయమున శ్రీ మాతృదేవినిగూడ విడువలేదు.

ఒకనా డీ భక్తునిగురించి మాట్లాడుచు ''అతడు మంత్రమునుగూడ తిరిగి ఇచ్చివేసెనా ? అతడు తన జపమాలను పారవేసెనే. ఎవరైనను మంత్రమునుగూడ తిరిగి ఇచ్చివేయ గలరా ?'' అని అమ్మగారి నడిగితిని.

అమ్మగారు : అట్టి దెన్నడైన సాధ్యమగునా ? మంత్ర ములో జీవమున్నది. దానిని గైకొనువా రెవరైనను తిరిగి యిచ్చివేయగలరా ? ఒకసారి గురువుచే ఆకృష్టుడైనవాడు తన గురుని విడనాడ గలడా ? ఇతడుకూడ బుద్ధి తెచ్చుకొని తా నిపుడు దూషించుచున్నవారికి పాదాక్రాంతుడగుదినము తప్పక వచ్చును.

భక్తుడు : ఇట్టి సంఘటన యేల జరుగవలయును ?

అమ్మగారు : ఇట్టి విషయములు జరుగుచుండుట యెల్లరకును విదితమే. ఒకగురువు పెక్కు శిష్యులకు మంత్రోపదేశము చేయవచ్చును. కాని వారందఱి స్వభావము నొకేరీతిగ నెట్లుండగలదు. భక్తుని స్వభావమునుబట్టి యాతని యాధ్యాత్మిక జీవితప్రభావము వ్యక్తమగుచుండును. "అమ్మా! నన్ను పిచ్చివానిగా చేయుడు." అని యితడొకసారి నన్నడిగెను. "నాయనా! ఏల ? నీవేల పిచ్చివాడవై యుండవలయును. ఎంతోపాపము చేసిననే తప్ప, ఎవరికైన ఉన్మాదావస్థ యెన్నటికైన కలుగునా ?" అని నేను బదులుచెప్పితిని. అందుపై "నా తమ్ముడు శ్రీ గురుదేవుని చూచియున్నాడు. నాకుగూడ శ్రీవారి దర్శనమగునట్లు కటాక్షింపుడు," అని యతడడుగగా "ఆయనను స్థూలనేత్రములతో నెన్నడైన నెవరైన చూడగలరా ? కండ్లుమూసికొని యెవరైన శ్రీ గురుదేవుని చూచిన చూడవచ్చును. నీ తమ్ముడు పసిబిడ్డడు. ఒకవేళ తనకండ్లను మూసికొని శ్రీ గురుదేవు నాతడు చూచియుండి, స్థూలనేత్రములతో శ్రీవారిని చూచితి నని అతడు తలంచుచుండవచ్చును," అని హితవుచెప్పి, పారమార్థిక సాధనలను చేయుచు శ్రీగురుదేవు నాతడు ప్రార్థించుచుండునెడల తనకుగూడ శ్రీవారిదర్శనము కలుగునని హెచ్చరించితిని. ఆధ్యాత్మికముగా తానెంత యభివృద్ధిని గాంచెనో, తన కేపాటి జ్ఞానమును, భగవత్స్మృతియు కలిగెనో యే మనుష్యునకైనను వానియంతరాత్మయే చెప్పును. ఇంతే

కాక, స్థూలనేత్రములతో భగవంతుని చూడగలిగినవా రెవరున్నారు?

ఉద్బోధన పత్రికా కార్యాలయములోనివా రీభక్తుని తీవ్రముగా మందలించిరి. అటుతరువాత నితడు గంగానదీ తీరమున నివసించుచుండెడివాడు. ఒకొక్కప్పుడితడు ఉద్బోధనపత్రికాభవనము గుమ్మముపై కూర్చుండి, అక్కడనే భోజనము చేయుచుండును. కొంతకాలమైన తరువాత శ్రీ మాతృదేవి అనుమతితో నితనిని వారికడకు తోడ్కొని వచ్చిరి. అమ్మగా రీతని నెన్నివిధములనో సమాధానపరుప ప్రయత్నించి, ఇట్లు చెప్పిరి: 'నాభక్తుల అవసానకాలమందు వారికి నేనండనై నిలువవలెను,' అని శ్రీ గురుదేవులు చెప్పుచుండువారు. ఇవి వాస్తవముగా శ్రీవారి నోటినుండి వెలువడినమాటలు. నీవు నా బిడ్డడవు. దేనిని జూచి నీవు భయపడవలయును? పిచ్చివానివలె నేల ప్రవర్తించెదవు? అట్టి ప్రవర్తన శ్రీ గురుదేవునకు అవమానకరము కాదా? శ్రీ రామకృష్ణుల భక్తుడు వెఱ్ఱివాడైనాడని లోకు లనెదరు. శ్రీ గురుదేవున కపకీర్తికరమగు విధమున నీవు ప్రవర్తింప వచ్చునా? ఇంటికిపోయి యితరులందరివలెనే జీవింపుము. వారివలెనే భోజనముచేయుచు జీవింపుము. నీ మరణకాలమున శ్రీ రామకృష్ణులు నీకు ప్రత్యక్షమై, నిన్ను తమ సన్నిధికి గొనిపోయెదరు. ఆయనను స్థూలనేత్రములతో నెవరైన నెన్నడైన చూచినారేమో నాకు చెప్పగలవా? నరేను (వివేకానందస్వామి) మాత్రమే శ్రీ గురుదేవునట్లుచూచెను. ఇది శ్రీవారి సందర్శనమునకై స్వాములవారెంతో పరిత

పించుచుండినప్పుడు, అమెరికాలో జరిగెను. శ్రీ గురుదేవుడు తనచేతిని పట్టుకొనినట్లు నరేనునకు తోచుచుండెడిది. ఈదివ్య దర్శనముకూడ కొలదినాళ్లవరకు మాత్రమే కలిగెను. ఇక నీ వింటికిపోయి సుఖముగా నుండుము. లౌకికుల జీవిత మెంత దుఃఖభాజనము! మొన్ననే రామునికుమారుడు మరణించెను. అధమమట్టి విచారమేదియులేక నీవు సుఖముగా నిద్రింపవచ్చునే!

శ్రీ మాతృదేవి చెప్పిన ఈ హితోపదేశమును విని యా భక్తుడు చాల శాంతినొంది, ఉద్బోధనాభవనములో భోజనముచేసి, పిమ్మట తన స్వగ్రామమునకు తిరిగివచ్చి క్రమ క్రమముగా తన యెప్పటి మనస్స్వాస్థ్యమును బడసెను.

*　　*　　*　　*

జయరాంబాటి 1911-వ సం॥ మే 26-వ తేది.

రామేశ్వర యాత్ర పూర్తి చేసికొని శ్రీ మాతృదేవి కలకత్తాకు తిరిగివచ్చి, కొలదినాళ్లైన తరువాత జయరాంబాటికి వెళ్లినారు. తమ ప్రాత యింటిముంగిటి వసారాలో నొకనాటి సాయంకాలమున గూర్చొనియుండి యొక సన్న్యాస భక్తునిగురించి, అమ్మగారు నన్నడిగిరి.

అమ్మగారు : అత డేమనెను?

శిష్యుడు : మూడు నాలుగు నెలలవరకు మీకొఱకతడు బెంగపెట్టుకొనెను.

అమ్మగారు : ఎంత విపరీతము! మాయాబంధముల నన్నిటిని, సన్న్యాసి త్రెంచికొనవలయును. ఇనుపగొలుసు

వలె, బంగారు గొలుసుకూడ సంకెలయే. సన్న్యాసి యేవిధ మైన మాయలోగాని చిక్కుకొనకూడదు. "అయ్యో! అమ్మ ప్రేమ! అమ్మప్రేమ! దానిని కోల్పోయితిని." అని అత డెల్లప్పుడు విలపింపనేల? ఏమి భావము లివి! పురుషులు నన్నెల్లెడల నాశ్రయించుచుండుట నా కిష్టములేదు. ఎంత యైనను ఇతడు పురుష స్వరూపుడు. నేను భగవంతునిగూర్చి చెప్పుచుండుటలేదు. నేను ఆడువారితో మెలగవలసిన దానను. ఆషుకూడ మంచిగంధమరగదీయుట కనియో, మఱియే యితర వంకనో పెట్టుకొని చీటికిమాటికి నాదగ్గరకు వచ్చుచుండెడువాడు. ఒకనా డతనిని మందలించితిని.

శిష్యుడు : వేదాంతాదర్శముల నవలంబించు సన్న్యాసులు నిర్వాణమును బడయుదురా?

అమ్మగారు : తప్పక క్రమక్రమముగా మాయాబంధములను త్రెంచివైచుకొని, నిర్వాణమును చూఱగొని వారు భగవంతునిలో నైక్యమగుదురు. ఈ శరీరమునకు ఆశలే కారణము. ఇందుకు సందేహమేమియు లేదు. ఆశాలేశము లేనిదే, శరీరము జీవించియుండజాలదు. ఆశలు పూర్తిగా నశించిన మానవునకు సర్వము సమాప్తము కానున్నదని అర్థము.

ఇచ్చటకు పిల్లలు (అనగా భక్తులు) వచ్చి భోజనము చేసి సంతోషపడి వెళ్లుచుందురు. వారియందు నాకు మమకారమేల యుండవలయును? "మీరేల యెల్లప్పుడును నరేంద్రునికొఱకును, ఇతర యువకులకొఱకును తహతహ లాడె

దరు? యథేచ్ఛగా తినుచు, తిరుగుచు, ఆటలాడుకొనుచు వారెంతో సుఖముగా నున్నారు. మీ మనస్సును భగవంతునిపై నిలుపుట శ్రేయస్కరము. వారియందు మీకేల యీ మమకారము?'' అని యొకనాడు హజ్రా శ్రీ గురుదేవునితో జెప్పెను. ఈ మాటలువిని శ్రీ గురుదేవుడు తన మనస్సును నరేంద్రుడు మున్నగు బాలశిష్యులనుండి తీసివైచి పూర్తిగా భగవద్ధ్యాన నిమగ్నము గావించి, నిర్వికల్ప సమాధిలోనికి బోయెను. శ్రీవారి గడ్డమును, శిరోజములును కదంబ పుష్పమువలె నిక్కపొడుచుకొనెను. శ్రీగురుదేవు డెటువంటి మానవుడో నీవేయూహించుకొనుము. ఆయన శరీరము కొయ్యబారెను. శ్రీవారికి పరిచర్య చేయుచుండిన రామలాల్ ''దయచేసి మరల మీ సహజస్వరూపము దాల్పుడు,'' అని చాలసారులు చెప్పెను. చిట్టచివరకు శ్రీ గురుదేవుని మనస్సు శరీరస్మారకమును కలిగియుండు స్థితికి వచ్చెను. మానవకోటియందు తమకుగల దయావిశేషము చేతనే, శ్రీరామకృష్ణులు తమ మనస్సును భౌతికప్రపంచముపై నిలిపియుంచిరి.

నిర్వాణమును, తదితర ముక్తిస్థితులను గురించి

మరణకాలమున యోగిను (యోగానందస్వామి) నిర్వాణమును కోరెను. ''యోగినూ! ఇటు చూడుము. నిర్వాణమునకు ఒప్పుకొనకు; సూర్యచంద్రులే తన నేత్రములుగాగల విశ్వరూపునిగ శ్రీగురుదేవుని భావింపకుము. శ్రీగురుదేవుడు మనతోనెట్లు కలసిమెలసి యుండెడివాడో అట్లే ఆయనను ధ్యానింపుము. ఆ భావముతోనే

ఆయనను సమీపింపుము'' అని గిరీశబాబు అతనితో చెప్పెను. దేవతలును అమరులును, ఎంతటివారైనను ఈ భూమిపై మరల జన్మించుచున్నారు; సూక్ష్మశరీరములతో వారాహారమును తినలేరు, మాటలాడలేరు. కనుక ఆస్థితిలో వారు చాలకాలము జీవింపజాలరు.

శిష్యుడు: వారన్నము తినలేనియెడల మాటలాడలేని యెడల వారు తమకాలమెట్లు గడిపెదరు?

అమ్మగారు: యుగములవరకు కొయ్యబొమ్మలవలె తామున్న చోటనే వారుందురు. రామేశ్వరమందలి రామలింగేశ్వరస్వామివారి దేవాలయములో నేనుచూచిన రాజవస్త్రాలంకృతులై నిలువబడియుండిన రాజులబొమ్మలవలెనే వారుకూడ నుందురు! భగవంతునకు వారి అక్కరకలిగినప్పుడు, వారి నాయన వారివారి స్థానములనుండి క్రిందకు తీసికొనివచ్చును. యమలోకము, సత్యలోకము ధృవలోకము మున్నగు వేర్వేఱు పరలోకములు కలవు. నరేంద్రుని (వివేకానందస్వామిని) సప్తర్షి మండలములో నుండి క్రిందికి భూలోకమునకు తాము తీసికొనివచ్చితిమని శ్రీగురుదేవులు చెప్పిరి. నిజముగా వారిమాటలు వేదవాక్యములే. అవి యెన్నటికిని అసత్యములు కాజాలవు.

శిష్యుడు: అట్లైన మేముకూడ కొయ్యబొమ్మలవలెనో మట్టిబొమ్మలవలెనో జీవింపవలెనా?

అమ్మగారు: అక్కరలేదు. మీరు శ్రీగురుదేవుని సేవచేయవలయును. రెండు తరగతుల భక్తులున్నారు. ఈ భూలోకములోవలెనే, యొక తరగతివారు భగవంతుని సేవ

చేయుచుందురు. రెండవతరగతివారు యుగములకొలది ధ్యాన నిమగ్నులై యుందురు.

శిష్యుడు : నిర్వాణసిద్ధియైన తరువాతకూడ ఈశ్వర కోటులు మాత్రము సామాన్యభేద ప్రపంచజ్ఞానస్థితికి రాగలరని, ఇతరుల కది సాధ్యముకాదని శ్రీగురుదేవులు చెప్పుచుండు వారు. దీని యర్థమేమి?

ఈశ్వరకోటులు నిర్వాణస్థితి నుండి వెనుకకు రాగలరు

అమ్మగారు : నిర్వాణసిద్ధియైన తర్వాతకూడ ఈశ్వర కోటి తన మనస్సును ఆ యనిర్వచనీయస్థితినుండి తిరిగి క్రిందకు తీసికొనివచ్చి సామాన్య ప్రపంచజ్ఞానావస్థకు మరలింపగలడు.

శిష్యుడు : భగవంతునిలో లీనమైన మనస్సును మరల మన ప్రపంచములోని కెట్లు తీసికొనిరాగలరు? ఒకపాత్ర లోని నీటిని చెరువులోనికి పారపోసిన తరువాత, ఆ పాత్ర లోని నీటిని ఆ చెరువునీటినుండి యెవరైన నెన్నటికైన విడదీయగలరా?

అమ్మగారు : ఇది అందరికిని సాధ్యముకాదు. పరమహంసలుమాత్రమే యిట్లు చేయగలరు. క్షీరనీరముల మిశ్రమమునుండి హంస క్షీరమును వేఱుపఱచి త్రాగగలదు.

శిష్యుడు : అందరును ఆశలను విడువగలరా?

అమ్మగారు : విడువగలిగినచో ఈ సృష్టియే అంతమొందియుండును. ఆశలనందరును విడువలేరు కనుకనే, సృష్టి జరుగు

ఆశలును, ముక్తియు

చున్నది. ఆశలుకలవారు మరల, మరల జన్మమెత్తు చుందురు.

శిష్యుడు : గంగానదీ జలములో నిలువబడియుండిన మనుష్యుడట్లే నిలువబడియుండి ప్రాణమును విడిచిపెట్టు నను కొనుడు.

అమ్మగారు : జననమరణములనుండి ముక్తి, ఆశా లేశముకూడ లేనప్పుడుమాత్రమే, సుసాధ్యము. ఆశ యిసు మంతైన నున్నచో, దేనివలనను లాభము లేదు. ఎవరికైనను భూమిపై నేటిదే కడసారి పుట్టుకయైనను, అట్టి మానవ వ్యక్తి ఆశలను విడనాడనియెడల, ఏమిలాభము ?

శిష్యుడు : అమ్మా! ఈ సృష్టి అనంతము ? చాల దూరములలోనున్న మండలములలో నేమి జరుగుచున్నదో యెవరు చెప్పగలరు ? లెక్కలేని యా నక్షత్రములలోను, మండలములలోను వేనియందైన ప్రాణముగల జీవులున్నవో లేవో యెవరుచెప్పగలరు ?

అమ్మగారు : ఈ మాయాప్రపంచమున సర్వజ్ఞుడై యుండగలవాడొక్క భగవంతుడే. బహుశః ఆ మండలముల లోను నక్షత్రములలోను, జీవముగల జంతువేదియు లేదు.

ఈ సంవత్సరమందే వర్షకాలములో నొకనాడు శారదానందస్వామియు, యోగీనీమాయియు, గోలప్ మాయియు మఱి కొందరు భక్తులును జయరాంబాటినుండి కామార్పకూరునకు వెళ్లిరి. యోగీనీమాయి కాలుజారి

రోడ్డుమీదపడి యామెశరీరమున కొన్నిచోట్ల చీరుకుపోయి రక్తము ప్రవహించెను. అందరికంటె ముందుగా జయరాం బాటికి నేను తిరిగివచ్చి శ్రీమాతృదేవితో యోగినీమాయికి సంభవించిన ప్రమాదమునుగురించి చెప్పితిని. అందుపై అమ్మగారిట్లు తమ విచారమును వెలిబుచ్చిరి: "వారుబయలు దేరక ముందు 'యోగిని మనతో వచ్చుచున్నది. ఆమె రోడ్డుమీద నెన్నిసారులు జారిపడునో చూచెదముగాక' యని గోలప్ చెప్పెను. గోలప్ మాటలను ఋజువుచేయుటకే యోగిని పడిపోయెను. నిజముగా ఆ మాట లోక సాధ్వి నోటి నుండి వెడలివచ్చినవి. ఆమె తపస్విని. కనుక ఆమె మాటలు జరిగి తీరును. ఇందుచేతనే, సాధువు లెన్నడు నెవరినిగురించియు నేమియు చెప్పకూడదు."

ఉద్బోధనా పత్రికాకార్యస్థానము,కలకత్తా, 1912-వ సం॥జనవరి 16-వ తేది.

ఆధ్యాత్మికాభ్యుదయమును శీఘ్రముగ కలుగజేయుట

నేటియుదయముననే అమ్మగారితోకూడ నామెగదిలో నుంటిని. "అమ్మా! ఒకనాడు శ్రీ చైతన్యమహాప్రభువు 'నీకు కృష్ణునియందు భక్తి కలుగుగాక!' అని నారాయణిని ఆశీర్వదించిరి. ఈ మాటలం దెంతటి మహిమయుండెనో కాని మూడు నాలుగేండ్ల ప్రాయముగల ఆ బాలిక వానిని వినినతోడనే 'హా! కృష్ణా! ఓ కృష్ణా!' అని శ్రీకృష్ణనామమును స్మరించుచు నేలపైబడి దొర్లెను. నారదునిగురించి మే మొక కథను చదివియున్నాము. భగవత్సాక్షాత్కారము నొందినతరువాత నొకనాడా మహా

నీయు డొక చీమయెడల కనికరము వహించి తనలో తా నిట్లనుకొనియెను: 'ఎన్నియో మానవజన్మలెత్తి చేసిన తపఃఫలముగా నేను పరమార్థమును సాధించితిని. మానవ జన్మ మెత్తుటకుకూడ పాప మీ చీమ అనంతకాలము వేచి యుండవలెను గదా.' ఇట్లు జాలిపడి 'నీకు ముక్తి కలుగుగాక!' అని యా చీమ నాశీర్వదించెను. వెంటనే చీమ పక్షులు జంతువులు మున్నగు మానవేతర రూపములను ధరించి క్రమముగా నొక మనుష్య శరీరమును గైకొనెను. పిమ్మట మానవజన్మ లెన్నియోయెత్తి, సుఖదుఃఖము లనుభవించి క్రమక్రమముగా పారమార్థిక సాధనలను శ్రద్ధతో జేసి, భగవంతు నారాధించి ముక్తిని బడసెను. బహుజన్మలలో జరిగిన యీ సంఘటనల నన్నిటిని నారదుడు రెప్పపాటులో జూచెను. కనుక మహాత్ముల దయావిశేషమున మానవులకు వెంటనే ముక్తి లభింపవచ్చును,'' అని చెప్పితిని.

అమ్మగారు: అది నిజమే.

శిష్యుడు: దీనితోపాటు నే నింకొక విషయముకూడ వినియున్నాను. ఇతరుల పాపముల ఫలమును తానే యనుభవింప సమ్మతించు మానవు డెక్కువకాలము జీవింపజాల డందురు. ఎందరికో ముక్తిని సమకూర్చి యుండగల శరీర మొక్కరికొరకు కృశించిపోవును.

మహాత్ములు - పాపుల సముద్ధరణము

అమ్మగారు: అదికూడ నిజమే. ఇంతేకాదు. ఈ విధముగా మహాత్ములు తమశక్తిని గోల్పోవుదురు. ఎందరో జీవుల ముక్తికి వినియోగపడియుండగల

ప్రచండ తపోమహిమ, యొకే యొక మానవవ్యక్తి శ్రేయమునకై వ్యయమగుచున్నది. "గిరీశుని పాపఫలము లెల్ల నేనే భరింప బూనుకొని యుండుటచేతనే, నాకీ శరీర బాధ లెల్ల కలుగుచున్నవి," అని శ్రీ గురుదేవులు సెలవిచ్చుచుండువారు. ఇప్పుడు గిరీశుడుకూడ బాధపడుచున్నాడు.

శిష్యుడు : అమ్మా! ఒకనాడు నాకొక కలవచ్చెను. చింపిరి జుట్టుగల మనుష్యు డొకడు మీ దగ్గరకువచ్చి, మీరతని కేదైన మేలు వెంటనే చేయవలయునని పట్టు పట్టుచుండెను. అత డింతకుమున్నె మీయొద్ద మంత్రోపదేశ మందినవాడే. కాని, తానుమాత్ర మే యాధ్యాత్మిక సాధననుకూడ చేయడట. 'నే నతని కేమైన నుపకారము చేసిన యెడల, నేను జీవింపను; నా శరీరము వెంటనే పడిపోవును,' అని మీరు చెప్పితిరట. నే నత్యంత మనఃపూర్వకముగా మి మ్మా మనుష్యునిపట్ల నెంతమాత్రము దయ చూపవలదని ప్రార్థించుచు, "మీరేల యితనికి సాయము చేయవలయును? ఇతడు తనముక్తిని తానే సంపాదించుకొనును. అతనినే సాధన చేయనిండు," అని విన్నవించితిని. అత డొకే పట్టు పట్టినందున, మీ రాతని సేవగించుకొనుచు, "నే నితని కేమైన సాయము చేసినచో నే నిక జీవింపజాలను; నా శరీరము వెంటనే పడిపోవును," అని పలుసారులు చెప్పుచు నాతని రొమ్మును మెడను చేతితో దాకి మీ రాతని కేదో సాయము చేసితిరి. అంత నా కల అంతరించెను. భౌతికశరీరము దాల్చినచో నెవరైన తమ మహిమను కొంత గోల్పోవుదురందురు. ఇది నిజమా?

అమ్మగారు : ఔను. నిజమే. కొంతమంది యెడతెంపు లేకుండ కోరినమీదట విసుగుపుట్టి, "ఈ శరీర మేనాడో యొకనాడు మరణించును. ఈతనికి ముక్తినొసగెదను. ఈ క్షణమే యీ శరీరము పడిపోయిన పడనిమ్ము," అని పలు సారులు తలంతును.

శిష్యుడు : అమ్మా! భగవత్సాక్షాత్కారమనగా జ్ఞాన, చైతన్యముల సిద్ధి యని అర్థమా? లేక మఱియొక యేదైనను అని అర్థమా?

భగవత్సాక్షాత్కారము అను మాటకు అర్థము

అమ్మగారు : ఈ పైనచెప్పినవి సిద్ధించుటకాక ఆ మాటకు వేఱే అర్థమేమున్నది? భగవత్సాక్షాత్కారము కలిగిన మనుష్యునకు రెండుకొమ్ములు మొలచునని యెవరైన చెప్పుదురా?

శిష్యుడు : మీ భక్తకోటిలో చాలమంది భగవత్సాక్షాత్కారమునకు వేఱే విధముగా వ్యాఖ్యానము చేసెదరు. మానవుడు స్థూలనేత్రములతో భగవంతునిజూచి ఆయనతో సంభాషించునని వారి నమ్మకము.

అమ్మగారు : ఔను; "దయయుంచి నాయనను మాకు కనబఱచుడు," అని వారడుగుచుందురు. కాని, శ్రీరామకృష్ణు లెవరి తండ్రియునుగారు. గురువు, కర్త, తండ్రి—ఈ మూడు మాటలే యాయనను, శూలములవలె గ్రుచ్చుకొని బాధించెడివి. ఋషు లెంతమంది యుగములకొలది తపస్సుచేసిరి! అయినను వారు భగవత్సాక్షాత్కారము బడయజాలక

పోయిరి. ఇప్పుడన్నన్నో జనులెట్టి సాధనలను చేయరు, నియమములేవియు పాటింపరు. కాని, వారికి వెంటనే భగవంతుని కనుబఱచవలెనట! ఆ పని నే చేయజాలను. శ్రీరామకృష్ణు లెవరికైనను భగవంతుని గనుబఱచిరేమో నీవు నాకు చెప్పగలవా?

శిష్యుడు : అమ్మా! సరేకాని, ఎంత ప్రయత్నించినను కొంతమందికి సిద్ధికలుగదని, ప్రయత్నింపకపోయినను కొంత మందికి పరమార్థము లభించునని చెప్పెదరు. దీని అర్థమేమి?

అమ్మగారు : భగవంతునిది శిశుస్వభావము. కొంత మంది అడిగినను వారికీయడు. మరి కొంద రడుగకపోయినను తీసికొనుడని వారికిచ్చును. ఇట్లిచ్చినవారు బహుశః వారివారి పూర్వజన్మలలో పుణ్యకార్యము లెన్నియో చేసి యుందురు. అందుచేత భగవదనుగ్రహమునకు వారు పాత్రులైరి.

భగవంతుడు శిశు స్వభావుడు

శిష్యుడు : అప్పుడు భగవత్కటాక్షవిషయమునగూడ యోగ్యాయోగ్యత విచక్షణ యున్నదన్నమాట.

అమ్మగారు : ఔను. అది నిజము. సర్వము మానవుల పురాకృతకర్మపై నాధారపడియున్నది. కర్మ అంత మొందిన వారికి భగవత్సాక్షాత్కారము కలుగును. అదియే వారి కడపటి జన్మము.

శిష్యుడు : పారమార్థికజ్ఞానము, అఖండ చైతన్యాను భూతి కలుగుటకు కర్మక్షయమును, ధార్మికసాధనలును,

ప్రాప్తకాలమును ముఖ్యకారణములని ఒప్పుకొందును. కాని భగవంతుడు మన 'సొంతము' అయినయెడల సంకల్పమాత్రమున తన భక్తున కాయన ప్రత్యక్షము కాజాలడా?

అమ్మగారు : నిజమే. కాని, భగవంతుడు తన 'సొంతము' అను నమ్మక మెవరికున్నది? జనులు తమ విధాయక ధర్మమని భావించి యేదో యొక సాధనను చేయుదురే కాని, భగవంతునికొఱ కెందరు ప్రయత్నింతురు?

శిష్యుడు : తన సొంతతల్లి పోషణప్రేమలకు దూరము చేయబడిన శిశువు తన సొంతతల్లినే గుర్తింపడని నేను మీా కొకసారి చెప్పితిని.

అమ్మగారు : ఔను, నీవు నిజము చెప్పితివి. ఒక మనుష్యు డింకొకని చూడనిదే యెట్లు ప్రేమింపగలడు? నన్ను నీవు చూచుచున్నావు; ఇదివరకు చూచియున్నావు. నేను నీ తల్లిని, నీవు నా బిడ్డవు.

1912 సం॥ ఫిబ్రవరి 1-వ తేది.

నేడు శ్రీమాతృదేవి దగ్గరకు నేను వెళ్లునప్పటికి రాత్రి సుమారు తొమ్మిదిన్నర గంటయైనది. పగటివేళ నేనామెను చూడనేలేదు.

అమ్మగారు : పగలంతయు నీ వెక్కడనుంటివి?

శిష్యుడు : క్రిందను లెక్కల పుస్తకములను చూచుచున్నాను.

అమ్మగారు : ఔను. ప్రకాశ్ కూడ నాతో అట్లే చెప్పి నాడు. సంసారమును త్యజించినవారి కెవరికైన నిట్టివిషయములు రుచించునా? ఒకసారి శ్రీ గురుదేవుని జీతము విషయమై లెక్కలలో పొరపాటువచ్చెను. దేవాలయ కార్యనిర్వాహకుని కడకు వెళ్లి ఆ విషయమై మాటలాడుడని శ్రీవారిని గోరితిని. "ఎంత సిగ్గుచేటు! లెక్కల విషయమై చింతింతునా?" అని ఆయన చెప్పిరి. "భగవన్నామమును స్మరించువా రెన్నడును బాధపడరు. నీ విషయమై వేఱుగ చెప్పనేల!" అని వా రొకసారి నాతో చెప్పిరి. త్యాగమే వారి భూషణము.

శ్రీ గురుదేవుల మహోజ్వల త్యాగము

1912-వ సం॥ ఫిబ్రవరి 9-వ తేది.

నిన్న రాత్రి గిరీశచంద్రఘోషు స్వర్గస్థుడయ్యెను. అతనినిగురించి, "అమ్మా, శరీర స్మారకము లేని స్థితిలో మరణించువారికి తరువాత నున్నతతరమైన ఆధ్యాత్మిక పదము కలుగునా?" అని శ్రీ మాతృదేవి నడిగితిని.

శరీరస్మృతిపోయిన తరువాత మరణించువారి ఆధ్యాత్మికస్థితి

అమ్మగారు : శరీరస్మారకము పోవుటకు మున్ను మనస్సున గల ప్రధానభావమునుబట్టి జీవుని మరణానంతర స్థితి యేర్పడును.

శిష్యుడు : ఔను. అది నిజము. సాయంకాల మారు గంటలైనతరువాత "జయ్ రామకృష్ణా!" యని యుత్కం

తగా బలికి గిరీశుడు శరీరస్మృతిని గోల్పోయెను. అటు తరువాత నాతనికి మరల శరీర స్మృతి కలుగనే లేదు. శరీర స్మృతి పోవుటకు కొలది నిమిషములుముందు "మనము పోవుదము, మనము పోవుదము! నాయనా! నన్ను కొంచెము పట్టుకొనుము," అని యీ తీరున నతడెల్లప్పుడును చెప్పుచుండెను. "మాటిమాటికి 'మనము పోవుదము, మనము పోవుదము, పద'* అనియే యేల చెప్పుచుందువు? శ్రీ రామకృష్ణుల దివ్యనామస్మరణ చేయుము. అదియే నీకు నిజముగా మేలుచేయును," అని నే నాతనితో చెప్పితిని. ఈ విధముగా నేను రెండుసారులు చెప్పినపిమ్మట "అది నాకు తెలియదా!" అని గిరీశబాబు ప్రత్యుత్తరమిచ్చెను. "మంచిది. లోలోన నితనికి తెలివిపూర్తిగానున్నది," అని తలంచితిని.

అమ్మగారు: శరీరస్మారకముపోవుటకు మున్ను తన మనస్సున ప్రబలియుండిన భావమందే యాతడు పూర్తిగా నిమగ్నుడై యుండెను. వారందరు (శ్రీరామకృష్ణుని శిష్యులందరు) శ్రీగురుదేవుని యందుండియే వచ్చిరి, తిరిగి వారి కడకే వెళ్లెదరు. వారాయన శరీరభాగములని, కరచరణాద్యవయవములని చెప్పనగును.

---

* మరణ సమయమున తన్నెవరైన గంగానదీ తీరమునకు గొనిపోవలయునని గిరీశబాబునకు తీవ్రవాంఛయుండెను. ఇందుచేతనే అతడీ మాటలనుచుండెను. "తన ఆత్మశ్రేయస్సునకు నా సోదరునకు గంగానది అవసరమా?" అని యాతని సోదరు డడిగెను.

1912-వ సం॥ ఫిబ్రవరి 21-వ తేది.

ఉదయ మేడుగంటలయ్యెను. శ్రీమాతృదేవి తమ మంచముదగ్గర నేలపై కూర్చుండిరి. ద్వారకకు తీర్థయాత్ర వెళ్లిన నిర్భయానందస్వాములవారు గిర్నార్ పర్వతముల లోని దత్తాత్రేయ దేవాలయమునుండి అమ్మగారికి ప్రసాదము పంపిరి. "దత్తాత్రేయుడన నెవరు?" అని అమ్మగా రడిగిరి.

శిష్యుడు : జడభరతుడు మొదలగు వారివలె ఆయన కూడ మహాముని, ఈశ్వరకోటి.

అమ్మగారు : శ్రీగురుదేవుని పిల్లలలో కొందరివలెనా?

శిష్యుడు : మంచిది. శ్రీగురుదేవుని శిష్యులలోని యీశ్వరకోటులు కొందరు భార్యాపుత్రాదులతో సంసార నిమగ్నులై యున్నారే! ఇది యెట్లు సంభవించెను?

అమ్మగారు : ఔను. వారచ్చట కృశించుచున్నారు. "నీ వాతని (శ్రీరామకృష్ణుని) కడకు వెళ్లెదవేని, మే మాతడు కలకత్తాకు వచ్చునప్పు డాతని బండిపై రాళ్లువిసరి దానిని ముక్కలు ముక్కలుగా చేసెదము," అని భయపెట్టి, పూర్ణ నకు వాని బంధువులు బలవంతముగా పెండ్లి చేసిరి.

శిష్యుడు : సరే, వారు పెండ్లి చేసికొని యుండవచ్చును. నాగమహాశయునకు మాత్రము కాలేదా? కాని పిల్లలనుకని, సంసారము చేయుటయా!

అమ్మగారు : బహుశః వారికట్టి కోరికలుండియుండును. అయినను ఒకసంగతిని నేను నీకు చెప్పవలసియున్నది. ఈ లోకము మహాక్లిష్టము, బహుదురవగాహము. శ్రీగురుదేవు

యొకరి ద్వారమున నొక పనిచేయును, మరియొకరి ద్వార మున మరియొక పనిచేయును.

ఓహో! భగవంతుని లీలలెంత దుర్గ్రాహ్యములు! అయిన నేమి? గృహస్థుడైనను ఈశ్వరకోటియైయుండగలడు. ప్రమాద మేమున్నది?

రాధుకు అనారోగ్యముగానుండెను. ఆమెకు నొప్పియు, జ్వరమును. ఆమె విషయమై అమ్మగారికి ఆందోళనగానుండి "నేను బ్రతికి యున్నంతవరకు దానికి ఆరోగ్యముకలుగదు. నేను పోయినతరువాత దాని క్షేమమును చూచువారెవరు? అప్పుడది బ్రతుకునా?" అని ఆమె చెప్పిరి.

శిష్యుడు : నేడంతయు భక్తులు తండోపతండము లుగా నెట్లు వచ్చుచుండిరి! మీకొకక్షణమైనను విశ్రాంతి లేకుండెను.

అమ్మగారు : "దయయుంచి యీ జనసమ్మర్దమును తగ్గించి నాకు కొంచెము విశ్రాంతికలుగనిండు," అని నేనహో రాత్రములు శ్రీ గురుదేవులను ప్రార్థించుచున్నాను. కాని అది నాకు దొరుకుట లేదు. శ్రీ గురుదేవుని సందేశమెల్లెడల వ్యాప్తినొందెను. అందుచేతనే యింతమంది జను లిచ్చటికి వచ్చుచున్నారు...శ్రీ గురుదేవుని జీవితావసానదినములలో కూడ జనులిట్లే ఆయనకడకు వచ్చుచుండిరి. నాకడకువచ్చు వారితో "మీకులగురువు నొద్ద మంత్రోపదేశము నొందుడు. మీ యొద్దనుండి వారేదైన నపేక్షింతురు. నే నేమియు కోరను," అని మనఃపూర్వకముగా చెప్పి వారిని పంపివేయు

ప్రయత్నింతును. కాని వారు నన్ను విడువక యేడ్చుచుందురు. దానితో నా హృదయము కరగిపోవును. మంచిది. నా జీవితాంతముకూడ సమీపించుచున్నది. నేనిక బ్రతుకబోవు కొలదిదినము లీతీరుననే కడచిపోవును.

శిష్యుడు : అయ్యో! వలదు. అమ్మా! మీరట్లేల చెప్పెదరు. మీరిప్పు డారోగ్యముగనే యున్నారు. మీకేదియు విశేషమైన బాధలేదు. అట్టిచో మీరీ ప్రపంచమును విడిచి వెడలి పోగోరనేల? అమ్మా! మీరట్లెన్నటికిని మరల చెప్పవలదు.

ఆ కాలమున అమ్మగారు బహువిచారముగను, లౌకిక విషయములపట్ల నిర్లక్ష్యముగను గనుపడుచుండిరి.

మధ్యాహ్నమున నొక ముక్కోపి శ్రీ మాతృదేవి కడకువచ్చి గందరగోళము చేసెను. ఈవిషయమై అమ్మగారిట్లు చెప్పిరి. శ్రీ గురుదేవులు నేనున్నట్లే యెవరికిని తెలియనీయలేదు. అత్యంతశ్రద్ధతో శ్రీవారు నన్నెల్లప్పుడు కాపాడిరి. నేడన్ననో దీనికి వ్యతిరేకమే పూర్తిగా జరుగుచున్నది. బజారులో డప్పువేసి చాటించినట్లు, నన్ను వీరు ప్రకటించుచున్నారు. దీనికంతకును కారణభూతుడు 'మ'. కథామృతముచదివి, జనులు మైమరచుచున్నారు. గిరీశబాబు శ్రీ గురుదేవుని బలాత్కరించి, తన యాప్తితములను బడసి ఆయనను దూషించెను. నేడు జనులు నావిషయమున గూడ నిట్లే ప్రవర్తించుచున్నారు. "మంత్రోపదేశమునకై వీరెల్లప్పుడును నన్నేల వేధింపవలయును? బేలూరుమఠములో నా

పిల్లలు (శ్రీగురుదేవుని శిష్యులు) కలరే; వారికేమియు శక్తి లేదా? ఇక్కడకే జనులందరిని పంపుచున్నారు. తమ కుల గురువును విడనాడిన యెడల వారికెంతో పాపము వచ్చునని కూడ చివరకు నేను జనులతో చెప్పితిని. కాని, అప్పటికిని వారు నన్ను విడువకున్నారు."

శిష్యుడు : భక్తులకు మంత్రోపదేశము చేయవలెనను కోరిక మీకున్నదికనుకనే, మీరు వారికి మంత్రోపదేశము చేయుచున్నారు.

నిజమైనగురువు దయ వలననే మంత్రోపదేశము చేయును

అమ్మగారు : లేదు. జాలిచే నే నీపనిచేయుచున్నాను; వారు నన్ను విడువరు. ఏడ్చెదరు. వారిని చూచి జాలిపడుదును. దయ తలచి, వారికి మంత్రోపదేశము చేయుదును. ఇంతేకాక, దీనివలన నాకేమి లాభము కలుగుచున్నది? భక్తులకు నేను మంత్రోపదేశము చేయునప్పుడు వారి పాపముల నేను భరింతును. అట్టి సమయమున "ఈశరీరమెట్లైనను పోవలసినదే; వారు సత్యమును గ్రహింతురుగాక!" అని తలచుచుందును.

1912-వ సం॥ మే 2-వ తేది.

శిష్యుడు : ముఖాముఖముగా భగవంతుని చూడనిదే మనకేమి లాభము కలుగగలదు? "ఎవడైనను చేపలను పట్టుకొను నాశతో నొక చెరువుగట్టుననో, నదియొడ్డుననో కూర్చుండునుగాని, మురికిగుంటదగ్గర కూర్చొనడు. నీ వే

ప్రయోజనమునకై సన్న్యాసివైతివో ఆ ప్రయోజనము చూచాయగానైన నీకు కనుపడెనా ?" అని యొకసారి నేనొక ఫకీరును ప్రసంగవశమున నడిగితిని.

అమ్మగారు : వాడేమి చెప్పెను ?

శిష్యుడు : వాడేమి చెప్పజాలును ?

అమ్మగారు : (ఇంచుక ఆలోచనా నిమగ్నులై) నీవు సరియైన మాట చెప్పితివి. ఏదోవిధమైన దివ్యానుభవము మానవునకు కలుగనిచో, వాని కెన్నియున్నను, లాభమేమి ? అయినను పారమార్థిక విషయములలో నతడు విశ్వాసము కలిగియుండవలెను.

భగవంతునికొఱకు తీవ్రవాంఛ

శిష్యుడు : ప్రక్కగదిలో బంగారు కాసులరాశి యున్నదని, దాని నొకదొంగ యీవలి గదిలోనుండి చూచుచున్నాడని భావింపుడు. ఈ రెండు గదులకు నడుమనున్న గోడయే యీ బంగారమంతయు వాని స్వాధీనము కాకుండ నాటంకపెట్టుచున్నది. ఇట్టి స్థితిలో వానికెన్నటికైన నిద్రపట్టునా ? ఆ కాసులరాశిని తాను చేచిక్కించుకొను టెట్లనియే వాడెల్లప్పుడును తలంచుచుండును. ఇదేవిధమున దైవమను వస్తువొకటి యున్నదను దృఢవిశ్వాసము మానవున కున్నచో, అతడెన్నడైన సంసారములో నుండగలడా ?" అని స్వామిజీ (వివేకానందస్వాములవారు) కూడ సెలవిచ్చె నని శరత్ మహారాజు మొన్న చెప్పెను.

అమ్మగారు : అదెంతయు నిజము.

శిష్యుడు : అమ్మా! మీరేమి చెప్పినను, త్యాగమును, విరక్తియు ముఖ్యముగా నుండవలయును. అవి యెన్నడైన మాకు కలుగునా ?

అమ్మగారు : తప్పక కలుగును. శ్రీ గురుదేవుని శరణు జొచ్చినచో, మీకు సర్వమును లభించును. త్యాగమే ఆయన వైభవము. ఆయన సర్వమును త్యజించినందుననే మన మాయన పేరును స్మరించుచు తిని, సౌఖ్యమున ననుభవించుచున్నాము. శ్రీ గురుదేవు డఖండ త్యాగ మహోజ్వల స్వరూపుడగుటచే శ్రీవారి భక్తులుకూడ చాల గొప్పవారని జనులు తలంచుచుందురు.

శ్రీరామకృష్ణుల త్యాగప్రశంస

ఏమి చెప్పుదును! ఒకనాడు శ్రీవారు నౌబత్తునందలి నా గదిలోనికి వచ్చిరి. వారి చిక్కములో లవంగములు మున్నగు సుగంధ ద్రవ్యములేవియు లేవు. అప్పుడప్పుడు వారు వానిని నమలుచుందురు. అక్కడనే తినుటకు కొన్నిటిని వారికిచ్చి, మరికొన్నిటి నొక కాకితములో కట్టి ఆ పొట్లమును తమ గదిలోనికి తీసికొని వెళ్లుడని వారిని కోరితిని. వారును తమ గదివైపునకే పోవుచుండిరి. కాని అచ్చటకు వెళ్లుటకు మారుగా, శ్రీవారు సరిగా గంగానది యొడ్డునకుపోయి నిలిచిరి. వారికి దారి కనుపడలేదు. అది వారు గమనించనే లేదు. "అమ్మా! నే నిందులో పడి మునిగిపోనా!" అని మరలమరల చెప్పుచుండిరి. అపరిమిత వేదనతో నా మనస్సు కొట్టుకొనుచుండెను. అప్పుడు నది బాగుగా నిండియుండెను.

నేనును చిన్నదాననగుటచే గదిలోనుండి బయటకు పోలేదు. ఆ సమీపమున నాకెవరును కనుపడలేదు. శ్రీవారికడకు నే నెవరిని పంపగలుగుదును! చివరకు కాళీదేవాలయములో నుండి యొక బ్రాహ్మణుడు నా గదివైపునకు వచ్చుచుండగా చూచి, హృదయుని తోడ్కొనిరమ్మని అతనిని బంపితిని. అప్పుడు భోజనము చేయుచుండిన హృదయుడు తన విస్తరిని విడిచిపెట్టి శ్రీగురుదేవునికడకు బరుగిడివెళ్లి, ఆయనను పట్టుకొని మరల వారి గదిలోనికి తీసికొనివచ్చెను. ఇంకొక క్షణమాలస్యమైయుండినచో ఆయన గంగానదిలో పడి పోయియేయుందురు.

శిష్యుడు : ఆయన నదికి దక్షిణముగా నెందుకు వెళ్లిరి?

అమ్మగారు : కొలదిగా సుగంధ ద్రవ్యములను శ్రీవారి చేతిలో నేనుంచినందున, వారు దారిని కనుగొనలేకపోయిరి. సాధువు లెన్నడును వస్తువులను నిలువచేసికొనగూడదు. శ్రీవారి త్యాగము పరిపూర్ణమైనది.

ఒక వైష్ణవసాధు వొకసారి పంచవటికి వచ్చెను. అతడు మొట్టమొదట మహాత్యాగివలె నటించెను గాని, చివరకు కుండలు, గిన్నెలు, చెంబులు, కాయధాన్యములు, బియ్యము మొదలైన వివిధ వస్తువులను తీసికొని నిలువచేయ నారంభించెను. శ్రీగురుదేవు లిది కనిపెట్టి, 'పాప మిత డీసారి నాశనము కానున్నాడు!' అని యొకనాడు చెప్పిరి. అతడు మాయాపాశములో చిక్కుకొననుండెను. శ్రీగురు

దేవులు త్యాగమునుగురించి వానిని తీవ్రముగా హెచ్చరించి, చివరకు మఱియొకచోటునకు పొమ్మనిరి. పిమ్మట వాడా స్థలమును విడిచి వెళ్లిపోయెను.

అమ్మగారికి సాష్టాంగదండప్రణామము చేయుట కొక భక్తుడువచ్చెను. అతడు సెలవుతీసికొని యింటికి వెళ్లనుండి నప్పుడు "హరీశునిపట్ల నా వాత్సల్యమును వెల్లడించి నేనొక సారి మోసపోతిని కనుక, నేనిప్పుడెవరికిని నా భావములను గనుబరచను," అని అమ్మగారు చెప్పిరి.

1912-వ సం॥ మే.

శ్రీ మాతృదేవికి ఉత్తరములను చదివి వినిపించుటకై నేను మేడమీదకు వెళ్లితిని.

శిష్యుడు : ఒక భక్తునికుమార్తె తన మామగారి యూరిలోనుండి నన్నిక్కడకు వచ్చి చూచుటకు తాను కుతూహలపడుచుంటినని వ్రాసి, తన ప్రణామములను మీకు నేను తెలుపవలెనని కోరెను. ఇంతేకాక, తాను మీ కుత్తరము వ్రాసినట్లు తన భర్త బంధువులకు తెలియకుండు నట్లు జాగరూకులై వర్తింపవలెననికూడ మిమ్ము కోరు చున్నది.

అమ్మగారు : అట్లైనచో నీ వామెకు ప్రత్యుత్తర మేదియు వ్రాయవలదు. దానిని తన బంధువులకు తెలియ కుండ దాచియుంచుమని నన్నామె మరల కోరును. జయరాంబటిలో జోగీంద్రుడను తపాలాబంట్రౌతు నాకొర కుత్తరములు వ్రాయుచుండువాడు. "తపాలాబంట్రౌతు మా

యుత్తరములను చూచుచున్నాడా?'' అని చాలమంది తమ యసంతృప్తిని వెల్లడించిరి. అట్టి మనుష్యునిచే నేను వారి కుత్తరములను వ్రాయించుట వారికిష్టములేదు. ఎందుచేత? నాకు కపటములేదు. ఇష్టమున్నచో నా యుత్తరము లెవరైనను చూడవచ్చును.

మరియొక భక్తుడు, శ్రీమాతృదేవి జయరాంబటికి ఎప్పుడు తిరిగి వచ్చెదరని యడిగెను. ''ఫాల్గుణ మాసములో జగద్ధాత్రీ పూజాసమయమునకు అచ్చటికి మీరు తిరిగి వచ్చెదరని యీ భక్తునకు మీ సెలవైనచో, ప్రత్యుత్తరము వ్రాసెదను'' అని అమ్మగారితో చెప్పితిని.

అమ్మగారు : ఓహో! వలదు, వలదు! మన మా విషయమై నిశ్చయముతో నెట్లుండగలము? నే నిక్కడ నుండునది, కేవలము దైవసంకల్పముపై ఆధారపడియుండును. నేడున్నవాడు రేపుండడుగదా?

శిష్యుడు : అమ్మా! మీ రట్లేల మాటలాడవలయును? మీరు బ్రతికియుండుటచేతనే, ఇంతమంది జనులు మిమ్ము సందర్శించి, మనశ్శాంతిని బడయగలుగుచున్నారు.

అమ్మగారు : ఔను. అది నిజమే.

శిష్యుడు : దయయుంచి నాకొఱకు సజీవులై యుండుడు.

బహు ప్రేమపూరితమైన కంఠస్వరముతో ''అయ్యో! నే ననిన వీరికెంత యభిమానము! వీరియందు నాకుగూడ అంత అభిమానము,'' అని కన్నుల నీరు నించుచు అమ్మగారు సెలవిచ్చిరి. శిష్యుడామెకు వీవనతో విసరుచుండెను.

"నాయనా! 'నీవు చిరంజీవివై భక్తికలిగి శాంతిని చూఱ గొనెదవుగాక' యని హృదయపూర్వకముగా నిన్నాశీర్వదించుచున్నాను. శాంతియే ముఖ్యమైన ప్రాప్యము. ఎవరికైనను కావలసినది శాంతియొక్కటియే," అని అపరిమిత దయార్ద్రస్వరముతో అమ్మగా రాతనితో జెప్పిరి.

శిష్యుడు : అమ్మా, ఒక యూహ యెల్లప్పుడు నా మనస్సును కలవరపఱచుచుండును. అది యేమందురా? శ్రీ గురుదేవుని దర్శనము నాకేల దొరకుట లేదు? ఆయన మా 'సొంతము.' అయినను మాకేల ప్రత్యక్షము కారు? తమ సంకల్పమాత్రమున శ్రీవారు ప్రత్యక్షము కాజాలరా?

అమ్మగారు : అది నిజము. నీవిన్ని కష్టములను క్లేశములను అనుభవించుచుండగా శ్రీవారేల ప్రత్యక్షమగుట లేదో యెవరు చెప్పగలరు? ఒకసారి బలరాముని భార్యకు జబ్బుగా నుండెను. "నీవు కలకత్తా వెళ్ళి యామెను చూడవలయును," అని శ్రీ గురుదేవులు నాకానతిచ్చిరి. "నేనెట్లు పోగలను? ఇక్కడ బండియేదియు కనుపడుట లేదే," అని నేను బదులు చెప్పితిని. అందుపైని "ఏమి! బలరాముని భార్య యెంతో బాధపడుచుండగా నీవు వెళ్ళుటకు సందేహించుచున్నావా! నీవు కలకత్తాకు నడిచి వెళ్ళుము," అని యుద్రేకముతో శ్రీ గురుదేవులు చెప్పిరి. చివరకొక పల్లకిని తీసికొనివచ్చిరి. నేను దక్షిణేశ్వరమునుండి బయలుదేరితిని. ఆమె అనారోగ్యముగా నుండినప్పుడు నేను రెండుసారులు వెళ్ళి యామెను చూచితిని. మఱియొకసమయమున శ్యామ్‌పుకూర్ నుండి

రాత్రి నడిచియే వెళ్లితిని. ఆపత్సమయమున భగవంతుని రక్షణయే లేకున్న, నిజముగా మానవునిగతి యేమగును?

శిష్యుడు : శరీరమున్నంత కాలము మానవులకు విచారములును, కష్టములును తప్పవు. ఈ కష్టములను తొలగింపుమని నేను శ్రీ గురుదేవు నడుగుట లేదు. కాని, మేము విచారములలోను, కష్టములలోను నున్నప్పుడు మా కాయన ప్రత్యక్షమై ధైర్యమును కలుగ చేయలేరా?

అమ్మగారు : నాయనా! నీవు చెప్పినది సమంజసమే.

పరమార్థానుభూతి దైవసంకల్పముపైని ఆధారపడును

బలరాముని మనుమడు కొలదినాళ్ల క్రిందట చనిపోయెను. ఆ బాలుని తల్లియు, నాయనమ్మయు మనశ్శాంతి కొఱకు నాకడకు వచ్చిరి. వారి విచారముకూడ కొంతవర కుపశమిల్లినది. ఇట్టి విషయములను గురించి నేను శ్రీ గురుదేవునితో మాటలాడుచుండెడు దానను. అట్టిసమయములం దాయన "అట్టివారు నాకు లక్షోపలక్షలున్నారు, నా గొఱ్ఱెను తోకయొద్దనో పీపుననో కోసి దానిని చంపెదను. ఇది కేవలము నా యిష్టమునుబట్టి జరుగుచున్నది," అని చెప్పుచుందురు.

శిష్యుడు : ఆయన మా బాధను చూచుటలేదా?

అమ్మగారు : కాని, ఆయనకు నీవంటి వారెందరో యున్నారు. "అఖండసచ్చిదానందసాగరము! ఎన్ని తరంగములందుండి పైకిలేచి, మరల మాయమగుచున్నవి! దీని కంతములేదు, పరిమితిలేదు," అని శ్రీ గురుదేవులు నుడివెడివారు.

శిష్యుడు : ఆధ్యాత్మిక జ్ఞానోదయ మెంతమాత్రము కలుగని సామాన్య మనుష్యుడెంతో సుఖముగా నున్నాడు; కాని అసంపూర్ణమగు జ్ఞానోదయముకలిగి భగవత్సాక్షాత్కారమును బడయగోరువారికి వారి కోరిక నెరవేరనిచో, అపరిమితమగు బాధకలుగును. వారెంత బాధపడుదురో వారికే తెలియును.

అమ్మగారు : నీవు చెప్పిన దెంతనిజము! సామాన్య జనులెంతో సుఖముగా నున్నారు. వారు భోజనాది వ్యాపారములను చేయుచు, సంతోషముగా కాలముగడపుచున్నారు. భక్తులుపడు బాధకు మాత్రమే అంతులేకున్నది.

శిష్యుడు : భక్తులు బాధపడుచుండుటచూచి మీరు బాధపడరా?

అమ్మగారు : నే నెందుకు బాధపడవలయును? చివరకు ప్రపంచకర్త సాక్షిభూతుడేకదా!

శిష్యుడు : భక్తరక్షణముకొఱకు మానవరూపమున మీ రీ భూలోకమునకు తిరిగి రా గోరరా?

అమ్మగారు : ఓహో! మానవశరీరమున ఎంత దారుణ బాధ! ఇంకవలదు, ఇంకవలదు! నే నీ భూలోకమున మరల జన్మింపకుందును గాక! తాము జబ్బుగా నుండినప్పుడు

**శ్రీ గురుదేవుని శరీరబాధ : దాని అర్థము**

శ్రీ గురుదేవులకు అమలక ఫలమును తినవలెనను కోరిక గలిగెను. దుర్గాచరణు డీ కోరికనువిని మూడునాళ్లు నిద్రాహారములు లేకుండ వెదకి వెదకి కొన్ని యుసిరికపండ్లను

తెచ్చెను. శ్రీ గురుదేవు లాతని భోజనము చేయుమని చెప్పి, ఆ యాహారమును ప్రసాదముగ జేయుటకు తాముగూడ కొంచె మన్నము తినిరి. అందుపైని "మీ రన్నమును బాగుగా తినుచున్నారే. ఇక మీరు జావ నెందుకు త్రాగ వలయును. మీరు జావను మాని అన్నమే తినవలయును," అని నే నంటిని. "వలదు, వలదు. ఈ నా జీవితావసాన దినములలో జావనే పుచ్చుకొనుట నా కెక్కువ యిష్టము," అని శ్రీవారనిరి. జావకూడ పుచ్చుకొనుటకు శ్రీవారికి భరింపరానంత కష్టముగ నుండెడిది! తఱచుగా దానిని వారు ముక్కువెంబడి కక్కుచుండెడివారు...

"మీ అందరికొరకు నేను బాధపడుచున్నాను. లోకు లందరి బాధల నాపై వేసికొంటిని," అని శ్రీ గురుదేవులు చెప్పుచుండెడువారు. గిరీశుని పాపఫలములనెల్ల తమపై వేసి కొనుటచేతనే శ్రీ గురుదేవులు బాధపడిరి.

మన కష్టములెల్ల ఈ భూలోకముననే. ఈ భూలోక మునకాక వేరొకచోట నేమికలదు? తమ అహంకార ఫలిత ముగా జనులపరిమితముగా దుఃఖము లనుభవించుచు చిట్ట చివరకు "నా లెక్కయేమి, జమయేమి? ఓ దైవమా! సర్వ శక్తిమంతుడవు నీవే! శాశ్వతుడవు నీవే!" అని చెప్పుదురు.

శిష్యుడు : ఇటుతరువాత మమ్ము మీరు జ్ఞప్తియం దుంచుకొందురా?

అమ్మగారు : నా నిర్యాణానంతరమున దివ్యానంద స్థితిలోనుండు నేను బహుశః మిమ్ము జ్ఞప్తియందుంచుకొనక

పోవచ్చును. నాయనా, కాలమే ముఖ్యమైనది. ఎప్పుడేది జరుగునో యెవరికి తెలియును?

శిష్యుడు : అమ్మా! నిజమే. సర్వమును కాలవశమున జరుగు చున్నదనుటకు సందేహము లేదు. కాని, కాలమునకు అతీతమైనది, కాలమును శాసించు శక్తిగూడ గలదు.

అమ్మగారు : ఔను, అదియు నిజమే.

శిష్యుడు : దయయుంచి మీ ఆరోగ్యమును కాపాడు కొనుడు. అప్పుడన్నియు సరిగానుండును.

ఎనిమిదిగంటలైనది. "ఎనిమిదిగంటలా? బహుశః అయియుండును. పూజా మందిరములో ఆరాధనకు వేళ యైనది. నేనిక వెళ్లెదను," అని అమ్మగారు చెప్పిరి.

నే నామె యుత్తరములను తీసికొని మేడమీదకు వెళ్లితిని. ఆమె శిష్యులలో నొకరు కాశిలో చనిపోయిరను వార్తనువిని, "ఏదో యొకనాడు అందరును చనిపోవలసినదే. గుంటలోనో, చెరువుగట్టుననో మరణించుటకు బదులుగా నతడు కాశిలో మరణించెను!" అని అమ్మగారు చెప్పిరి.

తమ కుటుంబ కలహములను గురించి తెలుపుచు, తమ కేమైన పైకము పంపుడని కోరుచు అమ్మగారి సోదరులు జాబు వ్రాసిరి. "వారికి పుష్కలముగా ధనము దొరుకునట్లు కటాక్షింపుడు. అందువిషయమై శ్రీ గురుదేవునితో చెప్పి, మీ సోదరులను శరీర సుఖములను తనివితీర మొగము మొత్తునట్లనుభవింపనిండు," అని నేను విన్నవించితిని.

అమ్మగారు : ఆ సుఖములతో వారికెన్నటికైన మొగము మొత్తునా? ఎంతయున్నను వారికి తృప్తికలుగనే కలుగదు. లోకుల కెన్నటికైన భోగములతో మొగము మొత్తునా? ఎప్పటి కప్పుడు వారు తమ విచారకథను చెప్పుచునే యుందురు. నా సోదరులలో నొకరగు కాళియే యెల్లప్పుడును పైకమడుగుచుండును. ఇప్పుడు ప్రసన్నుడను మఱియొక తమ్ముడుకూడ వానిని చూచి, డబ్బుకొఱకు నన్ను వేధించుచుండును. నా మూడవతమ్ముడగు వరదా యెన్నడును పైకమడుగడు. "అక్కకు పైక మెక్కడినుండి వచ్చును?" అని వాడనుచుండును.

శిష్యుడు : ఆ పిచ్చియమ్మయో? ఆమె కూడ పైకమడుగునా?

అమ్మగారు : పైక మిచ్చిననుకూడ ఆమె పుచ్చుకొనదు.

శిష్యుడు : ఆ కుటుంబములో మీరెందుకు జన్మించినారు?

అమ్మగారు : నా తల్లిదండ్రులు బహుపుణ్యాత్ములగుటచేత.

1912-వ సం॥ జూన్ 25-వ తేది.

ఆ సమయ ముదయము. అమ్మగారు పూజా మందిరమునకు ప్రక్కనుండిన గదిలో, మంచముదగ్గర కూర్చుండిరి. మేము మాటలాడుకొనుచుంటిమి.

ఆధ్యాత్మిక జీవితములో కర్మకుగల ప్రాముఖ్యము

శిష్యుడు : రామకృష్ణ పరంపరలోని సన్న్యాసులు సేవాశ్రమములలోను, ధర్మ వైద్య శాలలలోను పనిచేయుట, పుస్తకములను విక్రయించుట, లెక్కలను వ్రాయుట మొదలగు వివిధకర్మ కలాపములలో పాల్గొనుట మంచిది కాదని కొందరందురు. శ్రీగురుదేవు లెన్నడైన నిట్టి వ్యాపారములకు బూనుకొనిరా? భగవత్సాక్షాత్కారము నకై ఆత్రపడి యీపరంపరలో చేరిన సాధకులకిట్టి పనులను బలవంతముగా విధించుచున్నారు. సాధకుడేదియో పనియే చేయవలసియున్నచో, పూజామందిరములో అర్చన, ధ్యానము, జపము, భగవన్నామ సంకీర్తనము మొదలగు పనులు చేయవలయును, తదితర వ్యాపారములలో పాల్గొనిన యెడల సాధకు డాశాపాశములలో జిక్కువడి భగవంతునకు దూరుడై పోవును.

అమ్మగారు : ఆవిధముగా ప్రసంగించువారి మాటల నెన్నడును నీవు వినకూడదు. పనిచేయనిచో, రేయుంబవళ్లు నీ వేమి చేసెదవు? దిన మిరువదినాలుగుగంటలును ధ్యాన, జపముల నెవరైన చేయుచుండగలరా? శ్రీగురుదేవుని విషయ ముదాహరించితివి. కాని, వారి సందర్భమే వేఱు. శ్రీవారికి తగిన అన్నపానాదులను మధురుడు సమకూర్చుచుండువాడు. నీవేదో పనిచేయుచుండుటచేతనే ఆహారమును సంపాదించు కొనగలుగుచున్నావు. లేనిచో, ఒకకబళ మన్నమునకై యింటింటికిపోయి నీవు బిచ్చమెత్తుకొనవలసి వచ్చును. బహుశః నీవందుచే జబ్బుపడవచ్చును. ఇంతేకాక, యీ

కాలమున సాధువులకు బిచ్చము పెట్టువా రెక్కడనున్నారు? నీ వట్టిమాటల నెన్నడును పాటింపకుము. శ్రీగురుదేవుల ఆజ్ఞప్రకారము వ్యవహారములు సాగుచుండును. ఈ పద్ధతుల మీదనే మఠనిర్వహణము జరుగును, ఈ పద్ధతులప్రకారము నడుచుకొనలేని వారు మఠమును విడిచి వెళ్లెదరు. ఒకనాడు మణిమల్లిక్ ఒక సాధువును చూచివచ్చి ఆ సంగతిని శ్రీగురుదేవునితో విన్నవింప "మంచిది. అతడు నీకునచ్చెనా?" అని శ్రీవారడిగిరి. అందులకు, "ఔను. ఆసాధువును చూచితిని కాని___" అని మణిచెప్పెను. "కాని_నీ ఆక్షేపణయేమి?" అని శ్రీవారడిగిరి. అందుపై "అందరికిని ధనముకావలెను," అని మణిమల్లిక్ బదులుచెప్పెను. "సాధువున కెంతకావలయును? బహుశః పొగాకునకో, గంజాయికో ఒకకాని. అంతే. గిన్నెలకొలది నేయియు, పాలును, పరుండుటకు పరుపు మొదలగు సామగ్రు లెన్నియో మీకు కావలెను కాని, పొగత్రాగుటకు సాధువులకు కావలసిన దొకకానియే. వారికది లభింపకూడదా?" అని శ్రీగురుదేవులు సెలవిచ్చిరి.

శిష్యుడు : కోరికవలననే భోగములు కలుగుచుండును.

నిజముగా కోరిక లేవియు లేకపోవుటయే విరక్తి

ఒకనికి నాలుగంతస్తులమేడ యుండ వచ్చును కాని, యేభోగము కొఱకైనను వానికి కోరిక లేనియెడల, నిజముగా వాడనుభవించు భోగమేదియులేదు. మరియొకడు చెట్టుక్రింద నివసించుచున్నను వానికి కోరికయున్నయెడల, దానివలననే వానికి భోగమంతయు లభించును. "ఒక మనుష్యున కెచ్చటను బంధువు లెవరును లేకపోవచ్చును.

అయినను వాడొకపిల్లిని పెంచునట్లుచేసి, సంసారములోనికి మహామాయ వానిని లాగవచ్చును. ఇదియే యామెలీల!'' అని శ్రీ గురుదేవులు చెప్పుచుండెడివారు.

అమ్మగారు : అది నిజము. కోరికయే సర్వమునకును కారణము. ఏకోరికయు లేని మనుష్యునకింక బంధమేమి కలదు? ఇన్ని వస్తువులుకలిగి నేను జీవించుచుండుట మీరు చూచుచున్నారు. కాని, నాకు దేనియందును మమకారము లేదు; ఎంత మాత్రమును లేదు.

శిష్యుడు : మీ కేమి కోరిక యుండగలదు? ఇక మా మాట అడిగెదరా! మా మనస్సులలో పనికిమాలిన కోరికలు లెక్కలేకుండ నెన్ని పుట్టుచుండును! వాని నెట్లు విడనాడ గలము.

కోరికలు - నిజమైనవి : నామమాత్రమైనవి

అమ్మగారు : నీ విషయములో ఇవి నిజమగు కోరికలే కావు. అవి యొక లెక్కలోనివికావు. నీ మనస్సున నిప్పుడుపుట్టి, యుత్తర క్షణముననే మాయమగుచుండు వింత తలంపు మబ్బులే కేవలమవి. అవి యెంత యెక్కువగా పొడ చూపి అణగారుచుండిన నీకు అంత మంచిది. *

---

* ''ఎంత దీక్షతో నేను మతసాధన లెన్ని చేయుచున్నను, నా మనస్సునందలి మాలిన్యము తగ్గుటయే లేదు,'' అని భక్తుడగు నొక సన్న్యాసి శ్రీమాతృదేవికి విన్నవించెను. అందుపైని అమ్మగారిట్లు బదులుచెప్పిరి. ''ఎఱుపు, నలుపు, తెలుపు మొదలగు వేర్వేరు రంగుల దారములను నీవు కదురుపై చుట్టితి వనుకొనుము. విడదీయునప్పుడుకూడ

శిష్యుడు : తాను రక్షించెదనని భగవంతుడు నాకభయమిచ్చినగాని, నేను నా మనస్సు నెట్లు నిగ్రహింపగలుగుదునా యని నిన్న తలంచితిని. ఒకకోరిక పోయిన వెంటనే మఱియొకటి తలచూపుచున్నది.

సాధకునకు దైవము రక్షణ నొసంగును

అమ్మగారు : అహంభావ మున్నంతకాలము కోరికలు కూడ తప్పక యుండును. కాని, ఆ కోరికలేమియు నిన్ను బాధింపవు. శ్రీ గురుదేవుడే నీ రక్షకుడు. సర్వమును పరిత్యజించి తన పాదారవిందముల నాశ్రయించిన శరణాగతులను, ధర్మజీవనాభిలాషులను రక్షింపనిచో శ్రీ గురుదేవునకు నిర్దయుడనుపేరు వాటిల్లును. నీపైన నాధారపడి జీవింపవలయును. నిన్ను పాలముంచినను, నీట ముంచినను నీ వా భారమునంతయు శ్రీ గురుదేవుల సంకల్పమునకే వదలివేయవలయును. కాని నీవుమాత్రము ధర్మమగు దానినే, ఆయనయిచ్చిన శక్తికొలదిని చేయుచుండవలయును.

శిష్యుడు : అమ్మా! శ్రీ గురుదేవునకు నేనంత పరిపూర్ణాత్మ సమర్పణము గావించితినా? శ్రీవారిపై నే నేకొంచెముగనో ఆధారపడగల ననుభావము నా మానసికాకాశమున నొక్కొక్కప్పుడు మెఱుపువలె మెఱసి, ఆ వెను

---

నీవు వానిని సరిగా అదే వరుసలో చూడగలవు గదా!'' కోరికలలో రెండు రకములుకలవు. కొన్ని కోరికలు భోగవాంఛను తీవ్రపఱచును; మఱికొన్ని విరక్తిని త్వరితపఱచును. పైకొకవిధముగ కనుపడినను, గుణములో ఈ రెండురకముల కోరికలకును భేదముకలదు.

నెంటనే మాయమగుచుండును. శ్రీ గురుదేవుడే మమ్ము రక్షింపనిచో, మా కిక దారి యేమున్నది? ఒకొక్కప్పుడు నే నట్లు తలచుచుందును. అమ్మా! ఇట్టి తలంపునకు కారణము, మీరు జీవించియున్న, మా కష్టములను భయములను మీకు విన్నవించి, సత్యజ్ఞానదయామృతసదనమగు మీ వదనమును గాంచి మేము శాంతి నొందగలమను నమ్మకమే. ఈ దర్శన భాగ్యము లేనినాడు మమ్మెవరు రక్షింతురు? మాకు మీ అభయప్రదానము కలుగుచో, మేము సురక్షితులమను భావముతో నుందుము.

అమ్మగారు: నాయనా! భయపడకుము, నీ వెందుకును భీతిల్లవలసిన పనియే లేదు. ఆలుబిడ్డలతో సంసారసాగర మందు నీవు మునుగవు. ఇట్టి ప్రమాదము నీ కెన్నడును కలుగదు. ఇక నీవు భయపడవలసినది దేనికి? ఈ లోపున, నే నీ శరీరమును చాలించుటకుముందే, నీ ఆధ్యాత్మికజీవన సౌధమునకు భద్రమగు పునాదిని నిర్మించుకొన గలుగుదువు.

శిష్యుడు: భగవంతుడు దయారస భరితములైన తన చల్లనిచూపులను మాపై ప్రసరింపనిచో, జపతపములు మున్నగువానివలన మా కేమి లాభము కలుగును? ఆ జగన్నాథుని రక్షణయే మా కవచము.

అమ్మగారు: నీవు దేనికిని భయపడవలసిన పని లేదు. శ్రీ గురుదేవులు నిన్ను తప్పక రక్షించుచుందురు. చింతింపకుము.

1912-వ సం॥ జూలై 7-వ తేది.

శిష్యుడు : అమ్మా! రథోత్సవము చూచుటకై మీరు జగన్నాథమునకు బోవ నేర్పాటైనది కాదా?

అమ్మగారు : జనసమ్మర్ద మమితముగానుండు రథోత్సవసమయమున జగన్నాథమునకు పోవుట మంచిదియా? అప్పుడచ్చట కలరావ్యాధి ప్రబలవచ్చును. ఇప్పటికే అచ్చటి గదులను, గృహముల నన్నిటిని యాత్రికులు బాడుగకు దీసికొని ఆక్రమించియుండుటచే, నివసించుటకు స్థలమే లేదనియు, చిన్నగదులుకూడ పదిరూపాయల బాడుగకు జనులు తీసికొనిరనియు, శీతకాలమునవచ్చి, దేవుని సేవించుట మంచిది యనియు పూజారి లక్ష్మీకాంతము చెప్పెను.

శిష్యుడు : మహమ్మదీయు లెన్ని దేవాలయములను, దేవదేవీవిగ్రహములను నాశనము చేసిరి! కొన్ని విగ్రహములకు ముక్కులను, మఱికొన్నిటికి చెవులను కోసివేసిరి... గుజరాతులో సోమనాథస్వామి దేవాలయమున్నది. పూర్వకాలమున గంగోత్రియందలి జలముతో అచ్చటి స్వామికి పూజారులు నిత్యాభిషేకము చేయుచుండువారు. ప్రతిదినము హిమాలయపర్వతములనుండి జనులు కుండలతో నీటిని తమ తలలపై నిడుకొని తెచ్చెడువారు. ఈ విగ్రహమును మహమ్మదు సుల్తాను పడగొట్టి, దేవాలయ ద్వారములందలి మంచిగంధపుతలుపుల నెత్తుకొనిపోయెను. అట్లేల జరుగవలయును?

అమ్మగారు : దేవతా ప్రతిమలలోనుండు భగవంతుని మూర్తి దుష్టులకు గోచరింపదు. అనగా అట్టి జనుల సమక్ష

మున దేవత మాయమగునని చెప్పవచ్చును. సంకల్పమాత్ర మున భగవంతుడేమి కావలసిన, తనకేమి యిష్టమున్న, దాని నెల్ల చేయగలడు. ఇదికూడ ఆతని లీలయే.

శిష్యుడు : కర్మఫల మనుభవింపకుండ తప్పించుకొను టకు వీలగునా ? జ్ఞానమువలన తప్ప మఱిదేనివలనను కర్మ నాశనము కాదని వేదములు చెప్పుచున్నవి. అయినను ప్రారబ్ధకర్మఫలమును తప్పించుకొన నెవరికిని సాధ్యము కాదు.

అమ్మగారు : మన మనుభవించు సుఖదుఃఖములకు కర్మయే కారణము. శ్రీ గురుదేవులు కూడ కర్మఫల మనుభవింపక తప్పి నది కాదు. ఒకసారి వారి అన్నగారు తీవ్రజ్వరములో సంధియెత్తిన స్థితి యందు, మంచినీటిని త్రాగుచుండగా చూచి, మిక్కిలి కొంచెముగా త్రాగిన తరువాత అన్నగారి చేతిలోనుండి యాయన మంచినీటి పాత్రను లాగుకొనిరి. అందుమీఁదట అన్నగారికి కోపమువచ్చి "మంచినీటిని త్రాగ కుండ నీవు నన్ను ఆటంకపఱచినావు. ఇట్లే నీవుకూడ బాధ పడెదవు. నీవుకూడ నీ గొంతులో నిట్టిబాధ ననుభవింతువు," అని చెప్పిరి. "అన్నా! నీ కపకారముచేయ నేను తలపెట్ట లేదు. నీవు జబ్బుగా నుండుటచే, నీరు నీకు చెఱుపు చేయును. మంచినీటిపాత్రను నేను లాగుకొనుట కదియే కారణము. అన్నా! సందర్భ మిట్లుండ నీవేల నన్ను శపించితివి ?" అని

కర్మఫలము అనివార్య ములేయైనను పారమార్థిక సాధనలవలన వానియనర్థ మును తగ్గించుకొనుటకు వీలగును

శ్రీ గురుదేవులు విన్నవించిరి. పిమ్మట అన్నగారేడ్చుచు "తమ్ముడా! నాకు తెలియకయే యీ మాటలు నా నోట వచ్చినవి. ఇవి జరిగి తీరవలసినదే," అని తమ పశ్చాత్తాపమును వెలిబుచ్చిరి. తాము వ్యాధిగ్రస్థులై యుండినప్పుడు "ఆ శాపమువలననే యిప్పుడు గొంతులో నాకీ పుండు కలిగినది," అని శ్రీ గురుదేవులు నాతో జెప్పిరి. "ఇట్టి స్థితి మీకే సంభవింపగలుగునెడల, మానవమాత్రులు బ్రతుకుట కింకెట్లు సాధ్యమగును?" అని శ్రీవారి నడిగితిని. ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరముగా "నా అన్నగారు ధర్మవర్తనుడు, ఆయన మాటలు జరిగి తీరవలసినదే. సామాన్యులగు వారిమాట లెల్ల ఈ రీతిని జరుగునా?" అని శ్రీ గురుదేవులు సెలవిచ్చిరి.

కర్మఫల మనుభవింపక తప్పదు. కాని భగవన్నామ స్మరణవలన దాని తీవ్రతను నీవు తగ్గించుకొనవచ్చును. నాగలిచాలంత పెద్దపుండు నీకు కలుగవలసియుండినయెడల, అధమ మొక సూది గ్రుచ్చుకొని బాధపడెదవు. జపతపములచే కర్మఫలమును చాలవరకు నిరోధించవచ్చును. సురథరాజు విషయ మిట్టిది. లక్షమేకలను బలియిచ్చి అతడు దేవీపూజ చేసెను. ఈ లక్షమేకలును కొంతకాలమైన తరువాత నొకే కత్తిదెబ్బతో రాజును చంపినవి. అందుచే లక్షసారులు జన్మింపవలసిన ఆవశ్యకత అతనికి తప్పినది. జగన్మాత నతడు పూజించియుండుటే అందులకు కారణము. పావన భగవన్నామస్మరణ కర్మఫలముల తీవ్రతను తగ్గించును.

శిష్యుడు : అట్లైనచో కర్మవిధికే యీ లోకమున అత్యధిక ప్రాముఖ్యము కలుగును. అప్పుడు మనమేల భగ

వంతుని నమ్మవలయును? బౌద్ధులు భగవంతు డున్నాడని అంగీకరింపరు, కాని కర్మవిధి నంగీకరింతురు.

అమ్మగారు : కాళి, కృష్ణుడు, దుర్గ మొదలగు దేవత లెవరును లేరనియా నీవు చెప్పదలచుకొనినది?

శిష్యుడు : జపతపములవలన కర్మఫలము నశించునా?

అమ్మగారు : ఎందుకు నశింపదు? సత్కర్మ చేయుట మంచిది. ఎవరికైనను మంచిచేసిన సుఖము కలుగును, చెడుగుచేసిన కష్టము సంభవించును.

శిష్యుడు : (శ్రీ) గురుదేవుని దర్శనార్థము చాలమంది భక్తులు వచ్చుచుండెడివారు. వారిప్పు డెక్కడనున్నారు? మిమ్ము చూచుటకు వా రెవరును వచ్చుటలేదు.

అమ్మగారు : వారందరును సుఖజీవనములను గడుపుచున్నారు.

శిష్యుడు : ఏమి? సుఖజీవనములా?

అమ్మగారు : నీ మాటయే సరియైనది. ఆలు బిడ్డలతో మానవు డీ లోకమున నెట్లు సుఖముగా నుండగలడు? కామ కాంచనాసక్తులై జనులు మైమరచుచున్నారు. ఈ లోకమున సర్వమును తుదకు కష్టకారణమగును.

శిష్యుడు : అంతేకాదు; మనస్సు బాహ్యవిషయముల పైననే పోవుచుండును.

అమ్మగారు : విశ్వజననియగు కాళియే జీవులందరికిని తల్లి. మంచి చెడ్డలు రెండునుకూడ ఆమెనుండి పుట్టినవే. సర్వమామె గర్భమునుండి జనించుచున్నది. పలురకముల

పరిపూర్ణజీవులు కలరు. పుట్టుకతోనే పరిపూర్ణులైనవారు కొందరు. పారమార్థిక సాధనలను చేసి పరిపూర్ణులైనవారు కొందరు. గురుకటాక్షమున పరిపూర్ణులైనవారు కొందరు. ఆకస్మికముగా పరిపూర్ణులైనవారు కొందరు.

శిష్యుడు : ఆకస్మికముగా పరిపూర్ణులగుట యనగా అర్థమేమి ?

అమ్మగారు : అది మఱియొకరి ధనమునకు వారసులగుట మూలమున అకస్మాత్తుగా భాగ్యవంతులగుట వంటిది.

ఇంతలో అమ్మగారి మేనకోడలు నళిని గంగానదిలో స్నానముచేసి గదిలోనికి వచ్చెను. నీటితో శుభ్రపఱుపనగు మరుగుదొడ్డి అపరిశుద్ధముగా నుండినదని కనిపెట్టి కొన్ని కుండల నీళ్లుపోసి దానిని కడిగినందున, నామె శుద్ధినిమిత్తము గంగలో స్నానముచేసినది. ఆమె కుళాయినీటిలో స్నానము చేసిన చాలియుండెడిదని అమ్మగారును శిష్యుడునుకూడ నభిప్రాయపడిరి.

నళిని : అది యెట్లు చాలును ? మరుగుదొడ్డిని శుభ్రపఱచితినే !

అమ్మగారు : అంతమాత్రమున మనమింత వ్యత్యాస మును పాటింపనేల ? నిజమునకు నీవు మలమును చేతితో తాకలేదే. తాకితివనుకొన్నను, దానిలో ప్రమాద మేమున్నది ? మన ప్రేగులలో మలములేదా ? ''అన్నము, పులుసు, కూర, వెన్న మొదలగు ఆహారపదార్థముల కొన్నినాళ్ల వరకు

మనమొక కుండలో నుంచితిమేని, అవియన్నియు మురిగి పోయి కంపుకొట్టును. మానసమలమన్న నంతకంటె వే ఱేదియు కాదు,'' అని శ్రీగురుదేవులు చెప్పుచుండువారు.

అమ్మగారు : ఎండిన మలమును మా గ్రామములో నే నెన్నిసారులో త్రొక్కితిని. కొలదిసారులు గోవిందనామ స్మరణ చేసినతోడనే నేను మరల శుచిగ నుండినట్లు నాకు తోచెడిది. మనస్సే బహు ముఖ్యము. శుచిగ నున్నట్లుకాని, అశుచిగ నున్నట్లుకాని యెవరికైనను మనస్సునందే తోచు చుండును. దోషపూరితమైన మనస్సుకలవాడే యితరుల దోషములను చూడగలుగును. ఇతరులదోషము లెన్నుట వలన వారికెన్నడైన నేమైన సంభవించునా ? అందువలన నీకే హానికలుగును. ఇది నా మనోవైఖరి. ఈ కారణముచే నా కెవరిదోషములుకాని కనుపడవు. ఏ మనుష్యుడైనను నాకెంత చిన్న మేలుచేసినను, వానిని జ్ఞప్తియందుంచుకొనుటకు ప్రయత్నింతును. ఇతరుల తప్పులను కనిపెట్టుటా! ఇది యెవరుకాని యెన్నడును చేయకూడని పని. నేనట్లెన్నడును చేయను. క్షమయే తపస్సు.

మనస్సునుబట్టి పరిశుభ్రత యుండును

శిష్యుడు : ''ఇంటిలో దొంగ చొరబడి, యేమైన దొంగిలించె ననుకొనుము. నీ మనస్సున దొంగనుగురించిన యూహ స్ఫురించును. కాని అట్టియూహ యేదియు చంటి పిల్లకు కలుగదు. అందుచే నెవరుగాని ఆ బిడ్డకంటికి దొంగగా కనుపడరు,'' అని స్వామిజీ (వివేకానందస్వాముల వారు) చెప్పుచుండువారు.

16

అమ్మగారు : అది నిజమే, నిర్మలమైన మనస్సుగల వారికి సర్వమును నిర్మలముగనే కనుపడును. పూర్వజన్మ మందు పారమార్థిక సాధనలను చాల కఠిన నియమముల నాచరించినవారికి మాత్రమే పుట్టుకతో పవిత్రమైన అంతః కరణ కలుగును.

శిష్యుడు : అమ్మా! జపమునుగాని ఆధ్యాత్మిక సాధన లనుగాని చేయునపుడు, నా మనస్సున కానందము కలుగదు.

అమ్మగారు : (చిరునవ్వు నవ్వుచు) ఎందుచేత? కొంచెముకూడ కలుగదా?

శిష్యుడు : నేను ఆ సాధనలను అంత నిండుమనసుతో చేయుటలేదు. ఏ కొలది నిమిషములో చేసి, విసుగుపుట్టి "గొణుగుకొనుటవలన లాభమేమి? భగవంతుడనువా డున్న యెడల, వా డుండియే యున్నాడు. ఇంతకంటె ధ్యాన మొనర్ప నేను ప్రయత్నించుటయే మేలు," అని తలపోయు చుందును.

అమ్మగారు : నీవు ధ్యానముచేయగలవా?

శిష్యుడు : చేయలేను. అదికూడ చేయలేను. విష యములెల్ల గ్రహింతునుగాని, వాని నాచరించి శాంతిని బడయలేకున్నాను. ఎవరైన దక్షిణేశ్వరమునకు దారిని చక్కగా తెలిసికొనవచ్చునుగాని, అందరికిని ఆ దారియంతయు నడువ సాధ్యమగునా?

ఈ సమయమున లలితబాబు గదిలోనికి ప్రవేశించి, అమ్మగారికి ప్రణామముచేసిన పిమ్మట వా రిరువురును సంభా

షింప దొడగిరి. శిష్యుడుగూడ అప్పుడప్పు డా సంభాషణలో పాల్గొనుచుండెను.

అమ్మగారు : "పదునైన కత్తివాదరవలె, దారి బహు కష్టమైనది. బ్రహ్మవిద్య కత్తిపై సామువంటిది," అని శ్రీ గురు దేవులు సెలవిచ్చుచుండువారు. (క్రొంచెముసేపూరకుండి) కాని, శ్రీవారు మిమ్ము తమ చేతులనిడుకొని మీ యోగ క్షేమ ములను వేయికన్నులతో నెల్లప్పుడును కనిపెట్టుచున్నారు.

లలిత : మా మరణానంతరము మమ్ము తమచేతుల లోనికి దీసికొందురు; అందులో గొప్ప యేమున్నది ? మే మీ శరీరమున సజీవులమై యుండునపుడు శ్రీవారట్లు చేసిన యెడలగదా చెప్పుకొనదగినది!

అమ్మగారు : మీ రీ శరీరమందుండగనే యిప్పుడే శ్రీవారు మిమ్ము తమచేతులతో పట్టుకొనియే కాపాడు చున్నారు. మీ తలపై శ్రీవారున్నారు. నిజముగా మి మ్మాయన తమచేతులతో పట్టుకొనియే యున్నారు.

శిష్యుడు : నిజముగా. శ్రీ గురుదేవులు మమ్ము తమ చేతులతో పట్టుకొని కాపాడుచున్నారా? మీరు నిజము చెప్పుచున్నారా?

అమ్మగారు : (గంభీరస్వరముతో) ఔను. నిజముగా, ముమ్మాటికి నిజముగా.

అమ్మగారు ప్రాతఃకాలపూజను పూర్తిచేసి భక్తులకు ప్రసాదమును పంచిపెట్టి, గదిని తుడిచి చేతితో మట్టిని తీయు చుండగా గుండుసూదియొకటి యామెచేతి చిటికెనవ్రేలులో

గ్రుచ్చుకొనెను. వ్రేలిలోనుండి రక్తముకారి నొప్పిచే అమ్మగారు దారుణముగా బాధపడుచుండిరి. ఈ సంగతి తెలియగనే, శిష్యుడు మేడమీదకు పఱుగెత్తుకొని వచ్చెను. వేడి సున్నమును వ్రేలికి వేయుమని యెవరో యాతనితో జెప్పిరి. దానివలన బాధ చాల తగ్గినది. "నాయనా, నీవు నా సొంత బిడ్డవు. నిజముగా సొంతబిడ్డవు," అని ఆతనియందు తమకు గల ప్రేమాతిశయమును అమ్మగారు వెలిబుచ్చిరి.

కాశి, 1912-వ సం॥ నవంబరు.

కాశీ పుణ్యక్షేత్రమునకు శ్రీ మాతృదేవి వచ్చియుండిరి. ఈ క్రింది ప్రసంగ మచ్చట జరిగెను :

శిష్యుడు : యాత్రికులందరు విశ్వనాథస్వామి విగ్రహమును తాకుదురు గావున, సాయంకాల మర్చకులు విగ్రహమున కభిషేకమును పూజనుచేసి, పిమ్మట నైవేద్యమును సమర్పింతురు.

అమ్మగారు : డబ్బున కాశపడి అర్చకులు జనులందరిని విగ్రహమును ముట్టుకొన నిచ్చుచున్నారు. వారట్లేల చేయవలయును? దూరముననుండి ప్రతిమను చూచిన చాలును, లేనిచో అవినీతివర్తనులు ప్రతిమను తాకుదురు. కొందరి హస్తస్పర్శచే శరీరము మండును; మిక్కుటమైన బాధ కలుగును. వారు నన్ను తాకిన తరువాత నేను కాలుసేతులు కడుగుకొనుచుందును. అదృష్టవశమున కలకత్తాలోవలె నిచ్చట నన్నుచూచుటకై జనులు తండోపతండములుగా వచ్చుటలేదు.

శిష్యుడు : పెద్దస్వాముల వారల అనుమతి లేనిదే ఇచ్చట మిమ్మెవరును చూచుటకే వీలులేదు. జనసమ్మర్దమును తగ్గించుటకే యీ యేర్పాటు చేసిరి.

అమ్మగారు : వెళ్ళినచోటనెల్ల కచ్చేరి చేసినట్లుగా, గొడవ జరుగుట కెవరిష్టపడుదురు?

కాశిలోకూడ వెట్టివదినె అమ్మగారిని బాధపెట్టుచునే యుండెను.

అమ్మగారు : బహుశః ముండ్లుగల బిల్వపత్రములతో నేను శివుని పూజించితిని. అందుచే నా జీవితములో నిటువంటి కంటకప్రాయమైనస్థితి నాకు దాపురించెను.

శిష్యుడు : అదియెట్లు? తెలియక శివునికి ముళ్ళ మారేడాకులను సమర్పించినందున ప్రమాదమేమి?

అమ్మగారు : కాదు, కాదు. అట్లుకాదు. శివపూజ బహుకష్టము. అజ్ఞానముచే నైన ఆరాధకుడు తప్పుచేసిన యెడల, వానికి హానికలుగును. నిజమేమనగా, ఈ జన్మయే తమ కడసారి జన్మగా కలవారు, పూర్వజన్మలో చేసిన కర్మఫలములను ఈ జన్మలోనే యనుభవింతురు.

పుట్టినప్పటినుండి నేనే పాపముగాని చేసినట్లు నాకు జ్ఞాపకములేదు. అయిదేండ్ల ప్రాయమున నేను శ్రీ గురుదేవులను స్పృశించితిని. అప్పటికి శ్రీవారిని నేను గ్రహించుకొని యుండకపోయినను నిస్సంశయముగా తమ దివ్యహస్తస్పర్శచే నన్నాయన ధన్యురాలిని జేసిరి. అయినను నేనింత దారుణముగా బాధపడుట కేమికారణము? శ్రీవారిని స్పృశించిన వారందరును మాయాబంధవిముక్తులైరి; నాకుమాత్ర మింత

ప్రబలసంసార జంజాటము తలపై నుండనేల? అహోరాత్ర ములు ద్వంద్వాతీతమగు మహోన్నత బ్రహ్మానంద ప్రపంచ మున కెగుర నా మనస్సు ప్రయత్నించును. జనులయందుగల దయచే నేను దానిని బలవంతముగా ఈ జీవప్రపంచమునకు దింపియుంచుచున్నాను. అయినను నాకే దారుణమైనబాధ తప్పకున్నది!

శిష్యుడు: అమ్మా! మీ బంధువు లేమి చేసినను చేయ నిండు, దయయుంచి మమ్మందరిని సహింపుడు. ఆత్మస్మారకము గలవా డెన్నడును కోపోద్రేకమునకు వశుడు కాజాలడు.

అమ్మగారు : నీవు చెప్పినది నిజము. క్షమకంటె యెక్కువయైన సుగుణము వేరేదియు లేదు. ఇది రక్తమాంసా దులతోకూడిన శరీరమగుటచే నేనొక్కొకప్పుడు కోపోద్రేక మున నేమైన అనవచ్చును.

పిమ్మట అమ్మగారు తమలో తా మిట్లనుకొనిరి : ''తరుణమున హెచ్చరిక చేయువాడే నిజమగు స్నేహితుడు. తరుణము మించిన తరువాత, 'అయ్యో!' యని యెంతవిలపిం చిన నేమి లాభము?''

1912-వ సం॥ డిశంబరు.

కాశీలో నుండినప్పుడు శ్రీ మాతృదేవి కాశీఖండ పురాణమును వినుచుండువారు. ఒకనాటి సాయంకాలమున పురాణశ్రవణమైన తరువాత, శిష్యునితో ప్రసంగించిరి.

శిష్యుడు : కాశీనగరములో మరణించువారందరికిని ముక్తి వచ్చుచున్నదా?

అమ్మగారు : ముక్తి కలుగునని శాస్త్రము చెప్పు చున్నది.

శిష్యుడు : ఈ విషయమున మీస్వానుభవమేమి? మరణించినవారి చెవులలో మహాదేవుడే తారకమంత్ర ముప దేశించుటను శ్రీగురుదేవులు చూచిరి.

అమ్మగారు : నాయనా! నా కావిషయమేమియు తెలి యదు; అట్టిదృశ్యము నే నెన్నడు చూచియుండలేదు.

శిష్యుడు : ఈ విషయమును మీరేదైన చెప్పిబల పరచినగాని, నేను నమ్మజాలను.

అమ్మగారు : "ర—నమ్మననుచున్నాడు. దయ యుంచి మీరా విషయమున నాకేదైన నిదర్శనమును గను బరపుడు," అని శ్రీ గురుదేవులకు విన్నవింతును.

మహమ్మదీయ పరిపాలనలో హిందూదేశమున పలు తావులందు జరిగిన దేవాలయ వినాశమును గురించి ప్రసం గించుచు, "ప్రజాపీడనమంత మిక్కుటముగా ప్రబలి యుండెను. ఆ విషయమున భగవంతుడేమి చేసెను?" అని యడిగితిని.

అమ్మగారు : భగవంతు డనంతక్షమాసమన్వితుడు. అహోరాత్రములు బిందెలకొలది నీటిని తలపై ప్రిమ్మరించి జనులు శివుని పూజించుచున్నను, మరియొకప్పుడు పొడి బట్టలతో కప్పి యా పరమేశ్వరు నారాధించుచున్నను, అందువలన స్వామి కేమైన బాధగాని శ్రమగాని కలుగు చున్నదా? భగవంతుని సహనమపరిమితమైనది.

కాశిలో మరణించినచో ముక్తికలుగును

మరుసటి యుదయమున శ్రీ మాతృదేవి క-మహారాజుతో నిట్లుచెప్పిరి : ''నిన్నరాత్రి మేల్కొనియే నేను నాశయ్యలోబరుండి యుండగా, బృందావన మందలి సేట్ దేవాలయములోని నారాయణ ప్రతిమ తటాలున నాకు కనుపడి నాప్రక్కనువచ్చి నిలుచుండెను. స్వామిమెడలోని పూలహారము పాదములవరకు వ్రేలాడుచుండెను. ఆ విగ్రహము నెదుట శ్రీ గురుదేవులు చేతులను జోడించి నిలువబడి యుండిరి. 'శ్రీ గురుదేవు లిచ్చటికెట్లు వచ్చిరి?' అని ఆశ్చర్యపడుచు 'ర—నమ్మననుచున్నాడు,' అని చెప్పితిని. 'అతడు నమ్మితీరవలెను. ఇది అంతయు నిజము,' అని శ్రీ గురుదేవులు సెలవిచ్చిరి. కాశిలో చనిపోవువారికి ముక్తి లభించునని వారి యభిప్రాయము. ఆ నారాయణ విగ్రహము నాతో రెండు సంగతులు చెప్పెను. ఇందొకటి యీప్రశ్న, 'భగవంతుని విషయమై యథార్థమును తెలిసికొనిననేతప్ప, పరమసత్యమును గురించిన జ్ఞానమును పడయుట కెవరికైన సాధ్యమగునా?' రెండవ సంగతిని జ్ఞాపకము చేసికొనలేకున్నాను.''

క—మహారాజు : నారాయణ విగ్రహము నెదుట శ్రీ గురుదేవు లేల చేతులు జోడించుకొని నిలువబడిరి?

అమ్మగారు : అది వారి స్వాభావికస్థితి. అందరి సమక్షమునను వారు నమ్రులై యుండువారు.

మరునాటి యుదయమున శ్రీ మాతృదేవిని దర్శించి, ముందటి దినమున జరిగిన సంభాషణ నందుకొని యిట్లడిగితిని:

"కాశిలో చనిపోవువారికి ముక్తిలభించు నేమో దయయుంచి చెప్పుడు. మీ రేమైన నిదర్శనము చూచితిరా ?"

అమ్మగారు : శాస్త్రములట్లు చెప్పుచున్నవి. ఇంతే కాక, యీ విశ్వాసముతో జనులిచ్చటకు వేనవేలుగా వచ్చుచున్నారు. పరమేశ్వరుని శరణు జొచ్చినవారికి వేఱెగతి యేది సంప్రాప్తమగును ?

శిష్యుడు : భగవంతుని పాదపద్మములకు శరణాగతులైన వారికి ముక్తిలభించునను మాట నిజమే. కాని జగదీశ్వరునకు ఆత్మార్పణము చేసికొననివారి విషయమును, భగవద్భక్తులు కానివారి విషయమును, మతాంతరుల విషయమును దీసికొనుడు. కాశిలో మరణించుటవలన వారికిగూడ ముక్తి లభించునా ?

అమ్మగారు : ఔను. వారికిగూడ లభించును. కాశీనగరమంతయు పరంజ్యోతిర్మయము. ఇచ్చట జీవించు సమస్త జంతువులకును, తుదకు కీటకములకు, పురుగులకుకూడ దివ్యప్రజ్ఞ పూర్తిగా కలదు. భక్తుడైనను, నాస్తికుడైనను, మతాంతరుడైనను చివరకు కీటకమైనను సరే, ఇచ్చట మరణించిన ప్రతి జీవికి తప్పక ముక్తి కలుగును.

శిష్యుడు : మీరు నిజము చెప్పుచున్నారా ?

అమ్మగారు : ఔను. ఇది ముమ్మాటికి నిజము. కానిచో, ఈ దివ్యస్థలమున కింతటి వైభవమెట్లు కలిగెనో నీవు చెప్పగలవా ?

నా సమీపముననే భగవంతునకు నివేదనకాబడిన మధుర భక్ష్యములు కొన్ని యుండెను. జుమ్మని రొదచేయుచు

నాచేతిపై నొక యీగ వ్రాలెను. దానిని నా వ్రేలితో జూపుచు, "ఈ యీగకుగూడ ముక్తిచేకూరునా ?" యని నే నడిగితిని.

అమ్మగారు : ఔను. ఈ యీగకూడ పరమపదము నొందును. ఇచ్చట జీవించు సమస్తజంతువులును పరంజ్యోతిర్మయములు. ఈ మేడమెట్లమూలలను చిక్కు-వడిన రెండు చిన్నపిచ్చుకలను భూదేవుడింటికి గొంపోవగోరెను, కాని, "వలదు, వలదు. అవి కాశీనగర నివాసులు. నీవు వానిని దీసికొని పోకూడదు!" అని నేనా బాలుని వారించితిని. తూర్పు బంగాళమునుండి వచ్చు స్త్రీలు 'బంగాళీతలా'లో నివసింతురు ; తమతమ యిండ్లపట్లను, ఆస్తులపట్లను స్నేహితులపట్లను బంధువులపట్లను వారికి ప్రేమ యేమియు లేదా ? అయినను కాశిలో మరణించుటకై వా రిచ్చట నివాస మేర్పరచుకొనిరి. వారి బుద్ధి యిట్టిది. వారికి మమకారము లేదు.

శిష్యుడు : అమ్మా! చూచితిరా, తూర్పు బంగాళ మందలి జనులకెంత పారమార్థిక చింతకలదో !

అమ్మగారు : ఔను. అది నిజము. మా జిల్లాప్రజలకు పారమార్థిక చింత లేదు. రాధు మామగారి విషయ మాలోచింపుము. అతని కుటుంబమునకు కాశిలో నొక సొంతయిల్లు కలదు. అయినను కాశిపేరు చెప్పినంతమాత్రమున వారు భయపడుదురు. తమ స్వగ్రామము నంటిపెట్టుకొనియున్నచో, తాము మరణింపమని వారి భ్రమ. కాని మనమెచ్చటకు

వెళ్లినను మన నీడవలె మృత్యువు మన వెనువెంట వచ్చు చుండును.

శిష్యుడు : ఇచ్చట మరణించువారికి ముక్తి లభించు నని చెప్పునప్పుడు, మీరు నిజముగా సత్యము పలుకు చున్నారా ?

అమ్మగారు : (తీవ్రస్వరముతో) నేను నీయెదుట మువ్మారు ప్రమాణము చేయజాలను. ఒకసారి ప్రమాణము చేయుటయే తప్పు ; ఇక మూడుసార్లు ప్రమాణము చేయుటా! అందును కాశిలోనా !

శిష్యుడు : (నవ్వుచు) అట్లైన, నేను కాశిలో మర ణింపకుండునట్లనుగ్రహింపుడు. అట్లు జరిగెనేని నేనెక్కడ నుందునో, మీరెక్కడ నుందురో! మన మొకరినొకరు చూడముగదా !

అమ్మగారు : (నవ్వుచు) ఎంత అవివేకము! ఇతడు కాశిలో మరణింప నిష్టపడడట!

శిష్యుడు : అమ్మా! కంటితో చూచినప్పుడు గదా నమ్మకము కలుగును. ఏ విషయమునైన కన్నులార చూచి నప్పుడే నమ్ముదుము.

అమ్మగారు : మహాత్ముల మాటలందు నీకు నమ్మకము లేకున్నచో, నీవిక చేయగల దేమున్నది? మహర్షులును, సాధు సత్తములును నడిచిన మార్గముకాక వేఱెమార్గ మింకేమి కలదు ?

శిష్యుడు : నిజమే. వేఱొకమార్గ మేమియులేదు. అపరోక్ష జ్ఞానులగు మహనీయుల వాక్యములను వినుట తప్ప

నేనేమి చేయగలను? అందుచేతనే, మిమ్మీ ప్రశ్న నడిగితిని. సూటిగా ప్రత్యుత్తర మిచ్చినగాని, మిమ్ము విడువను.

అమ్మగారు : నీవు నమ్మినను నమ్మకపోయినను, భగవంతున కేమి లెక్క? శుకమహర్షికూడ పరమేశ్వరుని దృష్టియందొక గండుచీమతో సమానము. భగవంతు డనంతుడు. వానిని నీ వెంతమాత్రము గ్రహింపగలవు? మన గురుదేవుడు అపరోక్షజ్ఞాని. ఆయన సర్వమును చూచిన సర్వజ్ఞమూర్తి. వారిమాటలు వేదవాక్యములు. ఆయన మాటలయందు నీకు నమ్మకము లేనిచో, నీ విక చేయగల దేమున్నది?

శిష్యుడు : శాస్త్రములు భేదాభిప్రాయములను దెలుపుచుండును. కొన్నిశాస్త్రము లొకరీతిని జెప్పును. మఱికొన్ని శాస్త్రములు మరొకరీతిని జెప్పును. మనము దేని నంగీకరింపవలెను. ఇందు చేతనే, మిమ్ము నేనిట్లు బాధపెట్టుచున్నాను.

ఒక్కొకప్పుడు శాస్త్రములు నమ్మటకు వీలులేనివిగా నుండును

అమ్మగారు : అది నిజమే. రాబోవు నెలలో ఇంత వర్షముకురియునని పంచాంగము చెప్పును. కాని, పంచాంగమును పిండుటవలన మనకొక నీటిబొట్టు కూడ రాదు. ఇంతేకాక, శాస్త్రములలో పనికిమాలిన విషయము లెన్నియో యుండును. 'తు' 'చ' తప్పకుండ శాస్త్రాదేశముల ప్రకార మెవరును నడచుకొనజాలరు. "శాస్త్రాదేశ బంధములచే బిగింపబడిన భక్తి, ఆ పేరునకు తగదు..." అని శ్రీగురుదేవులు చెప్పుచుండువారు.

ఈ కలియుగమున కేవలము సత్యము నాశ్రయించి వారికి భగవత్సాక్షాత్కారము లభించును.

సత్యము - ముక్తి

"సత్యమునుతప్ప నితర మెన్నడును పలుకని మానవుడు భగవంతుని ఒడిలో పరుండియున్నాడు," అని శ్రీ గురుదేవులు చెప్పెడివారు. దక్షిణేశ్వరమం దాయన వ్యాధిగ్రస్తులై యుండినప్పుడు, నేను వారికొరకు పాలు చిక్కగా మరగకాచి, రెండుశేర్ల పాలను దీసికొని వెళ్లి అవి యొకశేరే యని చెప్పుచుండుదానను. అంతేకాని అవి నిజముగా నెంతయుండెనో నేనాయనకు చెప్పుచుండుటలేదు. ఒకనాడీ విషయమును శ్రీవారు గ్రహించి, "ఇదియేమి? సత్యము తప్పకు, చూచితివా? విస్తారముగా పాలుతీసికొనుట వలన నాకు కడుపులో బాధ కలుగుచున్నది," అని యానతిచ్చిరి. అదియేమి చిత్రమోకాని ఆనాడే వారు శరీరము సుస్తిగాలేక బాధపడిరి. వారు సర్వశక్తిసంపన్నులు. మన మట్లుకాదు.

శిష్యుడు : నిజముగా నాకొఱకై యీ విధముగా మిమ్మీ ప్రశ్నల నేనడుగుటలేదు. నన్నుగురించి నాకు చింత లేదు. ఈ విషయమై నా భావమే వేఱు. నేను తెలిసికొన గోరునదేదనగా: మిమ్ము నా తల్లిగా సంబోధించుచున్నాను. మీరు నిజముగా నా తల్లియా?

అమ్మగారు : తల్లిని కానిచో నేనింకెవరను? ఔను, నేను నీ సొంతతల్లిని.

శిష్యుడు : మీ రట్లనవచ్చును. కాని, నాకిది స్పష్టముగా గోచరమగుటలేదు. నన్ను కన్నతల్లిని సహజముగను,

అప్రయత్నముగను నా సొంతతల్లిగా గ్రహించుచున్నాను. కాని, మిమ్మా విధముగా భావింప నాకు సాధ్యమగునా?

అమ్మగారు : అయ్యో! అది యెంతయు నిజము! కొలది క్షణములైన తరువాత శ్రీ మాతృదేవి యిట్లు నుడివిరి : నాయనా! భగవంతుడే మన తల్లియును, తండ్రియును. భగవంతుడే మన తల్లియు తండ్రియు నగుచున్నాడు.

1912-వ సం॥ డిసెంబరు.

శిష్యుడు : తపస్సునకుగల ఆవశ్యకత యేమి?

తపస్సునకు గల ఆవశ్యకత

అమ్మగారు : తపస్సు మిక్కిలి యవసరము. యోగిన్‌మాయిని చూడుము, ఇప్పటికిని నామె యెట్లుపవాసము చేయుచున్నదో చూడుము! గోలప్ మాయి జపమునకు పెట్టినది పేరు. ఒకనాడు నరేను తల్లి నన్ను చూడవచ్చినప్పుడు, నరే నామెతో నిట్లనెను. "బహుశః నీవు తపస్సు చేసియుంటివి. అందుచేతనే, వివేకానందుని నీ కుమారునిగా కంటివి. మరల తపస్సు చేయుము. అప్పుడు నీకు మఱొక వివేకానందుడు కలుగును."

శ్రీ గురుదేవు లన్నిరకముల సాధనలను చేసినారు. "అచ్చుదిమ్మను తయారుచేసితిని; మీరిక విగ్రహమును కొట్టవచ్చును," అని ఆయన చెప్పెడువారు.

శిష్యుడు : విగ్రహమును అచ్చుకొట్టవచ్చుననగా అర్థమేమి?

భూదేవుడు : శ్రీగురుదేవుని ధ్యానించవలయునని యర్థము.

అమ్మగారు : ఔను, ఇతడు దాని యర్థమును గ్రహించినాడు. విగ్రహమును అచ్చుకొట్టుటయనగా శ్రీ గురుదేవుని మూర్తిని ధ్యానముచేసి, వారి జీవితములోని వివిధ విషయములను తలపోయుట. ఆయనను ధ్యానించువారికి సర్వదివ్యానుభూతులు కలుగును. నన్ను స్మరించువారికి అన్నవస్త్రముల లోటెన్నడునుండదు. వారి కెట్టి లేమిడిగాని కలుగదు,'' అని ఆయన చెప్పుచుండువారు.

శ్రీ గురుదేవుని మూర్తి మంత్రము

మకు : ఆయనయే యిట్లు చెప్పినారా?

అమ్మగారు : ఔను, ఈ మాటలు ఆయన నోటి నుండి వెలువడినవే. వారిని స్మరించుచుండువారికి సమస్త కష్టములును తొలగిపోవును. శ్రీవారి భక్తులందరు నెంత సుఖముగానున్నారో నీవు చూచుచుండుట లేదా? శ్రీగురు దేవుని భక్తులవంటి భక్తు లింకొకచోట నీకు కనుపడరు. ఇచ్చట కాశిలో నేనెందరినో సాధువులను చూచుచున్నాను. కాని, ఆయన భక్తులవంటి మఱియొక భక్తుని నీవు నాకు కనుబఱచగలవా?

శిష్యుడు : అమ్మా! దానికొక కారణము కలదు. శ్రీగురుదేవుని విషయము మా కిప్పుడిప్పుడే కట్టివేయబడిన బజారువలె తోచుచుండును. బజారులక్షణములలో నొక్కటి కూడ లోపింపదు. జనులింకను తిరుగులాడుచునే యుందురు,

శ్రీ గురుదేవుని భక్తులును, ఆ ప్రత్యక్షశిష్యులును ఇంకను సజీవులై యున్నారు. శ్రీ గురుదేవుడు మాకెంతో సన్నిహితుడైనట్లే తోచుచుండును. మేము మనసార నాయనను ప్రార్థించుచో మాకోరిక ఫలించును.

అమ్మగారు : ఔను, చాలమందికోరికలట్లే ఫలించుచున్నవి.

శిష్యుడు : కృష్ణుడును, రాముడును, తదితరులును ఏ యుగమునాటివారో! ప్రార్థించి పిలిచినవెంటనే 'ఓ' యని పలుకుటకు చాలినంత సన్నిహితులు కారు.

అమ్మగారు : అది నిజము.

కాశీపూర్ తోట యింటినిగురించి, "అది పవిత్ర స్థలము. ఇప్పుడచ్చట నొక ఐరోపీయ గృహస్థుడు నివసించుచున్నాడు," అని శిష్యుడు చెప్పెను.

అమ్మగారు : కాశీపూర్ తోట యింటిలోనే శ్రీ గురుదేవులు తమ జీవితావసాన దినములను గడిపిరి. బహుతీవ్ర ధ్యానాది కఠిన తపస్సాధనోజ్వల మహిమాన్విత మాదివ్య స్థలము! అచ్చటనే శ్రీ గురుదేవులు మహాసమాధి విలీనులైరి. ఆస్థలమంతయు దివ్యమహిమాన్వితము. అచ్చట ధ్యానము చేయువారికి బ్రహ్మజ్ఞానము కలుగును. దాని యజమానికి శ్రీ గురుదేవులు కలలో కనుపడి, దానిని బేలూరు మఠమున కిచ్చివేయుమని ఆనతిచ్చుచో, మఠాధికారులు దానిని సంపాదింపవచ్చును.

పిమ్మట శ్రీ మాతృదేవి శ్రీ గురుదేవుని శిష్యులను గూర్చి ప్రసంగించిరి. "శ్రీ గురుదేవుని యీ శిష్యులెవరో నాకు దయయుంచి చెప్పుడు. వారి నిజస్వరూపమును గుర్తించుట మా తలకు మీరిన పని," అని శిష్యుడు విన్నవించెను.

అమ్మగారు: నాకేమి తెలియును? పూర్వావతారములందు శ్రీ గురుదేవునితోబాటు భూలోకమున జన్మించినవారు తిరిగి యీ యవతారమునగూడ వారితో వచ్చిరి.

శిష్యుడు: నాలుగుచేతులు మొదలైన యసాధారణ శరీరలక్షణములుగల దేవతను చూడవలెననుకోరిక యేదియు నాకులేదు. మనకున్న రూపముతోడనే నెంతయు సంతుష్టి పడియుందును.

అమ్మగారు: అదియే నా స్వభావముకూడ. ఇట్టి దివ్యదర్శనములవలన మనకేమి లాభము కలుగును? మనకు శ్రీ గురుదేవుడున్నాడు—అతడే సర్వమును.

జయరామ్‌బాటి 1913-వ సం॥ మార్చి.

శ్యామ్‌బజారులో నివసించు డాక్టర్ లలితుడును, ప్రబోధబాబును వచ్చిరి. సాయంకాల మించుమించుగా నాలుగు గంటలకు, వారు శ్రీ మాతృదేవికడకువచ్చి నమస్కరించిరి. పిమ్మట ఈ క్రింది సంభాషణ జరిగెను:

లలితబాబు: అమ్మా! ఆహారవిషయమై, యేయే నియమములను మేము పాటింపవలెను?

అమ్మగారు: శ్రాద్ధకర్మ సమయమున పెట్టబడు అన్న

మును తినుట తగదు. పారమార్థిక జీవితమున కది హాని కరము. శ్రీ రామకృష్ణులు దానిని నిషేధించుచుండువారు. ఇంతే కాక, నీవు తినునదెల్ల మొట్టమొదట భగవంతునకు నివేదన కావలెను. ఇట్లు నైవేద్యముకాని యన్నము నెవరును భుజింపకూడదు. మనము తిను అన్నమునుబట్టియే, మన రక్తముకూడ నుండును. నిర్మలమైన యాహారమునుండి నిర్మలమైన రక్తము, మనస్సు, బలమును కలుగును. చిత్తశుద్ధియున్నచో ప్రేమభక్తి లభించును.

పవిత్రాహారము—అపవిత్రాహారము

లలితబాబు : అమ్మా! మేము గృహస్థులము, మా బంధువుల శ్రాద్ధకర్మలు జరుగునప్పుడు మేమేమి చేయవలయును ?

అమ్మగారు : మీ బంధువులకు కోపము కలుగకుండ, మీ రట్టి సమయములందు పైపెత్తనము వహించి సాయము చేసి, యెట్లైన భోజనమునుమాత్ర మానాడు చేయకుండ తప్పించుకొనుడు. మీరట్లు చేయజాలరేని, శ్రాద్ధకర్మ జరుగుచుండినప్పుడు విష్ణువునకుగాని, యితర దేవతలకుగాని సమర్పితమైన ఆహారమును భుజింపుడు. భగవదర్పితమైన శ్రాద్ధాహారమును భక్తులు భుజింపవచ్చును.

లలితబాబు : చాలసమయములందు శ్రాద్ధకర్మకై సేకరింపబడిన ఆహారపదార్థములలో నెక్కువభాగము మిగిలిపోవును. మేము దానిని తినవచ్చునా?

అమ్మగారు : ఔను, తినవచ్చును. నాయనా! అది

మిమ్ము బాధింపదు. గృహస్థులైనప్పుడు మీ రట్టి యాహార మును భుజింపకుండ నెట్లుండగలరు?

ప్రబోధబాబు : అమ్మా! శ్రీ గురుదేవుడు త్యాగ ప్రియుడు. మేము దానినెంత స్వల్పముగా నాచరించు చున్నాము!

అమ్మగారు : ఔను, మెల్ల మెల్లగా మీకది అల వడును. ఈ జన్మలో కొంచెముగను, రాబోవు జన్మలో కొంచె మెక్కువ గను — ఈ రీతిని మీ రభివృద్ధిగాంతురు. శరీరము మాత్రమే మార్పు నొందును; ఆత్మయన్ననో, యెల్లప్పుడు నొకేరీతి నుండును. 'కామినీ కాంచన' త్యాగము! "నాకిష్టమున్నచో మధుర బాబు సాయముగైకొని కామార్పకూరునెల్ల బంగారముగా మార్చివేయగలను. కాని, అందువల్ల కలుగు లాభమేమి? అదియంతయు నశాశ్వతము," అని శ్రీ గురుదేవులు చెప్పు చుండువారు. ఒకొక్క భక్తునిజూచి "చూచితిరా! దేని కొఱకును నీతనికి కోరికలేదు. ఇది యీతని కడసారి జన్మ," అని ఆయన నుడువుచుండువారు. భక్తులు శ్రీ మాతృదేవికి ప్రణమిల్లి సెలవుతీసికొని వెళ్లిరి.

పారమార్థికాభివృద్ధి క్రమక్రమముగా లభించును

శ్రీ రామకృష్ణుని సన్న్యాస శిష్యులలో కొందరు శూద్రులగుటచే, పూర్వాచార విధులను బట్టి వారు సన్న్యాసమున కర్హులుకారను నాక్షేపణను గురించి

శూద్రులును, స్త్రీలును సన్న్యాసమున కర్హులా?

అమ్మగారిట్లు చెప్పిరి : "శ్రీ రామకృష్ణుల శిష్యులు జ్ఞానులు కనుక సన్న్యాసులు. జ్ఞాని సన్న్యాసికావచ్చును. గౌరీదేవి విషయమును దీసికొనుడు. స్త్రీకి సన్న్యాస మియ్యకూడదు. కాని, గౌరీదేవి స్త్రీయా? ఏ పురుషుడు నామెకు సమానుడు కాడు. ఆమెవంటి పురుషు లెందరున్నారు? ఆమె చేసిన పనులను చూడుము— పాఠశాల కట్టించెను. బండి, గుఱ్ఱములు మొదలగువాని నెన్నియో సంపాదించెను. "సన్న్యాసమును స్వీకరించిన స్త్రీ నిజముగా స్త్రీకాదు. ఆమె పురుషవ్యక్తియే," అని శ్రీ గురుదేవులు చెప్పుచుండువారు. 'నేను నీరుపోయుచున్నాను, నీవు బంకమట్టిని చేయుదువు,' అని ఆయన గౌరీదేవితో జెప్పుచుండువారు.

1913-వ సం॥ మార్చి 28-వ తేది.

ఉదయమున శిష్యుడు శ్రీ మాతృదేవి యింటిలోనికి వచ్చినప్పు డామె చేమకాడలను తరుగుచుండిరి. "చేమకాడలతోకూడ మీరేమి తరుగుచున్నారు?" అని అత డడిగెను. "ఇది గడ్డి. ఇదికూడ ఆ కూరలలో నొకరకము. శ్రీ కృష్ణుని మేనిచాయ యీ గడ్డివలె నుండును," అని అమ్మగారు బదులుచెప్పిరి. శిష్యుడు మధ్యాహ్న భోజనమునకై కూర్చుండెను. తన యింటివసారాలో మఱియొక అతిథికి, బహుశః తన బంధువులలో నొకరికి, రాధు తల్లి విస్తరివేసి మంచినీళ్ల చెంబు పెట్టెను. ఒక పిల్లివచ్చి ఆ చెంబులోని నీటిని కొంచెము త్రాగెను. రాధుతల్లి యీ నీటిని పాఱబోసి, మరల దానిలో మంచినీటి నుంచెను. పిల్లి

మరలవచ్చి కొంచెము నీటిని త్రాగెను. రాధుతల్లి ఆ నీటిని తీసివేసి చెంబులో మరల నీటిని బోసెను. మూడవసారికూడ పిల్లివచ్చి ఆ నీటిని త్రాగెను. "ఓసి దొంగముండ కానా! మాడుమొగము పిల్లీ! నిన్ను చంపెద! నిన్ను చంపెదను చూడు!" అని కోపోద్దీపితురాలై అరచుచు రాధుతల్లి ఆ పిల్లిని వెంటదఱిమెను. శ్రీ మాతృదేవి అప్పుడచ్చట నుండిరి. "వలదు వలదు. దాహముగొన్న జంతువును నీ వాపకూడదు. ఇదిగాక, ఆ పిల్లి యింతకుమున్నే యా నీటిని త్రాగెను," అని అమ్మగారు చెప్పిరి. ఈ మాటలతో రాధు తల్లికి కోపము మఱింత యెక్కువయై, "పిల్లి యెడల నీవు కనికరము వహింప నక్కర లేదు. ఇంతవరకు మానవునిపట్ల నీ దయ పూర్తియైనది కాబోలు! మనుష్యులకు నీ దయనేల నిలువచేసికొనవు?" అని యామె కేకలిడెను.

"నా దయను సంపాదింపని మానవుడు నిజముగా నిర్భాగ్యుడు. నేను కనికరింపని వా రెవరినిగాని, చివరకొక కీటకమునుగాని నే నెఱుగను," అని తీవ్రస్వరముతో అమ్మ గారు పలికిరి.

శిష్యుడు సాయంకాల భోజనమునకు గూర్చుండెను. అమ్మగారే యొక కూరను, బంగాళాదుంపలను, మఱికొన్ని పదార్థములను సిద్ధముచేసి, శిష్యునకు వడ్డించి, "ఇవి తిని, ఎట్లున్నవో నీవు నాకు జెప్పవలెను," అని నుడివిరి.

శిష్యుడు: ఇది వ్యాధిగ్రస్తుని పథ్యాహారమువలె నున్నది. దీనిని వండినవా రెవరు?

అమ్మగారు : నేనే.

శిష్యుడు : మీరే?

అమ్మగారు : ఔను.

శిష్యుడు : ఇంతకంటె దీనిని బాగుగా వండవచ్చును. ఈ వంట మా ప్రాంతము వారికి అంతగా రుచించునట్టిదిగా లేదు.

అమ్మగారు : వీనిలో చారు, పులుసు మొదలగు ద్రవ పదార్థముల నించుక రుచి చూడుము.

నళిని : ఓ అత్తా! నీవు కూరలో నెట్టు మిరపకాయలు వేయనే వేయవు. అది యెవరికైన రుచించునా?

అమ్మగారు : (నళినితో) వానిమాట పాటింపకుము. (శిష్యుని సంబోధించుచు) నీవది తినిచూచినయెడల, దాని రుచి నీకు తెలియును.

శిష్యుడు ; కొన్నాళ్లనుండి మీరు వండిన కూరలను గురించి అడుగుచు వానిలో గొన్నిటిని రుచి చూచితిని. అవి యన్నియు నొకేరీతి నుండెను.

అమ్మగారు : మంచిది. నేనొకనాడు మీ యూరిలో వండినట్లు వండెదను. నీవు నా కా పద్ధతిని జెప్పవలెను. మీరు మిరపకాయల నెక్కువగా వాడెదరని నేననుకొందును. అంతేకాదా?

శిష్యుడు : అంత యెక్కువగా వేయము. కార మెక్కు

వగా వేయనంతమాత్రమున రుచికి కూర బాగుగా నుండదని చెప్ప వలను పడదు.

అమ్మగారు : (నళినితో) రేపు కొంచెము పప్పు తెమ్ము. నేనొక పులుసును జేసెదను. నేను మిక్కిలి చక్కగా వంట చేసెడిదానను. ఇప్పుడు నా కలవాటు తప్పినది. కామారుప్ప కూరులో, లక్ష్మి తల్లియు నేనును వంటచేసెడివారము. ఆమె చాల బాగుగా చేసెడిది.

1913-వ సం॥ మే 12-వ తేది.

రాధు జ్వరముతోను ఒడలునొప్పులతోను పండుకొని యుండెను. "నీవు నా కూతురిని మందుతో చంపివేయు నట్లున్నావు," అని నోటికి వచ్చినట్లెల్ల ఆమె పిచ్చి తల్లి శ్రీమాతృదేవిని తిట్ట నారంభించెను. ఆ సమయమున బరోదాను బిలిచిరి. ఆత డామె నింటిలోనుండి బయటకు తఱిమెను. అమ్మగారుకూడ నింక సహింపలేక రాధుతల్లిని తీవ్రముగా మందలించి, శిష్యునితో నిట్లు చెప్పిరి : "(తక్కువ వారిపట్ల) ప్రయోగింపబడు 'తూయి (ఓసి,)' అను మాటను గూడ నెన్నడు నా పట్ల వాడియెఱుగని భర్తకిచ్చి నన్ను వివాహముచేసిరి. ఈ రాధుతల్లిని జూడుము! రేయుంబవ ళ్లీమె నన్నెట్లు తిట్టిపోయుచున్నదో చూడుము! దీనినెల్ల అనుభవించుటకు నేనేమిపాపము చేసితినో నాకు తెలియదు. బహుశః ముల్లుగల మారేడుదళముతో శివుని పూజించి యుందును. అందుకే ఆ ముల్లిప్పుడు రాధుతల్లియై నన్ను బాధించుచున్నది."

రాధువ్యాధిని గురించి శ్రీ మాతృదేవి యిట్లు చెప్పిరి : "రాధుపై నామన సెంతమాత్రము నిలుచుట లేదు. దాని అనారోగ్యము విషయమున నాకు విసుగుపుట్టినది. బలవంతముపై నగాని నామనస్సు దానివైపునకు మరలుట లేదు. "నా ప్రభూ! నా మనస్సు నించుక రాధువైపునకు మరల్పుడు. లేకున్న దానిని జూచువారెవరు?" అని శ్రీ గురుదేవులను ప్రార్థించుదానను. ఇటువంటి జబ్బు నేనెన్నడు జూడనే లేదు. బహుశః దీని పూర్వజన్మలో నేదియో వ్యాధికి ప్రాయశ్చిత్తము చేసికొనకుండ మరణించియుండును. ఒకానొక వ్యాధికి అవసరమైన ప్రాయశ్చిత్తము చేసికొనకుండ దాని వలన నేమానవుడైనను మరణించునెడల, వానికి రాబోవు జన్మలో అదేవ్యాధి సంప్రాప్తమగును. కాని, యీసూత్రము సన్న్యాసులకు వర్తింపదు.

వ్యాధినివారణకై తపస్సు చేయకుండ ఆ వ్యాధివలన మరణించుట మంచిదికాదు.

కేదారుని తల్లి : చనిపోవునప్పుడు సన్న్యాసి భగవన్నామమును స్మరించును గనుక, నతనికి మోక్షము లభించును.

అమ్మగారు : ఔను. అది నిజము. మొన్న కోల్పారాలో చనిపోయిన కుబ్జవానికి మరల జన్మమున్నదా? లేదు. ఇదియే వాని అంత్యజన్మ.

కాశీపూర్‌లో వ్యాధిగ్రస్తులై యుండినప్పుడొక సారి శ్రీగురుదేవులు, "నేను జబ్బుగానున్నాను. ప్రాయ

శ్చిత్తమేదియు చేయనందుకు కాళీ దేవాలయాధికారులు నన్ను విమర్శింపవచ్చును. ఈ పది రూప్యములు దక్షిణేశ్వర మునకు దీసికొని వెళ్లి శ్రీ కాళీమాతకు సమర్పించి, ఆ పైక మును పిమ్మట బ్రాహ్మణులకును,తదితరులకును పంచిపెట్టుము," అని రామలాలుతో చెప్పిరి. ఏ కర్మనుగాని చేయుటకు సన్న్యాసికి హక్కు లేదు. అందుచేతనే, శ్రీగురుదేవులు తమ యిష్టదైవమునకు మొట్టమొదట సమర్పించి పిమ్మట బ్రాహ్మణులకును తదితరులకును పంచిపెట్టుటకై రామలాలునుకోరి, అతనిచేతికి పైకమిచ్చిరి. పూర్వకాలమున సన్న్యాసులును, ఋషులునుఅడవులలోనివసించుచుండువారు. వారు చాంద్రాయణవ్రతమువంటితపస్సు చేయగలిగిరా? తమతమ యిష్టదైవములకు పండ్లను కందమూలాదులనుమాత్రము సమర్పించి, బీదజనులకు ఇచ్చివేయుచుండువారు. వారి కది చాలును.

రాధుతల్లి : మా మేనత్త జబ్బుపడి చనిపోయెను. ఆ జబ్బుతోనే ఆమె మరల జన్మించినదనియా మీ యభిప్రాయము?

అమ్మగారు : మీ మేనత్త మరల జన్మింపలేదని నీవు తలంచుచున్నావా? ఆమె ఆజబ్బుతోనే తప్పక మరల జన్మించినది. ఒక మనుష్యుడొక కుటుంబములో తన కర్మఫల విశేషమువలన మరల పుట్టి చచ్చుచుండును.

1913-వ సం॥ జూన్ 8-వ తేది.

సురేంద్రనాథ భౌమికుడును డాక్టర్ దుర్గాప్రసాదును

శ్రీ మాతృదేవియింట నతిథులుగ నివసించుచుండిరి. వారా మధ్యాహ్నము తమయూరికి వెళ్లెదరు. ప్రొద్దుట స్నానముచేసి, వారిరువురును శ్రీమాతృదేవికడకువచ్చి ప్రణమిల్లిరి. అమ్మగారు తమ హస్తముతో వారి శిరములను దాకి వారిని దీవించి కూర్చుండబనిచిరి. కుశల ప్రశ్నలైనతరువాత సురేంద్రుడు శ్రీ మాతృదేవితో నిట్లు చెప్పెను : "అమ్మా! శ్రీగురుదేవు నారాధించుటలో నాకొక చిక్కు కలుగుచున్నది. ఒక భక్తుడు తన యిష్టదేవమున కును శ్రీగురుదేవునకు నెట్టి భేదములేదని నమ్మునను కొనుడు. శ్రీగురుదేవుని పటమును శక్తిగా భావించి అతడు పూజిం చును. తరువాత "ఓ మహేశ్వరీ! నీ దయానిశేషముచే" అని యీ రీతిగా దేవిని సంబోధించుచు, జప ఫలమును శ్రీ గురుదేవునకు సమర్పించును. దీనివలన నా మనస్సు సందేహ పీడితమగుచున్నది." "నాయనా! అట్లే కానిమ్ము. మహే శ్వరుడును, మహేశ్వరియుగూడ మన గురుదేవుడే. ఆయ నయే సర్వదేవ (దేవీ) స్వరూపుడు. ఆయనయే సర్వబీజా క్షర మూర్తి. ఆయన రూపమున జనులు సర్వదేవతల నారాధింపవచ్చును. ఆయనను నీవు మహేశ్వరునిగను మహేశ్వరిగనుకూడ సంబోధింపవచ్చును." అని అమ్మగారు మందహాసముతో బదులు చెప్పిరి.

*శ్రీ గురుదేవునకును, భక్తుల యిష్టదేవతల కునుగల సంబంధము*

సురేంద్రుడు : అమ్మా! ధ్యానసమయమున నా మనస్సు స్థిరముగా భగవంతుని పాదపద్మములయందు నిలువ జాలకున్నది.

అమ్మగారు : అయిన నేమి? నీవు శ్రీగురుదేవుని పటమును జూచుచుండిన జాలును. కాశిపూర్‌లో శ్రీ గురుదేవులు వ్యాధిగ్రస్తులై యుండినపుడు, వంతుల ప్రకారము బాల శిష్యు లాయనకు పరిచర్య చేయుచుండువారు. గోపాలుడుకూడ వారిలో నొకడు. ఒకనాడా యువకుడు శ్రీవారికి సేవచేయుటకుమారుగా ధ్యానమునకు బోయెను; చాలసేపటివరకు రాలేదు. ఈ సంగతిని గిరీశబాబు విని, "ఎవరి నాతడు కన్నులు మూసికొని ధ్యానించుచుండెనో ఆయన జబ్బుతో మంచముపై బరుండి బాధపడుచున్నారు. అట్టిస్థితిలో నున్నవారి నతడు ధ్యానించుటలో గల వివేకమును యోచింపుడు," అని చెప్పెను. పిమ్మట గోపాలుని తోడ్కొనిరమ్మని మనుష్యుని బంపిరి. అతడు వచ్చినతరువాత శ్రీ గురుదేవు లాతనిని తమకాళ్లను మెల్లగా నొత్తుమనిరి. అతడు పాదము లొత్తుచుండగా, "నొప్పులెత్తుచుండుటచే నిన్ను నా కాళ్ల నొత్తుమని యడుగుచున్నానని తలంచుచున్నావా? లేదు. లేదు! నీ పూర్వజన్మలలో నెన్నియో పుణ్యకార్యములు చేసితివి; అందుచేతనే, నీసేవ నేను స్వీకరించుచున్నాను." అని ఆయన సెలవిచ్చిరి. శ్రీ రామకృష్ణుల చిత్తరువును జూచుచుండుము. అదియేచాలును.

మనస్సు నేకాగ్రముగా నీవు నిలుపలేకున్న, శ్రీగురుదేవుని పటమును జూచుచుండుము

సురేంద్రుడు : అమ్మా! ప్రతిదినము యథావిధిగ మూడుసారులు జపము చేయజాలకున్నాను.

అమ్మగారు : అట్లే కానిమ్ము. శ్రీ గురుదేవులను తలచుకొనుచుండుము. చేయగలిగినప్పుడెల్ల జపము చేయుచుండుము. కనీసము నీ వాయనకు మనస్సులో నమస్కారము చేయగలవు కాదా ?

దుర్గబాబు : అమ్మా! ఆహార విషయమున మేమేమి నియమములను పాటింపవలయునో మాకు తెలియదు.

ఆహారవిషయమున మనము శుచినియమముల నెంత వరకు పాటింపవలయును ?

అమ్మగారు : ఆహారవిషయమున శ్రీ గురుదేవు లొక నియమమును శ్రద్ధగా మనము పాటింపవలయునని చెప్పుచుండువారు; శ్రాద్ధకర్మలలో వండబడు అన్నమును తినకూడదని తమ భక్తులనందరిని శాసించెడువారు. అది పారమార్థికాభివృద్ధికి హానికరమని వారి యభిప్రాయము. దీనినితప్ప, మీ యిష్టము చొప్పున దేనినైన మీరు తినవచ్చును; కాని మీ రట్లు చేయునప్పుడు, శ్రీ గురుదేవులను స్మరింపుడు.

దుర్గాబాబు : అమ్మా! ఆసుపత్రిలో పనిచేయుచుండునప్పుడు చాలసారులు మాకు దాహమగును. అట్టితరి స్థలమునుగాని, మనుష్యులనుగాని పాటింపకుండ నేను నీళ్లు త్రాగవలసివచ్చుచుండును. వాస్తవముగా నేనట్లు త్రాగుచున్నాను. అమ్మా! ఈ విషయమున మీ యభిప్రాయ మేమి ?

అమ్మగారు : త్రాగక నీకు గత్యంతర మేమున్నది ? నీ విధాయకధర్మమును నిర్వహించుచుండునపుడు, నీ వట్లు

త్రాగుచున్నావు. నీళ్లు త్రాగునప్పుడు శ్రీ గురుదేవులను నీవు స్మరింతువేని, నీకు హానికలుగదు. వేర్వేఱు చిల్లర పనులు చేయవలసిన వారికి, ఆహారవిషయమునగల మత నియమముల నన్నిటిని బాటింప సాధ్యమగునా ?

సురేంద్రుడు : అమ్మా ! మీరు చూచుచున్నారు గదా. గృహస్థులమగు మేము చాలమంది బంధువులతో కుటుంబములుగా జీవింతుము. ఒక్కొకప్పుడు వంట చేయు చుండగనే, కుటుంబములోని కొంతమంది భోజనము చేయు చుందురు. ఆ యన్నమునే కొంతతడవైన తరువాత నాకును వడ్డించెదరు. నేనా యాహారమును భగవంతునకు సమర్పింప సందేహింతును.

అమ్మగారు : గృహస్థుల విషయములో నిట్టిది తప్పదు. మేముకూడ నట్టి సన్నివేశముల నెదుర్కొనవలసిన వారమే. కుటుంబములో వ్యాధిగ్రస్తుడగు మనుష్యుడున్నచో, వానికై అన్నమును వేఱుగా దీసియుంతుము. అయినను నీకు విస్తరిలో నన్నము వడ్డించిన తర్వాత శ్రీ గురుదేవులను స్మరించి, వారే నీకాయన్న మొసంగిరని భావించి, దానిని నీవు భుజించుచో, నీపారమార్థికాభ్యుదయమున కందువలన నెట్టిహానియు కలుగదు.

సురేంద్రుడు : అమ్మా! నా మానసికస్థితిని మీకు నే నెట్లు వర్ణింపగలను? అంతర్యాములై సర్వజీవులను నడుపు వారు మీరే. మీకు సర్వము తెలియును. కొన్ని సంవత్సరములనుండి నేనీ కష్టములనెల్ల బడుచున్నాను. మీ

యాశీస్సులే లేనిచో, నే నీనాటికి బహుశః మరణించియే యుందును.

అమ్మగారు : ఔను నాయనా! ఈ లోకములోని జీవితకష్టములనుగూర్చి నీవు నాకు చెప్ప బని లేదు. ఆ కష్టముల కంతమే లేదు. నీ విషయమున బాధ తప్పనిసరి యగుచున్నది. బాబూ! నన్ను చూడుము. శ్రీ గురుదేవుని సంకల్పమువలన నేనెంత దుఃఖభాజనమగు జీవితమును గడపుచున్నాను! (రాధును చూపుచు) ఈ పిల్లనిమిత్తము నేనెంత కష్టపడుచున్నాను!

సురేంద్రుడు : అమ్మా! ఔను! మీస్థితివలననే మా కించుక ధైర్యమును, దుఃఖోపశమనమును గలుగుచున్నవి. ఈ లోకకష్టములను స్వానుభవముచే మీ రెఱిగినవా రౌటచే, మీ దయకు పాత్రులము కాగలమని మాయాశ.

అమ్మగారు : తండ్రీ! భయపడకుము, శ్రీ గురుదేవులున్నారు. ఇహపరముల రెండింటను నిన్నాయనయే రక్షించును.

సురేంద్రుడు : అమ్మా! మేమెంతో దూరగ్రామమున నివసించుచున్నాము. కలలు నిజమా?

అమ్మగారు : ఔను! శ్రీ గురుదేవులను గురించిన స్వప్నములు నిజమైనవే. కాని, తమ్ముగురించిన స్వప్నములను తుదకు తమకుకూడ తెలుపవలదని వారియాజ్ఞ.

సురేంద్రుడు : అమ్మా! శ్రీ గురుదేవులెట్లుండెడి వారో

మే మాయనను చూడలేదు. కనుక, మాకు గురువును, సర్వమును మీరే.

అమ్మగారు : నాయనా! భయపడకుము. శ్రీ గురుదేవులు నిన్ను రక్షింతురు; ఇహామునను పరముననుగూడ నీక్షేమమును కనిపెట్టుచుందురు. ఆయన నీ కెల్లప్పుడును తోడునీడయై నిన్ను కాపాడుచుండును.

ఆ భక్తు లిరువురును భోజనము చేసిన తరువాత, శ్రీ మాతృదేవికడ సెలవుదీసికొని వెళ్లిరి. కలకత్తాకు వెళ్లుచుండిన వరదా మామ వారితోగూడ పయనమయ్యెను. అమ్మగారు వారితోగూడ కొంతదూరము నడిచి, కంటికగపడువరకు వారిని చూచి వెనుకకు మరలెను.

సురేంద్రుడు బల్లారతన్‌గంజిలో నొక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. అచ్చటి కసాయివాండ్రు కొందరు, ఆవులను బ్రతికియుండగనే చర్మము నొలిచి చంపుచుండిరి. ఒకనాఁడా దుర్మార్గులా పాఠశాలయెదుటనే యిట్లు చేసిరి. అందుపైని సురేంద్రుడు, మిగిలిన యుపాధ్యాయులును, హైందవ మహమ్మదీయ విద్యార్థులందరును తీవ్రముగా ప్రతిఘటించి, ఆ దుండగీండ్రను కొట్టిరి. దీనివలన కొంత చిక్కు కలిగెను. కటికవాండ్రు సురేంద్రునిపై పగతీర్చుకొనెదమని బెదరించిరి. ఈ సమయముననే ఆ పాఠశాలయందలి విద్యార్థులు చాలమంది, మంత్రోపదేశమునకై జయరాంబటికి వెళ్లిరి. సురేంద్రుడు శ్రీమాతృదేవి కొకయుత్తరము వ్రాసి, వారిచేతికిచ్చి పంపెను. ఆ బాలురుకూడ జరిగిన యుదంతము

నెల్ల విన్నవింప, అమ్మగారు మిక్కిలి పరితాపపడి, "అట్టి ఘోరకృత్యములను మీరే ప్రతిఘటింపనిచో, నిక వాని కసమ్మతిని దెలుపువారెవరు?" అని చెప్పిరి. ఆమె సురేంద్రునకు అభయోత్సాహము లొసంగుచు నొకయుత్తరము వ్రాయించి, అట్టి క్రూరకార్యములు మరల జరుగకుండునట్లు చూడుమని యాతని కానతిచ్చిరి. కొన్నాళ్లైన తరువాత శ్రీ మాతృదేవి సురేంద్రునకు మరల నుత్తరము వ్రాసి, అందులో "భగవంతుడే నిజముగా నున్నయెడల, నత డీ పాపమును తప్పక పరిహరించును" అని సెలవిచ్చిరి. కొంత కాలమైన తర్వాత ప్రజలు తీసికొనివచ్చిన వ్యాజ్యఫలితముగా, బహుహేయమగు నిట్టి కసాయితనము అంతరించెను.

1913-వ సం॥ జూలై 14-వ తేది.

శిష్యుడును, ముకుందుడును శ్రీ మాతృదేవియింటి నడవలో తమ మధ్యాహ్నభోజనమునకై కూర్చుండిరి. ప్రక్కయింటి నడవలో అమ్మగారు కూర్చుండిరి. తనపై కాకి రెట్టవేసినందున, అప్పుడే స్నానముచేసి తెల్లని చీర కట్టుకొని నళిని వచ్చెను.

శుభవిషయమున విపరీతాచారము అపరిశుద్ధచిత్తమును సూచించును

అమ్మగారు: నేను ముసలిదాననే కాని, ఆ విధముగా కాకి రెట్టవేసినదని నేనెన్నడును వినలేదు. నీ మనస్సు కల్మషపూరితమైనది. దారుణ పాపములు చేయనిచో, మనస్సు తన నిర్మలస్వభావము నెట్లు కోల్పోవగలదు. కృష్ణబోసు సోదరి కిట్టి విపరీ

తాచారములు కలవు. గంగలో స్నానముచేయుచు, తన తల పూర్తిగా నీటిలో మునిగినదా యని యామె జనుల నడుగు చుండును. అది మూఢాచారము. ఇందువలన మనస్సెన్నటికిని నిర్మలముకాదు. అపరిశుద్ధమైన మనస్సు, సులభముగా నిర్మలముకాదు. నీ ఆచారము నెంత వ్యగ్రముగా కనుబఱచు చుందువో, నీ మూఢత్వమంత యెక్కువయగును. అన్ని విషయములం దిది నిజము.

శిష్యుడు : మహాపురుషులవారు (శ్రీ శివానందస్వామి) చేతులతో కుక్కలను బుజ్జగించి పిమ్మట శ్రీ గురుదేవు నారాధించుటకు పూజామందిరమునకు వెళ్లుట నేను చూచు చుందును. ఎవరో యొకరువచ్చి, యాయన చేతిలో కొంచెము నీటిని పోసెడివారు. ఆయన దానిని తనమోముపై జల్లు కొనెదరు. ఆ కాలమున గంగాజలమునే అన్నిటికిని వాడు చుండెడువారు.

అమ్మగారు : వారి విషయమే వేఱు. వారందరును సాధువులు. వారి యంతఃకరణ మెంత నిర్మలముగా నుండును! గంగానదీ తీరమున నివసించువారు నిజముగా దేవతలే. దేవతలు తప్ప వేఱెవరైన గంగాతీరమున నివసింపగలరా? మానవులు ప్రతిదిన మొనర్చుచుండు పాపములు, గంగా స్నానమువలన నశించుచున్నవి.

నళిని : ఉద్బోధనా పత్రికా కార్యాలయమందలి నీళ్ల గదిని కడిగి, పిమ్మట కట్టుబట్టను మార్చుకొని పూజామందిరములో నైవేద్యమునకై గోలప్‌మాయి యొకనాడు పండ్లను

సిద్ధము చేయుచుండగా జూచి నేను "గోలప్ దీదీ! ఇదేమి? వెళ్లి గంగలో స్నానముచేయుము," అని అంటిని. "నీకంత యిష్టమున్నచో ఆపని నీవేల చేయవు?" అని గోలప్ మాయి నాకు బదులు చెప్పెను.

అమ్మగారు : ఎంత నిర్మలమైనది గోలప్ మనస్సు! ఆమె యెంత మహోన్నతాత్మురాలు! అందుచేతనే యామె పరిశుద్ధాపరిశుద్ధవస్తువుల కంతగా వ్యత్యాసమును పాటింపదు. మడిపేరిట పామరులు ప్రదర్శించునట్టి మూఢాచారముల నామె యెంతమాత్రము పాటింపదు. ఆమె కిది కడపటిజన్మ. అటువంటి మానసికస్థితిని బడయవలెననిన నీవు వేఱొకజన్మ నెత్తవలెను. గంగాతీరములందు ఎనిమిదిమైళ్లవరకు నిర్మల వాయువు వీచుచుండును. ఈ వాయువే నారాయణుని శరీరము. కఠిన నియమాచరణమువలన మనస్సు నిర్మల మగును. 'పవిత్రతాస్వరూపమని చెప్పదగిన భగవంతుని సాక్షాత్కారము, నియమము నిష్ఠ లేనిదే సిద్ధింపజాలదు.'

భగవత్సాక్షాత్కారమువలన నెవరికైన నితర లాభ మేమి కలుగును? అట్టివారికి తలపై రెండుకొమ్ములు మొల చునా? వారి మనస్సు నిర్మలమగును. చిత్తశుద్ధి యున్నచో జ్ఞానము కలుగును, పరమార్థానుభూతి లభించును.

శిష్యుడు : భగవంతున కాత్మార్పణము గావించు కొనుటయే కాని, నియమముగాని నిష్ఠగాని ఆచరించినవారి కీ స్థితి యెట్లు లభించును?

అమ్మగారు : భగవంతునకు పరిపూర్ణాత్మార్పణము గావించుకొని, సంశయమునకు తావులేని అచంచల విశ్వాస

ఆత్మార్పణమును, పారమార్థిక సాధనయును

మును వానియం దుంచుటయే వారి పారమార్థిక సాధన. హా! "కోటిజన్మ లెత్తినను నాకేమి భయము?" అని నరేను చెప్పెను. నిజమే; జ్ఞాని పునర్జన్మ కెన్నడైన భయపడునా? అత డే పాపమును చేయడు. నిరంతరము భయగ్రస్తుడగువాడు అజ్ఞాని. వాడే బంధము లలో చిక్కుపడి పాపకళంకము నొందును; కోట్లకొలది జన్మల వరకు అనంతములైన దుఃఖములను, బాధలను అనుభవించి, తుట్టతుదకు భగవంతునే కాంక్షించును.

శిష్యుడు : ఔను. అతడు స్వానుభవమువలన గుణ పాఠములను నేర్చుకొని పిమ్మట జ్ఞానము నొందును.

అమ్మగారు : ఔను, దూడ 'హంబా, హంబా' (నేను, నేను) అని అరచుచుండును. దాని చర్మముతోను ప్రేగులతోను డోళ్లు మొదలగు పనిముట్లు జనులు చేసిన తరువాతకూడ అది ఆ ధ్వనినే చేయుచుండును. చిట్టచివరకు దూదేకులవాని చేతిలో బడినప్పుడు, 'తుహుం, తుహుం' (నీవు, నీవు) అని అది రొదచేయును.

1913-వ సం॥ సెప్టెంబరు 18-వ తేది.

ఒక భక్తునకు వ్రాసిన లేఖలో శ్రీ మాతృదేవి యిట్లు నుడివిరి : "మానవజన్మలో నెట్టి సుఖమును లేదు. ఈ లోకమంతయు నిజముగా దుఃఖమయము. ఇచ్చట సుఖమనునది నామ మాత్రమే.

జీవితములో భగవంతుని యందే మనకు శాంతి సౌఖ్యములు లభించును

శ్రీ గురుదేవుని దయావిశేషము లభించిన ధన్యాత్ములు మాత్రమే ఆయన భగవంతుడే యని గ్రహింతురు. వారి సౌఖ్యమదియే యని జ్ఞప్తియందుంచుకొనుము.

సన్న్యాసాశ్రమ ధర్మము

సన్న్యాసి శిష్యుడొకడు జయరాంబటికి వచ్చి, శ్రీ మాతృదేవిని సందర్శించి, పిమ్మట ఋషీకేశము వెళ్లెను. కొలదినాళ్లైన తరువాత, నత డమ్మగారికి వ్రాసిన యుత్తరములో నిట్లు విన్నవించెను. "అమ్మా! కాలక్రమమున నాకు శ్రీ గురుదేవుల దర్శనభాగ్యము లభించునని మీరు చెప్పితిరి. కాని, ఇంతవరకట్లు జరుగలేదు." అది విని అమ్మగారు, "శ్రీరామకృష్ణులు ఋషీకేశమునకు నీకొరకై కాని నీవచ్చట నున్నావని కాని వెళ్లియుండలేదు," అని అతనికి బదులు వ్రాయుము. అతడు సన్న్యాసాశ్రమము స్వీకరించెను. భగవంతుని ప్రార్థించుటతప్ప నతనికి వేఱుపని యేమున్నది? ఆయన తమ దయవచ్చినప్పుడు భక్తులకు బ్రత్యక్షమయ్యెదరు," అని శిష్యునితో జెప్పిరి.

భగవత్ప్రార్థన

ఒక స్త్రీ అమ్మగారి కిట్లు వ్రాసెను: "అమ్మా! వయస్సున నేను చిన్నదానను. నా అత్తమామలు నన్ను మీయొద్దకు రానీయకున్నారు. వారి యభీష్టమునకు నేను వ్యతిరేకముగా నెట్లు నడువగలను? మీ యాశీస్సులను బడయవలయునని నా కోరిక". "అమ్మాయీ! నీవిచ్చటకు రా నక్కఱలేదు. సర్వవిశ్వాంతర్యామియగు భగవంతుని బ్రార్థింపుము. తన

యమోఘాశీర్వాదము లాతఁడే నీ కనుగ్రహించును,'' అని యామెకు బదులు వ్రాయుమని అమ్మగారు శిష్యున కాన తిచ్చిరి.

1918-వ సం॥ సెప్టెంబరు 30-వ తేది.

ఉదయమున శ్రీ మాతృదేవి పూజకై పండ్ల నాయత్త పఱచుచుండిరి. శిష్యుడొక భక్తుడు వ్రాసిన యుత్తర మామెకు చదివి విని పించుచుండెను. ఆ భక్తుడు భగవంతు నిపై తాను అలుక వహించిన ధోరణిలో వ్రాసెను. ఇందుకు అమ్మగారిట్లు బదులు చెప్పిరి : '' 'శుకుడు, వ్యాసుడు మొదలగు ఋషులే పెద్దచీమలవంటివారు,' అని శ్రీ గురుదేవులు చెప్పెడివారు. అనంతమగు ఈ సృష్టియంతయు భగవంతునిది. నీవు భగవంతుని ప్రార్థింపనిచో వాని కేమిలెక్క ? భగవంతుని తలపెట్టనైన తలపెట్టని వారెందరో యున్నారు. నీ వాతనిని స్మరింపనిచో నీవే దురదృష్టవంతుడవు. వాని మాయచే జనులు వానిని మఱచియున్నారు. 'వీరు బాగుగనేయున్నారు; వీరి నిట్లే యుండనిమ్ము,' అని వారినిజూచి భగవంతు డను కొనుచుండును.''

భగవంతునిపై అలిగిన భక్తుడు

శిష్యుడు : అమ్మా, ఈ విలేఖరివలె జనులు భగవంతుని దర్శింప నిష్టము లేనివారుకారు. అట్లయ్యును, వారి మనస్సు లలో నిట్టి ప్రశ్నయే యెందు కుదయించవలయును ? వాస్తవ మేమనగా, తమ 'సొంతముగా భావింపగోరు భగవంతుడు తమకు దూరుడగుచుండుట జూచి మనస్సున వారు చాల

బాధపడుదురు. చైతన్యుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు మున్నగు వారు తమ భక్తుల శ్రేయస్సునకై యెంతో కష్టించి పని చేసిరి.

అమ్మగారు : అదియే శ్రీ గురుదేవుల దృక్పథము కూడ. భక్తులనందరిని జ్ఞప్తికి దెచ్చుకొనుట నాకెల్లప్పుడును సాధ్యము కాదు. "ఓ ప్రభూ! వారెచ్చటనున్నను అందరిని అనుగ్రహింపుడు. వారి నందరిని నేను జ్ఞప్తికి దెచ్చుకొన లేకున్నాను," అని శ్రీ వారికి నేను విన్నవించుచుందును. ఆయనయే సర్వము చేయుచున్నారు, లేనిచో, ఇంతమంది జనులేల రావలయును?

శిష్యుడు : అది తప్పక నిజము. జనులు కాళికను, దుర్గను, ఇతర దేవతలను భగవంతునిగా నమ్ముట సులభము; కాని, ఒక మనుష్యుని భగవంతునిగా నమ్ముట సులభమా?

అమ్మగారు : అది వారి దయావిశేషముపైననే ఆధారపడి యున్నది.

భగవదనుగ్రహమునకును సూర్యుని కిరణములకును గల సామ్యము

మరియొకనా డొక భక్తుడు వచ్చెను, "అమ్మా! మీకా యుత్తరమును వ్రాసిన దీ భక్తుడే," అని శిష్యు డమ్మగారితో జెప్పెను. "అటులనా? మంచి కుఱ్ఱవాడుగనే కనుపడుచున్నాడు," అని చెప్పి, ఆ భక్తుని, సంబోధించి అమ్మగారిట్లు సెలవిచ్చిరి : "చూడుము. దిగువకు ప్రవహించుట నీటిస్వభావము; కాని, సూర్యుని కిరణములు నీటి నాకసము వైపునకు పైకి లేవ

నెత్తుకొనిపోవును. ఇట్లే మనస్సు సహజముగా తుచ్ఛవిషయ ములపై, భోగ్యపదార్థములపై బోవుచుండును; కాని, భగవంతుని దయయున్నచో మనస్సు మహోన్నత విషయ ములపై బోగలుగుచుండును.''

భగవంతుడు మనుష్యుల కేందుకు కనుపడడు

అప్పటి కుదయమున పదిగంటల ముప్పది నిమిషము లయ్యెను. గృహస్థుడగు నొక భక్తుడు వచ్చి, అమ్మగారికి ప్రణమిల్లి, ''అమ్మా! శ్రీ గురుదేవులు నాకేల కనుపడరు?'' అని అడిగెను. ''ధైర్యము విడనాడక ప్రార్థించు చుండుము. కాలక్రమమున సర్వమును ప్రాప్తించును. పూర్వకాలపు మునులును, ఋషులు నెన్నియుగములు భగవంతునికొఱకు తపస్సుచేసినను, కృతార్థులు కాలేదే! ఒక క్షణములో భగవంతుడు నీకు ప్రత్యక్షమగు ననుకొను చున్నావా? ఈ జన్మలో కాకున్న రాబోవు జన్మలోనో, ఆ జన్మలో కాకున్న దాని తరువాతి జన్మలోనో నీ మనో రథము ఫలించును. భగవంతుడు ప్రత్యక్షమగు టంత సులభమా? కాని, యీ సారి శ్రీ గురుదేవులు సులభమార్గ మును కనుబఱచియుండుటచే, భగవత్సాక్షాత్కారము బడయుటకు అందరకును సాధ్యమగును,'' అని అమ్మగారు బదులు చెప్పిరి.

ఆ భక్తుడు వెళ్లిన తరువాత అమ్మగారిట్లు చెప్పిరి: ''అతడు ప్రాపంచికవిషయసాగరమున పూర్తిగా మునిగి యున్నాడు. డజనులకొలది పిల్లలుగల తండ్రి. అట్లయ్యును,

"శ్రీ గురుదేవుడు నా కెందుచేత కనుపడడు?" అని అత డడుగుచుండును. స్త్రీలు చాలమంది శ్రీ గురుదేవుని కడకు వచ్చి 'భగవంతునిపై మేమేల మా మనస్సు నేకాగ్రముగ నిలుపలేకున్నారము? ఎందుచేత మా మనస్సును స్థిరముగా నిలుపజాలకున్నాము?' అని బహువిధముల మొఱపెట్టుచుండెడు వారు. శ్రీ రామకృష్ణులు వారి కిట్లు బదులు చెప్పుచుందురు: 'మీ కింకను పురిటిగది వాసన పోలేదు. ఆ వాసనను మొట్ట మొదట వదుల్చుకొనుడు. భగవత్సాక్షాత్కారముకొఱకై మీ కింత తొందరయేల? సర్వము కాలక్రమమున జరుగ గలదు. ఈ విధముగా మన మీ జన్మలో నొండొరులము కలిసికొనినాము. రాబోవు జన్మలో మరల కలిసికొనెదము. అప్పుడు మీరు కడతేరుదురు.' సజీవుడైన మనుష్యుని చూచుట సులభము. నే నిచట నివసించుచున్నాను కనుక, నిచ్చట కెవరైన వచ్చినంతమాత్రమున నన్ను చూడగలరు. స్థూలనేత్రములతో నిపుడు శ్రీ గురుదేవులనుచూచు మహా భాగ్యమే కొలదిమంది పుణ్యాత్ములకో కలదు. విజయ గోస్వామి ఢక్కాలో శ్రీ గురుదేవులనుజూచి వారి శరీరమును గూడ స్పృశించెనట. శ్రీ గురుదేవు లది విని 'నా యాత్మ బయటకుపోవుట మంచిదికాదు. బహుశః ఈ శరీరమింక చాలనాళ్లు జీవింపదు,' అని చెప్పిరి.

భగవంతు నెవరైన చూచిరేమో నీవు నాకు చెప్ప గలవా? నరేనునకు శ్రీ గురుదేవులు భగవత్సాక్షాత్కార మనుగ్రహించిరి. ఎంత గొప్పవారైనను, శుకుడు, వ్యాసుడు, శివుడు మొదలగువారు పెద్దచీమలవంటివారే. అప్పుడప్పుడు

మాత్రమే, మెఱపువలె భగవంతుడు వారికి గోచరించు చుండును. ఎవరికో కొందరికి భగవంతుడు కలలో కనుపడ వచ్చును. కాని భగవంతుని స్థూలశరీరరూపమున జూచుట నిజముగా మహాభాగ్యము.

(ఉద్రేకముతో) "నిర్మలాంతఃకరణులకు ధ్యానమేల సాధ్యముకాదు? వారేల భగవంతుని చూడజాలరు? పరి శుద్ధాత్ములు జపము చేయునప్పుడు, భగవంతుని పావన నామము తమలోపలినుండి దానంతటది పాతాళగంగవలె పొంగివచ్చుచున్నట్లు వారికి తోచును. నామస్మరణకొఱకు వారెట్టి ప్రయాసగాని పడరు. నియమితకాలములందు బద్ధక మును వదలిపెట్టి, యెల్లరును ధ్యాన జపములను చేయవల యును. నేను దక్షిణేశ్వరములో నుండినప్పు డొకనాడు శరీర మస్వస్థతగా నుండినందున, కేవలము బద్ధకముచే నిద్రనుండి కొంచె మాలస్యముగా మేల్కొంటిని. ఆ కాలమున నేను తెల్లవారుజామున మూడుగంటలకే నిద్రనుండి లేచుచుండు దానను. ఆ మరునా డంతకంటె నాలస్యముగా మేలుకొంటిని. చివరకు రానురాను శీఘ్రముగా నిద్రనుండిలేచుటకే మనస్క రింపని స్థితికి వచ్చుచుంటినని కనుగొని 'ఆహా! తుట్టతుదకు సోమరినైతిని,' అని నాలో నేననుకొంటిని. పిమ్మట నన్ను నేనే బలవంతపఱచుకొని, వేకువజామున లేవ నారంభించితిని. క్రమక్రమముగా నా తొల్లిటి యలవాటు మరల నాకు కలిగెను. ఇట్టి విషయములలో, మన మచంచలదీక్షతో మన యభ్యా సమును కొనసాగించుచుండవలయును.

"తపోనిష్ఠ, భగవత్సేవ, తీర్థయాత్ర, ధనసంపాదన— వీని నెల్ల యౌవనమందే జనులు సాధింపవలయును. చూడుము. కాశిలోను, బృందావనములోను నే నెన్ని చోట్లకో నడిచి వెళ్ళుచుంటిని. కాని, యిప్పుడు కొలది యడుగుల దూరమునకైనను నాకు పల్లకి కావలసివచ్చుచున్నది. ఇతరుల నానుకొనుచున్నాను. వార్ధకములో శరీరము బలహీనమగును. మనస్సునకు పటుత్వము తగ్గును. అట్టి సమయమున నేమైన చేయుటకు సాధ్యపడునా? మన మఠములోని బాలసన్న్యాసులు చిన్నతనమందే తమ మనస్సును భగవంతుని వైపునకు మరల్చుచుండు టెంతయు సమంజసము. అందు కిదియే వారికి సరియైన కాలము. (శిష్యునితో) నాయనా! తపోనిష్ఠ పూజ మొదలగు వాని నిప్పుడే యభ్యసింపుము. కొంతకాలమైన తరువాత నివి సాధ్యమగునా? సాధింపవలసిన దెల్ల ఇప్పుడే సాధింపుము. ఇదియే సరియైన కాలము."

పారమార్థిక సాధనలకు యౌవనమే సరియైన కాలము

శిష్యుడు : ఇప్పుడు మీ ఆశీర్వాదములను బడయు వారు నిజముగా నెంతో ధన్యులు. ఇటుతరువాత వచ్చువారికి ఈ సదవకాశము లభింపజాలదు.

అమ్మగారు : ఏమి నీ యూహ? వారు కృతార్థులు కారనియా నీ యభిప్రాయము? భగవంతు డెల్లప్పుడును, అంతటను నున్నాడు. శ్రీ గురుదేవు లెల్లప్పుడు నున్నారు. ఆయన దయవలన వారు కృతార్థులు కాగలరు. విదేశీయులు పారమార్థికాభ్యుదయమును బడయుట లేదా!

శిష్యుడు : తాను ప్రేమింపబడుచున్నట్లు మనస్సు గ్రహించెనేని, మనస్సున కాసక్తి కలుగును; మీరు మమ్ము నిజముగా ప్రేమించుచున్నారా?

అమ్మగారు : నేను మిమ్ము ప్రేమించుచుండుట లేదా? నాకు బహు స్వల్పపరిచర్య చేసినవారినిగూడ నేను ప్రేమింతును. నీవు నాకెంతో సేవచేయుచున్నావు. నే నింటిలో నేవస్తువు తాకినను నీవు నాకు జ్ఞాపకము వచ్చెదవు. మీలో నాయొద్దనున్నవారిని నేను తఱచుగా తలచుచుందును. దూరముగా నున్నవారి విషయమున "ఓ ప్రభూ! వారి యోగక్షేమములను దయయుంచి కనిపెట్టుచుండుడు. నే నెల్లప్పుడును వారిని జ్ఞాపకముంచుకొనజాలను," అని శ్రీ గురుదేవునకు విన్నవించుచుందును.

1918-వ సం॥ అక్టోబరు.

అమ్మగారు మంచముపై గూర్చుండిరి. భక్తులు వ్రాసిన యుత్తరములను శిష్యుడు శ్రీ దేవివారికి చదివి వినుపించుచుండెను. కృష్ణలాల్ మహారాజుకూడ నచ్చట నుండెను. 'మనస్సు నేకాగ్రముగా నిలుపజాలకున్నాము.' ఇట్టిభావము లా యుత్తరములలో నుండెను. శ్రీ మాతృదేవి వీనిని విని తీవ్రస్వరమున నిట్లు సెలవిచ్చిరి. "ప్రతిదినము భగవన్నామము పదునైదు లేక యిరువదివేలసారు లుచ్చరించినయెడల మనస్సు స్థిరముగా నిలుచును. ఇది నిజము. ఓ కృష్ణలాల్! ఇది నా స్వాను

జపము మనస్సును కుదురుగా నిలిపి భగవంతుని వైపునకు మరల్చును

భవమువలన గ్రహించితిని. మొట్టమొదట జనులు దీని నభ్యసించి, తాము కృతార్థులుకానిచో లాభము కనుపడ లేదని చెప్పుకొనవచ్చును. కొంత భక్తితో వారు జపము నభ్యసింపవలయును. కాని వారేమియు చేయక 'మేమేల కృతార్థులమగుటలేదు?' అని మొఱపెట్టుచుందురు.''

ఒకభక్తుడు గదిలోనికివచ్చి జపమును గురించియు, ధ్యానమును గురించియు నడుగగా అమ్మగారిట్లు చెప్పిరి: ''భగవన్నామమును నియమితమగు లెక్కగా జపమాల తోనో, వ్రేళ్లపైననో, మానసికముగనో యుచ్చరించుటవలన మనస్సు భగవంతుని వైపునకు మరలును. సహజముగా మనస్సు పలుత్రోవల పరుగులెత్తుచుండును. అది యీ సాధనవలన భగవంతునివైపునకు తిరుగును. భగవన్నామ ముచ్చరించుచుండగా సాధకుడు తన యిష్టదైవస్వరూపమును జూచి తన్మయుడగుచో, నతని జప మాగిపోవును. ధ్యానము నందు కృతార్థుడగువానికి సర్వము లభించును. స్వతస్సిద్ధ ముగా మనస్సు నిలుకడలేని వస్తువు. అందుచే మనస్సును స్థిరముగా నిలుపుటకై, ఆరంభమందు కొంచెముగా శ్వాసను నిగ్రహించుచు సాధకుడు ధ్యాన మభ్యసింపనగును. ఇది మనస్సు నిశ్చలముగా నుండుటకు తోడ్పడును. కాని, దీని నెవరైన మితముతప్పి చేసినయెడల, మెదడునకు వేడి హెచ్చును. భగవద్దర్శనమునుగూర్చికాని, ధ్యానమును గూర్చికాని నీవు సంభాషింపవచ్చును గాని, మనస్సే సర్వము అను విషయమును మఱువకుము. మనస్సు స్థిరముగా నిలుచుచో, సాధకునకు సర్వము లభించును.

"మానవులు భగవంతుని మఱచుటెంతయు సహజము కనుక, అవసరము కలిగినప్పుడెల్ల భగవంతుడే భూమిపై నవతరించి, తానే సాధనను చేసి ముక్తిమార్గమును కనుబఱచును. భగవంతు డీసారి త్యాగాదర్శమును లోకమునకు ప్రదర్శించెను."

## ( తృతీయ భాగము )*

### పారమార్థిక సాధన

పారమార్థిక సాధననుగూర్చి సన్న్యసియగు నొక శిష్యునితో శ్రీమాతృదేవి చేసిన ప్రసంగములే సంగ్రహముగా ఈ దిగువ నుదాహరింపబడుచున్నవి :

ప్రాణాయామము—తీర్థయాత్ర—కుండలిని

శిష్యుడు : అమ్మా! యోగాసనములను, ప్రాణాయామమును అభ్యసించుట మంచిదియా?

అమ్మగారు : ఈ సాధవలవలన అమానుషమహిమలు కలుగును. వీనివలన సాధకుని పారమార్థికాభివృద్ధికి అంతరాయము కలుగును.

శిష్యుడు : ఒక పుణ్యస్థలమునుండి మఱియొక పుణ్యస్థలమునకు బోవుచుండుట మంచిదియా?

---

* సన్న్యసులును, గృహస్థులునగు పలువురు శిష్యులు లిఖించినవి.

అమ్మగారు : ఏదైన నొకానొకచోట మనస్సునకు నిలుకడ కలిగెనేని, తీర్థయాత్ర కవసరమే లేదు.

శిష్యుడు : ధ్యానము నా కసాధ్యముగానున్నది. దయ యుంచి నా కుండలినీశక్తిని ప్రబోధింపుడు.

అమ్మగారు : కాలక్రమమున అదియే మేల్కొనును. జపమును ధ్యానమును చేయుచుండుము. కుండలినీశక్తికి స్వయంవికాసము లేదు. ఎడతెగకుండ ధ్యానము సాగిన కొలది, మనస్సు చాల నిశ్చలమగును గనుక, ధ్యానమును విడిచిపెట్టుటకు నీవే యిష్టపడవు. *ధ్యానము చేయుటకు మనస్సు సుముఖముగా లేనిచో ధ్యానమునకు దానిని నిర్బంధ పఱుపకుము. అట్టిస్థితిలో ప్రణామములొనర్చి, ధ్యానాసనము నుండి లేచిరమ్ము. నిజమగు ధ్యానము దానంతటదియే కలుగవలెను.

**చిత్తవిక్షేపము – జపము**

శిష్యుడు : అమ్మా! ఎందుచే మనస్సు స్థిరముగా నిలువదు? నేను భగవంతుని దలంప బ్రయత్నించునపుడు, మనస్సు తదితర విషయములపైకి బోవుచుండును.

అమ్మగారు : మనస్సు ఐహికవిషయములపైకి బోవుట తప్పు. 'ఐహికవిషయములు' అనగా ధనము, కుటుంబము మొదలగునవి. కాని మనస్సు సహజముగా, మనముచేయు చుండు పనినిగూర్చి తలపోయుచుండును. ధ్యానము సాధ్యము కానియెడల, జపము చేయుము. జపమువలన పరమార్థము సిద్ధించును. మనస్సు ధ్యానమునకు సుముఖముగానున్న

సరే. కాని బలవంతముగా దానిని ధ్యానమునకు నియమింపకుము.

పారమార్థిక సాధనకు తగిన స్థలము

శిష్యుడు : ఏకాంతస్థలమున గాక మఠములోనో కాశీనగరములోనో యుండి పారమార్థిక సాధనలను చేయుట యెక్కువ ప్రశస్తమా?

అమ్మగారు : ఋషీకేశమువంటి యేకాంతస్థలమున పారమార్థిక సాధనలను చేయుచో నీ మనస్సు బలీయమై, అటుపిమ్మట నీ వెచ్చటనున్నను, నెట్టిసమాజములోనున్నను అణుమాత్రమును చలింపవు. మొక్క లేతగానున్నప్పుడు దానికి కంచెయో తడికయో రక్షణకై యుండవలయును. కాని పెరిగి పెద్ద చెట్టయిన తరువాత, పశువులవలన దాని కెట్టి హానియు కలుగజాలదు. ఏకాంతస్థలమున పారమార్థిక సాధన బహు ముఖ్యము. ఆత్మవికాసమునకై కోరిక కలిగినప్పుడెల్ల, ఏదైన సందేహముగాని చిక్కుగాని బయలుదేరినప్పుడెల్ల కన్నుల నీరునించి భగవంతుని ప్రార్థింపుము. పరమేశ్వరుడు నీ హృదయమాలిన్యమునంతయు కడిగివైచి, నీ మనోవేదనను నివారించి నీ కాత్మవికాసమొసంగును.

కర్మయోగము - పారమార్థిక సాధన

శిష్యుడు : పారమార్థిక సాధనలను చేయజాలని నీరసుడను. మీ పాదపద్మములే శరణముగా గైకొంటిని. నా యుద్ధరణమునకు అవసరమగుదాని నెల్ల మీరే యొనర్పుడు.

చేతులు జోడించి "శ్రీ గురుదేవుడు నీ త్యాగశక్తిని కాపాడునుగాక!" అని ప్రార్థించి, అమ్మగారిట్లు చెప్పిరి : "ఆయన నిన్ను జాగరూకులై రక్షించుచున్నారు. నీవు భయపడనక్కఱలేదు. శ్రీ గురుదేవుల కార్యమును నిర్వహించుచు, పారమార్థిక సాధనలనుకూడ చేయుచుండుము. పనిచేయుచున్నచో వ్యర్థాలోచన లేవియు కలుగవు. ఏ పనియు లేనివానికి అట్టి ఆలోచనలు కుప్పలు తిప్పలుగా బయలుదేరుచుండును."

యోగాభ్యాసమును ప్రాణాయామ సాధనయును

శిష్యుడు : నా యారోగ్యరక్షణకై కొన్నాళ్లనుండి నేను యోగాసనము లభ్యసించుచున్నాను. ఆహారమును జీర్ణించుకొనుటకును, బ్రహ్మచర్యవ్రతావలంబనకును యోగాసనములు తోడ్పడును.

అమ్మగారు : ఆ విషయమున నీవించుక జాగరూకుడవై యుండుము. నీవట్టి పనులను చాలకాలము చేయుచుండుచో, నీ మనస్సునకు శరీరమునందు సక్తత కలుగవచ్చును. ఇట్లని, నీవీ యభ్యాసములను విడిచిపెట్టినచో నీ యారోగ్యమునకు భంగము కలుగవచ్చును. కనుక నీవీ విషయమున వివేకముతో ప్రవర్తింపవలెను.

శిష్యుడు : అమ్మా! నేనీ సాధనను దినమున కైదు లేక పది నిమిషముల వరకు మాత్రమే జీర్ణశక్తికొరకు చేయుచున్నాను.

అమ్మగారు : మంచిది. యోగాభ్యాసమును కొంతకాలము చేసి పిమ్మట విడనాడుచో, చివరకు నీ యారోగ్యము

చెడవచ్చునని హెచ్చరిక చేసితిని. నాయనా! నీకు బ్రహ్మ జ్ఞానము కలుగునుగాక యని ఆశీర్వదించుచున్నాను.

శిష్యుడు : నేను ప్రాణాయామముకూడ కొంచెము చేయుచున్నాను. నే నా సాధనను చేయుచుండవచ్చునా?

అమ్మగారు : ఔను, కొంచెముగా జేయవచ్చును. కాని, ఎక్కువగా చేసినచో, నీ మెదడును నరములును తాపోద్రిక్తములగును. మనస్సు దానంతటదియే స్థిమిత పడుచో, నిక ప్రాణాయామ మెందుకు?

శిష్యుడు : అమ్మా! కుండలినీశక్తి మేల్కొనకపోయినచో, లాభ మేమియు లేదు.

అమ్మగారు : నాయనా! అది యెంతయు నిజము.

కుండలినీ వికాసమును జపమును

కుండలినీశక్తి క్రమక్రమముగా మేల్కొనును. భగవన్నామోచ్చారణము వలన నీకు సర్వమును లభించును. మనస్సు స్థిరముగా నిలువకున్నను కూడ, నీ వొకచోట గూర్చుండి భగవన్నామమును పదిలక్షల సారులు జపింప వచ్చును. కుండలిని మేల్కొనుటకు పూర్వము అనాహత నాదము వినబడును: కాని, శ్రీ విశ్వేశ్వరీకటాక్షము లేనిదే యేదియు సిద్ధింపదు. నేటి వేకువజామున బహుశా శివదర్శన ప్రాప్తి నాకు కలుగదని తలంచుచుంటిని. కాశీ * దేవాలయములో శివ విగ్రహము చాల చిన్నదికదా. పూవులతోను

---

* ఈ ప్రసంగము కాశీలో జరిగెను.

బిల్వపత్రములతోను కప్పబడి అది నీటియడుగున నుండును. ప్రాయికముగా విగ్రహ మెవరికిని కనుపడదు. ఈ యూహ నా మనస్సున బుట్టిన వెంటనే, మిక్కిలి నల్లనిరాతి శివవిగ్రహ మును స్పష్టముగా జూచితిని. అది మనము దేవాలయములో సేవించు విశ్వనాథుడే యని గ్రహించితిని. ఒక భక్తురాలు ఆ విగ్రహశిరోభాగమును తనచేతితో స్పృశించెను. నేను కూడ వెంటనే ఆ విగ్రహముపై నా చేతి నుంచితిని.

శిష్యుడు : అమ్మా! శిలావిగ్రహముతో మాకు తృప్తి కలుగదు.

అమ్మగారు : నాయనా! అట్లనెదవేల? ఎంతమంది మహాపాపులు కాశికివచ్చి, ఆ శివవిగ్రహమును దాకి ముక్త లగుచుండుటలేదు? ఆ మహాదేవుడు కొంచెమేని గొణుగు కొనకుండ అందరి పాపములను తన మూపున మోయు చున్నాడు.

భక్తుడు : పారమార్థిక సాధనల కెట్టి స్థలము తగినది? సాధకుడా సాధనల నెట్లు చేయవలయును?

అమ్మగారు : నీకు తగినస్థలము కాశి. మనస్సును భగవంతుని పాదారవిందములయందు స్థిరముగా నిలుపుటయే, భగవద్విషయికములగు యోచనలయందు మనస్సు తగిలి యుండునట్లు చేయుటయే పారమార్థిక సాధనల ప్రయోజ నము. ఆ పావననామస్మరణను చేయుచుండుము.

భక్తుడు : జీవితలక్ష్యమేమి?

జీవిత లక్ష్యము

అమ్మగారు : భగవత్సాక్షాత్కారము బడసి, తదేక ధ్యాననిమగ్నులై యుండుటయే మానవులకు జీవితలక్ష్యము. మీరు సన్న్యాసులు, భగవంతుని సొంతమని చెప్పదగినవారు. ఇహమందును పరమందునుకూడ మీ ఆధ్యాత్మిక శ్రేయస్సును పరమేశ్వరుడు కాపాడుచుండును. మీరిక దేనినిగూర్చి ఆందోళనపడవలయును? నిరంతరము భగవంతుని ధ్యానముచేయుట సాధ్యమగునా? కొంతకాలము పని చేయుడు. తక్కిన వేళల భగవంతుని ధ్యానింపుడు.

శిష్యుడు : అమ్మా! గాఢధ్యాననిమగ్నుడనై, భగవదానంద సాగరమున నోలలాడుచుండ గలుగునట్లు దయయుంచి నన్నాశీర్వదింపుడు.

శ్రీమాతృదేవి తమ పావన హస్తమును నా తలపైనుంచి, "ఎల్లప్పుడును నిత్యానిత్యవస్తువివేచన చేయుచుండుము" అని నన్నాశీర్వదించిరి.

శిష్యుడు : అమ్మా! మాటలలో నిత్యానిత్యవస్తు వివేచన చేయుట సులభము. కాని, నిజముగా ఆచరణలో వివేచనచేయవలసిన సమయమువచ్చినప్పుడు, మాకది జ్ఞప్తికిరాదు. అట్టి విషమసమయములందు ధర్మమార్గమును విడనాడకుండు శక్తిని నాకనుగ్రహింపుడు.

అమ్మగారు : నాయనా! నిరంతరము శ్రీరామకృష్ణులు నీకు తోడునీడయై రక్షించుచుందురుగాక! నీకు జ్ఞానము కలుగుగాక!

శిష్యుడు : అమ్మా! ఎన్నో దినము లీరీతిని గతించి పోవుచున్నవి. కాని నాకేమియు సిద్ధింపలేదు.

అమ్మగారు : ఈ ప్రపంచకోలాహలమునుండి విడివడి పరమేశ్వరుని పాదారవిందములందు నీ మనస్సు కుదురుగా నిలుచునట్లు వాని దయను బడసితివి. ఇది స్వల్పవిషయమా? "మా మనస్సునకు తృప్తిగా మేము ధ్యానప్రార్థనల చేయ లేకపోవచ్చును. కాని ఈ లోక వ్యసనములు మాకేవియు లేవు," అని యోగానందస్వామి చెప్పుచుండును. నా విషయము చూడుము. ఈ రాధునిమిత్తము నేనెంతయో కష్ట పడుచున్నాను.

శిష్యుడు : ఒకతోటలో నేకాంతముగా పారమార్థిక సాధనలందు కొంతకాలము గడపవలెనని నా కోరిక.

అమ్మగారు : మంచిది. అందుకు తగిన కాలమిదియే. ఇట్టి సాధనలను చేయుటకుకూడ నిదియే తగినవయస్సు. కాని, నీ యాహారవిషయమై యెల్లప్పుడును జాగ్రత్తగా నుండుము. యోగానందస్వామి కఠిననియమముల నాచరించి, తత్ఫలితముగా చాల కష్టపడి అకాలమరణము నొందెను.

**గురువును, భగవంతుడును**

ఒకనాడు ప్రసంగవశమున నొక శిష్యురాలు తమ యెడల తానే భావముతో ప్రవర్తింపవలయునని అమ్మగారి నడిగెను. "నన్ను రాధగనో, నీకు నచ్చిన యే యితరవిధముగనో నీవు భావింపవచ్చును. నన్ను నీ తల్లిగా తలంచినను కూడ చాలు," అని అమ్మగారు బదులుచెప్పిరి.

దివ్యదర్శనములును, ఆధ్యాత్మిక వికాసమును

"చాలమంది భక్తులు దివ్యదర్శనములను గాంచిరి. కాని నే నేదియు చూడలేదు," అని శిష్యురాలు అమ్మగారితో విన్నవించెను. "ఇవి చాల స్వల్పవిషయములు" అని అమ్మగారు బదులు చెప్పినప్పుడు, శిష్యురాలి మనస్సు ఆశా పూరితమయ్యెను. తన కాధ్యాత్మిక వికాసము కలుగునా యని యామె యడుగగా, కాలక్రమమున తప్పక కలుగునని అమ్మగారు నొక్కి చెప్పిరి.

ఆరాధనయును విధాయకకృత్యములును

శ్రీ గురుదేవుని ఆరాధన విషయమై శిష్యురా లడుగగా "నీవు గృహకృత్యములను చేయ వలసినదానవు; ఆరాధన చేయజాలవు. శ్రీ గురుదేవుని ప్రార్థింపుము. ఆయనయే నీకు సర్వము సిద్ధింపజేయును. చంద్రుడు పిల్లలందరకు నెట్లు మామయో అట్లే శ్రీ గురుదేవుడు నీ సొంతము," అని అమ్మగారు చెప్పిరి.

"అమ్మా! మా జీవితపద్ధతి యెట్లుండవలెను?" అని యొక భక్తు డొకసారి అమ్మగారి నడిగెను.

అమ్మగారు : ఇప్పటివలెనే నీ జీవితమును గడుపుము. మనఃపూర్వకముగా శ్రీ గురుదేవుని ప్రార్థింపుము. ఆయన నెల్లప్పుడును తలంచుచుండుము.

ఆధ్యాత్మికపతనమును అహంకారమును దైవసంకల్పమును

భక్తుడు : అమ్మా! ఆధ్యాత్మికముగా విశేషౌన్నత్యమును గాంచిన మహానుభావులుకూడ పతితులగుటచూడ, నాకు భయమగుచున్నది.

అమ్మగారు : నీ వెల్లప్పుడును భోగవిషయములచెంత నుండుచో, వానికి వశుడవు కావచ్చును.

భక్తుడు : మానవుడు తన స్వయంకృషిచే నేమియు చేయజాలడు. అతని ముఖమున భగవంతుడే సర్వమును చేయుచున్నాడు.

అమ్మగారు : ఔను. అది నిజమే. కాని, నీ కా జ్ఞానము నిరంతరమున్నదా ? దురహంకారాంధులై జనులు తామే స్వతంత్రులుగ సర్వము చేయుచున్నట్లు తలంతురు. భగవంతునిపై వా రాధారపడనే పడరు. పరాత్పరుడు తనపై నాధారపడువారిని రక్షించును.

*　　　*　　　*

"అమ్మా! మిమ్మే గురువుగానమ్మి, మీ యాశీస్సులను బడసినవానికి పారమార్థిక సాధన చేయవలసిన యావశ్యకత యున్నదా ?" యని సన్న్యాసియగు నొకశిష్యుడు శ్రీ మాతృదేవి నడిగెను.

పారమార్థిక సాధనల యావశ్యకత

అమ్మగారు : అది నిజమే. కాని యీ విషయ మెటు వంటిదనగా : గదిలో వివిధములైన ఆహారపదార్థము లుండవచ్చు. కాని భోజనము చేయవలెననిన, నెవరుకాని వానిని వండవలయును. ముందుగా వంటను ముగించువారు ముందుగనే భోజనముచేయుదురు. ఈ రీతిగా కొందరుదయముననే భుజింతురు; మరికొందరు సాయంకాలమునకుగాని భుజింపలేరు. మిక్కిలి సోమరులైనవారు భోజనమే చేయక యుపవాసముందురు.

శిష్యుడు : అమ్మా! మీ మాటలు నాకు బోధపడుట లేదు.

అమ్మగారు : సాధకు డెంతగా పారమార్థిక సాధనలను చేసిన నంత త్వరితముగా భగవత్సాక్షాత్కారమును బడయును. అత డెట్టి యాధ్యాత్మిక సాధననుకూడ చేయక పోయినను, చిట్టచివరకు ముక్తినొందును—ఇది నిజము. కాని ధ్యానప్రార్థనలనుచేయక కాలమును వృధచేయువారికి, పరమార్థానుభూతి కలుగుటకు ఆలస్యమగును. పారమార్థిక సాధనలను చేయుటకే నీవు సంసారమును పరిత్యజించితివి. కాని నీవీ సాధనల నెల్లప్పుడు చేయజాలవు గనుక, సత్కర్మ లొనర్చుట యావశ్యకము. ఆ కర్మను శ్రీగురుదేవుడే నీకు నిర్ణయించెనని నీవు భావింపవలయును. కఠిన నియమ బద్ధమైన జీవితము నీకు మంచిదికాదు. కడుపునొప్పిచే బాధ పడుచుందువు. నీ యాహారము విషయమై జాగ్రత్తగా నుండుము. ఇది ప్రాణాంతకమగు వ్యాధికాదు గాని, బాధ కరముగా నుండును.

* * *

"అమ్మా! ఎవరికైన బ్రహ్మజ్ఞాన మెట్లు కలుగును? క్రమక్రమముగా సాధనచేయుటవలననో లేక దానంతటదియే సిద్ధించునా?" అని యొకనా డొక శిష్యుడు శ్రీమాతృదేవి నడిగెను. "బ్రహ్మవిద్య మిక్కిలి కష్టము. శ్రీగురుదేవులను ప్రార్థింపుము. వారు సముచిత కాలమున నీకు బ్రహ్మజ్ఞాన మొసంగెదరు," అని అమ్మగారు బదులుచెప్పిరి.

* * *

మనోనిగ్రహము

"అమ్మా! నా మనస్సు బహు చంచలముగా నున్నది. ఏ విధముగా ప్రయత్నించినను, నేను దానిని స్థిరముగా నిలుపలేకున్నాను," అని అమ్మగారి సమక్షమున కోల్పారాలో నొకశిష్యు డడిగెను. "గాలి, మేఘముల నెగురగొట్టునట్లు, భగవన్నామము సంసార విషయలౌల్యమను మబ్బును పటాపంచలు చేయును," అని శ్రీ మాతృదేవి చెప్పిరి.

ఆనాడే తన మనోదౌర్బల్యమునుగురించి మరియొక శిష్యుడు మొరపెట్టుకొనగా, కామమును పూర్తిగా జంపివేయుట కెవరికైన సాధ్యమగునా? శరీరమున్నంతకాల మెవరికైనను, కామమే లవలేశమో యుండక తప్పదు. కాని మాంత్రికుని విభూతికి పాము లొంగియుండునట్లు, పరిశుద్ధాత్ముల మనోబలమునకు అది లొంగియుండవచ్చును," అని అమ్మగారు సెలవిచ్చిరి.

*　　*　　*

ఆస్తికవిశ్వాసమును పాండిత్యమును

భగవంతునియెడల నుండవలసిన నమ్మకమునుగురించి ఒకసారి శ్రీ మాతృదేవి యిట్లు ఆనతిచ్చిరి: "కేవలము పుస్తకములను చదువుటవలన నెవరికైన భగవంతుని యందు నమ్మకము కలుగునా? అమితమగు గ్రంథపఠనము వలన, చిత్తవిభ్రమణము కలుగును. బ్రహ్మమే సత్యము, సంసార మనిత్యమను విషయమును గ్రహించుటకు మాత్రమే మానవులు మతగ్రంథములను చదువవలయునని శ్రీ గురు

దేవులు చెప్పుచుండెడివారు. కొన్నివస్తువులను నాకొరకు తీసికొని రమ్మని నీకొక యుత్తరము వ్రాసితి ననుకొనుము. ఆ యుత్తరము నీ కెంతకాల మవసరము? దానిలోని సంగతులు నీకు తెలియునంతవరకే కదా! అందలి విషయములు నీకు తెలిసిన తరువాత, నీ కా యుత్తరమెందుకింక? అప్పుడు నీ వా వస్తువులను సేకరించి నాకడకు వత్తువు. అట్లు కానిచో, నా యుత్తరమును రేయుంబవళ్లు చదువుటవలన లాభమేమి?''

ముక్తిమార్గము

''సంసారజీవితసాగరమున మునిగియుండువారు దేనిని సాధించుటకును వీలుపడదు,'' అని యొకనా డొక శిష్యుడు ప్రసంగవశమున విన్నవింపగా, అమ్మగారిట్లు బదులు చెప్పిరి: ''నాయనా! ఈ సంసారము అగాధమైన బురదమడుగు వంటిది. అందొకసారి చిక్కుపడినవారు మరల బయటకువచ్చుట బహు కష్టము; బ్రహ్మ, విష్ణువు లంతటివారికిగూడ మతులు పోవును. ఇక మానవులనుగూర్చి చెప్పుట కేమున్నది! భగవన్నామస్మరణ చేయుచుండుము. నీ వట్లుచేయుచో, ఆ పరమేశ్వరుడెప్పుడో యొకనాడు నిన్ను బంధవిముక్తుని గావించును. నాయనా! పరాత్పరుడే యా బంధములను తొలగింపకున్న, నెవరికైన ముక్తి లభించునా? భగవంతునియందు పరిపూర్ణమైన నమ్మకమును కలిగియుండుము. పసిబిడ్డ లెట్లు తమ తల్లిదండ్రులే తమకు దిక్కని భావింతురో, శ్రీగురుదేవు నట్లే భావింపుము.''

* * *

"అమ్మా! కల్పవృక్షముక్రింద నున్నప్పుడేదో యొక కోరికను మనము కోరవలయునందురు! కాని మేము మీా బిడ్డలము. బిడ్డలు ప్రత్యేకించి తల్లి యెదుటబడి యేమి కోరవలయును? తనబిడ్డల కేది శ్రేయస్కరమో తల్లి గ్రహించి, వారికి దానినే యెల్లప్పు డిచ్చుచుండును. శ్రీ గురుదేవుడు చెప్పుచుండునట్లు 'వారివారి జీర్ణశక్తికి తగినట్లుగా తల్లి తనబిడ్డలకు వేర్వేఱు భోజన పదార్థములను వండును.' అమ్మా! ఇక నాకు బహుశ్రేయస్కరమైనదేదో సెలవిండు!"

ఆత్మార్పణమును ఆధ్యాత్మికాభివృద్ధియును

అమ్మగారు: మానవునిబుద్ధి అత్యల్పము. తనకు కావలసిన దొకటియైయుండ, వేరొకటి కోరును. వినాయకుని చేయబోయి చివరకు కోతిబొమ్మను చేయును. కనుక కోరికలన్నిటిని భగవంతుని పాదారవిందములకడ సమర్పించుటయే యుత్తమము. మనకు బహుశ్రేయస్కరమైనదేదియో ఆ పరమేశ్వరుడే మన కొనర్చును. కాని మానవులు భక్తి వైరాగ్యములకొరకు భగవంతుని ప్రార్థింపవచ్చును. ఇవి, కోరికలలో చేరజాలవు.

* * *

ఒకనాడు భక్తులయొద్దనుండి శ్రీ మాతృదేవికి చాల ఉత్తరములు వచ్చినవి. సాయంకాలమున శిష్యుడా యుత్తరము లామెకు చదివి వినిపించుచుండెను. అందలి విషయములను విని అమ్మగా

పారమార్థికజీవితము-శ్రద్ధ

రిట్లు సెలవిచ్చిరి : "ఈ పిల్ల లెన్ని రకముల కోరికలను తెలుపు చున్నారో చూచుచున్నావా? 'మేము జప ధ్యాన ప్రార్థనలు చేయుచున్నను మా కేమియు సిద్ధికలుగుట లేదు' అని కొందరు వ్రాయుచున్నారు. మఱికొందరు తమ కీలోకమున కలుగు చున్న కష్టములను, దుఃఖములనుగూర్చియు, తమ మనో వ్యాకులములగూర్చియు మొరపెట్టుచున్నారు. నే నిట్టివింక వినజాలను. 'ప్రభూ! ఇహపరములందు వీరి నెల్లప్పుడును రక్షింపుము' అని నేను శ్రీ గురుదేవుని నిత్యము ప్రార్థించు చున్నాను. వీరి తల్లినగు నే నింతకంటె దేనికొరకు ప్రార్థింప గలను? కాని నిజముగా భగవత్సాక్షాత్కారమును కోరువా రెందరు కలరు? అందుకు కావలసిన శ్రద్ధ యెక్కడున్నది? తమకెంతో భక్తి, పరాకాంక్షలున్నట్లు వీరు చెప్పుకొందురే కాని, యేదో యొక భోగ మెంత లవలేశము కలిగినను, దానితో తృప్తిపడి 'ఆహా! భగవంతు డెంత దయామయుడు!' అని తమ సంతోషాతిశయమును వెలిబుచ్చుచుందురు. కొంత మంది భక్తులు రాధు యోగక్షేమమును విచారించుచు నాకు జాబులు వ్రాయుచుందురు. నన్ను కేవలము మెప్పించుటకై, మరే విషయమునైన తడవుటకుముందు రాధును గురించి అడుగుచుందురు. నే నీ లోకమునువీడి వెళ్ళినతరువాత, దాని వైపు చూచువారైన నుండరు."

ఒకనాడొక శిష్యుడు భక్తిముక్తులను గురించి యడు గగా శ్రీ మాతృదేవి యిట్లానతిచ్చిరి : "భగవంతు డేక్షణ మందైనను ముక్తి నీయవచ్చునుగాని, భక్తి నంత సులభ

ముగా నిచ్చుట కిష్టపడడు.'' సంకల్పమాత్రమున నెవరికైన ప్రసాదించుటకు ముక్తి ధనమును తమ గుప్పిటనుబట్టి యుంచినట్లుగా శ్రీ మాతృదేవి యీ మాటల నుచ్చరించిరి. కాని వెంటనే అమ్మగారీ ప్రసంగమును మార్చివైచిరి.

ముక్తి - భక్తి

* * *

ఒకసారి జయరాంబటిలో శ్రీ మాతృదేవిగారి యింటి పెరటిలో, వేకువజామున లేగదూడ అరచుచుండెను. పాలు పితుకుటకై దానితల్లిని దానియొద్ద నుండి విడదీసిరి. దూడ అర్పులను విని, అమ్మగారు దానికడకు పరుగు పరుగున వెళ్లి, ''ఉండుముండుము! నిన్ను నీ తల్లియొద్ద విడిచి వైచెదను,'' అని చెప్పుచు దూడను దానితల్లికడ జేర్చిరి. ఆ సమయమున అమ్మగారి మోమున ప్రసరించుచున్న దయార్ద్ర దృక్కులనుజూచి శిష్యుడు విస్మయమొంది, మూర్తీభవించిన విశ్వమాతృప్రేమయే యామె యని గ్రహించెను. ఆహా! ఆ లేగవలె మనముకూడ భగవంతునికొరకు విలపించుచో, నాతడు మనలను సకల సంసార బంధములనుండి విముక్తుల గావించునుగదా!

భగవంతునికొఱకు ఆత్రత

* * *

చాలరాత్రి యగువరకును ప్రసంగము జరిగెను. 'మీ మీ విధాయక కార్యములను కష్టపడి చేయుచో, భగవత్సంకల్పము ప్రకారము సర్వమును మీకు సిద్ధించును,' అని

'క'—తమతో చెప్పుచుండుననని అమ్మగారికి శిష్యుడు విన్నవించెను. "నిజమే, మీ మీ విధాయకకృత్యములను మీరు చేయవలసియే యుండును. కాని ధ్యాన, జప, ప్రార్థనలనుగూడ చేయుట మిక్కిలి యావశ్యకము. అధమముదయమునను, సాయంకాలమునను ఈ సాధనలను చేయవలయును. పడవకు చుక్కానివలె, ఈ సాధన మానవజీవితమునకు మిక్కిలి యుపకరించును. సాయంకాల ప్రార్థనకై కూర్చుండునప్పుడు, సాధకుడా పగలంతయు తాను సత్కర్మలను చేసెనో, పాపకర్మల నాచరించెనో వివేచన చేయవచ్చును. పిమ్మట నాత డానాటి తన మానసికస్థితిని, ముదంటినాటి తన మానసికస్థితితో పోల్చి చూచుకొనవలయును. ఇంతేకాక, అతడు జపమొనర్చునప్పుడు తన యిష్టదైవమూర్తిని ధ్యానింపవలెను. ధ్యానమునందు మనకు మొట్టమొదట కనుపడునది మన యిష్టదేవత ముఖము. అంతతో తృప్తిపడక మన మా మూర్తి నాపాదమస్తకము ధ్యానింపవలయును. మీ మీ పనులతోపాటుగా నుదయమునను సాయంకాలమునను మీరు ధ్యానముచేసిననేతప్ప, మీరు చేయునది సత్కర్మయో, పాపకర్మయో మీ కెట్లు తెలియగలదు?" అని శ్రీ మాతృదేవి సెలవిచ్చిరి.

కర్మ ధ్యానములను రెండిటిని చేయవలయును

"పారమార్థిక జీవితమున ధ్యాన జపములవలననే కృతార్థులము కాగలము కాని, కర్మవలన మన కేదియు సిద్ధింపదని కొందరందురు," అని శిష్యుడు మనవి చేయగా

అమ్మగారిట్లు బదులు చెప్పిరి : "ఏది ఫలప్రదమో యేది కాదో, వారెట్లు తెలిసికొనిరి ? ఏ కొలదినాళ్లో ధ్యాన జపము లభ్యసించు సాధకునకు సర్వము లభించునా ? మహామాయ దయయుంచి, పరమార్థసిద్ధికి గల అడ్డంకులను తొలగించిననే తప్ప, నెవరికి నేమియు లభింపదు. బలవంతముగా మితిమీరి ధ్యాన ప్రార్థనలను చేయుటచే నొకనికి మతి చెడిపోవుటను మీరు మొన్న చూడలేదా ? మతిచెడిన తర్వాత, మనుష్యుని జీవితమే నిరర్థకమగును. మానవుని మనస్సు బహు సూక్ష్మమైనది. ఏ మాత్రము లోపము జరిగినను నెంతవానినైన నున్మాదుని జేయును. భగవంతు నెల్లప్పుడును స్మరించుచు సరియైన జ్ఞానముకొరకెల్లరును వానిని ప్రార్థించుచుండ వలయును. నిరంతరము ధ్యాన జపములను చేయగలవా రెందరున్నారు. కొంద రారంభమందు పట్టుదలతో ఈ సాధనలను జేయుదురు కాని, ఎల్లప్పుడును చిత్రాసనములపై గూర్చుండుటవలన, 'న'-విషయములో జరిగినట్లు, వారితలలు వేడెక్కి, గర్వాంధులై వివిధ విషయములపైకి మనస్సుపోయి యెన్నో చింతలతో బాధపడుచుందురు. యథేచ్ఛగా మనస్సును తిరుగనిచ్చుటకంటె పనిచేయుచుండుటయే చాల మంచిది. ఆ రీతిగా నిలుకడలేక తిరుగుటకు అవకాశ మబ్బిన మనస్సువలన, కలవరము కలుగును. ఈ విషయములన్నిటి నాలోచించియే, నా నరేను జనులకు నిష్కామకర్మ చేయుటకు వీలగు సంస్థలను నిర్మించెను." 'న'-ను గూర్చి మరల నిట్లు శ్రీ మాతృదేవి ప్రసంగించిరి :—"ఒకచోటుననే యెల్లప్పుడు

కేవల ధ్యాన సాధనలో గల ప్రమాదములు

కూర్చుండుటచే నతడు తనమనస్సు నెట్లు మలినపరచుకొను చున్నాడో నీవు చూచుచునే యున్నావు. అతని ఛాందస భావములును, మూఢ విశ్వాసములును నానాటికి పెచ్చు పెరుగుచున్నవి. అతడెల్లప్పుడును తన మనోవ్యథలనుగూర్చి మొఱపెట్టుచుండును. అంత చింత యెందుకుండవలయును? ఈ యనుభవము లన్నిటివలన నతనికి జ్ఞానోదయము కలుగ జాలదా?"

*　　　　*　　　　*

తపస్సెంత పవిత్రమో కర్మకూడ అంత పవిత్రము

శ్రీమాతృదేవి కోరికపై నొకశిష్యు డామె సన్నిధిని నివసించుచుండెను. అతడెల్లప్పుడును పూజామందిరములో ఆరాధనయందును తదితర కార్యముల యందును నిమగ్నుడై యుండువాడు. బేలూరుమఠములోని కొంతమంది సన్న్యాసులు తపోనిష్ఠ నభ్యసింప వివిధప్రదేశములకు వెడలుచుండిరని విని, "నేనీ పనులన్నిటి యందు నిమగ్నుడనై యుండుట నాకు శ్రేయస్కరముగా తోచుటలేదు. నాకుగూడ తపస్సు చేయవలెనని కోరిక యున్నది. దయయుంచి మీ యనుజ్ఞ నొసంగుడు," అని అతడు విన్నవించెను. "నాయనా! నీ వెందుకట్లు తలంప వలయును? నీ విప్పుడు నా పనిని చేయుచున్నావు. శ్రీగురు దేవుని కార్యభారమును భక్తిశ్రద్ధలతో నిర్వహించుచున్నావు. ఏ విధముగనైన నివి తపోనిష్ఠకంటె నాధ్యాత్మికముగా తక్కువ విలువకలవియా? ఈ పనుల నీవేల విడనాడవల

యును? తపస్సు చేయవలయుననుతీవ్రవాంఛ నీ కెప్పుడైన కలుగునెడల, ఒకటి, రెండు నెలలు నీ వెచ్చటికైన వెళ్ల వచ్చును,'' అని అమ్మగారు సెలవిచ్చిరి.

*　　*　　*

ఆరాధన - జపము

శ్రీ గురుదేవు నారాధనను తనకు బోధింప నొక భక్తురాలు ప్రార్థింపగా, ''సంసార లంపటమున దగుల్కొని ఆరాధనను చేయజాలవు. శ్రీ గురుదేవుని పావననామమంత్రము నీ కుప దేశించితిని. ఆ మంత్రమును జపించుచో నీకు సర్వము లభించును,'' అని అమ్మగారు సెలవిచ్చిరి.

*　　*　　*

తీవ్రమైన భక్తి లేకుండ శ్రీ భగవానుని నామస్మరణ చేసినంతమాత్రమున నేమైన లాభము కలదా యని యొక భక్తుడు శ్రీ మాతృదేవి నడిగెను.

జపము చేయవలసిన పద్ధతి

అమ్మగారు : నీవు నీటిలో మునిగినను, నిన్నితరులు నీటిలో త్రోసినను, నొకేవిధమున నీ బట్టలు తడిసిపోవును, అంతేకాదా? నీ మనస్సింకను బలహీనముగా నుండుటచే, ప్రతిదినము ధ్యానము చేయుచుండుము. నిరంతర ధ్యానమువలన మనస్సున కేకాగ్రత కలుగును. ఎల్లప్పుడును నిత్యానిత్యవస్తువివేచన చేయుచుండుము. ఎప్పుడైన నే విషయముపైనను నీ మనస్సు పోవుచున్నట్లు తోచెనేని, ఆ విషయానిత్యతనుగూర్చి తలపోసి, నీ మనస్సును దానినుండి

భగవంతుని వైపునకు మరలింప ప్రయత్నింపుము. ఒక మనుష్యుడు గాలము వేసి చేపలుపట్టుచుండెను. ఆ మార్గమ ననే యొక పెండ్లి యూరేగింపు తాళమేళములతో బోవుచుం డిననుకూడ, వాని దృష్టియంతయు గాలముముల్లుపైననే నిలిచియుండెను. ఊరేగింపును క్రీగంటితోనైన నతడు చూడడయ్యెను.

ఆధ్యాత్మిక సాధనల జేయుటకు తగినచోటు నేర్పరచు కొనవలెనను కోరిక తనకున్నను, తన దేహారోగ్యము బాగు లేదని సన్న్యాసియగు నొక శిష్యుడు శ్రీ మాతృదేవికి విన్నవించెను.

* * *

అమ్మగారు : ప్రస్తుతము కొంతకాల మించుక పని చేయుచుండుము. పిమ్మట తపోనిష్ఠ నవలంబింపవలెనను తీవ్ర వాంఛ కలిగినప్పుడు, నీవా పనిని విడిచిపెట్టవచ్చును.

శిష్యుడు : నేను జపముచేయుచున్నానేకాని మనస్సు నేకాగ్రముగా నిలుపలేకున్నాను.

ప్రతిదినము నిర్ణీతసంఖ్య ప్రకారము జపము చేయుము

అమ్మగారు : ఏకాగ్రముగ నీ మనస్సు నిలిచినను సరే, నిలువకున్నను సరే, భగవన్నామస్మరణ చేయుచుండుము. ప్రతిదినము నిర్ణీత సంఖ్య ప్రకార మా నామజపము చేయుచుండుట నీకు శ్రేయస్కరము.

* * *

శిష్యుడు : అమ్మా! నిర్ణీతసంఖ్యనే జ్ఞప్తియందుంచుకొని పవిత్ర మంత్రజప సాధనను జేయుదునా?

అమ్మగారు : సంఖ్యయందే దృష్టియుంచి జపము చేయుచో నీ మనస్సు సంఖ్యపైననే నిలువవచ్చును. కనుక సంఖ్యను ప్రధానముగ పాటింపక, నీవు భగవన్నామ జపము చేయుట మంచిది.

శిష్యుడు : జపముచేయునప్పుడు మా మనస్సేల భగవంతునియందు లీనముకాకున్నది?

అమ్మగారు : క్రమముగా లీనమగును. ఏకాగ్రముగా మనస్సు నిలువకున్నను, నామస్మరణ మానవలదు. విధాయకముగా నీవు చేయవలసినపని చేయుచుండుము. నామస్మరణ చేయునపుడు మనస్సుదానంతటదియే, గాలి తగులకుండ నొకచోటనుంచిన క్రొవ్వువత్తి దీపమువలె, భగవంతునిపై స్థిరముగ నిలుచును. దీపము గాలికే చలించి కొట్టుకొనును. ఇట్లే మనభ్రమలును కోరికలును మనస్సును చెదరగొట్టును. మంత్రోచ్చారణ సరిగా లేనియెడల కూడ చిత్తమున కేకాగ్రత చేకూరుట ఆలస్యమగును. వెనుకటికొక స్త్రీకి, 'రుక్మిణీ నాథాయ' అను పవిత్రనామ ముచ్చరింప గురువు బోధించెను. కాని యామె అంత పెద్దమాట నుచ్చరింపలేక 'రుక్కు, రుక్కు' అని స్మరణచేయు చుండెను. అందువలన నామెకు కొలది నాళ్లవరకు అభివృద్ధి కలుగలేదు. కాని కొంతకాలమైన తరువాత భగవదనుగ్రహమువలన నామెకు సరియైనమాట స్ఫురించి, జపము ఫలించెను.

ఏకాగ్రత - జపము

* * *

అమ్మగారు కోల్పారాలోని జగదంబాశ్రమమందు నివసించు చుండినప్పుడు, వారొక భక్తునితో నిట్లు ప్రసంగించిరి.

భక్తుడు : భగవన్నామ జపమును చేయుటకుముందు సాధకుడు శాస్త్రోక్తముగా తన మోమును కడుగుకొనవలెనా?

అమ్మగారు : ఔను, స్వగృహమం దున్నప్పుడు, సాధకుడీ నియమముల ననుసరింపవలయును; కాని పరస్థలమున నుండుచో జపమును మానసికముగా చేయవచ్చును.

భక్తుడు : పరస్థలమున నున్నప్పు డతడు భగవన్నామమునుమాత్రమే యుచ్చరింపవలయునా, లేక గురువు తన కుపదేశించిన మంత్రము నుచ్చరింపవలయునా?

ఏకాగ్రచిత్తముతో చేయు జపము చాల ఫలప్రదము

అమ్మగారు : ఔను, మంత్రమునుకూడ నుచ్చరింపవలయును. మనోనిగ్రహముతో భగవన్నామము నొకసారి జపించుట, భగవత్పరముకాని మనస్సుతో లక్షసారులు జపించుటకంటె చాల మేలు. అన్యవిషయములపై మనస్సునుంచి నీవు దినమంతయు నామజపము చేసినను దానివలన విశేషలాభము కలుగదు. మనస్సునేకాగ్రముగా నిలిపి జపముచేసినప్పుడే, మనకు భగవదనుగ్రహము కల్గును.

భక్తుడు : నేనిప్పుడు చేయుచున్నది చాలునా, లేక యేదైన, నెక్కువగా చేయవలయునా?

అమ్మగారు : నీ విప్పుడు చేయుచున్నట్లే యిటుతరువాత

కూడ చేయుచుందుము. శ్రీరామకృష్ణులు నిన్నిదివరకే తమ సొంతముగా స్వీకరించి యున్నారు.

భక్తుడు : రెండుమూడు నాళ్లైనను శ్రద్ధతో తనను ప్రార్థించువారికి భగవంతుడు సాక్షాత్కరించునందురు. నే నెంతకాలమునుండియో ప్రార్థించుచున్నను, నా కెట్టి సాక్షాత్కారముగాని కలుగకున్నదేమి ?

అమ్మగారు : నాయనా! సర్వమును కాలక్రమమున లభించును. శ్రీరామకృష్ణుల వాక్యములు శివుని వాక్యముల వలె అమోఘములు; వ్యర్థము లెన్నటికిని కాజాలవు. వారి యందు భక్తికలిగి వారి పాదారవిందములయందే శరణు జొరుము. నిన్ను నిరంతరము రక్షించుచున్న తల్లిగాని తండ్రి గాని యెవరో యొక రున్నారని జ్ఞప్తియందుంచుకొనిన చాలును.

భక్తుడు : మీ మాటలయందు నాకు పరిపూర్ణ విశ్వాసము కలదు.

* * *

ఒకసారి యొకశిష్యుడు శ్రీమాతృదేవి కిట్లు విన్న వించెను : "అమ్మా! జపమాలతో జపముచేయుచున్నప్పుడు సంఖ్యలను నేను లెక్కపెట్టలేకున్నాను. వ్రేళ్లు కదలుచున్న యెడల, నాలుక నిశ్శబ్దముగా నిలిచిపోవును. చేతులును నాలుకయును పనిచేయునెడల, మనస్సు స్థిరముగా నిలువదు."

అమ్మగారు : కొంతకాలమైన తరువాత నీ వ్రేళ్లును నాలుకయును వానిపనిని చేయకపోయినను, మనస్సు

మాత్రము భగవంతుని ధ్యానించుచున్నట్లు నీవు గ్రహింతువు.

*　　　*　　　*

ఒకసారి యొకభక్తుడు తనవ్రేళ్లపై మంత్రోచ్చారణల నెట్లు లెక్కపెట్టవలెనో మఱచిపోయి, అమ్మగారి నా విషయమై యడుగుమని శిష్యునిపేర వ్రాసెను. అమ్మగా రిదివిని "మరచిపోయిన నేమి? ఏ విధముగనైనను లెక్కపెట్టవచ్చును. దీని ప్రయోజనమంతయు భగవంతునివైపునకు మనస్సును మరలించుటయే" అని చెప్పిరి.

వ్రేళ్లపై జపము

*　　　*　　　*

ధ్యాన జపములనుగురించి శ్రీ మాతృదేవి శిష్యునితో నిట్లు ప్రసంగించిరి: జ్ఞానోదయ శుభసమయ మెప్పుడు వచ్చునో చెప్ప వీలులేదు కావున, ఈ పనులకొక నియమితకాలము నేర్పాటుచేసికొనుట మిక్కిలి యావశ్యకము. ఆ సమయమంత యాకస్మికముగా వచ్చును. అందునుగురించి యెవరికిని, ముందుగా నేదియు తెలియదు. కనుక నెన్నిపనులున్నను నిర్ణీతకాలములందు జనులు తప్పక సాధన చేయుచుండవలయును."

పారమార్థిక సాధనలను నియమితకాలములందు తప్పక చేయుచుండ వలయును

శిష్యుడు: ఒక్కొక్కప్పుడు శరీర మనారోగ్యముగా నుండును, మరికొన్ని వేళలందు పనియొత్తిడి యెక్కువగా నుండవచ్చును. ఇందువలన నాయా నియమితకాలములందు సాధన చేయుట యెల్లప్పుడును సాధ్యముకాదు.

అమ్మగారు : శరీర మనారోగ్యముగా నున్నప్పుడు మన మేమియు చేయలేము. కాని, పనిలో నెంత మునిగి తేలుచున్నను, మన మధమము భగవంతుని స్మరించి నమస్కరించుచుండవలెను.

శిష్యుడు : సాధన కుత్తమకాల మేది?

అమ్మగారు : రేయుంబవళ్ల సంధ్యాకాలము భగవత్ప్రార్థనకు మిక్కిలి యనుకూలము. రాత్రి యంతరించి పగలు ప్రారంభమగును; దిన మస్తమించి రాత్రి ప్రారంభమగును—ఇదియే దివారాత్రముల సంధి. ఈ సమయములందు మనస్సు నిర్మలముగా నుండును.

మనోదార్బల్యమును గురించి శ్రీమాతృదేవి శిష్యునితో నిట్లు చెప్పిరి: "నాయనా! ఇది ప్రకృతి నియమము. పూర్ణిమ, అమావాస్యలను నీవు చూచుచున్నావు కావా? ఇట్లే మనస్సు కొన్ని వేళలందు మంచి సంస్కారములకును మరికొన్ని వేళలందు చెడు సంస్కారములకును లోనగుచుండును."

తాను రైలుబండిలోగాని పొగయోడలోగాని ప్రయాణము చేయుచుండునప్పుడు జపమెట్లు చేయవలయునని యొక శిష్యు డడుగగా, "మానసికముగా మంత్ర ముచ్చరింపుము. నీ వ్రేళ్లును నాలుకయును క్రమక్రమముగా పని చేయుట మానివేయును. మనస్సుమాత్రమే పనిచేయుచుండును. చివరకు మనస్సే గురువగును," అని అమ్మగారు సెలవిచ్చిరి.

ప్రయాణము చేయుచుండునప్పుడు జపము

* * *

ఒకానొక యుత్సవ సమయమున దొమ్మరివాడొకడు వేర్వేరు రకముల విద్దెలను ప్రదర్శించుచుండెను. తనరొమ్ముపై నొక పెద్దరాయి పెట్టించుకొని దానిని పగులగొట్టించుకొనుట ఆ విద్దెలలో నొకటి. దానిని పగులగొట్టుచుండినప్పుడు, "హా! పరమేశ్వరా! పరమేశ్వరా! వీనిని రక్షింపుము, రక్షింపుము!" అని అమ్మగారు భగవంతుని ప్రార్థించుట చెంతనున్నవారు వినిరి. ఈ యాట ముగిసిన తరువాత, "నాయనా! వీరల కేమైన మంత్రము తెలియునా లేక యిందేదయినా నితర రహస్యమున్నదా?" అని అమ్మగారు నన్నడిగిరి.

శిష్యుడు: అమ్మా! లేదు. దీనిలో అట్టిదేవియు లేదు. విడువక సాధన చేయుటవలన కలిగిన ఫలితమిది. ప్రతిదినము తనచేతులలో నొక దూడనెత్తుకొని పొలమునకు బోవుచుండిన మనుష్యుని కథను నేనమెరికాదేశములో వింటిని.

జపము-ఆధ్యాత్మికాభివృద్ధి

అది యొక పెద్ద యెద్దగువరకు నత డీ యభ్యాసమును చేయుచునే యుండెను. అది పెరిగి పెద్దదైన తరువాతకూడ దానిని లేగదూడవలెనే అవలీలగా నతడు మోసికొనిపోగలుగుచుండెను. ఈ విద్దె నత డందరియెదుట ప్రదర్శించుచుండెను. ఇవన్నియు అభ్యాస ఫలితములు.

అమ్మగారు: ఔనౌను. అది నిజమే. చూచితివా యభ్యాసమహిమను? ఇట్లే విడువకుండ జప మభ్యసించువారికి భగవత్సాక్షాత్కారము కలుగును.

* * *

రామకృష్ణపరంపరకు చెందిన యొక సన్న్యాసి కాశీయందలి మణికర్ణికాఘట్టములో తపోనిష్ఠయందుండెను. అతడు భగవత్కటాక్షము తనపై నెప్పుడు ప్రసరించునో అమ్మగారి నడుగుమని కలకత్తాకు వచ్చుచుండిన శ్రీమాతృదేవి శిష్యునితో జెప్పెను. శిష్యు డీ సంగతిని విన్నవించి నప్పుడు, అమ్మగారు తీవ్రస్వరమున నిట్లు సెలవిచ్చిరి: "తపోనిష్ఠ నభ్యసించుచున్నంతమాత్రమున నెవరికైన భగవత్కటాక్షము తప్పక కలుగవలెనను నియమమేదియు లేదని అతనికి వ్రాయుము. పూర్వకాలమున ఋషులు వేలకొలదియేండ్లు తలక్రిందుగా, నడుగున నగ్నిజ్వాల నుంచికొని ఘోరతపము చేసిరి. అట్లయ్యునుగూడ వారిలో నేకొందరికి మాత్రమో భగవత్కటాక్షము కలిగెను."

తపోనియతి - భగవత్కటాక్షము

*   *   *

"అమ్మా! నేనెంతో తపస్సును జపమును చేయుచున్నను, నాకే సిద్ధియు కలుగలేదు," అని యొక శిష్యుడు విన్నవింప, "వెలయిచ్చి కొనుటకు భగవంతుడు కూరగాయలవంటివాడు కాడు," అని అమ్మగారు బదులు చెప్పిరి.

భగవంతుడు వెలకు దొరకు వస్తువుకాదు

"అమ్మా! నేను మీ కడకు చాల తఱచుగా వచ్చుచు మీ యనుగ్రహమును బడసియున్నను, నాకే పారమార్థికసిద్ధి యేల కలుగలేదు? పూర్వ మే స్థితిలో నుంటినో యిప్పుడుకూడ నదేస్థితిలో నున్నట్లు తోచుచున్నది," అని

భగవత్కటాక్షము మెల్లగ పని చేయును

యొకనాడు శిష్యుడు మిక్కిలి ఆతృతతో విన్నవింప, "నాయనా! నీవు శయ్యలో నిద్రించుచుండగా, నిన్నా శయ్యతోకూడ నెవరో మరియొకచోటునకు తీసికొనిపోయి రనుకొనుము. అట్టిసందర్భములో మెలకువ వచ్చినవెంటనే, నీవొక క్రొత్తస్థలమునకు వచ్చినట్లు గ్రహింపగలుగుదువా? ఎంతమాత్రము గ్రహింపలేవు. నీ మమత పూర్తిగా పోయిన తరువాతనే, నీవొక క్రొత్తస్థలమునకు వచ్చినట్లు తెలిసికొనగలవు," అని అమ్మగారు సెలవిచ్చిరి.

* * *

"అమ్మా! భగవత్సాక్షాత్కార మెట్లు కలుగును? జపము, ధ్యానము, పూజయు నిందుకు తోడ్పడునా?" అని జయరాంబటిలో శిష్యు డొకనా డమ్మగారి నడిగెను.

అమ్మగారు : ఇవేవియు తోడ్పడజాలవు.

శిష్యుడు : అట్లైనచో భగవద్దర్శన మెట్లు కలుగును?

అమ్మగారు : కేవలము వానిదయవలననే. కాని, సాధకుడు ధ్యానమును జపమును చేయుచుండవలెను. అందువలన చిత్తశుద్ధి కలుగును. ఆరాధనాది పారమార్థిక సాధనలను ముముక్షువులు చేయుచుండవలెను. పువ్వును చేతబట్టుకొని ఆఘ్రాణించువారికి దాని పరిమళమెట్లు తెలియునో, సానపై గంధపుచెక్క నరగదీయువారికి మంచిగంధపు వాసన యెట్లనుభవైకవేద్యమగునో అట్లే నిరంతరము భగవంతుని దలంచుచుండువారికి ఆధ్యాత్మిక వికాసము

దైవానుగ్రహము - ఆధ్యాత్మిక సాధన

కలుగును. కోరికలన్నియు విడనాడుదువేని, నీ వీ క్షణముననే భగవత్సాక్షాత్కారము బడయగలవు.''

*　　　*　　　*

ఆధ్యాత్మిక సాధనలనుగూర్చి ముచ్చటించుచు, 1901-వ సంవత్సరములో నొకనాడు శ్రీ మాతృదేవి సన్న్యాసియగు నొక శిష్యున కిట్లు హితవొసంగిరి : ''ఉదయమునను సాయంకాలమునను ధ్యానమునకు గూర్చుండుము. ఉద్రేకమేమియు లేని చల్లని మనస్సుతో, ధ్యానప్రార్థనల నభ్యసింపుము. ఇట్లుచేయుట బహుకష్టము. దీనికంటె నొక పారపుచ్చుకొని మట్టిని త్రవ్వుట యెక్కువ సులభము. (శ్రీ గురుదేవుని చిత్రపటమువైపు చూచుచు) వీరిదయలేక నీకేమియు లభింపదు.'' ఆశ్రమకార్యముల నిర్వహించుచుండుటవలన, యథావిధిగా తాను ధ్యానప్రార్థనల నభ్యసింపలేకుంటినని శిష్యుడు తెలుపగా, ''ఈ కార్యము లెవరివి ? ఇవన్నియు నాయనవే. కొంతకాలమైనతరువాత నీ మనస్సే నీకు గురువై, జ్ఞానవికాసము కలుగజేయునని గ్రహింపగలవు,'' అని అమ్మగారు బదులు చెప్పిరి.

ధ్యానము, కర్మ, భగవత్కటాక్షము

ఒకనాడు శ్రీ మాతృదేవి యిట్లానతిచ్చిరి : ''మేమెంతో జపము చేసితిమి, ఎన్నో ఆధ్యాత్మికసాధన లాచరించితిమి. కాని, వానివలన నిసుమంతయు ప్రయోజనము లేదు. మహామాయ కనికరించి దారిలోని యడ్డంకులను దీసివైచిననేతప్ప నెవరికైన ముక్తి యెట్లు లభించును ?

ఓ మానవులారా! భగవంతుని శరణుజొరుడు! సర్వము వానికి సమర్పించి వాని శరణుజొరుడు! అప్పుడే, మహామాయ కనికరించి ముక్తికి దారిచూపును.'' పిమ్మట శ్రీ గురుదేవుని చరిత్రలోని యీ క్రింది విషయమును అమ్మగారు తెలిపిరి: అది జ్యేష్ఠమాసము. కామార్పుకూరులో నొకనాటి సాయంకాలము బాగుగా వర్షము కురిసి, చేలన్నియు నీళ్లతో నిండి యుండెను. శ్రీ గురుదేవులు నీటిని ద్రోసికొనుచు అడవుల వైపునకు వెళ్లుచుండిరి. ఆ నీటిలో వాలుగచేపలు చాల కనుపడినవి. జనులు వానిని రాళ్లతోగొట్టి చంపుచుండిరి. అందొకటి శ్రీ గురుదేవుల పాదములచుట్టును తిరుగ నారంభించెను. ఇదిచూచి 'దీనినిమాత్రము చంపకుడు. ఇది యెట్లు నా పాదముల శరణుజొచ్చియున్నదో చూడుడు. మీలో నెవరికైన సాధ్యమైనయెడల దీనిని తీసికొనివెళ్లి, హాల్దార్పకూరు కోనేటిలో విడిచిపెట్టుడు,'' అని సెలవిచ్చిరి. పిమ్మట శ్రీవారే యా చేపను గుంటకు దీసికొనిపోయి దానిలో విడిచి పెట్టిరి. ఇంటికి తిరిగివచ్చినతరువాత మాకీ యుదంతమంతయు దెలిపి, 'ఆ విధముగ భగవంతుని శరణుజొచ్చువారికిమాత్రమే ముక్తికలుగును,' అని చెప్పిరి.

* * *

మరణకాలమున భగవత్కటాక్షము

సన్న్యాసియగు నొక శిష్యుడు వ్రాసిన నిరాశాపూరితమగు నుత్తరములోని విషయములను విని, తీవ్రస్వరమున శ్రీ మాతృదేవి యిట్లు నొక్కి వక్కాణించిరి: ''అది

యెట్లు పొసగును? శ్రీ గురుదేవుని దివ్యనామమనిన నంత తృణప్రాయమా? ఇచ్చటకు వచ్చుచు శ్రీ గురుదేవుని తలంచు చుండువారి కేనాడో యొకనాడు, తమ యిష్టదైవ దర్శన ప్రాప్తి తప్పక కలుగును. తుదకు వారి ప్రాణావసానసమయ మునకైన శ్రీ గురుదేవుని దర్శనము కలిగితీరును.''

*          *          *

త్యాగవైభవము

మానస యను నొక యువకుడు తనకు మంత్రోపదేశము చేసి సన్న్యాసాశ్రమ మొసంగుడని శ్రీ మాతృదేవిని ప్రార్థింప, నాతనికోరిక నామె సంతోషపూర్వకముగా నీడేర్చిరి. అతడును మిగుల నానందించెను. సాయంకాలమున నాతడు కాళీమామ యింటిలో దేవీకీర్తనలను బాడుచుండెను. శ్రీ మాతృదేవి యా పాటల నెంతయు మెచ్చుకొనెను. అప్పుడచ్చట రాధు, మకు, నళిని, అమ్మగారివదినె లొకరిద్దరు, మరికొందరు భక్తులునుకూడ నుండిరి. ''ఈ చిన్నవాని నీమె సన్న్యాసిగ జేసినది,'' అని యామె వదినెలలో నొకరనిరి. ఆ ముక్క నందుకొని యా క్రిందివిధమున మకు వ్యాఖ్యానించెను: ''అది నిజము. మా అత్త యేమిచేయుచున్నదో చూడుడు! ఈ ప్రశస్తయువకుల కీమె సన్న్యాసమిచ్చుచున్నది. వీరి తల్లిదండ్రులెన్నో కష్టములకులోనై వీరినిపెంచి, తమయాశలనెల్ల వీరిపైననే పెట్టుకొనియుండిరి. అవియన్నియు నేడు బూడిదలోపోసిన పన్నీటివలె పరిణమించెను గదా! ఇక నీ యువకుడేమిచేయును? ఋషీకేశమునకు పోయి బిచ్చమెత్తుకొనును ; లేకున్న

నే చికిత్సాలయములోనో రోగుల మలమూత్రముల నెత్తు చుండును. ఎందుకిది? పెండ్లి చేసికొని యొక యింటివాడై జీవనము గడపుటకూడ ధర్మపద్ధతియే. సరేకాని, అత్తా, నీ వీ యువకుల నిట్లు సన్న్యాసుల జేయుచో, మహామాయకు నీపై కోపము వచ్చును. వారు సన్న్యాసులు కాగోరుదు రేని, వారంతట వారే సన్న్యాసులగుదురు గాక. ఆ విషయ మున నీవేల బాధ్యత వహింపవలెను?'' ఇందుకు ప్రత్యుత్తర ముగా (శ్రీ) మాతృదేవి యిట్లు సెలవిచ్చిరి : ''మకూ! ఈ బిడ్డ లందరు దివ్యాంశసంభూతులు. వీరీ ప్రపంచమున అనాఘ్రాత పుష్పములవలె నిష్కల్మష జీవనులై యుందురు. ఇంతకంటె కోరదగిన దేమున్నది. సంసారమం దేమిసుఖమున్నదో స్వానుభవమువలన నీవు గ్రహించిన విషయమేకదా! ఇన్నాళ్లనుండి నీవు నాయొద్ద నేమి నేర్చుకొంటివి? సంసార మం దేల యింత వ్యామోహము? ఇంత పశుప్రవృత్తియేల? దీనివలన నీకు కలుగుచున్న సుఖమెట్టిది? ఆదర్శనీయమైన పవిత్రజీవనమును నీవు కలలోనైన నూహింపలేవా? నీవును నీ భర్తయు నిప్పటికైన సోదరీసోదరులవలె జీవింపలేరా? పందులకు తగినజీవనముపై నింత భ్రమయేల? ఈ ప్రపంచ దుఃస్థితి జూడ నాకు మరణవేదనవలె నున్నది.'' (శ్రీ) మాతృ దేవి చేయుచుండిన యీ గంభీరప్రసంగమునువిని, అచ్చట నున్నవారి హృదయములెల్ల కరగిపోయెను. ఇంకను అమ్మ గారిట్లు సెలవిచ్చిరి : ''బ్రహ్మచర్య మవలంబించి పవిత్రజీవనము గడుపువారికి, వారు భగవంతుని ప్రార్థించినను సరే ప్రార్థిం పకపోయినను సరే భగవత్సాక్షాత్కారము చాల త్వరిత

ముగా కలుగును. ఇతరులు సంసారపాశబద్ధులగుటచే, భగవంతుని ధ్యానింప బ్రయత్నించినను వారి కా పని కష్ట మనిపించును."

*　　　*　　　*

సన్న్యాసి తల్లికి హితోపదేశము

ఒకసన్న్యాసి తల్లి తనకుమారుని నెట్లైన మరల సంసారజీవన మవలంబింప బ్రోత్సహింప గోరినపిమ్మట, శ్రీ మాతృదేవి ఆమె కిట్లు హితవు గఱపిరి: "సన్న్యాసికి తల్లిగానుండుట అనన్య సామాన్యమగు మహాభాగ్యము. చూచిచూచి జనులొక యిత్తడిగిన్నెనుకూడ విడిచిపెట్టలేరే! దానిపై వారికి మమకారము పోదే? ఇట్టిస్థితిలో సంసారమును విడిచిపెట్టుట సులభమా? అటువంటి సుపుత్రునితల్లివి నీవు. నీ వెందుకు చింతపడవలయును? అతడు సాధువైనను, నీ యోగక్షేమము కనిపెట్టుచుండును."

*　　　*　　　*

సంశయాత్ముడగు నొక సాధకునకు హెచ్చరిక

అమ్మగారి శిష్యుడగు నొక యువకున కొకసారి తలవని తలంపుగా నొక సంపన్నకుటుంబమువారు పెండ్లికి పిల్లనిచ్చెద మని మాట లారంభించిరి. అతని దారిద్ర్యమును శాశ్వతముగ బారద్రోలజాలినంత ధనమును కట్నముగా నిచ్చెద మనిరి. ఎం. ఏ. పరీక్ష ప్యాసైన తరువాత ఆ యువకుడొక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడయ్యెను. అతనికింకను సుఖాపేక్ష పూర్తిగా పోలేదు. కనుక తన

పెండ్లివిషయమై శ్రీ మాతృదేవి యభిప్రాయము తెలిసికొనగోరి, అందునుగూర్చి యామెనడిగెను. సర్వమును విని అమ్మగారిట్లు సెలవిచ్చిరి: "నాయనా! నీకిప్పుడే కొంతయు లేదు. సంసారాగ్నిలోబడి దగ్ధుడవగుట కేల అపేక్షించెదవు? నీ విప్పుడు సత్కర్మచేయుచున్నావు. నీ సాయమువలన బాలు రెందరో విద్యావంతులగుచున్నారు. నీ విద్యార్థులు సత్పురుషులయ్యెదరు. అది నీకుగూడ శ్రేయస్కరము."

"అమ్మా! అప్పుడప్పుడు నా మనస్సు సుఖముల నపేక్షించి కలతపడుచుండును. అందువలన నేను భయపడుచుందును," అని యా యువకుడు ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట అమ్మగారి ట్లానతిచ్చిరి: "భయపడకుము. ఈ కలియుగములో మానసికపాపము పాపమేకాదు. ఈ విషయమున నీ చింతల నెల్ల విడనాడుము. నీవు భయపడనక్కర లేదు." శ్రీ మాతృదేవి యొసంగిన యీ యభయప్రదానమును విన్నతరువాత ఆ భక్తుడు వివాహ విషయమును మరల నెన్నడును తలపెట్ట లేదు. తాత్కాలిక భావోద్రేకమువలన తన మనశ్శాంతి నెన్నడును గోల్పోలేదు.

*　　　*　　　*

సన్న్యాస గృహస్థాశ్రమములు

"అమ్మా! మీరు మీ బిడ్డలనందరిని సమభావముతో చూడవలసియుందురు గదా! అట్లయ్యును, ఒకడు తన వివాహ విషయమై మీ యభిప్రాయమును తెలిసికొనగోరి జాబువ్రాయుచో, వివాహమాడుటకు వానికి మీ యనుమతి

నిచ్చెదరు; మరియొకడు సంసారమును పరిత్యజింపగోరు నెడల, త్యాగజీవనమును కొనియాడుచు వానికి వేఱువిధమున బోధ చేయుదురు. అందరి నుత్తమమార్గమున నడపుట మీ విధాయక ధర్మము కాదా?'' అని యొక భక్తురా లడుగగా శ్రీ మాతృదేవి యిట్లానతిచ్చిరి : ''ఒకనికి సుఖాపేక్ష తీవ్రముగా నున్నదనుకొనుము. ఆ కోరికను విడనాడుమని నే నెంత బోధించినను అతడు నా మాట వినునని తలంతువా? మరియొకడు బహుజన్మార్జిత పుణ్యఫల విశేషముచే, ఈ సుఖము లన్నియు మాయావిలాసములే యని గ్రహించి భగవంతు డొక్కడే సత్యమని భావించుననుకొనుము, ఇట్టివానికి నే నించుక సాయము చేయవలదా? ఈ సంసార దుఃఖమునకు అంతమేమైన నున్నదా?''

* * *

ఒక శిష్యురాలి కుమారుడు వివాహమాడుట కంగీకరించుటలేదని విని శ్రీ మాతృదేవి యా శిష్యురాలితో నిట్లనిరి : ''ఆహా! ఈ కాలమున బాలురందరు పెండ్లియాడ మనుచున్నారు. కాని, మహోన్నత జీవితమునకు గావలసిన సంస్కారసంపత్తిగల సుజనులు మాత్రమే సన్న్యాసాశ్రమమును స్వీకరించి, సర్వబంధ విముక్తులగుటకు అర్హులు. ఇక సంసారజీవితము నించుక రుచిచూడ జన్మించినవారు కొందరున్నారు. సామాన్యముగా జను లీ లోకసుఖము లనుభవింపవలెననియే నా మతము. కాని శ్రీ గురుదేవుని శిష్యులయు, మిత్రులయుమాట వేరు.

శిష్యురాలు: అమ్మా! వాడు మీ బిడ్డడే. వాని భావి సుఖముగాని, కష్టముగాని కేవలము మీ యధీనము. వాని విషయమున మీ యిష్టమెట్లో యట్లే చేయుడు.

వివాహమా? త్యాగమా?

అమ్మగారు: ఈ జన్మలో వివాహమాడి వానిని భోగము లన్నియు ననుభవింపనీ; లేకున్న, నీడేరక లోన నణగియున్న వాంఛ లెన్నడైన తీవ్రరూపముదాల్చి వాని పతనమునకు దారితీయ వచ్చును. కాని, శ్రీ గురుదేవుని రక్షణ యతని కుండునంతకాల మత డెన్నటికిని జారిపడడు. ఈ విషయమును నీవు గట్టిగా నమ్మవచ్చును. శ్రీ గురుదేవులు నాకు చెప్పిన యొకమంత్ర మతని కుపదేశించితిని. దాని సాయమున నెవరైన పరిపూర్ణులు కాగలరు. అతడెన్నడైన దురవస్థ పాలై దుఃఖించునా?

*　　　*　　　*

మానసిక త్యాగప్రశంస

"తనను తమయిష్టదైవముగా స్వీకరించు వారికి పునర్జన్మ యుండదని శ్రీ గురుదేవు డానతిచ్చెను. ఇక శ్రీ వివేకానంద స్వాముల వారన్ననో సన్న్యాసాశ్రమము స్వీకరించినగాని యెవరికిని ముక్తిలభింపదని సెలవిచ్చిరి. ఇట్టి సందర్భములో గృహస్థులకు తరణోపాయ మేది?" అని అమ్మగారి నొక శిష్యుడడిగెను. శ్రీమాతృదేవి దీనికిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి: "ఔను. శ్రీ గురుదేవు లానతిచ్చిన విషయ మెంత నిజమో

శ్రీ స్వాములవారి ప్రవచనముకూడ అంతనిజము. గృహస్థులకు బహిరంగ త్యాగమక్కరలేదు. ఆంతరంగిక త్యాగము వారికి దానంతటదియే లభించును. కాని, కొందరివిషయములో బహిరంగత్యాగ మావశ్యకము. నీవు శ్రీగురుదేవునకాత్మార్పణముచేసికొనినచో, వారెల్లప్పుడు నీకు తోడు నీడయై నిల్చియుందురను విషయమును జ్ఞప్తియందుంచుకొనుము.''

సన్న్యాసాశ్రమపు కట్టుబాట్లు

అమ్మగారొకసారి యొకసాధువున కిట్లు హితవొసంగిరి: 'ఓసాధూ! జాగ్రత్త!' అని శ్రీరామకృష్ణులు హెచ్చరించుచుండువారు. సాధువు లెల్లప్పుడును చాల మెలకువగా నుండవలెను. వారి జీవితము జారుడునేలపై నడకవంటిది. అట్టినేలపై నడచువారు బహుజాగ్రత్తగా నడుగువేయవలయును. సన్న్యాసియగుట సులభమా? ఇష్టమున్నచో నెవరైన పెండ్లిచేసికొని గృహస్థజీవనమును గడుపవచ్చును. కాని, నీవుమాత్ర మట్టియుద్దేశముల నెల్ల విడిచిపెట్టినందున నీ వా విషయములపై మనస్సును పోనీయకూడదు. కక్కిన కూటికి తిరిగి ఆశపడకూడదు. కుక్కకు మెడపటకా అపాయము కలుగకుండ రక్షించునట్లే, కాషాయవస్త్రములు కూడ సన్న్యాసిని రక్షించును. మెడకు పట్టీయున్న కుక్కకు యజమాని యెవరో యొకరుండి తీరవలయునని యెంచి దాని జోలికెవ్వరును పోరు. సాధువునుకూడ తమతమయిండ్లలోని కందరును రానిత్తురు. మనస్సు సహజముగ పాపకార్య

ముల జేయగోరుచుండును. సత్కార్యాచరణయం దది సోమరి. నేను పూర్వము తెల్లవారుజామున నిద్రనుండి లేచి ధ్యానమునకు కూర్చుండుదానను. ఇంచుక శరీరాస్వస్థతవలన ఒకనాడట్లు లేచుటకు నిచ్ఛగింపనైతిని. ఈయొకనాటి క్రమభంగమువలన చాలనాళ్లవరకు నానిత్యచర్య తారుమారయ్యెను. ఇందుచేతనే సత్కార్యలను జయప్రదముగ నాచరింపవలయుననిన, నోరిమియు పట్టుదలయు నావశ్యకములని నేను చెప్పుచుండును. దక్షిణేశ్వరమున నౌబత్తుగదిలో నివసించుచుండినప్పుడు, 'పరమేశ్వరా! చంద్రునకుగూడ కళంకమున్నది. నా మనస్సుననెట్టి కళంకముగాని లేకుండునట్లనుగ్రహింపుము' అని వెన్నెలలో ప్రార్థించుచుండుదానను.

* * *

మాత్సర్య, మమకార రాహిత్యము

సన్న్యాసికి మమకారము, నీర్ష్యయు నుండకూడదు. సర్వావస్థలయందు నతడు సమభావుడై ప్రశాంతముగ నుండవలెను. "మనమిరువురము పరస్పరసహానముతో మెలగునెడల, సర్వమును చక్కగా జరుగును. లేనిచో, మన వివాదములను బరిష్కరించుటకు దేవాలయ నిర్వాహణాధికారిని మనము వేడుకొనవలసి యుండును," అని శ్రీరామకృష్ణులు హృదయునకు హితోపదేశము చేయుచుండువారు.

* * *

అమ్మగారితో ప్రసంగవశమున 'క' ఇట్లు విన్నవించెను: "అమ్మా! నీ పిల్లలందరును విద్యావంతులు. వీరు

(కోల్పారా ఆశ్రమనివాసులు) విద్యావిహీనులగు మీ బిడ్డలు. శరత్ మహారాజు శ్రీగురుదేవునిగురించి గ్రంథములను రచించి వారి సందేశమును, ఉపదేశములను

పాండిత్యము-సన్న్యాస జీవనము

లోకమందంతట వ్యాపింపజేయుచున్నారు. ఇంకను మీ బిడ్డలలో నితరు లుపన్యాసములిచ్చుచున్నారు. శ్రీ రామకృష్ణులభావముల నీరీతిగా ప్రచారములోనికి దీసికొనివచ్చుట కెంతో కృషిజరుగుచున్నది.'' ఇందుపై శ్రీ మాతృదేవి యిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి : ''ఏమి నీ యూహ ? మన గురుదేవునకే! చదువుటయు వ్రాయుటయు నంతగా తెలియకుండెనుగదా! భగవద్భక్తియే ముఖ్యము. ఈ ప్రాంతమున నీవలన నెంతో పని జరుగగలదు. ఈ సారి పండితపామరులను, బీదసాదలను సర్వజనులను ముక్తులజేయుటకే శ్రీగురుదేవుడు భూమిపై నవతరించెను. ఇచ్చట మలయమారుతము వీచుచున్నది. తమ తెరచాపలనువిప్పి శ్రీ గురుదేవుని శరణుజొచ్చువారు నిజముగా ధన్యులు. ఈ సారి వెదుళ్లును, గడ్డియు తప్ప జవసత్వము లేమాత్రమున్నచెట్లు, మొక్కలన్నియును ఈ మలయమారుతాహతికి చందనతరువులుగా మారును. నీవేల చింతించెదవు. మీరు నా స్వజనము. కాని, యొకసంగతిని మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. బంగారుతో పొదిగినదంతముగల యేనుగువంటివాడు విద్యావంతుడగు సాధువు.'' అమ్మగారి మాటలనుచు పూజామందిరములోనికి వెళ్లిరి.

* * *

"భగవంతుడే మనకందరికిని తల్లియుతండ్రియునైన యెడల, మనచే పాపమేల చేయించుచున్నాడు?" అని యొక శిష్యుడు శ్రీ మాతృదేవి నడిగెను.

భగవంతుడు : కర్మ : దుఃఖము

అమ్మగారు : నిజమే. ఈ చరాచరజీవులెల్ల భగవంతుడే. కాని, భేదాత్మక ప్రపంచములో జీవులు తమతమ పురాకృతకర్మకును, ఆంతరంగిక సంస్కారములకును అనుగుణముగా వ్యవహరించుచు సుఖదుఃఖము లనుభవించుచున్నారు. ఒకే సూర్యుడాయావస్తు, స్థలములనుబట్టి వేర్వేఱు విధములుగా ప్రకాశించుచున్నాడు.

శిష్యుడు : సర్వమును భగవత్సంకల్పము ప్రకారమే జరుగుచున్నయెడల, కర్మసూత్రమును తప్పించుకొనుటకు భగవంతుడు మనకేల సాయముచేయకున్నాడు?

అమ్మగారు : ఔను. భగవత్సంకల్ప మట్లున్నయెడల, మన యాధ్యాత్మికవికాసము త్వరలో చేకూరును. కాని, మనకు వాని సంకల్పము తెలియదు. ఈ కర్మసూత్ర ఫలితముగా తుదకు శ్రీ రామకృష్ణులుకూడ బాధపడవలసినవారైరి. ఒకనాడు వారి అన్నగారు తీవ్రజ్వరములో, సంధివలన బాధపడుచు, వైద్యులు నిషేధించిన చల్లనినీటిని త్రాగుటకు ప్రయత్నించిరి. అప్పుడచ్చట నుండిన శ్రీ గురుదేవులు తమ అన్నగారిచేతిలోని నీటిపాత్రను బలవంతముగా లాగివైచిరి. అందుపై వారియన్నగారు కోపోద్దీపితులై 'నీవు

నన్ను నీరుత్రాగనీయలేదు కనుక, నీ యవసానదినములలో నీవుకూడ నేదియు తినలేని స్థితిలోనుందువుగాక!' యని శపించిరి. 'అన్నా! నీ మేలు కోరి నేనట్లు చేసినందుకు ఫలముగా, నాకు నీ శాపము లభించెను', అని శ్రీ రామకృష్ణులు విన్నవింప వారి యన్నగారు కన్నుల నీరుగార 'అయ్యో! నే నెందుకట్లంటినో! నా నోట నటువంటిమాటలేల రావలయునో నాకే తెలియకున్నది,' అని తమ పశ్చాత్తాపమును వెలిబుచ్చిరి. నాయనా! చూచితివా! తమ కడసారి జబ్బులో శ్రీ గురుదేవులకుగూడ వారి పూర్వకర్మఫల మనుభవింపక తప్పినదికాదు. ఆ కాలమున వా రేమియు తినలేక పోయిరి.

* * *

జపము-కర్మోపశమనము

భగవన్నామ జపమువలన ప్రారబ్ధకర్మఫలమును తప్పించుకొన వీలగునాయని యొక భక్తుడు శ్రీ మాతృదేవి నడిగెను.

అమ్మగారు: ఎవరైనను ప్రారబ్ధకర్మ ఫల మనుభవింపక తప్పదు. దాని నెవరును తప్పించుకొనజాలరు. కాని భగవంతుని పవిత్రనామజపమువలన, స్మరణవలన దాని తీవ్రత తగ్గును. ప్రారబ్ధమునుబట్టి కాలుపోవలసినవానికి, భగవద్ధ్యాన ఫలితముగా పాదములో నొకముల్లు గ్రుచ్చుకొనుటతో సరిపోవును.

* * *

ఒకసారి అమ్మగారిట్లు సెలవిచ్చిరి : "శ్రీ గురుదేవుని సత్యవ్రతదీక్ష యెంతనిశ్చలమైనది! అయ్యో! వారి యున్నతాదర్శనీయ వర్తనమును మన మనుసరింపలేము కదా. ఈ కలియుగమున సత్యవ్రతమునకు మించిన తపస్సు వేఱేదియులేదని యాయన చెప్పుచుండువారు. సత్యవ్రత భంగములేకుండ నడచుకొనువారు భగవత్సాక్షాత్కారము బడసెదరు."

శ్రీ గురుదేవుని సత్యవ్రత దీక్ష

* * *

"శ్రీ గురుదేవుడు నిజముగా ముమ్మాటికిని భగవంతుడే. ఇతరుల దుఃఖములను, కష్టములను తొలగించుటకై యా దయానిధి, ఈ లోకమున ప్రజలబాగోగులను స్వయముగా తెలిసికొనుటకై మారువేషముతో తన నగరమందు తిరుగు రాజువలె వ్యవహరించెను; తన నిజస్వరూప మాలోకమునకు దెలియుటతోడనే, అందుండి యంతర్ధానమయ్యెను," అని శ్రీ మాతృదేవి యొక భక్తునితో జెప్పిరి.

శ్రీ గురుదేవుని దివ్యత్వము

ఒకప్పుడు రాధు చికిత్సకై అమ్మగారు బాగ్ బజారు నందలి బోసు పరాలో నొకయింటిలో అద్దెకుండిరి. పరిచర్యచేయుట కామెతో శిష్యురాలుకూడ నుండెను. అమ్మగారొకనాడామెను శ్రీ గురుదేవునకు నైవేద్యమొనర్పుమని అడిగిరి. నైవేద్య మారగింపు చేయుపద్ధతి తనకు తెలియదని యామె విన్నవింప, శ్రీ మాతృదేవి

శ్రీ గురుదేవునకు నైవేద్యమొనర్చు పద్ధతి

యిట్లానతిచ్చిరి : "ఇటుచూడుము. శ్రీ గురుదేవుని నీ సొంతముగా భావించి, 'ఇటువచ్చి యీ పీటపై గూర్చుండి భోజనము చేయుడు,' అని వారిని ప్రార్థించి, వారువచ్చి యుచితాసనముపై గూర్చుండి భోజనముచేయునట్లు భావింపుము. మన స్వజనులను భోజనమునకై పిలుచుటకు మనకు మంత్రము కావలెనా? ఇది నిజముగా మనబంధువుల కాతిథ్యమిచ్చుట వంటిదే. ఏ విధమున నీవు వారిని సేవించినను శ్రీ గురుదేవుడు నీ సేవను స్వీకరించును." పిమ్మట, శ్రీ గురుదేవునకు నైవేద్య మారగింపు చేయుటకై యొకమంత్రమును అమ్మగారు శిష్యురాలికి బోధించిరి.

* * *

శ్రీ గురుదేవుని ప్రార్థించువిధము

తన యేకైకపుత్రికను కోల్పోయిన యొక యువతి నోదార్చుచు శ్రీ మాతృదేవి యిట్లు చెప్పిరి : "అమ్మాయీ? నీకు నేనేమి చెప్పగలను? నాకేమియు తెలియదు. శ్రీ గురుదేవుని చిత్రపటము నీ యెదుట నుంచుకొనుము. వా రెల్లప్పుడు నీకు తోడు నీడయైయున్నారని గ్రహింపుము. దుఃఖపూరితమైన నీ హృదయమందలి వేదనను ఆయనకు విన్నవింపుము. కన్నుల నీరునించి 'ఓ ప్రభూ! నన్ను నీయొద్ద కాకర్షించి, నా మనస్సునకు శాంతి ననుగ్రహింపుము,' అని త్రికరణ శుద్ధిగా ప్రార్థింపుము. నిరంతర మట్లు చేయుట వలన నీ మనస్సునకు క్రమముగా శాంతి కలుగును. శ్రీ గురుదేవునియందు భక్తికలిగి, నీకు కష్టమువచ్చినప్పుడెల్ల వారితో చెప్పుకొనుము.

*　　　　*　　　　*

ఒకనాటి సాయంకాలమున సోదరీసుధీరయు, నొక బాలికా శిష్యురాలు శ్రీ మాతృదేవి చెంతనుండిరి. అమ్మగారు వారి కిట్లు హితోపదేశము చేసిరి : "తుద

**శ్రీ గురుదేవుని ప్రార్థన వలన ప్రేమభక్తి కలుగును**

కొక్కసారియైనను నిజముగా శ్రీ గురుదేవుని ప్రార్థించినవారేవిషయమునగాని భయపడ నక్కరలేదు. శ్రీ వారి నెల్లప్పుడును ప్రార్థించువారికి శ్రీ భగవానుని దయవలన ప్రేమభక్తి కలుగును. అమ్మాయీ! ఈ ప్రేమయే పారమార్థిక జీవితరహస్యము. శ్రీ బృందావన గోపస్త్రీల కిది సిద్ధించెను. వారికీ లోకమున శ్రీ కృష్ణుడుతప్ప వేఱేదియు తెలియదయ్యెను. 'అమూల్యమైన ఈ ప్రేమ భూషణమును జనులు బహు జాగ్రత్తతో కాపాడుకొనవలయును,' అని నీలకంఠుని కీర్తనలలో నొక చరణమున కర్థము." అమ్మగారా పాటను పాడి, యిట్లు సెలవిచ్చిరి : "ఆహా! నీలకంఠుని కీర్తన లెంత మధురములు! ఆ కీర్తనలనిన శ్రీ గురుదేవునకు బహుప్రీతి. ఆయన దక్షిణేశ్వరములో నివసించుచుండిన కాలమున నీలకంఠు డప్పుడప్పుటకువచ్చి యా కీర్తనలనుపాడి, వారికి వినుపించుచుండువాడు. మే మచ్చట నెంత సుఖముగా నుండెడివారము! వేర్వేఱు మనోవైఖరులుగల జను లెందరో ఆయనకడకు వచ్చుచుండువారు. ఆ కాలమున దక్షిణేశ్వరము మహానంద నిలయముగా మాకు కనుపడెడిది."

*　　　　*　　　　*

మంత్రము - పూజ

"అమ్మా! చాలమంది విధ్యుక్తముగా శివపూజ చేయుచున్నారు. మేము నట్లు చేయ వచ్చునా?" యని యొక భక్తురాలడుగగా శ్రీమాతృదేవి యిట్లు బదులుచెప్పిరి: "నేను మీ కుపదేశించిన మంత్రములో సమస్తమున్నది. దానితో దుర్గను, కాళిని సర్వదేవతలను మీరు పూజింపవచ్చును. ఇష్టమున్నవారు శివపూజా విధానమును నేర్చుకొనవచ్చును. కాని మీ కది యనావశ్యకము. దానివలన మన చిత్తక్షోభ లెక్కువగుటతప్ప, వేఱు లాభమేమియు లేదు."

శ్రీ గురుదేవునకు నైవేద్యమును సమర్పించునపు డనుసరించవలసిన పద్ధతినిగురించి యొకరడుగగా శ్రీమాతృదేవి యీ విషయమున ప్రత్యేక కర్మకాండ ననుసరింప నక్కర లేదనియు, గురువుపదేశించిన మంత్రమే యన్నిటికిని చాలుననియును సెలవిచ్చిరి.

ఆధ్యాత్మిక సంస్కారములు గల యొక యువకునకు హితబోధ

శ్రీ మాతృదేవి కడసారి జబ్బులో నామెను సందర్శింప వచ్చిన యొక యువకుని కుశలప్రశ్న లడిగినతరువాత, నిక చాలకాలము తాము జీవింపక పోవచ్చునని యామె చెప్పిరి. ఆ యువకు డీవార్తవిని మిక్కిలి దిగులుపడి, యామె లేనిచో తన జీవితము దిక్కుమాలిన దగు ననుభయమును వెలిబుచ్చగా, అమ్మగారతని నిట్లు హెచ్చరించిరి: "శ్రీ రామకృష్ణుడే మన రక్షకుడను విషయమెన్నడును మరువకుము. నీవీ సంగతిని

విస్మరింతువేని చిక్కులపాలయ్యెదవు. నీ తల్లినిగురించియు, నితర కుటుంబీకులను గురించియు నేను నిన్ను నేడెందు కడిగితినో నీకు తెలియునా? నీ తండ్రి మరణమునుగురించి కొంతకాలము క్రిందట 'X'-వలన వింటిని. అప్పుడు నీ తల్లి కితరబంధువు లెవరైన నుండిరో లేరో యనియు, యామె జీవితపోషణకు చాలిన స్థితికలదాయనియు నతని నడిగితిని. అంతతో నాగక, యామె నీపై జీవనమున కాధారపడియుం డెనాయనికూడ ప్రశ్నించితిని. నీ సాయములేకయే యామె జీవింపగల స్థితిలో నుండెనని తెలిసికొని, 'మంచిది, ఈ బాలునకు పవిత్రోద్దేశములున్నవి. ఇక శ్రీరామకృష్ణుల దయవలన నితడు పారమార్థిక జీవితమును నిరాటంకముగా గడుపగలడు' అని తలంచితిని. అందరును మాతృసేవ చేయ వలయును. ఇతరుల సేవయందు మీ జీవితమును ధారవో యుటకై నా కడకువచ్చిన మీకందరికిని ముఖ్యముగా నిది విధాయకధర్మము. నీ తండ్రి నీ తల్లికేమియు పైకమిచ్చి యుండనియెడల, ధనమార్జించి యెట్టిలోటు లేకుండ నామెను పోషించుచుండుమని నిన్నడిగియుండెడుదానను. శ్రీ రామ కృష్ణుల దయావిశేషమువలన నీకా యభ్యంతరము లేకుండ పోయెను. ఆమెవశము చేయబడిన పైకము వ్యర్థము చేయ బడకుండునట్లు మాత్రము చూడుము. ఆ విషయమై యేదో యొక యేర్పాటుచేసి, నీ శక్తికొలది నామె యోగక్షేమమును కనిపెట్టుచుండుము. ఇదిమాత్రము నీ కొక చిన్నలాభమా? కేవల న్యాయమార్గముల నెవరును ధనమార్జింపజాలరు. ధన మెల్లప్పుడును మనస్సును కళంకపరచును. ఈ కారణమును

బట్టియే, నీ తల్లి యార్థికవ్యవహారములను సాధ్యమైనంత త్వరలో పరిష్కరింపుమని నిన్నడుగుచున్నాను. ఎక్కువగా నీవాపనిలో నిమగ్నుడవయిన యెడల ధనమునందు నీకాసక్తి గల్గును. ధనమున కింత సమ్మోహన శక్తియున్నది. దాని కతీతుడనని, దానియందెన్నటికిని మరులు గొననని నీ వను కొనవచ్చును. ఏ క్షణముననైన దాని యందలి యాసక్తిని విడిచిపెట్టగలనని నీ వింకను తలంచవచ్చును. నాయనా! వలదు; ఇట్లెన్నటికిని తలంపవలదు. సూదిబెజ్జమంత రంధ్రముద్వారమున ధనాసక్తి నీ మనస్సున ప్రవేశించి, నీకు తెలియకుండగనే క్రమక్రమముగ నిన్నణచివేయును. అది నీ వెన్నటికిని తెలిసికొనజాలవు. ముఖ్యముగా నీవు కలకత్తాలో నివసించుచుండుటచే, ధనము జనుల నెంతదుర్మార్గులను చేయునో నీకు తెలిసినవిషయమే. సాధ్యమైనంత శీఘ్రముగా నీ తల్లి వ్యవహారములను పరిష్కారముచేసి, కలకత్తానుండి పారిపొమ్ము. ఇంతేకాక, నీ తల్లి నొక పుణ్యక్షేత్రమున నివసింప బ్రోత్సహింప గలుగుదువేని, మీ రిరువురును మీ యైహిక సంబంధమును మరచి, పారమార్థిక జీవనమును గడుపవచ్చును. ప్రస్తుతము నీ తల్లి విచారగ్రస్తయైయున్నది. ఇది యత్యుత్తమమైన యేర్పాటని తలంతును. ఇంతేకాక నీ తల్లికూడ చాలపెద్దదియైనది. ఆమెతో నెల్లప్పుడును భగవంతునిగురించి ప్రసంగించుచుండుము. ఆమె తరణోపాయమునకు తగిన సాయమును నీ వామెకు చేయగలుగుదువేని, నిజముగా పుత్రధర్మమును నెరవేర్చినవాడవగుదువు. ఆమె పాలనుత్రాగికదా నీవు పెరిగితివి! నిన్ను పెద్దవానిజేయుట

కామె యెంతకష్టపడినది! ఆమెకు సేవచేయుటయే నీ యత్యున్నత ధర్మము. కాని నీ పారమార్థికాభ్యుదయమున ఆమె యాటంకము కలిగించుచో నీ వన్యథా తలంపవచ్చును. నీ వామెను నా కడ కెందుకు తీసికొనిరావు? ఆమె స్వభావ మెట్టిదో చూచి, యుక్తమని తోచినయెడల నామె కేమైన హితబోధ చేసెదను. కాని, జాగ్రత్త! నీ తల్లికి సేవచేయు నెపమున సంసారలంపటమున దగులుకొనకుము! ఇదియొక పెద్దవిషయము కాదు, ఒక వితంతువు పోషణమునకు గావలసిన ధన మతిస్వల్పము. కొంచెము నష్టమువచ్చిననుగూడ నీ వామె వ్యవహారములను సాధ్యమైనంత త్వరలో బరిష్కరించుటకు బ్రయత్నింపుము. శ్రీ రామకృష్ణు లెన్నడును ధనమును చేతితో స్పృశింపజాలకుండిరి. అట్టి మహానీయుని పేరు చెప్పుకొని మీరీ ప్రపంచరంగమున కరుగుచున్నారు. వారి మాట లెన్నడును మరువవలదు. ఈ లోకమున మీరుచూచు దురవస్థలన్నిటికిని మూలకారణము ధనమే. ధనము మీ మనస్సును నితరభ్రమలకు గురిచేయ వచ్చును, జాగ్రత్త!"

* * *

గృహస్థుడగు నొకభక్తు డొకసారి యొక సన్న్యాసితో నగౌరవముగా మాట్లాడెను. అమ్మగారాయువకున కిట్లు హితవుగరపిరి: "నీవనిన శ్రీ గురుదేవున కపరిమిత దయ. అందుచేతనే నీ బాల్యమునుండియు నీ కాయనయం దవ్యాజానురాగము కుదిరెను. అయి

గృహస్థుడగు నొక యువభక్తునకు హితోపదేశము

నను, నీవీ కొలదిపాటి విషయములను జ్ఞప్తియందుంచుకొని నీ జీవితమం దనుసరింపవలయును. ఈ మూడు విషయములం దును నీవు జాగరూకుడవై యుండవలయును. మొదటిది, నదీతీరముననుండు గృహము ; ఎప్పుడైనను నది పొంగి నీ యింటిని నాశనముచేసి వరదలో తుడిచివేయవచ్చును ; రెండవది, పాము నీ కంటబడినప్పుడు నీవు బహుజాగ్రత్తగా నుండవలెను : అది యెప్పుడువచ్చి నిన్ను కరచునో యెవరును చెప్పలేరు ; మూడు, సాధువు : అతనిమాటవలన, తలంపు వలన గృహస్థునకు కీడు కలుగవచ్చునన్న సంగతి నీ వెరు గవు. సాధువును చూచినప్పుడెల్ల నీ వతనికి గౌరవము కను బరుపవలయును. ప్రతివచనములచేగాని, న్యూనత కలుగ చేయు సంభాషణలచేగాని నీ వాతనిని నిరాదరణ చేయ కూడదు.'' తన జీవితాంతమువర కాశిష్యుడు శ్రీ మాతృదేవి సెలవిచ్చిన యీ యుపదేశ వాక్యములను గౌరవముతో పాటించెను.

* * *

మంత్రోపదేశము చేసినతరువాత శ్రీ మాతృదేవి యొక శిష్యురాలికిట్లు హితవుచెప్పిరి : ''అమ్మాయీ! సావ ధానముగా వినుము. నూతనముగా వితంతువైన స్త్రీకి నేను సామాన్య ముగ మంత్రోపదేశము చేయను.

**వితంతువగు నొక శిష్యురాలికి హితబోధ**

కాని, నీకు పారమార్థికచింత యుండుటచే నీవిషయమున నా యలవాటును త్రోసిపుచ్చి, నీకు మంత్రోపదేశము చేసితిని.

ఈపనికి నేను పశ్చాత్తాపపడ నక్కఱలేకుండ చూడవలసిన భారము నీది. శిష్యులుచేయు పాపమువలన గురువు బాధ పడును. ఈ మంత్రమును ప్రతిదినము నిర్ణీతకాలములందు తప్పక జపించుచుండుము.''

ఈ శిష్యురా లొకసారి తన యత్తవారింటికి వెడలు చుండినప్పుడు, శ్రీ మాతృదేవి యిట్లు సెలవిచ్చిరి: ''ఎవరి తోడను నీవు చనవుగా నుండకూడదు. కుటుంబమున జరుగు శుభకార్యములు మొదలగు సంతోష సమయములందు నీ వెక్కువగా పాల్గొనవలదు. నీ మనస్సు నెల్లప్పుడును పార మార్థిక విషయములందే లీనము గావించి, యితరుల విషయమై తెలిసికొన కుతూహలపడకుము. క్రమక్రమముగా ధ్యాన ప్రార్థనలందు కాల మెక్కువగా గడుపుచు, శ్రీరామకృష్ణుల యుపదేశములను చదువుచుండుము.'' మరియొకనాడామె తమతో నొంటరిగా నుండినప్పుడు శ్రీ మాతృదేవి యి ట్లామెకు బోధించిరి: ''ఏ పురుషునితోనైన, తుదకు నీ తండ్రితోనైనను సోదరునితోనైననుగూడ నీ వెన్నడును చనవుగా నుండకుము. ఇక నితరులమాట చెప్పనేల? చివరకు భగవంతుడే ఆ రూపమున వచ్చినను, పురుషునితో నీవు చనవుగా నుండకూడదని మరియొకసారి నొక్కి చెప్పు చున్నాను.''

సన్న్యాసులు నివసించుచుండిన మఠములకును, తదితర స్థలములకును తఱచుగా బోవలదని అమ్మగారీ శిష్యురాలికే యిట్లు హితవు చెప్పుచుండువారు: ''నీ మనస్సులో దుర

ద్వేషమేమియు లేకపోవచ్చును. పవిత్రసంకల్పములతోనే నీవిట్టి స్థలములకు వెళ్లినను, నిన్ను చూచుటతోడనే వారికి మనోవికారములు కలుగవచ్చును. అట్లగునేని, నీవుకూడ దానికి బాధ్యురాల వగుదువు.'' ఇంతేకాక, యేకాలమునబట్టిన నాకాలమునను, ఇట్టివా రట్టివారనక యెవరితోనైనను తీర్థయాత్రలకు బోవలదనియు, శక్తి యున్నయెడల కొలదిమంది సాధువులకు భోజనము పెట్టుమనియు నామెకు బోధించి, అచ్చటనున్నవారిలో ఒక పుణ్యస్థలమునకుబోయి, మంచి గుణపాఠమును నేర్చుకొనివచ్చిన భక్తురాలి నామెకు జూపుచు, శ్రీ మాతృదేవి యొకపాట నుదాహరించుచు, ''తీర్థయాత్రయును, విలాసార్థమగు పరదేశాటనమును దుఃఖకారణములు. వాని విషయమై నీకు చిత్తక్షోభవలదు. నీకు నిజముగా శ్రద్ధయే యున్నయెడల, నీ వింటిలోనుండియే యెక్కువగా సాధింపగలవు,'' అని సెలవిచ్చిరి.

ఒకనాడు కొంతమంది భక్తురాం డ్రొకానొక వ్యక్తిని విమర్శించుచుండగా, ''నిన్నిచ్చటకు మొదటిసారి తోడ్కొని వచ్చినది ఆమెయే. ఆమెపట్ల నీవు గౌరవభావము విడనాడ వలదు,'' అని అమ్మగారీ శిష్యురాలినే హెచ్చరించిరి.

ఈ శిష్యురాలొక శిశువును దత్తముచేసికొన గోరినప్పుడు, తాము రాధును పెంచుకొని యనుభవించినకష్టమామెకుజెప్పి, ''అట్టిపని నెన్నడును చేయకుము, ఇతరుల విషయమున నెల్లెడల నీ విధ్యుక్తధర్మమును నిర్వహించుచుండుము. కాని, భగవంతు నొకనినే నీవు ప్రేమింపవలెను,

ఐహికప్రేమ యెల్లప్పుడును, చెప్పనలవికాని దుఃఖమునకు కారణమగును,'' అని శ్రీ మాతృదేవి హెచ్చరించిరి.

శ్యామదాస్ కవిరాజు చేయుచుండిన చికిత్సవలన శ్రీ మాతృదేవి యారోగ్యము కొంచెము బాగుగానుండెను. ఒకనాటిసాయంకాలమున పెక్కురు భక్తురాండ్రామెను సందర్శింప వచ్చిరి. వారిలో నొకయామె విశేషముగా నగలను సొగసైన వస్త్రములను ధరించియుండెను. ఆమెయందించుక తత్తరపాటు కూడ కనిపించెను. వారిని సంబోధించి అమ్మగారిట్లు ప్రసంగించిరి: ''చూడుడు! లజ్జయే స్త్రీకి భూషణము. భగవద్విగ్రహ పాదాంకితమైనప్పుడు తనజన్మ సార్థకమయ్యెనని పుష్పము తలంచును. అట్లుకానిచో చెట్టుననే వాడిపోవుట దానికి చాలమేలు. అట్టిపుష్పముల నెవడైన డాంబికుడు గుత్తిగాకట్టి తనముక్కు దగ్గరబెట్టుకొని, 'ఆహా! ఎంత సువాసన!' అని శ్లాఘించుటచూచిన నాకు చాలబాధగానుండును. బహుశః వాడు మరుక్షణముననే యాగుత్తిని నేలపై బారవైచి తన పాదరక్షతో త్రొక్కివేయవచ్చును. ఇక దాని వైపే వాడు చూడడు.'' (ఆ స్త్రీని చాలకాలముక్రిందట నామెభర్త విడిచిపెట్టి, యెక్కడకో వెడలిపోయెనని తరువాత తెలియవచ్చెను.)

స్త్రీల లజ్జాగుణప్రశంస

* * *

తాము త్వరలో శరీరమును చాలించెదమని శ్రీమాతృదేవి చెప్పగావిని, యొకభక్తు డొకసారి తానిక దిక్కుమాలిన

22

గురువుగా శ్రీమాతృదేవి బాధ్యత

వాడనగుదునని తలంచుచు మిక్కిలి విచారించుచుండెను. అమ్మగారు వాని కిట్లు ధైర్యము చెప్పిరి: "నా శరీరము విచ్ఛిన్నమైనను, నేను బాధ్యతవహించిన శిష్యులలో ప్రతి వ్యక్తికిని ముక్తి లభించనంతవరకు నాకు విడుదలయుండగల దని తలంతువా? అంతవరకు నేను వారితో నిరంతరము నివసింపవలెను. వారి విషయమున పాపపుణ్యముల బాధ్యతను నేనే పూర్తిగా వహించియున్నాను. మంత్రోపదేశము చేయుటయనిన అంత తేలికపని యనుకొనుచుంటివా? మేము వహింపవలసిన బాధ్యత యెంత ప్రచండమైనది! శిష్యుల విషయమున మేమెంత ఆందోళన పడుచుందుము! చూడుము! నీతండ్రి మరణించెను. ఆ వార్త నీ విషయమున వెంటనే నాకెంతో ఆందోళన కలిగించెను. 'అయ్యో! శ్రీ గురుదేవుడు వీనిని మరల పరిశోధించుచున్నాడే!' అని విచారించితిని. ఈ పరీక్షయందు దుత్తీర్ణుడవగుదువుగాకయని నిరంతరము ప్రార్థించుచున్నాను. ఈ కారణమువలననే నీకీ హితబోధనంతయు జేసితిని. నేచెప్పునదెల్ల గ్రహింపగలుగుచున్నావా? నీవట్లు గ్రహింపగలిగియుండినచో, నా చింతలెంతో తగ్గియుండెడివి. శ్రీరామకృష్ణులు తమ వేర్వేరు బిడ్డలతో వేర్వేరు విధముల లీలావినోదము సలుపుచున్నారు. కాని, అందువలన ప్రమాదమేమియు లేకుండునట్లు చూచు భారము నాది. నాసొంతముగ స్వీకరించినవారిని వారి కర్మమునకు విడనాడి యూరకొనజాలను."

* * *

మహాత్ములను సేవించువారి అపరాధములను గురించి శ్రీ మాతృదేవి యిట్లు ప్రసంగించిరి: "మహాత్ములను సేవించునపు డెవరైనను ప్రమాదము

మహాత్ముల సేవలోగల ప్రమాదములు

నకు లోను కావచ్చును. ఆ ప్రమాద మిట్లు జరుగును. అట్టిమహనీయుల సేవాభాగ్య మనుభవించు వానికి గర్వ మెక్కువయై, తాము సేవించువ్యక్తి నతడు తనచేతి కీలుబొమ్మవలె నాడించి ప్రతి విషయముననను, తుద కాహార విహారాదులందుకూడ, తన యధికారమును చెలాయింపగోరును. దీనివలన సేవాఫల మాసేవకుడు కోల్పోవును. తమ స్వసుఖములను మఱచి, తాము సేవించు పెద్దల కష్టసుఖములే తమ కష్టసుఖము లుగా భావించువారి విషయమున నిట్లేల జరుగవలయును? సేవకుల పతనమునుగురించి నీవు మాట్లాడుచున్నావా? చాల మంది మహాత్ములు మిక్కిలి వైభవోపేతమైన జీవితమును గడపుచుందురు. ఈ భాగ్యభోగ్యములనుజూచి చాలమంది వారికడకు సేవకులుగావచ్చి, భోగోన్మత్తులై తమగోతిని తామే త్రవ్వుకొనెదరు. సరియైన విధమున సేవచేయువా రెందరున్నారో చెప్పుము. చెరువులోని నీటిపై చంద్రుని ప్రతిబింబము పడినతోడనే నీటియందు ప్రతిబింబితమైన చంద్రుడు నిజముగా తమకూటములోని జీవియేయని భ్రమించి, ఆనంద పారవశ్యమున నెత్తాళ్లు (ఒకవిధమైన చిన్న చేపలు) అటునిటు దుముకును. కాని చంద్రు డస్తమించినప్పుడవి తమ పూర్వస్థితిలోనికి బోవును; వెఱ్ఱిసంతోషముతో నెగిరి

యెగిరి, అలసిపోయి మాంద్యముగా నవి పడియుండును. దీని కంతటికిని కారణమేమో యవి గ్రహింపజాలవు.

*　　　*　　　*

పుణ్యకార్యములు - సుముహూర్తము

తనతల్లిని కాశీయాత్రకు దీసికొని పోగోరినప్పుడు ఆ ముహూర్తము బాగులేక పోవుటచే నామె యందులకు సమ్మతింపలేదని ఒక శిష్యుడొకసారి విన్నవింప, శ్రీమాతృదేవి యిట్లు బదులు చెప్పిరి: "నాయనా! దుర్ముహూర్తమున జేయు తీర్థయాత్ర పురాకృతపుణ్యకార్యముల ఫలమును నాశన మొనర్చునందురు. అట్లయ్యును, 'శుభస్యశీఘ్రమ్' అను నార్యోక్తి ననుసరించి జనులు తమ పవిత్రోద్దేశముల నన్నిటిని సాధ్యమైనంత త్వరలో సాధించ వలెనను మాట కూడ నిజమే."

ద్వంద్వార్థముగల యీ మాటలు శిష్యునకు బోధపడక, అతడు కంగారుపడుచుండుట చూచి అమ్మగారిట్లు చెప్పిరి: "దుర్ముహూర్తసమయమున పుణ్యక్షేత్రములను దర్శింపబోవుట యుక్తము కాదని లౌకికుల యభిప్రాయము. ముహూర్తౌచితిని బాగుగా నాలోచించి జనులట్టి పవిత్రోద్దేశమును తాత్కాలికముగా విడనాడవచ్చుననుట నిజమే. కాని మృత్యువు ముహూర్తము మంచిదా చెడ్డదాయను విషయమును పాటింపదుగదా! మరణమెప్పుడు వచ్చునో యెవరికిని తెలియదు గనుక, జనులు తమ పవిత్రోద్దేశములను సాధించుటకు తగిన యవకాశము కలిగినతోడనే, శుభ

ముహూర్తమునకై వేచియుండక కార్యాచరణకు గడంగ వలయును.''

* * *

స్వప్రయోజకత్వము విషయమున అపరిమిత విశ్వాసము తగదు

''అమ్మా! చెడుతలంపు లేవియు నామనస్సున బొడమవు'' అని శిష్యుడొకనాడు చెప్పగా, అదరిపాటుతో ''అట్లనకుము. అట్టిమాట నెవరుకాని చెప్పకూడదు,'' అని, అమ్మగారతనిని వారించుచు హెచ్చరించిరి.

* * *

అపవాదు-భక్తి మొదలగు విషయములను గురించి

కొంతవాదము చేసినతరువాత, నళినియును, మరి కొలదిమంది బాలికలును ఎట్టి అపవాదు జనులకు మంచిదని యడుగగా అపవాద విషయమున మంచి చెడ్డల ప్రసక్తియే యెట్లుండగలదని మొదట ప్రశ్నించి పిమ్మట మాతృదేవి యిట్లు సెలవిచ్చిరి : ''కాని యైశ్వర్యము విషయమున నపవాదు మంచిది. 'మీరు చాల ధనవంతులు' అని యే మనుష్యునితోనైన చెప్పినప్పుడు అతడు పైకెంతనమ్రతను గనుబరచినను అంతరంగమున మిక్కిలి సంతోషించును. ఈ ప్రసంగము చాలును. ఇక మనము భగవంతు నడుగవలసిన కోరికను మీరు నాకు చెప్పగలరా?'' ''అత్తా! ఔనౌను! మనము దివ్యజ్ఞానమును, భక్తిని, ఈ లోకమున మనకు సుఖమునుగూర్చు

నితరవస్తుచయమును కోరవలయును'' అని నళిని చెప్పెను. ''ఒకేమాటలో చెప్పవలెననిన, వైరాగ్యమును అనగా నెట్టి కోరికయు లేని స్థితిని మనము కోరవలెను. ఏలన, ఆశయే సర్వకష్టములకు మూలబీజము, బహు జననమరణములకు కారణము, ముక్తికంతరాయము'' అని అమ్మగా రానతిచ్చిరి.

*　　　*　　　*

దివ్యప్రేమ మానవప్రేమ

తనకును తనమిత్రునకునుమధ్య పొత్తుచెడినదని ఒక భక్తురాలు చెప్పినపిదప, ''ఏమానవ వ్యక్తిని గాని ప్రేమించు నెడల నీ వందులకు కష్టపడవలసి యుండును. భగవంతుని మాత్రమే ప్రేమించువారు నిజముగా ధన్యులు. భగవంతుని ప్రేమించుట యందెట్టి కష్టమును కలుగదు'' అని అమ్మగారు చెప్పిరి.

*　　　*　　　*

''అమ్మా! మీ యూరిలోని బాలవితంతువులు, మా ప్రాంతములం దట్టివారికి నిషిద్ధములైన పదార్థములను తినుటచూడ నా కాశ్చర్యమయ్యెను. సంఘము దీని నధిక్షేపించును'' అని పూర్వాచారపరాయణయగు నొకశిష్యురాలొకసారి తమతో చెప్పినప్పుడు, శ్రీ మాతృదేవి యిట్లు సెలవిచ్చిరి :

సాంఘికాచారములు– పారమార్థిక సాధనలు

''చూడుము. ఇది సాంఘికాచారములకు సంబంధించిన విషయము : ఈయాచారములు దేశమునందలి వివిధప్రాంతములలో వేర్వేరుగా నుండును. మా ప్రాంతమున

బాలవితంతువులకు ఆహారము విషయమునను, ఆభరణము లను ధరించు విషయమునను మీాపైపునకంటె నెక్కువ స్వేచ్ఛనిచ్చెదరు. సహజముగా వీనిని వారపేక్షింతురు. రుచ్యములగు భక్ష్యములను బహిరంగముగా తిననియ్యనిచో, వారు రహస్యముగా వానిని తినెదరు. కాని, మొదట కొంత స్వేచ్ఛ నిచ్చినయెడల, తాము సంఘనియమమునకు విరుద్ధ ముగా ప్రవర్తించుచున్నామని క్రమక్రమముగా గ్రహించి తమంతటతామే వారీ యభ్యాసమును మానివేయవచ్చును. తుదకు చెప్పెడిదేమన, నీవీ స్వల్ప విషయములను గురించి చిత్తక్షోభనందకుము. అందువలన శ్రీ గురుదేవుని మరచి పోయెదవు. జనులేమనిన, నననిమ్ము; శ్రీ గురుదేవుని నిరం తరము జ్ఞప్తియందుంచుకొని నీకు ధర్మమని తోచినదానిని చేయుచుండుము. 'జనులను పురుగులవలె చూడుము' అని శ్రీ గురుదేవులు చెప్పుచుండువారు. ఇది పరనిందా పరాయ ణులకును, దుష్టసంస్కారములుగల జనులకు మాత్రమే వర్తించునుగాని అందరికిని వర్తింపదు."

* * *

పవిత్రత

జయరాంబాటిలో శ్రీ మాతృదేవి కడసారి నివసించు చుండినప్పుడు వంట పనికత్తెయగు బ్రాహ్మణస్త్రీ యొక నాటి రాత్రి యించుమించుగా తొమ్మిది గంటలవేళ నామెకడకువచ్చి, "అమ్మా! నేను కుక్కను తాకితిని; స్నానము చేయవలెను" అని చెప్పెను. "ఇప్పుడు రాత్రిచాలప్రొద్దుపోయినది, స్నానము చేయకుము. కాలుసేతులు కడిగికొని, మరియొక బట్టను

కట్టుకొనిన చాలును” అని అమ్మగారు బదులు చెప్పిరి : అందుపై “ఓహో అది పనికిరాదు!” అని ఆ వంటకత్తె మారుపలుక, “అట్లైన నీ శరీరముపై కొంచెము గంగా జలము చల్లుకొనుము” అని అమ్మగారానతిచ్చిరి. అప్పటికిని కూడ, ఆ వంటకత్తెకు తృప్తికలుగకుండుట జూచి “అట్లైనచో నన్ను తాకుము” అని పవిత్రతాస్వరూపిణి, శ్రీమాతృదేవి సెలవిచ్చిరి.

* * *

అప్రమత్తతనుగురించి

“మీ రెప్పుడైన నొకచోటినుండి మరియొకచోటునకు వెళ్లినప్పుడు మీ చుట్టుప్రక్కలనుండు వస్తువులను చక్కగా పరిశీలించి, మీరుండు స్థలమున నేమి జరుగుచున్నదో బాగుగా తెలిసికొనుచుండుడు. కాని నోరుమాత్రము మీ రెన్నడు మెదపవలదు” అని అమ్మగారొకసారి చెప్పిరి.

కష్టముల నెదుర్కొనుట

“నాయనా! చూచితివా! నీకు కష్టము లెన్నడును రావనుమాట నిజముకాదు. కష్టము లెల్లప్పుడును వచ్చునుగాని, శాశ్వతముగా నుండవు. వంతెనక్రింది నీళ్లవలె నవి గతించిపోవునని గ్రహింపుము” అని అమ్మగారొకనా డొకశిష్యుని హెచ్చరించిరి.

సత్సంభాషణ

జయరాంబాటిలో నొకనాడెవరో రాధు పిచ్చితల్లినుద్దేశించి పరుషోక్తులాడుచుండుటను జూచి, శ్రీమాతృదేవి యిట్లానతిచ్చిరి ;

"మాటలచేనైన మన మితరుల నెన్నడును నొప్పింప గూడదు. కష్టభాజనమగు సత్యమునైనను మన మనావశ్యక ముగా పలుకకూడదు. ఎవరైన మోటుమాటలాడుట కల వడిరేని వారి స్వభావముకూడ మోటుబాఱును. తనమాటల నదుపులోనుంచుకొనలేని వానికి, సౌమ్యతయుండదు. 'ఒక కుంటివానిని వాడెట్లు కుంటివాడయ్యెనని మనమడుగగూడదు' అని శ్రీ గురుదేవులు చెప్పుచుండువారు."

**పనికివచ్చు సర్వవస్తువుల యందు గౌరవ భావము చూపవలయును**

ఒకనాటి యుదయమున శ్రీ మాతృదేవి యొడలికి తైలము రాసికొనుచుండగా, వాకిలి నెవరో ఊడ్చుచుండిరి. ఆ పనియైన తర్వాత నావ్యక్తి చీపురును విసిరి పార వైచెను. ఇది చూచి అమ్మగారిట్లాన తిచ్చిరి: "ఏమిది? పనియైనతోడనే చీపురుకట్టనంత నిరా దరణగా పారవేయుచున్నావు! దానిని విసిరి పారవైచుట కెంతకాలము పట్టునో, మెల్లగా దాని నొక మూలనుంచుటకు గూడ నంతే కాలముపట్టును. ఎంతకొలదిపాటి వస్తువునైన మనము నిరాదరణ చేయరాదు. నీ వొకవస్తువును గౌర వించు నెడల, అదిగూడ నిన్ను గౌరవభావముతో చూచును. నీకా చీపురుకట్ట మరల నక్కఱలేదా? ఇంతేకాక, అది యీ కుటుంబమునకు చెందినది. ఆ కారణమును బట్టికూడ, అది గౌరవ పాత్రమైనది. చీపురుకట్టనైన మనము గౌరవ ముతో చూడవలెను. ఎంత చిన్నపనినైనను మనము గౌరవ భావముతో చేయవలయును."

రాధు పెంపుడు పిల్లి 'మిని' యొకనాడు వాకిట నొక
శిరస్సు ప్రక్క బరుండియుండెను. ఒకభక్తురా
పవిత్ర మైనది లా పిల్లిని కాలితో బుజ్జగించుచుం
డెను. ఆమె క్రమక్రమముగా తన పాదమును దానితలపై
నుంచెను. ఇది చూచి అమ్మగారామెకిట్లు హితవొసంగిరి :
"నాతల్లీ! ఏమిచేయుచున్నావమ్మా! శిరస్సు గురుస్థానము.
తల నెవరును పాదముతో తాకకూడదు. పిల్లికి నమస్కరిం
పుము." "అమ్మా! నాకా విషయ మెన్నడును తెలియ
లేదు. నేడు నేనొక గుణపాఠమును నేర్చుకొంటిని" అని
యా భక్తురాలు బదులు చెప్పెను.

సమాప్తము.



SRI SARADA PRASANGAMULU (Telugu) *Price*: Rs.